# బైబులుభాష్య సంపుటావళి

## నాలుగవ సంపుటం

# ప్రార్థనం



Copies : 3,000
First Edition : December 25, 2003

పర్యవేక్షణ :

**Fr. THANAM MARREDY**
Parish Priest
St. Peter's Cathedral
Tarapeta
VIJAYAWADA - 520 001
A.P. INDIA

ముద్రణానుమతి :

**Rt. Rev. MALLAVARAPU PRAKASH**
Bishop of Vijayawada

ప్రచురణ :

**St. PETER'S CATHEDRAL**
Education Desk For The Children
Tarapeta
VIJAYAWADA - 520 001
A.P., INDIA

# విషయసూచిక

# మనవి మాట

బైబులు భాష్యం సంచికలను 1972లో ప్రారంభించాం. ఇప్పటికి 157 సంచికలు ముగిసాయి. వీటినే యిప్పుడు పది బైబులుభాష్యం సంపుటాలనుగా ముద్రించాం. ఈ సంచికల్లో ఓ 60 మాత్రం ఇదివరకే "బైబులు గ్రంథమాల" అనే పేరుతో పుస్తక రూపాన్ని సంతరించుకొని పలు ముద్రణలు పొందాయి.

ప్రస్తుతం ఈ 157 సంచికలను, వీటిల్లో వచ్చే అంశాలనుబట్టి, ఓ క్రమపద్ధతిలో అమర్చాం. ఈ సంపుటాల్లో వుంది ప్రధానంగా బైబులు వివరణలు, దైవశాస్త్ర విషయాలు, ప్రార్థనాంశాలు. మన క్రైస్తవ భక్తివిశ్వాసాలను బలపరచేది ముఖ్యంగా ఈ యంశాలే. ఎందరో వేదపండితుల భావాలు ఈ పుస్తకాల్లోకి వచ్చాయి. ఆ మహానుభావులందరికీ వందనాలు.

ఈ పుస్తకాలు మన క్రైస్తవమత సత్యాలను లోతుగా అర్థంచేసికోవడానికీ, ప్రార్థన జేసికోవడానికీ, ఇతరులకు బోధించడానికీ గూడ ఎంతో వుపయోగపడతాయి. కనుక మన గురువులు, మఠకన్యలు, ఉపదేశులు, గృహస్థులు మొదలైనవాళ్లు ఎవరైనాసరే వీటిని వినియోగించుకొని ఆధ్యాత్మిక లాభాన్ని పొందవచ్చు.

చాల సంవత్సరాల పొడుగున కొనసాగించిన రచనలు కనుక ఈ గ్రంథాల్లో పునరుక్తులు అనివార్యమయ్యాయి. పాఠకులు మన్నింతురుగాక. మొదటవ్రాసిన సంచికలకు తర్వాత వ్రాసిన వాటికీ శైలిలోకూడ భేదం వుంది.

మన క్యాతలిక్ సమాజంలో పఠనాభ్యాసం లేదు. ఇది మనం అవశ్యం సవరించు కోవలసిన ప్రధానలోపాల్లో వొకటి. ఇందుకే ఈ గ్రంథాలను చౌకధరకే విక్రయిస్తున్నాం. ఈ పుస్తకాలు మన సాహిత్యరాశిని పెంచి మన ప్రజల్లో పఠనాభిరుచిని ప్రోదిచేస్తాయని ఆశిస్తున్నాం. అసలు తెలుగులో మనకున్న క్యాతలిక్ సాహిత్యమే చాల తక్కువ.

ఫాదర్ టి.మర్రెడ్డిగారి ఆర్థిక సహాయంలేందే ఈ సంపుటాలు ఇప్పుడు, ఈ రూపంలో వెలుగు చూచేవి కావు. ప్రభువు ఆ మహనీయుని దీవించి ఆయన కృషిని సఫలీకృతం జేయునుగాక. విజయవాడ మేత్రాసనం తరపుననే ఈ పుస్తకాలను ప్రచురిస్తున్నాం.

ఈ సంపుటాల్లో రచయిత 31 ఏండ్ల పొడుగున కొనసాగించిన అవిరళకృషి దాగివుంది. కరుణామయుడైన ప్రభువు యెరూషలేం దేవాలయంలోని సాయంకాలపు ధాన్యబలినివలె ఈ సాహిత్యబలిని గూడ నెనరుతో స్వీకరించునుగాక.

ఈ పుస్తకాలకు పరిచయవాక్యాలు వ్రాసియిచ్చిన విజయవాడ పీఠాధిపతులు, పూజ్యులు, మహోఘనత వహించిన డాక్టరు ఎం.ప్రకాష్‌గారికి నమస్సుమాంజలులు. వీటిని సర్వాంగసుందరంగా ముద్రించిన శ్రీ పి.సాంబిరెడ్డిగారికి వారి సిబ్బందికి, ఓపికతో ప్రూఫులు దిద్దిన శ్రీ వి. గోపాలరెడ్డిగారికి మా కృతజ్ఞతలు.

\- *గ్రంథకర్త*

# ముందుమాట

ఫా.జోజయ్య గారు తమ రచనల ద్వారా ఆంధ్ర శ్రీసభకు సుపరిచితులు. వారి అవిరళకృషి, సేవాతత్పరత, తెలుగులో చక్కని సాహిత్యాన్ని రాయాలనే తపన, దానికితగిన అంకితభావం వేనోళ్ల కొనియాడదగింది. వీరు రచించిన చిన్నచిన్న పుస్తకాలను సంకలనం చేయడం అనే ప్రక్రియ వీరి జీవితకాలంలోనే జరగకపోయినట్లైతే, ఈ గొప్ప సాహిత్యాన్ని కోల్పోయే అపాయం వుండేది. అరుదుగా పాఠకులకు తెలుగులో లభ్యమయ్యే బైబులును మరియు కతోలిక వేదాంతమునకు సంబంధించిన అంశాలను క్షుణ్ణంగా పరిశోధన జరిపి చక్కని భాషలో ఆంధ్ర కతోలిక సంఘానికి గత ముప్పది సంవత్సరాలపైగా అందించారు ఫా.జోజయ్య గారు.

తెలుగు కతోలిక శ్రీసభకు, బైబులును క్రైస్తవ సిద్ధాంతాలను అర్థం చేసుకోవాలన్న కోరిక గల క్రైస్తవేతరులకు ఫా.జోజయ్య గారు గొప్ప వరమని నేను భావిస్తున్నాను. వీరి రచనలు సత్యాన్ని అన్వేషించడం యెడల ఆయనకున్న పట్టుదలకు, అందరికి జ్ఞానోదయాన్ని కలిగించాలన్న తపనకు, మరియు ఆంధ్ర శ్రీసభ పురోభివృద్ధి యెడల ఆయనకున్న తృష్ణకు నిదర్శనాలు. సరళమైన స్వచ్ఛమైన, సామాన్య ప్రజలకు అర్థమయ్యే తెలుగుభాషలో రచింపబడిన ఈ పుస్తకాలను చదివి, ఆధ్యాత్మిక జీవిత వికాసానికి క్రైస్తవ సిద్ధాంతాలను లోతుగా అర్థం చేసికోవటానికి వీటిని వినియోగించుకోవాలని కోరుతున్నాను. ఎంతో నేర్పుతో, క్రమపద్ధతిలో విభజింపబడిన రచనలను "బైబులు భాష్య సంపుటావళి" అన్న పేరుతో పదిసంపుటాలుగా అచ్చు వేస్తున్నందుకు అభినందిస్తున్నాను. ఈ గ్రంథాల ప్రచురణ బాధ్యతను తన భుజాలపై వేసికొని, సమయాన్ని వెచ్చించి, వలసిన ఆర్థిక వనరులను చేకూర్చినందుకు, ఆంధ్ర శ్రీసభకు ఉపయోగకరమైన ఈ సాహిత్యాన్ని ప్రజలకు అందించాలనే మంచికార్యాన్ని చేపట్టి విజయంతంగా పూర్తి చేసినందుకు ఫా.మర్రెడ్డి గారిని నా హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

ఆణిముత్యాల్లాంటి ఈ రచనలను ఆధ్యాత్మిక సంపత్తిగా అందరూ గుర్తించాలని, కతోలిక క్రైస్తవ సమాజమంతా ముఖ్యంగా మేత్రాణులు, గురువులు, మఠవాసులు అందరు ఈ కృషిని అభినందించాలని, ఆదరించాలని నా ఆకాంక్ష. మన ప్రజల స్తోమతకు తగినట్లుగా వీటి వెల కూడ చాల తగ్గించడమైనది. కావున ప్రతి ఒక్కరు, గ్రంథాలయాలు, ఆశ్రమాలు, మఠాలు, కతోలిక కేంద్రాలు ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలని నా మనవి.

ఫా.జోజయ్య గారు చేసిన ఈ కృషిని మరోసారి అభినందిస్తూ, వారు ఇంకా ఆంధ్ర శ్రీసభకు తమ అమూల్యమైన సేవలను రానున్న కాలంలో అందించాలని మనసారా కోరుకుంటూ, ప్రార్థిస్తూ...

ఇట్లు
మీ జ్ఞానతండ్రి
**+ మల్లవరపు ప్రకాష్**
విజయవాడ పీఠాధిపతులు

# 1. ఐదురకాల ప్రార్థనలు

బైబులు భాష్యం -2

## మనవిమాట

స్థూలంగా జెప్పాలంటే బైబులు ప్రార్థన ఐదువిధాలుగా వుంటుంది. మనకోసం మనం చేసికునే ప్రార్థన మనవి జపం. ఇతరుల కోసం మనం చేసేప్రార్థన విజ్ఞాపన జపం. మన పాపాలకు పశ్చాత్తాపాన్ని వెలిబుచ్చుతూ చేసే ప్రార్థన పశ్చాత్తాపజపం. ప్రభువు మనకు చేసిన మేలికార్యాలను తలంచుకొని అతనికి కృతజ్ఞతాస్తుతులు చెల్లించే ప్రార్థన కృతజ్ఞతా జపం. అతని మహిమ ప్రభావాలను తలంచుకొని అతనికోసమే అతన్ని స్తుతించి గౌరవించే ప్రార్థన ఆరాధన జపం. కనుక ఈ సంచికలో క్రమంగా :

| | | | |
|---|---|---|---|
| మనవి ప్రార్థనం | - | నంబర్లు | 1 - 9 |
| విజ్ఞాపన ప్రార్థనం | - | నంబర్లు | 9A - 21 |
| పశ్చాత్తాప ప్రార్థనం | - | నంబర్లు | 22 - 32 |
| కృతజ్ఞతా ప్రార్థనం | - | నంబర్లు | 33 - 38 |
| ఆరాధన ప్రార్థనం | - | నంబర్లు | 39 - 43 |

# 1. మనవి ప్రార్థనం

### 1. కుమారుడు చేప నడిగితే - లూకా 11, 11-13.

అన్నిజపాలకంటేగూడ ప్రాథమికమైంది మనవిజపం. కనుక తొలుత మనవి జపం అంటేయేమిటో విచారిద్దాం. పసిబిడ్డ ఆకలితో వచ్చి చేప నడిగితే తండ్రి పామునందీయుడు. గ్రుడ్డునడిగితే తేలునీయడు. ఇక, భూలోకంలోని తండ్రులందరికంటె గూడ శ్రేష్ఠుడు కరుణా వాత్సల్యాలుగలవాడు, పరలోకంలోని తండ్రియైన ప్రభువు. కనుక మనం అడుగుకొనే యీవులన్నీ ఆ తండ్రి అనుగ్రహిస్తూనే వుంటాడు. పరలోకంలోని ప్రభువు తండ్రిలాంటివాడే. కాని భూలోకంలోని ప్రజలమైన మనం బిడ్డలాంటి వాళ్లంకావాలి. అక్కరగలిగినపుడు పసిబిడ్డ సంకోచించకుండా, భయపడకుండా, స్వతంత్రంగా, చనువుతో తండ్రివద్దకు వెళ్తుంటాడు. తండ్రికి తన అక్కరలను తెలియజేసి కుంటూంటాడు. ఈ పసిబిడ్డ మనస్తత్వంతోనే మనమూ ప్రభువును సమీపించాలి. మన మనవులను ఆ తండ్రికి నివేదించుకోవాలి. కావున మనవి జపంలోని ప్రధానాంశం, పసిబిడ్డ తండ్రిని సమీపించినట్లుగా తల్లీతండ్రియునైన దేవుణ్ణి సమీపించడం. సమీపించి పసిబిడ్డలాగ మన అక్కరలను ఆ తండ్రికి తెలియజేసికోవడం.

## 2. అడగండి, మీకీయబడుతుంది - లూకా 11, 9-10.

ఈ వాక్యాల్లో అడగడం, వెదకడం, తట్టడం అనే మూడు ఉపమానాలు వాడబడ్డాయి. మన అక్కరల్లో తండ్రియైన దేవుణ్ణి వెదకాలి. అతనియింట ప్రవేశించి తలుపుతట్టాలి. మన అవసరాలేమిటివో ఆ తండ్రికి తెలియజేసికొని, అతని సహాయాన్ని అడుగుకోవాలి. ఈలా చేసినట్లైతే అతడు మనలను బిడ్డల్లాగ ఆదరిస్తాడు. ఈ వాక్యాల్లోని క్రియలన్నీగూడ "ఈయబడును" "తీయబడును" అనేరీతిగా కర్మణిప్రయోగంలో వున్నాయి. ఈ క్రియలన్నిటికీ కర్త ప్రభువే. అనగా మనకు తలుపుతీసేవాడు, మన మనవులను ఆలించి మనం అడుగుకునే వాటిని అనుగ్రహించేవాడు, ఆ తండ్రియే. పైగా ఇక్కడ, ఒకేభావాన్ని చెప్పడంకోసం అడగడం, వెదకడం, తట్టడం అనే మూడు ఉపమానాలు వాడారు. అనగా ప్రార్థనం మనం అత్యవసరంగా చేయవలసిన పని అని భావం. భక్తుడు రోజురోజు, రేపుమాపు, ఎడతెగకుండ ప్రార్థిస్తుండాలి.

## 3. నా నామమున మీరేమి యడిగినా - యోహా 14, 13-14.

మన మనవి ప్రార్థన ప్రభువునకు ప్రియపడాలి అంటే కొన్ని నియమాలను లేక షరతులను పాటించాలి. మొదటి నియమం, మనం క్రీస్తుపేరుమీదగా ప్రార్థన చేయాలి. మన ప్రార్థనలన్నీ క్రీస్తునామంమీదుగా పరలోకపితకు అర్పించాలి. బైబుల్లో "నామం" వ్యక్తిని సూచిస్తుంది. క్రీస్తునామం క్రీస్తుని సూచిస్తుంది. కనుక క్రీస్తుపేరుమీదుగా ప్రార్థన చేయడమనగా క్రీస్తుఅనే వ్యక్తి ఉద్దేశం ప్రకారం ప్రార్థనం చేయడం. మనం పరిశుద్ధులం గావడం, రక్షణాన్నిపొందడం - ఇది క్రీస్తు ఉద్దేశం. ఈ రక్షణాన్నే పరలోకరాజ్యంగా భావిస్తుంది నూత్నవేదం. కనుకనే "మీరు మొదట పరలోకరాజ్యాన్ని వెదకండి" అన్నాడు ప్రభువు - మత్త 6,33. మరో తావులో దైవచిత్తం ప్రకారం జీవించేవాడు పరలోకరాజ్యంలో ప్రవేశిస్తాడు అని చెప్పబడింది - మత్త 7, 21. కనుక క్రీస్తుపేరుమీదగా ప్రార్థించడమనగా క్రీస్తుకోరిక ప్రకారం ప్రార్థించడం. ఇక క్రీస్తుకోరుకొనేది మనం రక్షణం పొందాలిఅని, దైవచిత్తం నెరవేర్చి దైవరాజ్యంలో ప్రవేశించాలి అని. కనుక మన ప్రార్థనం క్రీస్తుకోరికను అనుసరించివుండాలి. అనగా మన రక్షణానికి సంబంధించి వుండాలి. ఇక్కడ రక్షణం దేహాత్మలకు రెండింటికీ వర్తిస్తుంది. కావున మనం ఈ భూమిమీది భౌతికావసరాలకోసమూ ప్రార్థించాలి, మోక్షభాగ్యం కోసమూ ప్రార్థించాలి.

## 4. మీరు అడిగే వాటినన్నిటినీ పొందామని నమ్మండి - మార్కు 11, 24.

ప్రభువు మనం అడిగేవాటిని అనుగ్రహిస్తాడనే విశ్వాసం కూడ వుండాలి. ఇది రెండోషరతు. ఈ నమ్మికకు ఆధారమేమిటంటే - దేవుడు నమ్మదగినవాడు, తండ్రీ.

భూలోకంలోని తండ్రులు బిడ్డలకు మంచి యీవులు ఇస్తూంటారు. ఈ తండ్రుల కంటె పరలోకంలోని తండ్రి శ్రేష్ఠుడుకాడా? అతడు తన బిడ్డలు అడుగుకొనే మనవులను అనుగ్రహించడా? - మత్త 7,11.

ప్రభువు అద్భుతాలు చేసేప్పుడు ఒకేవొక షరతు పెట్టేవాడు - ప్రజలకు తనయందు విశ్వాసం వుండాలి అని. పేతురు నీళ్ళమీద నడవడానికి అనుమానపడ్డం జూచి ప్రభువు అతన్ని మందలించాడు - మత్త 14,32 శిష్యులు అవిశ్వాసులై మూగదయ్యాన్ని పారద్రోలలేక పోవడంజూచి ప్రభువు వాళ్లను చీవాట్లు పెట్టాడు - మార్కు 9,19. క్రీస్తు స్వగ్రామమైన నజరేత్తునకు వెళ్లినపుడు అక్కడి ప్రజలు అతనియందు విశ్వాసముంచలేదు. కనుక ఆ గ్రామంలో అద్భుతాలేమి చేయలేక పోయాడు - మత్త 13,58. కనుక విశ్వాసంలేనివాళ్ళు ప్రభువునకు ప్రియపడరు.

## 5. సోదర ప్రేమతో - మార్కు 11, 25-26

ప్రార్థనాపరుడు భగవంతునికి అనుకూలంగా జీవించాలిగాని ప్రతికూలంగా జీవించగూడదు. అదేవిధంగా అతని హృదయంగూడ తోడి జనులకు సుముఖంగా వుండాలి గాని విముఖంగా వుండగూడదు. కనుక ప్రార్థనకు పూనుకోకముందు తోడిప్రజలు మనకు చేసిన అపకారాన్ని క్షమిస్తూ వుండాలి. ఆలాగే మనం తోడిప్రజలకు చేసిన అపకారాన్ని తలంచుకొని సంతాపపడుతూ వుండాలి. అప్పుడుగాని ప్రభువు మన ప్రార్థనను వినిపించుకోడు. ఓమారు ప్రభువు ఈలా సెలవిచ్చాడు. బలిపీఠం చెంత కానుకలు సమర్పిస్తూ వుండగా తోడివానితో పగగావున్న సంగతి జ్ఞాపకానికి వస్తుంది. అప్పుడు ఆ కానుకను అక్కడే వదలివేసి వెంటనే వెళ్లి ముందుగా తోడివానితో సమాధానపడి రావాలి. అనగా దేవునికి కానుకలు సమర్పించడంకంటె తోడి వారిపట్ల ప్రేమభావంతో ప్రవర్తించడం ముఖ్యం అని భావం - మత్త 5, 23-24. కనుక సోదరప్రేమలేని ప్రార్థన ప్రభువునకు ప్రియపడదు. ఇది మూడవ షరతు

## 6. దేవుడు అహంకారులను ఎదిరిస్తాడు - యాకో 4,6

దేవుడు అహంకారులను లక్ష్యంచేయడు. దీనులను ఆదరిస్తూ వుంటాడు. వినయాత్ములకు తన కృపను అనుగ్రహిస్తూ వుంటాడు. ఈ సత్యాన్ని బోధించడంకోసమే ప్రభువు సుంకరి, పరిసయుల సామెత చెప్పాడు. సుంకరి దేవాలయానికివెళ్లి వినయంతో తన పాపాన్ని వొప్పుకున్నాడు. క్షమాపణం పొందాడు. కాని పరిసయుడు పీఠంముందు నిలచి గర్వంతో తన్నుతాను పొగడుకున్నాడు. తనప్రక్కనే నిలబడి వున్న సుంకరిని చిన్నచూపు చూచాడు. అతడు నేను నీతిమంతుణ్ణి అనుకున్నాడుగాని ప్రభువు మాత్రం అతణ్ణి

క్షమించనేలేదు. అందుచేత వినయవంతుని ప్రార్థననేగాని ప్రభువు ఆదరింపడు - లూకా 18, 9-14. మరోతావులో చిన్నబిడ్డల్లాగ దేవుని రాజ్యాన్ని అంగీకరించమన్నాడు - మార్కు 10, 15. చిన్నబిడ్డలు తల్లిదండ్రులమీద ఆధారపడి జీవిస్తూవుంటారు. ఈలా ఆధారపడ్డమే వినయం. శిష్యులుకూడ వినయంతో ప్రభువుమీద ఆధారపడి జీవిస్తూ వుండాలి. కనుక వినయంతో ప్రార్థనం చేసి కోవడమనేది మనం పాటించవలసిన నాల్గవ నియమం.

## 7. మర్యాదా ప్రవర్తనం - ఆది 18, 27.

ప్రార్థనాపరునికి వినయంతో పాటు మర్యాదాభావం కూడ అత్యవసరం. అబ్రాహాము సొదొమగొమఱ్ఱాల తరపున ప్రభువును మనవి చేస్తూ "దుమ్మునూ బూడిదయు నైన నేను సాహసం చేసి ప్రభువుతో మాటలాడుతున్నాను" అంటాడు. దేవుడంటే యేమిటో అర్థం చేసికున్న మహానుభావులకు ఈలాంటి మర్యాదా ప్రవర్తనం అలవడుతుంది. ప్రార్థనం చేసుకునే నరుడు దైవసాన్నిధ్యం కలిగించుకోవాలి. క్రీస్తు గూడ తన తండ్రికి ప్రార్థనం చేసేప్పుడు చనువుతో "తండ్రీ" అనడు. మర్యాదతో "పరిశుద్ధుడవైన తండ్రీ" అని సంబోధించాడు - యోహా 17,11. కనుక మనం ప్రార్థనం చేసేప్పుడు దైవసాన్నిధ్యం కలిగించుకోవాలి. దైవసాన్నిధ్యంలో వుంటున్నాం గనుక మర్యాదా ప్రవర్తనం అలవరుచుకోవాలి. అనగా అణకువతో ప్రభువును వేడుకోవాలి. ప్రార్థనా సమయంలో మనం అవలంబించే ఆసనం కూడ భక్తి వినయ మర్యాదలను ప్రదర్శిస్తూ వుండాలి. పైన జెప్పిన నియమాలన్నీ పాటించినట్లైతే మనవి జపం ప్రభువునకు విన్పించి తీరుతుంది.

## 8. దేనికోసం ప్రార్థించాలి? - ఫిలి 4,6.

మనం దేనికోసం ప్రార్థించాలి? కేవలం ఆధ్యాత్మిక అవసరాల కోసం మాత్రమేనా లేక భౌతికావసరాలకోసం గూడ ప్రార్థించవచ్చా? నరుడు దేహాత్మల సంయోగం. కనుక మనం ఆత్మావసరాలను పురస్కరించుకొని ప్రార్థించాలి, దేహావసరాలను పురస్కరించుకొనీ ప్రార్థించాలి. కూడు, గుడ్డ, యిల్లు, బ్రతుకుదెరువు, పని, ఆరోగ్యం మొదలైన భౌతికావసరాలు ప్రభువునకు నివేదించుకోవాలి. భక్తి, విశ్వాసం, ప్రేమ పరిశుద్ధజీవితం, మనశ్శాంతి, రక్షణం మొదలైన ఆధ్యాత్మికావసరాలూ ప్రభువునకు విన్నవించుకోవాలి. అందుకే పౌలు ఫిలిప్పీయులను హెచ్చరిస్తూ, అన్ని అవసరాల్లోను ప్రభువును మనవిచేసికొమ్మన్నాడు. కనుక మనమూ మన అక్కరలను - అవి భౌతికమైనవి గానీ ఆధ్యాత్మికమైనవి గానీ - ప్రభువునకు తెలియజేసికుంటూ వుండాలి.

### 9. వాళ్ళకు ద్రాక్షరసం - యోహా 2,3.

ఇంతవరకు మనవి ప్రార్థననుగూర్చి విచారించాం. ఈ మనవి ప్రార్థనం చాల ముఖ్యమైంది. రోజురోజు ప్రభువును మనవిచేస్తూ వుండాలి. చాలామంది దృష్టిలో ప్రార్థనం అంటే విశేషంగా యీ మనవి ప్రార్థనమే. కాని యీ మనవి ప్రార్థనం వొక్కటే ప్రార్థనం అనుకోవడం పెద్ద పొరపాటు. మనవి ప్రార్థనం మాత్రమేగాక యింకా వేరేరకాల ప్రార్థనలు చాలా వున్నాయి. రోజూ దేవుణ్ణి అవి గావాలి యివిగావాలి అని అడుగుకుంటూ మనవి ప్రార్థనం మాత్రమే చేసికునేవాళ్ళల్లో స్వార్థం బలపడిపోతుంది. కనుక ఇకరాబోయే అంశాల్లో విజ్ఞాపన ప్రార్థనను గూర్చి విచారిద్దాం. మనకోసం మనం చేసుకునే ప్రార్థనను మనవి జపం అంటాం. ఇతరుల కోసం మనం చేసే ప్రార్థనను విజ్ఞాపన జపం అంటాం. ఈ భేదాన్ని బాగా గమనిస్తూ వుండాలి.

# 2. విజ్ఞాపన ప్రార్థనం

### 9A. ఆ పట్టణాల్లో పదిమంది నీతిమంతులుంటే - ఆది 18, 22-32.

సొదొమ గొమఱ్ఱా ప్రజల దుష్టకార్యాలు మితిమీరిపోయాయి. ప్రభువు ఆ పట్టణాలను దండించడానికి దిగివచ్చాడు. కాని అబ్రాహాము ప్రభువు నెదుట నిలచి ఈ దుష్ట నగరాల తరపున విజ్ఞాపనం చేసాడు. అక్కడ 50 మంది నీతిమంతులుంటే వారిని రక్షించమన్నాడు. ప్రభువు సరేనన్నాడు. కాని అంతమంది నీతిమంతులు అక్కడలేరు. చివరకు 45, 40, 30, 20,10 వరకు సంఖ్య దిగిజారిపోయింది. కాని ఆ నగరాల్లో పదిమంది నీతిమంతులు కూడ దొరకలేదు. అంచేత ప్రభువు గంధకం గురిపించి ఆ పురాలను నేలమట్టం చేసాడు. కాని యిక్కడ అబ్రాహాము చేసిన విజ్ఞాపనం చాల వుదాత్తమైన ప్రార్థనం. అతడు ఆ పాపపు ప్రజల కోసం ఆరు సార్లు ప్రభువును వేడాడు. "దుమ్ము బూడిదయునైన నేను సాహసించి ప్రభువుతో మాటలాడుతున్నాను - దుష్టులతో పాటు నీతిమంతులను కూడ నాశం చేస్తావా ప్రభూ!" అని సవినయంగా విన్నవించుకున్నాడు. ఈలాగే మనంకూడ ఇతరులకోసం భక్తి శ్రద్ధలతోను పట్టుదలతోను ప్రార్థనం చేస్తూండాలి.

### 10. నలువదినాళ్లు యావే సన్నిధిలో చాగిలపడితిని - ద్వితీ 9, 25-29.

మోషే పదియాజ్ఞలకని సీనాయి కొండమీదికెక్కి పోయాడు. అక్కడ ప్రభు సాక్షాత్కారం కోసం నలుబది నాళ్లు ప్రార్థనల్లో గడుపుతూ వచ్చాడు. ఈ మధ్యలో అహరోను నాయకత్వం క్రింద యిస్రాయేలు ప్రజలు బంగారు దూడను తయారు చేసికొన్నారు.

యావే యేపాటి దేవుడంటూ ఆ దూడను ఆరాధించడం మొదలుపెట్టారు. అంతలో మోషే తిరిగి వచ్చి ఆ వృషభారాధనను జూచి కంపించిపోయాడు. కోపంతో చేతిలోని రాతి పలకలను నేలకు విసరి కొట్టాడు. అప్పుడు యావేకు గూడ ప్రజలమీద తీవ్రకోపం గలిగింది. ఈ ప్రజలను సర్వనాశం చేస్తాను అన్నాడు ప్రభువు. కాని మోషే ఆ ప్రజల తప్పిదాన్ని మన్నించమని ప్రభువునకు నలువది నాళ్లు విజ్ఞాపనలు చేసాడు.

## 11. యావే ప్రభూ, చెవియొగ్గి ఆలింపుము - 2 రాజు 19, 14-19.

హిజ్కియా చాలా భక్తిమంతుడైన రాజు. అతని రోజులలో సన్హెరీబు అనే అస్సిరియను రాజు దండుతో వచ్చి యెరుషలేము మీద దాడిచేసాడు. హిజ్కియాను బెదరిస్తూ ఓ జాబు వ్రాసి పంపాడు. "ఎన్ని జాతులు నా వశమయ్యాయో చూడు. వాళ్లు కొలిచే దేవరలంతా యేమయ్యారు? నా చేతుల్లో నుండి తమ భక్తులను రక్షింపగలిగారా? నీ గతీ యింతే ఔతుంది. కాని నా శరణు పొందావో, నీవూ నీ పట్టణం బ్రతికిపోతారు" - ఇది అతని జాబు. హిజ్కియా ఆ జాబును చదివాడు. దేవాలయంలోనికి తీసుకొని వెళ్ళాడు. దాన్ని ప్రభు పీఠంముందు విప్పిపెట్టి పట్టణం తరపున యావేకు విజ్ఞాపనం చేసాడు. ప్రభువు రాజు మొర నాలించి ప్రవక్తయైన యెషయా ద్వారా అతనికి ఓదార్పు మాటలు చెప్పించాడు. ప్రభుదూత అర్ధరాత్రిలో అస్సిరియను సైనికులను కొందరిని చంపివేసాడు. అది చూచి సన్హెరీబు భయపడి పట్టణానికి అల్లంత దూరంనుండే పారిపోయాడు. హిజ్కియా విజ్ఞాపనం లాగే మన విజ్ఞాపనం గూడ తోడి ప్రజలను రక్షిస్తుంది.

## 12. ఇతడు పరిశుద్ధ పట్టణంకోసంమిక్కిలిగా ప్రార్థించాడు - 2 మక్క బీ 15, 12-16.

అంతియోకస్ ఎపిఫానీస్ అనే సిరియారాజు యెరూషలేముమీదకు ఎత్తివచ్చాడు. మక్కబీయుడైన యూదా ఎపిఫానిస్‌ను ఎదురించి పట్టణాన్ని కాపాడ్డానికి కంకణం కట్టుకున్నాడు. అతనికి ఓ కల వచ్చింది. ఆ కలలో ఓదర్శనం. ఆ దర్శనంలో ఓనియా అనే ప్రధానయాజకుడు చేతులుచాపి యూదులందరి మీదికి దేవుని దీవెనలు దిగివచ్చేలా ప్రార్థన చేస్తూ వుండగా యూదా చూచాడు. అదే దర్శనంలోనే ప్రకాశవంతుడు మహాప్రతిభావంతుడునైన ఓ ముదుసలికూడ కనుపించాడు. ఇతడే యిర్మీయా ప్రవక్త. ఓనియా అతన్ని యూదాకు చూపిస్తూ, "ఇతడు యూదా ప్రజలను ప్రేమించి వాళ్లకోసమూ పరిశుద్ధ పట్టణంకోసమూ మిక్కిలిగా ప్రార్థన చేసాడు సుమా" అని చెప్పాడు. అప్పుడు యిర్మియా యూదాకు ఓ సువర్ణఖడ్గాన్ని ప్రసాదించి, వెళ్లి దానితో శత్రువులను హతమార్చుమని చెప్పాడు. యూదా యీ దర్శనాన్ని అర్థంచేసికొని ఉత్సాహంతో యుద్ధానికి వెళ్ళాడు. ఈ యిర్మీయాలాగే మనంకూడ తోడి ప్రజలకోసం మిక్కిలిగా ప్రార్థనం చేస్తూవుండాలి.

ఇంతవరకు విజ్ఞాపన ప్రార్థననుగూర్చి పూర్వవేదంలోని ఉదాహరణలనుచూచాం. ఇక నూత్న వేదంలోని ఉదాహరణలనుగూడ కొన్నింటిని చూద్దాం.

## 13. నేను నీకొరకు వేడుకొంటిని - లూకా 22, 31-32

పేతురు ప్రభువును ప్రేమించాడు. కాని ప్రభువే మెస్సీయా అన్న విషయంలో మాత్రం అతని విశ్వాసం ఇంకా బలపడలేదు. అందుకే అతడు ప్రభువును ఎరుగనని మూడు సారులు బొంకాడు. పిశాచం అతన్ని జల్లెడలోని గోదుమల్లాగ జల్లించాలని కోరుకుంది. అనగా అతన్ని పట్టుకొని బలంగా ఊపివేయాలి అని, అంటే అతన్ని తీవ్రంగా శోధించాలి అని కోరుకుంది. ప్రభువు మాత్రం పేతురు కోసం ప్రార్థించాడు. కనుకనే అతని విశ్వాసం వేరంట నాశనమై పోకుండ నిలచింది. అతడు క్రీస్తుని ఎరుగనని బొంకినపిదపగూడ మళ్ళా పశ్చాత్తాప పడ్డాడంటే, అది ప్రభు ప్రార్థనా ఫలితమే. ఈవిధంగా ప్రభువు పేత్రు తరపున చేసిన విజ్ఞానం ఆపదల్లోనుండి అతన్ని కాపాడింది. మన విజ్ఞాపన ప్రార్థనలూ చాలమందిని శోధనలనుండి కాపాడుతూంటాయి.

## 14. తండ్రీ, వీరిని క్షమింపుము - లూకా 23, 34.

మిత్రులకోసం మాత్రమేగాక శత్రువులకోసంగూడ ప్రార్థించాడు ప్రభువు. ప్రభువును ఇద్దరు దొంగలమధ్య సిలువమీద కొట్టిచంపారు శత్రువులు. ఐనా క్రీస్తు వాళ్లను దూషింపలేదు గదా, వాళ్లకోసం విజ్ఞాపనం జేసాడు. వాళ్లపాపం వాళ్లకే అర్థం కావడం లేదుగనుక వాళ్లను క్షమించమని వాళ్ల తరపున తండ్రిని మనవి చేసాడు. మరో సందర్భంలో, శత్రువులనుగూడ ప్రేమించమన్నాడు ప్రభువు. హింసించే వాళ్లకొరకు ప్రార్థనం చేయమన్నాడు.- మత్త 5,44. శత్రువులను ప్రేమించి వాళ్లకు ఉపకారంచేసే మార్గాల్లో ప్రార్థనామార్గం శ్రేష్ఠమైంది. విజ్ఞాపన ప్రార్థనల ద్వారా శత్రువుల మనసు మారుస్తాం. వాళ్ళనుగూడ ప్రభువు వైపు ఆకర్షిస్తాం. స్తెఫను ప్రార్థనల వల్లనే సౌలు మనసు మార్చుకొని పౌలుగా తయారయ్యాడు. ఇక, మనం స్వీయదోషం వల్ల యెవరెవరితో కలహిస్తూంటామో వాళ్ళందరికోసమూ ప్రభువునకు విజ్ఞాపనం చేస్తూవుండాలి.

## 15. సంఘమయితే పేత్రుకోసం దేవుని ప్రార్థించింది - అ.చ. 12,5

హెరోదు తొలినాటి క్రైస్తవ సమాజాన్ని హింసించడం మొదలెట్టాడు. యోహాను సోదరుడైన యాకోబును ఖడ్గంతో చంపించాడు. అది చూచి యూదులు భళీ అని మెచ్చుకున్నారు. దానితో హెరోదు ఉప్పొంగిపోయి, పేత్రుని గూడ బంధించి చెరలో వేయించాడు. పాస్క పండుగ ముగిసిన పిమ్మట అతన్ని కూడ చంపించాలని

తీర్మానించుకున్నాడు. కాని యెరూషలేములోని సమాజం మాత్రం అత్యాసక్తితో పేత్రుకోసం ప్రభువునకు విజ్ఞాపనం చేసింది. దాని ఫలితంగా ప్రభువు దూతవచ్చి పేత్రుని చెరసాలలో నుండి విడిపించాడు. ఈలాగే మన విజ్ఞాపన ప్రార్థనలూ ఆపదలో నున్నవారిని ఆదుకొని కాచి కాపాడుతూంటాయి.

## 16. యేసు తల్లియైన మరియ గూడ - అ చ 1,14

ప్రభువు వుత్థానమైన పిమ్మట మోక్షానికి ఆరోహణంచేస్తూ శిష్యులను యెరూషలేము వదలి వెళ్ళవద్దని ఆజ్ఞాపించాడు. పూర్వవేదపు ప్రవక్తలద్వారా శతాబ్దాలు తరబడి తండ్రి వాగ్దానం చేస్తూ వచ్చిన పరిశుద్ధాత్మను ఆ పట్టణంలోనే పొందమని ఆదేశించాడు. ఆ యాత్మ దిగిరావడమే వాళ్ళ జ్ఞానస్నానమౌతుంది. ప్రభువు ఆజ్ఞాపించినట్లే శిష్యులంతా యెరూషలేములోనే బస చేసారు. ఓ మేడమీది గదిలో సమావేశమై ఆత్మాగమనం కోసం ప్రార్థిస్తూ వచ్చారు. ప్రభుజనని మరియమాతకూడ అక్కడే వాళ్లతోపాటు ప్రార్థనం చేసింది. ఆమె ప్రార్థనం ఆమెకోసమూ, శిష్యులకోసమూను. ఆమె ప్రభువునకు మల్లె శిష్యులకు గూడ మాత. ప్రభువు ఆదేశించినట్లే శిష్యులు ఆత్మను పొందాలి అని ఆ తల్లి కోరిక. అందుకే వాళ్ల తరపున గూడ విజ్ఞాపనం చేసింది. నాల్గవ శతాబ్దంలోనే ప్రాచీన క్రైస్తవులు ఈ తల్లిని "విజ్ఞాపన మాత" అని పేర్కొన్నారు.

## 17. ఎవరెవరి కోసం ప్రార్థించాలి?

పూర్వవేదపు అహరోను పరిశుద్ధ స్థలమైన గుడారంలోకి ప్రవేశించేప్పుడెల్ల యిస్రాయేలీయులలోని పండ్రెండు గోత్రాలవాళ్ళ పేర్లను లిఖించిన పట్టీనొకదాన్ని రొమ్ముమీద ధరించేవాడు. ఆ పట్టీద్వారా యిస్రాయేలీయుల పేర్లను ప్రభుసన్నిధిలో జ్ఞాపకం చేసేవాడు - నిర్గ, 28, 29. ఈలాగే మనంకూడ తోడి ప్రజలను ప్రభువునకు జ్ఞాపకం చేస్తూ వుండాలి. ఈ తోడి ప్రజల్లోకూడ మనకున్న సంబంధాన్ని పురస్కరించుకొని కొందరి కోసం విశేషంగా ప్రార్థిస్తుండాలి. మనం ఎవరెవరికి ఋణపడి వున్నామో వాళ్ళ పేర్లను ఒక జాబితాగా తయారు చేసికొని వాళ్ళందరికోసం ప్రార్థిస్తూవుండడం ధర్మం.

## 18. బృందంగా కూడి - మత్త 18,20

పూర్వవేదంలోని రబ్బయిలు మోషే ధర్మశాస్త్రాన్ని బోధిస్తూ వుండేవాళ్లు. యూదులు బృందంగా కూడి ఆ బోధలు ఆలిస్తూ వుండేవాళ్ళు. అలా ధర్మశాస్త్ర బోధలు ఆలించడం కోసం బృందంగా కూడినవాళ్ల మధ్యలో ప్రభు సాన్నిధ్యం నెలకొని వుంటుందని ఆ ప్రజలు విశ్వసించేవాళ్లు. ఆ సాన్నిధ్యాన్నే "షెకీన" అని పిలచేవాళ్ళు. ఇక నూత్నవేదంలోని

ధర్మశాస్త్రం, సువార్తబోధలు. ఈ బోధలను ఆలిస్తూ ప్రార్థనచేసికునే క్రైస్తవ బృందం మధ్యలో గూడ క్రీస్తు సాన్నిధ్యం నెలకొని వుంటుంది. ప్రభువు ఈ బృందం ప్రార్థనను ఆలిస్తాడు. అంచేత విజ్ఞాపన ప్రార్థనలు చేసేప్పుడు బృందంగా కూడి వుండడం మంచిది. దేవాలయంలోని ఉదయ సాయంకాల ప్రార్థనలు, వడకాలు, సెమినార్లు ఈలా గుమిగూడే అవకాశాలను కలిగిస్తాయి. ఈలాంటి అవకాశాలు లేనపుడు ఎవరికి వాళ్ళే వ్యక్తిగతంగా విజ్ఞాపన ప్రార్థనం చేసికోవచ్చు.

## 19. ఓ సేవ

కొంతమంది భూదానం చేస్తుంటారు. కొందరు శ్రమ దానం, మరి కొందరు విద్యాదానం, ఇంకా కొందరు విత్తదానం చేస్తుంటారు. ఈ దానాలన్నీ మానవులు తోడి మానవుల కొరకు చేసే సేవలు. కాని సేవలన్నిటిలోను శ్రేష్ఠమైంది ప్రార్థనాసేవ. ప్రార్థనకు మించిన సేవ యెవరికీ చేయలేం. అసలు ప్రార్థనకు మించిన ఉపకారం లేనేలేదు. అంచేత ఎవరి కోసం ప్రార్థిస్తున్నామో వాళ్ళకు మహోపకారం చేస్తున్నట్లుగా భావించాలి. "నీతిమంతుని విజ్ఞాపనం బహు బలంగలది" అంటుంది వేదవాక్యం - యాకో 5,16. మానవ బలం పనిచేయనపుడు ప్రార్థనం దైవబలాన్ని కదలించుకొని వస్తుంది. అంచేత దైనందిన జీవితంలో మన ప్రార్థనా సేవను తోడివారికి అర్పిస్తూ వుండాలి. తోడివారియొద్దనుండి ఈ సేవను పొందుతూండాలి.

## 20. క్రీస్తు విజ్ఞాపనం - హెబ్రే 7, 25

క్రీస్తు శరీరధారియై యున్నపుడు శిష్యులకోసం విజ్ఞాపనం చేసాడు అన్నాం. ఇక ప్రభువు ఉత్థానమైన పిదప విజ్ఞాన ప్రార్థనను మానివేయడు. ఉత్థానక్రీస్తు తండ్రి సమక్షంలో నిత్యమూ మనకోసం విజ్ఞాపనం చేస్తూవుంటాడు. తాను ఎవరికోసం శ్రమలనుభవించి ప్రాణాలు అర్పించాడో ఆ ప్రజలు ఇంకా భూలోకంలోనే వుండి శోధనలకు గురిఔతూ వున్నారని తండ్రికి నివేదిస్తాడు. తన ప్రార్థనల ద్వారా మనకు సమయోచితమైన సహాయాన్ని అనుగ్రహిస్తూనే వుంటాడు. తాను శోధింపబడి శ్రమలనుభవించినవాడు గనుక, నేడు శోధింపబడి శ్రమలనుభవిస్తూ వున్న మనకు సాయపడుతూంటాడు. మన తరపున ఆ ప్రభువు ఓ కృపాసింహాసనంలా వుంటాడు. కనుక మనం చనువుతో నమ్మికతో ధైర్యముతో ఆ ప్రభువు ప్రార్థనలపై ఆధారపడుతూ వుండాలి. మన విజ్ఞాపనలన్నీ మోక్ష క్రీస్తు విజ్ఞాపనలతో చేర్చి పరలోకంలోని తండ్రికి అర్పిస్తూ వుండాలి.

**21. ఆత్మ విజ్ఞాపనం** - రోమీ 8, 26-27.

క్రీస్తు మోక్షంలో మనకోసం ప్రార్థన చేస్తూవుంటే ఆత్మ మన హృదయంలోనే మనకోసం ప్రార్థన చేస్తూవుంటుంది. మనకోసం మాత్రం గాదు, మనతోనూ ప్రార్థన చేస్తుంది. అనగా ఆత్మతో కలసి మనమూ ప్రార్థన చేస్తుంటాం. మనతోకలసి, ఆత్మ ప్రార్థన చేస్తుంటుంది. ఈ యాత్మ సహాయంలేందే మనం ఏలా ప్రార్థించాలో, దేనికోసం ప్రార్థించాలో తెలిసికోలేం. పరిశుద్ధాత్మ మన హృదయంలో నెలకొని వుండి మనచేత ప్రార్థనం చేయిస్తుంది గనుకనే, మనం ప్రార్థింప గులుగుతూన్నాం. మనంచేసే విజ్ఞాపన ప్రార్థన లన్నిటినీ ఈ పరిశుద్ధాత్మ ప్రార్థనలతోగూడ జోడిస్తూవుండాలి. అలా జోడించి ఆత్మయందు తండ్రికి అర్పిస్తూ వుండాలి. క్రీస్తు విజ్ఞాపన ప్రార్థనతోను ఆత్మ విజ్ఞాపన ప్రార్థనతోను చేర్చి సమర్పింపబడిన ప్రార్థనలు తండ్రికి తప్పక విన్పిస్తాయి.

పునీతులు, దేవదూతలు మరియమాత వీళ్లంతాగూడ మనకోసం విజ్ఞాపనం చేస్తుంటారు. వాళ్ళ విజ్ఞాపనలను మనం తప్పకుండా వినియోగించుకోవాలి. కాని వీళ్ళ విజ్ఞాపనలకంటె దైవ వ్యక్తుల విజ్ఞాపనలను వాడుకొని, ఆపిమ్మట సృష్టిప్రాణులైన దేవదూతలు పునీతులు మొదలైన వాళ్ల విజ్ఞాపనలను వినియోగించుకుంటూండాలి.

పూర్వాంశాల్లో విజ్ఞాపన జపాన్ని గూర్చి విచారించాం. మూడవరకపు బైబులు జపం పశ్చాత్తాప ప్రార్థనం. కనుక ఇకమీదట పశ్చాత్తాప ప్రార్థనను గూర్చి ఆలోచిద్దాం.

# 3. పశ్చాత్తాప ప్రార్థనం

**22. తమ పాపాలను ఒప్పుకుంటూ** - మత్త 1,6

తొలి మానవుడైన ఆదాము మొదలుకొని ప్రతి మనుష్యప్రాణి పాపం చేస్తూనే వచ్చాడు. కాని బైబుల్లోని స్త్రీపురుషులు బలహీనతవల్ల పాపం చేసినా, మళ్లా పశ్చాత్తాపపడి ప్రభువుతో సమాధాన పడ్డారు. మనమూ వీళ్ళు పోయిన మార్గాన్నేపోతూండాలి. స్వీయ పాపాల కోసం పశ్చాత్తాపపడుతూండాలి.

స్నాపక యోహాను క్రీస్తునకు పురోగామి. అతడు క్రీస్తుకోసం ప్రజలను సిద్ధం జేసాడు. ఈలా సిద్ధం జేసిన కార్యాల్లో అతడిచ్చిన జ్ఞానస్నానం గూడ ఒకటి. ఇది నూత్నవేదపు జ్ఞానస్నానం కాదు. పూర్వవేదపు ప్రజల్లో అమల్లోవున్న ఓ రకపు శుద్ధీకరణ కర్మ. యోహాను బోధ విన్నవాళ్లు పశ్చాత్తాపం చెంది, తమ పాపాలను ఒప్పుకొని, జ్ఞానస్నానం పుచ్చుకొన్నారు. పాపపు మానవులమైన మనం కూడా మన పాపాలకు పశ్చాత్తాపపడుతూండాలి. దేవుని యెదుట మన తప్పిదాలను ఒప్పుకొంటూండాలి.

## 23. పరలోకానికి విరోధంగా పాపం చేసాను - లూకా 15, 21.

దుడుకు చిన్నవాని కథ మనకు తెలుసు. అతడు తండ్రియాస్తిని దూరదేశాల్లో దుర్వ్యయం చేసాడు. దుష్టజీవితం జీవించాడు. కాని కరవుకాలంలో కన్నుదెరసి, తన పాడు పనులకు పశ్చాత్తాపపడి మళ్లా తండ్రియింటికి తిరిగివచ్చాడు. తండ్రిని కలిసికోగానే అతడు "నీకూ పరలోకానికి విరోధంగా పాపం చేసాను" అన్నాడు. ఆ చిన్నవాడు తండ్రి ప్రేమను నిరాకరించాడు గనుక తండ్రికి వ్యతిరేకంగా పాపం చేసాడు. కాని మనం చేసే పాపాలు తోడిప్రజలకు మాత్రమే గాదు భగవంతునికి గూడ విరోధంగా వుంటాయి. (ఈ వాక్యంలో పరలోకం అంటే భగవంతుడు). కాబట్టి నరునికి విరోధంగా పోవడంగాదు, మరి భగవంతునికి విరోధంగా బోవడం పాపంలోని ప్రధానాంశం. పాపం సాధ్యమైతే దేవుణ్ణికూడ నాశం చేయాలని చూస్తుంది. పాపంలో యింత ఘోరత్వం వుంది. ఈలాంటి పాపకార్యాలు చేసే మనం కూడ పశ్చాత్తాప పడుతూండాలి. హృదయశుద్ధికి వేరొక మార్గం లేదు.

## 24. ప్రభువు పశ్చాత్తాప ప్రియుడు - నిర్గ 34, 7.

పాపంవల్ల కోపాన్ని పశ్చాత్తాపంవల్ల శాంతిని ప్రదర్శించేవాడు యావే ప్రభువు. నూత్నవేదంలోని ప్రభువు కూడా పశ్చాత్తాప ప్రియుడు. జక్కయ పేదల నోళ్ళుగొట్టి బ్రతికే పాపి అయినా అతడు పశ్చాత్తాప పడగానే ప్రభువు "నేడు ఈ ఇంటికి రక్షణం లభించింది" అన్నాడు - లూకా 19,9 ఓ పాపాత్మురాలు తన దుష్టజీవితాన్ని తలంచుకొని చిత్తశుద్ధితో పరితాపపడింది. తన కన్నీటిబొట్లతో ప్రభుపాదాలు ఆర్ద్రం చేసింది. ప్రభువు వెంటనే ఆమెను కరుణించి "ఈమె అధికంగా ప్రేమించింది గనుక ఈమె విస్తార పాపాలుగూడా క్షమించబడ్డాయి" అన్నాడు - లూకా 8,47. మరో సందర్భంలో వ్యభిచారిణి నొకర్తెను రాళ్ళతో గొట్టి చంపబోయారు యూదులు. అంతలో ప్రభువు ఆవైపువెళ్తు ఆమెను రక్షించి కాపాడాడు. "ఇక వెళ్ళి పాపం చేయకుండా బ్రతుకు" అని మాత్రం మందలించాడు - యోహా 8,11. పశ్చాత్తాప హృదయుల పట్ల ప్రభువు చూపే కారుణ్యం ఈలాంటిది. ఈలాంటి సన్నివేశాలు బైబుల్లో చాలా వున్నాయి. భక్తుడు ఈలాంటి సన్నివేశాలను మననం చేసికొని జీర్ణానికి తెచ్చుకొంటూ వుండాలి.

## 25. ఎవరైనా పాపం లేదనుకుంటే - 1యోహా 2,1.

మనం పాపం చేయగూడదు. కాని బలహీనత వల్ల పాపంలో పడిపోయినట్లైతే, పశ్చాత్తాపపడి ప్రభువు నెదుట మన పాపాన్ని ఒప్పుకోవాలి. అతడు తండ్రి యెదుట మన

తరపున మనవి చేసేవాడు. మన పాపాలకూ సర్వలోక పాపాలకూ శాంతికరుడు ఆ ప్రభువే. అనగా అతని సిలువ మరణం మన పాపాలను శుద్ధిచేస్తుంది. కనుక ఆ ప్రభువు మన దోషాలను క్షమించి సమస్త దుర్నీతి నుండి మనకు విముక్తి గలిగిస్తాడు.

ఇక, మనం పాపం లేని వాళ్ళం అనుకొంటే హతమైపోతాం. మనల్ని మనమే మోసపుచ్చుకుంటాం. అబద్ధమాడతాం. నరుల పాపాల కోసం చనిపోయానని చెప్పే క్రీస్తుని గూడ అబద్ధీకుని జేస్తాం. అంచేత బైబులు క్రైస్తవుడు నిత్యం పశ్చాత్తాపమార్గాన నడుస్తూండాలి - 1యోహా 1, 8-2,2.

## 26. నిరపరాధుని రక్తం అప్పగించాను - మత్త 27, 4.

యూదా ఘోరకార్యం చేసాడు. నేను నిరపరాధి రక్తాన్ని అప్పగించి పాపం చేసానని ఒప్పుకున్నాడు.ఐనా అతనికి పరిహారం లభించలేదు. ఎందుకంటే అతని హృదయం పశ్చాత్తాప తప్తం కాలేదు. పైగా నిరుత్సాహంతో నిండిపోయింది. కనుకనే అతడు ఊరి వెలుపలకు వెళ్లి ఉరివేసుకున్నాడు. కావున పశ్చాత్తాపములేని పాపపు ఒప్పుకోలు వల్ల ప్రయోజనం లేదు. పేత్రూ పాపం చేసాడు. ఐనా పశ్చాత్తాప పడి తన పాపాన్ని ఒప్పుకున్నాడు, వెలుపలకు వెళ్ళి బోరున యేడ్చాడు. నిరాశ చెందకుండ ప్రభువునందు నమ్మిక వుంచాడు. ప్రభువు అతని పాపాన్ని క్షమించాడు. కనుక పాపం చేసినపుడు నిరాశపడ్డం గాదు, ఎవరో నిర్బంధించగా పాపాన్ని ఒప్పుకోవడం గాదు - మరి పశ్చాత్తాప పూరితమైన హృదయంతో ప్రభువు నెదుట - ఆ పాపాన్ని నివేదించుకోవాలి. అప్పుడు క్షమాపణం లభిస్తుంది.

## 27. కేవలం నీకే విరోధంగా - కీర్త 51,4

పశ్చాత్తాప ప్రార్థనలోని ముఖ్యాంశం పశ్చాత్తాపమే. ఎంతగా పశ్చాత్తాప పడతామో అంతగా పాపపరిహారం పొందుతాం. మనం చేసే ప్రతి పాపమూ భగవంతునికి ప్రతికూలంగా పోతుంది. పాపంలోని సారమూ దుష్టత్వమూ, ఈ భగవంతునికి వ్యతిరేకంగా పోవడమనే అంశంలోనే యిమిడివుంది. అందుకే కీర్తినకారుడు స్వీయ పాపాన్ని స్మరించుకొని. "నీకే, కేవలం నీకే విరోధంగా పాపం చేసాను ప్రభూ" అన్నాడు. ఈ సత్యాన్ని మనం బాగా జీర్ణంచేసికోవాలి. కొంతమంది మంచినీళ్లు త్రాగినంత సులభంగా చీటికి మాటికి పాపం చేస్తుంటారు. పాపం భగవంతునికి విరోధంగా పోతుందని అర్థం చేసికున్నవాళ్లు ఇంత చులకనగా పాపకార్యాలకు పూనుకోరు.

## 28. రెక్కలు విరిగిన పక్షి

ఈ పశ్చాత్తాపంగూడ ప్రభువు అనుగ్రహించే వరం. మనంతట మనం పాపం చేయగలమేగాని పశ్చాత్తాపపడలేం. పాపం జేసినపుడు రెక్కలు విరిగిన పక్షిలాగ, ఊబిలో దిగబడిన జంతువులాగ, సాలీని గూటిలో జిక్కుపడిన పురుగు లాగ నిస్సహాయ స్థితిలో వుండిపోతాం. ప్రభువు కరుణిస్తేగాని ఈ పాపావస్థను దాటిమళ్లా బయట పడలేం. అందుకే "ప్రభూ నీవు మా మనసు మార్చు. అప్పుడు మేమ మనసు మార్చుకుంటాం" అంటాడు యిర్మీయా ప్రవక్త - 31, 18. "ప్రభూ, నాలోని రాతి హృదయాన్ని తీసివేసి దానిస్థానే విధేయాత్మకమైన నిర్మల హృదయాన్ని నెలకొల్పు" అంటాడు యెహెజ్కేలు ప్రవక్త -11, 19. "ప్రభూ! నన్ను బలంగా ఆకర్షించు అప్పుడు నేను నీ వైపు ఆకర్షింపబడతాను" అంటుంది పరమ గీతంలోని ప్రియురాలు - 1,4. పాపియైన నరుడు రేయింబవళ్లు మననం జేసికోవలసిన మహా వాక్యాలివి!

## 29. నాలుగు వంతులు నష్టపరిహారం - లూకా 19,8

ఈలా పశ్చాత్తాపపడినంక మన పాపాలను ప్రభువు నెదుట ఒప్పుకోవాలి. ఒప్పుకొని పాపపు ప్రవర్తనం మార్చుకుంటానని ప్రమాణం చేయాలి. జక్కయ బీదల నోళ్లుకొట్టి ధనం కూడబెట్టాడు. కాని ఓమారు పరివర్తనం చెందాక తన పాపపు జీవితం మార్చుకుంటానని ప్రమాణం చేసాడు. తన ఆస్తిలో సగభాగం బీదలకిస్తానన్నాడు. నోళ్లుగొట్టి అన్యాయంగా లాగుకున్న డబ్బునకు నాలుగంతలుగా నష్టపరిహారం చెల్లిస్తానన్నాడు. ఈ నాలుగు వంతులు నష్టపరిహారం, సగం ఆస్తి దానం చేయడం, ఇవన్నీగూడ అతని చిత్తశుద్ధిని యదార్థమైన పరివర్తనను తెలియ జేస్తాయి. అతడు మళ్లా పాపపు త్రోవ త్రొక్కడని ప్రమాణ పూర్వకంగా హామీయిస్తాయి. మన పశ్చాత్తాపానికి గూడ ఈలాంటి గట్టి మాటపట్టు అంటూ వుండాలి.

## 30. ఓ షరతు

మన పాపాలకు పరిహారం పొందాలి అంటే ఓ షరతును పాటించాలి. ప్రభువు మనలను క్షమించాలని ఏలా కోరుకుంటున్నామో అలాగే మనమూ ఇరుగుపొరుగువారిని క్షమిస్తుండాలి. "మీరు పొరుగువారి అపరాధాలను క్షమింపకపోతే మీ తండ్రి గూడ మీ యపరాధాలను క్షమించడు" అని ప్రభువు రూఢిగా జెప్పాడు - మత్త 6,15. పైగా క్షమాపణం పొందిగూడ తాను క్షమింపనొల్లని సేవకుని కథ మనకు తెలుసు. "నేను నిన్ను కరుణించిన రీతినే నీవును నీ తోడి దాసుని కరుణించవలదా" అని యజమానుడు

ఆ సేవకుని గద్దించాడు - మత్త 18, 33. కనుక మనకు ఎవరిమీద గూడ దీర్ఘకోపం, దీర్ఘకాలపుపగ పనికిరాదు. బైబులు బోధించే భగవంతుడు క్షమాపరుడు. అతన్ని కొలిచే క్రైస్తవ ప్రజలుకూడ సులభంగా క్షమించడం నేర్చుకోవాలి.

## 31. పాపులలో నేను ప్రధానుడను - 1తిమొ 1,15

పౌలు తొలుత క్రైస్తవులను హింసించాడు. అలా హింసించడంద్వారా క్రీస్తునకే ద్రోహం చేసాడు. కాని ప్రభువు మాత్రం ఇతన్ని క్షమించి నమ్మకమైనవాడని తలంచి తన పరిచర్యకు నియోగించుకున్నాడు. తరువాత పౌలు క్రీస్తుకోసం ఎంతో కృషి చేసాడు. ఎన్నోవేల మైళ్ళు ప్రయాణంచేసి ఎన్నో క్రైస్తవ సమాజాలు నెలకొల్పాడు. ఎంతో మందికి క్రీస్తును బోధించాడు. ఎన్నో జాబులు వ్రాసి క్రీస్తును గూర్చిన వేదసత్యాలెన్నో ప్రతిపాదించాడు. ఐనా ఈ పౌలు జీవితాంతం వరకూ తాను మహా పాపినని చెప్పుకున్నాడు. జీవితాంతం వరకూ హృదయంలో పశ్చాత్తాపాన్ని పాదుకొల్పుకున్నాడు. చివరిరోజుల్లో తిమోతికి వ్రాసిన మొదటి జాబుతో, పాపుల్లో నేను ప్రధానుణ్ణి అని చెప్పుకున్నాడు. పౌలులాంటివాణ్ణి క్షమిస్తే ఇక ప్రభువు మమ్ము మాత్రం క్షమించడా అని పాపులు ధైర్యము తెచ్చుకోవడం కోసం, ఇక రాబోయ్యే వాళ్లకు తనను ఓ ఉదహరణంగా వుంచడం కోసం, ప్రభువు తన్ను క్షమించాడు అని వ్రాసికున్నాడు - 1 తిమో 1, 13-17. ఈలా మహా భక్తులు తాము పాపుల మనకున్నారు. జీవితాంతమూ తమ పాపాల కోసం పశ్చాత్తాపపడుతూ వచ్చారు. ఇక అల్పులమూ యాథార్థ పాపులమూ ఐన మనం, రోజురోజు స్వీయ పాపాల కోసం పశ్చాత్తాప పడుతూండవద్దా?

## 32. మీకు సమాధానం కలగాలి - యోహా 20, 20.

ఉత్థానక్రీస్తు శిష్యులకు దర్శనమిచ్చినప్పుడు మీకు సమాధానం కలగాలి అని చెప్తూ వుండేవాడు. క్రీస్తు సిలువ మరణం వల్ల మనకు పాపపరిహారం లభించింది. కనుక ఉత్థాన క్రీస్తు నరులందరకు సమాధానాన్ని అందిస్తాడు. మనం పాపాలకు పశ్చాత్తాపపడేపుడు కూడ ఈ ఉత్థాన క్రీస్తు సమాధానాన్ని పొందుతూంటాం. అందుకే పశ్చాత్తాపపడేపుడు హృదయం ఎంత భారంగా వుంటుందో క్షమాపణ పొందాక అంత తేలికగా వుంటుంది. ఈ హృదయ సమాధానం మనకు అనుభవం పూర్వకంగా తెలిసిన సత్యమే. కనుక పాపాలను తలంచుకొని నిత్యం పశ్చాత్తాపపడదాం. పశ్చాత్తాప ఫలితమైన హృదయ శాంతిని అనుభవిద్దాం. క్రీస్తు సమాధానాన్ని చవిచూద్దాం.

ఇంత వరకు పశ్చాత్తాప ప్రార్థనను గూర్చి విచారించాం. ఇక కృతజ్ఞతా ప్రార్థనను గూర్చి ఆలోచిద్దాం.

# 4. కృతజ్ఞతా ప్రార్థనం

## 33. గుఱ్ఱాన్ని రౌతుని సముద్రంలో కూలద్రోసాడు - నిర్గ 15,1

మోషే నాయకత్వంక్రింద యిస్రాయేలీయులు ఈజిప్టునుండి వెడలివస్తున్నారు. కాని ఐగుప్తీయులు యిస్రాయేలీయులను వెన్నాడారు. అప్పుడు మోషే ఆధిపత్యాన యిస్రాయేలీయులు సురక్షితముగా రెల్లుసముద్రముదాటి ఆవలకు వెళ్లారు. ఐగుప్తీయులు మాత్రం యుద్ధవీరుడైన యావేకు లొంగిపోయి సముద్రములో మునిగిపోయారు. వాళ్లూ, వాళ్ల రథాలూ, గుఱ్ఱాలు అన్నీ నీటగలసిపోయాయి. ఇది యావేప్రభువు యిస్రాయేలీయులకు అనుగ్రహించిన రక్షణం. ఈ యద్భుత రక్షణాన్ని స్మరించుకుంటూ, సముద్రం దాటివచ్చిన వెంటనే మోషే యావేను స్తుతించి గానం చేసాడు - నిర్గ 15, 1-21. ఈలా ప్రభువు చేసిన మేలి కార్యాలను తలంచుకొని అతన్ని స్తుతించడమే కృతజ్ఞతాప్రార్థనం. బైబులు మొదటినుండి చివరిదాకా ఈ కృతజ్ఞతా ప్రార్థనలతో నిండివుంటుంది. క్రైస్తవ భక్తుడు గూడ చిన్ననాటినుండి ఈ కృతజ్ఞతా ప్రార్థనకు చక్కగా అలవాటు పడుతూండాలి.

## 34. మన మహాదేవుడు విమోచకుడునైన యేసుక్రీస్తు - తీతు 2,13

పూర్వ వేదంలోని ప్రభువు విశేషంగా విమోచకుడు అన్నాం. ఆ ప్రభువు అనుగ్రహించిన ఈజిప్టు దాస్య విమోచనాన్ని పురస్కరించుకొని యిస్రాయేలు ప్రజలు అతన్ని స్తుతించారు అన్నాం. ఇక నూతనవేదపు ప్రభువైన క్రీస్తుకూడ ప్రధానంగా విమోచకుడు. మనం ఫరోకు గాదు, పిశాచానికి దాసులం. ప్రభువు సిలువపై మరణం జెంది ఈ పిశాచ దాస్యాన్నుండి మనకు విముక్తి గలిగించాడు. మనమూ ఓ రెల్లుసముద్రం దాటిపోతాం. అదే మన జ్ఞానస్నానం. మనమూ ప్రభువుతో ఓ నిబంధనం చేసికుంటాం. ఇది కూడ మన జ్ఞానస్నాన సమయంలోనే జరుగుతుంది. మనమూ ఓ వాగ్దత్త భూమిలో అడుగిడతాం. అదే మన మోక్షం. మన మోషే, మన నాయకుడు, మన ప్రభువు క్రీస్తు ఈరీతిగా పూర్వవేదపు రక్షణ మంతాగూడ నూత్న వేదంలో మళ్లా కొనసాగిపోతుంది. అంచేత నూత్నవేద ప్రజలమైన మనం నిత్యం ప్రభువైన క్రీస్తును స్తుతించి గానంచేస్తూవుండాలి. అతనికి కృతజ్ఞతాస్తుతులు వందనాలు అర్పిస్తూ వుండాలి.

## 35. ప్రభువైన యేసు కృతజ్ఞతాస్తుతులు చెల్లించి - 1 కొరి 11, 23.

నూత్న వేదపు దేవుడు ప్రధానంగా విమోచకుడు అన్నాం. అతడు విమోచకు డైంది విశేషంగా సిలువ మరణం ద్వారా. ఈ సిలువ మరణానికి ముందు ప్రభువు

దివ్యసత్ప్రసాదాన్ని నెలకొల్పాడు. ఈ దివ్యసత్ప్రసాదం రాబోయే సిలువ మరణాన్ని సూచిస్తుంది. కనుకనే దీన్ని నా జ్ఞాపకార్థం చేయండి అని ఆదేశించాడు ప్రభువు. అంచేత దివ్యసత్ప్రసాదంలో పాలుగొనేప్పుడెల్లా ప్రభువు సిలువ మరణాన్ని ప్రకటిస్తూంటాం. ఈలా ప్రభువు రెండవ రాకడ వరకూ ఈ దివ్యసత్ప్రసాదబలిని మన పీఠాలపై కొనసాగిస్తూంటాం. ఇదే మన మర్పించే పూజబలి.

ఇక యీ దివ్యసత్ప్రసాద బలికి, లేక పూజబలికి, గ్రీకు బాషలో "కృతజ్ఞతాస్తుతి" అని పేరు. ఎందుకనగా ఈబలినెలకొల్పకముందు ప్రభువు తండ్రికి కృతజ్ఞతాస్తుతులు చెల్లించాడు. క్రైస్తవ ప్రజలమైన మనం సమర్పింపగల కృతజ్ఞతా ప్రార్థనలన్నిటిలోను శ్రేష్ఠమైంది ఈ పూజబలి. అంచేత క్రైస్తవభక్తుడు పూజబలిలో పాల్గొనడం ద్వారా ప్రభువుకి అతని తండ్రికి కృతజ్ఞతాస్తుతులు చెల్లిస్తుండాలి.

## 36. ఆ తొమ్మిది మంది యేరి -లూకా 17,18

ఓ మారు పదిమంది కుష్ఠరోగులు ప్రభువును కలసికొని ఆరోగ్యం ప్రసాదించమని వేడుకున్నారు. మీరు వెళ్లి ఆరోగ్యం పొందినట్లుగా దేవాలయంలోని యాజకులకు తెలియజేసికొమ్మన్నాడు ప్రభువు. అలా వెళ్తుండగా వాళ్ల కుష్ఠ పోయింది. తొమ్మిదిమంది వాళ్ల త్రోవన వాళ్లు వెళ్లారు. ఒకడు మాత్రం ప్రభువు దగ్గరకు మరలివచ్చి కృతజ్ఞత తెలియజేసాడు, ఆ వచ్చినవాడు యూదుడుకాడు, సమరయుడు. అప్పుడు ప్రభువు చాలబాధపడి "పదిమంది శుద్ధులయ్యారు. ఐనాగని ఈయన్యుడొక్కడు దప్ప శుద్ధులైన యూదు లెవ్వరూ తిరిగి రాలేదుగదా? ఆ తొమ్మిదిమందిగూడ వచ్చి కృతజ్ఞతాస్తుతు లర్పించి దేవుని మహిమపరచి వుండాల్సింది గదా!" అన్నాడు. కనుక ఈ సందర్భాన్నిబట్టి మనం కృతజ్ఞతా భావం కలిగి వుండాలనే ప్రభువు కోరుకుంటూంటాడు అని తేటతెల్లమౌతుంది. అంచేత కృతజ్ఞతా ప్రార్థనం మరచిపోవడం ఓ పెద్ద దోషంగా భావించాలి.

## 37. ఏయే మేలికార్యాలు

ఏయే మేలికార్యాలు తలంచుకొని కృతజ్ఞతా వందనాలు అర్పించాలి? మనం పొందే మేలులన్నిటినీ మూడు వర్గాలుగా విభజించవచ్చు. మొదట అందరితో బాటు మనమూ అనుభవించే ప్రాకృతిక వరాలున్నాయి. వీటి జాబితా చాల పెద్దది, ఇక్కడ కొన్ని విషయాలు మాత్రం గమనిద్దాం : 1. మన పుట్టువు, జగత్ సృష్టి, ఆకాశం, నీళ్ళు, గాలి, ఋతువులు, చెట్టుచేమలు, పశుపక్ష్యాదులు. 2. మన ఆరోగ్యం, తెలివితేటలు, చదువుసంధ్యలు, బ్రతుకుదెరువు, ఉద్యోగాలు. 3. మన కుటుంబం, బంధువులు,

స్నేహితులు. ఇరుగుపొరుగువాళ్లు. 4. వినోదాలు, సెలవులు. ఆటపాటలు, ఉల్లాస కార్యక్రమాలు. 5. మనదేశం, స్వాతంత్ర్యం, సంస్కృతి సంరక్షణ మొదలైనవి. ఈ భాగ్యాలన్నిటికీ ప్రభువునకు వందనాలు అర్పించాలి.

ఆమీదట, క్రైస్తవ ప్రజలంగా మనం అనుభవించే ఆధ్యాత్మిక వరాలున్నాయి. 1. ప్రభు జననం, బోధలు, మరణోత్థానాలు, రక్షణం, పరిశుద్ధాత్మ, బైబులు దేవద్రవ్యాను మానాలు 2. మన జ్ఞానస్నానం, విశ్వాసం క్రైస్తవవిద్య, క్రైస్తవ జీవితం, దివ్యపూజ, సత్ప్రసాదం. 3. మరియమాత పునీతులు, ధన్యమరణం, మోక్షభాగ్యం. ఈ యాధ్యాత్మిక భాగ్యాలన్నిటికీ ప్రభువునకు కృతజ్ఞత తెలియజేయాలి.

కడన, మనకు లభించిన ప్రత్యేక వరాలు కూడ వున్నాయి. 1. దేవుడు నాకు ప్రత్యేకంగా అనుగ్రహించిన తెలివితేటలు, పెద్దచదువు, ఆరోగ్యం. 2. నాశక్తి సామర్థ్యాలు, నాలోని మేలిగుణాలు, నా యాస్తిపాస్తులు. 3. నా పిలుపు, ప్రభువు నాకనుగ్రహించిన అంతస్తు, ఈ ప్రత్యేక వరాలకూ ప్రభువునకు వందనా లర్పించాలి.

ఈలా, యిసుక రేణువులనైన లెక్కపెట్టవచ్చు గాని ప్రభువు మన కనుగ్రహించే వరాలను, మనకు చేసే మేలికార్యాలను లెక్కిడలేం - కీర్తన 139, 18. కనుక ఈ భాగ్యాలన్నిటికీ జీవితాంతం కృతజ్ఞులమై వుండాలి.

## 38. ఎప్పుడెప్పుడూ?

ఎప్పుడెప్పుడు కృతజ్ఞతా ప్రార్థనను సమర్పిస్తుండాలి? ఉదయమూ రాత్రికృతజ్ఞతా స్తుతులు చెల్లిస్తూ ప్రభుని స్తుతించమన్నాడు కీర్తన కారుడు - 92. 2. అనగా నిత్యము ప్రభుని స్తుతించమని భావం. అంచేత మనం అప్పుడు ఇప్పుడు అనే నియమం లేకుండ ఎప్పుడూ ప్రభుని స్తుతిస్తూనే వుండాలి. తల్లి దండ్రులను ప్రేమించడానికి పసిబిడ్డకు ఓ ప్రత్యేకమైన కాలమంటూ వుండదు. ఈలాగే మనమూ ఎప్పుడూ ప్రభుని కీర్తిస్తుండాలి.

ఒకోమారు చాలా యేండ్లు గడచినపిదప గూడ అధ్యాత్మిక జీవితంలో మనమట్టే వృద్ధి చెందం. మొదట యెక్కడ ప్రారంభించామో అక్కడే వుండిపోతాం. దానికి చాల కారణాలుండవచ్చు. కాని దేవునిపట్ల కృతజ్ఞతా భావం చూపకపోవడమనేది కూడ తప్పకుండ ఓ కారణమై వుంటుంది. తాననుగ్రహించిన భాగ్యాలను స్మరించుకొని భక్తిభావంతో కృతజ్ఞతా ప్రార్థనలు సమర్పించని వాడంటే ప్రభువునకు అట్టే ప్రియంగలుగదు. అందుచేత అట్టివాడు ఆధ్యాత్మిక జీవితంలో అట్టే ముందడుగు వేయలేడు. కనుక మనం అవస్యంగా కృతజ్ఞతా ప్రార్థనకు అలవడాలి.

ఇంతవరకు కృతజ్ఞతా ప్రార్థనను గూర్చి ముచ్చటించాం. ఇక ఆరాధన ప్రార్థనను అవలోకిద్దాం.

# 5. ఆరాధన ప్రార్థనం

## 39. యావే పరిశుద్ధుడు, పరిశుద్ధుడు, పరిశుద్ధుడు –యెష 6,3

యెషయా ప్రవక్త యువకుడుగా వున్నప్పుడు ఓమారు ప్రభువును ఆరాధించుకోవడం కోసం యెరూషలేం దేవాలయానికి వెళ్ళాడు. దేవాలయంలో అతనికి ఓ దర్శనం లభించింది. ఆ దర్శనంలో, ప్రభువు రాజఠీవితో ఉన్నత సింహాచనంపై ఆసీనుడై వుండగా చూచాడు. ప్రభువునకు పైగా దేవదూతలు బారులతీరి వున్నారు. ఆ దేవదూతలు ప్రభు సాన్నిధ్యంలో వున్నారు కనుక భయభక్తులతో రెక్కలు విప్పి ముఖాలు కప్పుకుంటున్నారు. "సైన్యములకు అధిపతియైన యావే పరిశుద్ధుడు, పరిశుద్ధుడు, పరిశుద్ధుడు. సర్వలోకం ఆయన మహిమతో నిండివుంది" అని యెలుగెత్తి గాన ప్రతిగానలు చేస్తున్నారు.

ఈ దర్శనంలో దేవదూతలు ప్రభువును స్తుతించి ఆరాధిస్తున్నారు అన్నాం. మనం దేవుని చెంత నుండి పొందిన ఉపకారాలను తలంచుకొని అతన్ని స్తుతించినట్లైతే అది కృతజ్ఞతా ప్రార్థనమౌతుంది. ఆలాకాకుండ ప్రభువు, మహిమ, పరిశుద్ధత్వం మొదలైన దైవలక్షణాలను స్మరించుకొని దేవుణ్ణి అతని కోసమే అతన్ని స్తుతించినట్లైతే అది ఆరాధన ప్రార్థనమౌతుంది. ఈలాంటి ఆరాధన జపానికి మనం అలవాటు పడుతుండాలి.

## 40. తలవంచి యావేకు మ్రొక్కితిని – ఆది 24, 48.

అబ్రాహామునకు వృద్ధసేవకు డొకడుండేవాడు. అతడు అబ్రాహాము యాజ్ఞపై ఈసాకునకు పిల్లను వెదకగోరి, వారి సొంతదేశమైన పదనారామునకు ఒంటెలతో ప్రయాణమై వెళ్తాడు. అలావెళ్తూ "ఏ బాలిక నాకు ఈ వొంటెలకూ నీళ్ళు తోడియిస్తుందో ఆమెయే ప్రభుకృపవల్ల మా ఈసాకునకు వధువు కావాలి" అని ముందుగానే ప్రార్థనం చేసికున్నాడు. ఆ ప్రార్థనం ముగిసిందోలేదో కడవ భుజంమీద పెట్టుకొని రిబ్కా వచ్చింది. ఆబాలిక అతనికీ, ఒంటెలకూ నీళ్ళు తోడియిచ్చింది. అబ్రాహాము సేవకునకు ప్రభుచిత్తం అర్థమైంది. అతడు వెంటనే తలవంచి యావేకు మ్రొక్కాడు. యజమానుని దేవుడైన ప్రభువునకు స్తోత్రాలు చెల్లించాడు. ఆరాధనం అంటే యిలా వుంటుంది. ఆరాధనాపరుడు ఆయా వ్యక్తుల్లోను ఆయా సన్నివేశాల్లోను భగవంతుని దర్శిస్తాడు. దర్శించి భగవత్సాన్నిధ్యానికి మ్రొక్కులిడుతూంటాడు.

## 41. సింహాసనాసీనుడైన దేవునికి నమస్కారం చేసాడు - దర్శ, 19,4

భగవంతుని ఆరాధించి మహిమ పరచడమే నరుని ఆశయం అన్నాం. సృష్టి ప్రాణులు మోక్షంలో చేసే పనికూడ నిత్యం భగవంతుణ్ణి ఆరాధిస్తూండడమే. దేవదూతలు పునీతులు కలకాలం మోక్షంలో ఆ ప్రభువుని ఆరాధించి స్తుతిస్తూంటారు. నూత్నవేదంలోని చివరి పుస్తకమైన దర్శన గ్రంథాన్ని (దర్శనాగమం) వ్రాసిన యోహాను మోక్షంలోని భక్తులు ప్రభువును ఆరాధించే తీరును ఓ దర్శనంలో చూచాడు. నాల్గు జీవులూ, ఇరువది నల్గురు పెద్దలు, సాగిలపడి సింహాసనాసీనుడైన దేవునకు నమస్కారం చేసారు. స్తుతి, రక్షణం, మహిమ, ప్రభావం మా దేవునికే చెల్లుతాయి అంటూ ఆ ప్రభువుని వందించారు. ఇది మోక్షారాధనం. ఈలాంటి ఆరాధననే భక్తులు భూమిమీదకూడ అర్పిస్తుంటారు. కనుక ఈ యారాధన ప్రార్థనకు మనంకూడ చిన్ననాటి నుండే తర్ఫీదు పొందుతూండాలి.

## 42. యేసు నామమునకు ప్రతివాడు మోకాలు వంచాలి - ఫిలి 2,10

తండ్రి, సుతుడు ఆత్మ అని దేవునిలో ముగ్గురు వ్యక్తులు. సుతుడుగూడ దైవవ్యక్తి గనుక తండ్రికి సరిసమానుడు. ఐనా అతడు నేను తండ్రితో సమానమైన వాణ్ణిగదా అని బెట్టుగా వుండిపోలేదు. మరి మనుష్యుని రూపం ధరించి దాసుడై పుట్టాడు. తన్నుతాను ఖాళీచేసుకున్నాడు. అనగా తన దైవత్వాన్ని వదలివేసుకున్నాడు. పైగా అతడు సిలువ మరణం చెందడానికి గూడ వెనుకాడలేదు. ఈలా సుతుడు తన్నుతాను తగ్గించుకొని తండ్రికి విధేయుడయ్యాడు. మనుష్యరక్షణం సాధించాడు. అందుచేత తండ్రి అతన్ని మెచ్చుకొని "ప్రభువు" అనే తన బిరుదాన్ని కుమారునికి గూడ అనుగ్రహించాడు. అతన్ని హెచ్చించి మహిమపరచాడు. ఇక మీదట పరలోకంలోని దేవదూతలుగాని, పాతాళంలోని పిశాచాలుగాని, భూమిమీది మనుష్య ప్రాణులుగాని ఈ ప్రభువుని ఆరాధించాలి. భక్తి వినయ మర్యాదలతో ఇతని నామానికి మోకాలు వంచాలి. ప్రతిజీవి జిహ్వకూడ యేసుక్రీస్తు ప్రభువని స్తుతించాలి. ఈ యారాధనం క్రీస్తునకు, క్రీస్తుద్వారా తండ్రికి మహిమను కలిగిస్తుంది.

## 43. రండి, నమస్కారంచేసి సాగిలపడదాం - కీర్తన 95,7.

"యావే మన దేవుడు. మనం ఆయన పాలించే ప్రజలం. ఆయన మేపే గొఱ్ఱెలం. రండి, ఆయన ఎదుట నమస్కారంచేసి, సాగిలపడదాం" అన్నాడు కీర్తనకారుడు. చాల భక్తిపూరితమైన మాటలివి. ఈలాగే "పితకును సుతునకును" అనే త్రీత్వస్తోత్ర జపంగూడ ఆరాధనకు ఉపకరిస్తుంది. పూజలో వచ్చే "ఉన్నతమునందు" అనే మహిమగీతమూ ఆరాధన ప్రార్థనమే, ఇక యెషయా దేవాలయ దర్శనంలో వినిన "పరిశుద్ధులు" అనే స్తుతి ప్రార్థనం

వుండనేవుంది. ప్రాచీన క్రైస్తవ గేయ కారుడెవరో "తేదేయుం" అనే అద్భుతమైన ఆరాధన గీతికను రచించాడు. వీటిలో వేనినైన వాడుకోవచ్చు. ఈ ప్రార్థనం చేసికోవచ్చు.

## 44. మీ దేహం పరిశుద్ధాత్మకు ఆలయం - 1కొ 6,19

ఆరాధనకు ఉపకరించే మరోసాధనం మన హృదయం. మనలో చాలామంది బహిర్ముఖులు. వాళ్ళను వీళ్ళను, వాటిని వీటిని చూస్తూ కాలక్షేపం చేస్తుంటాం. కాని మహాభక్తులు అంతర్ముఖులు. ఆ మహానుభావులు వాళ్ల హృదయంలోనికి తొంగిచూచుకున్నారు. హృదయ పీఠంమీదనే భగవంతుణ్ణి నెలకొల్పుకున్నారు. ఆలా హృదయాంతరాళంలో నెలకొనివున్న భగవంతుణ్ణి ఆ హృదయంలోనే ఆరాధించుకున్నారు.

జ్ఞానస్నానంతోనే మన దేహం దైవవ్యక్తులకు ఆలయమౌతుంది. ప్రభువు మన హృదయంలో వసిస్తాడు. కనుక క్రైస్తవ భక్తుడు హృదయమనే దేవాలయంలోగూడ భగవంతుని ఆరాధిస్తూండాలి.

## 45. అతనిద్వారా, ఆత్మయందు, తండ్రిని చేరుతాం -ఎఫే 2, 18.

మీదటి యంశాల్లో ముగ్గురు దైవవ్యక్తులను గూర్చి ప్రస్తావిస్తూ వచ్చాం. ఇక మన ప్రార్థనలను ఈ ముగ్గురిలో ఎవరికి సమర్పించాలి? దివ్యారాధనలోగాని, బైబుల్లోగాని కనుపించే సామాన్య క్రమం ఇది. మన ప్రార్థనలను పితకు అర్పిస్తూండాలి. క్రీస్తు శిష్యులకు ప్రార్థనం నేర్పుతూ పితనుద్దేశించి ప్రార్థించమన్నాడు. మరోమారుకూడ శిష్యులతో మాటలాడుతూ, మీకు వలసినవాటిని నా పేరుమీదుగా తండ్రిని అడుగండి అన్నాడేగాని, నేరుగా నన్నే అడగండి అనలేదు - యోహా 16, 23. కనుక మనం అడుగుకోవలసింది తండ్రిని.

ఇక, యీ ప్రార్థనం క్రీస్తుద్వారా చేస్తూండాలి. ఎందుకనగా ఆ ప్రభువు ఆర్జించిన పాపపరిహారం వలన మనం పితకు ప్రియపడుతూన్నాం. క్రీస్తు లేందే పిత మనకు తండ్రికాడు, మనం పితకు పుత్రులమూగాము.

ఈలా పితకు సమర్పించే ప్రార్థనం, క్రీస్తుద్వారా చేసే ప్రార్థనం, పరిశుద్ధాత్మయందు చేస్తూవుండాలి. ఈ యాత్మమే మనచేత దేవుణ్ణి "తండ్రి" యని పిలిపిస్తుంది - రోమా 8,15. ఈ యాత్మ మనయందు ప్రార్థిస్తూ వుంటుంది, మనమూ తనతోపాటు ప్రార్థన చేసేలా చేస్తుంది - రోమ 8, 26-27. కనుక మనం పితకు ప్రార్థనం చేయాలి. నూత్న వేదంలో నేరుగా క్రీస్తునకు చేసిన ప్రార్థనలున్నాయి. మనమూ నేరుగా క్రీస్తునకు ప్రార్థన చేయవచ్చు. కాని యిక్కడ మనం సూచించిన క్రమం ప్రాచీనకాలం నుండి బహుళ ప్రచారంలోవున్న సామాన్య నియమం, అంతే.

# 2. మనవి ప్రార్థనం

బైబులు భాష్యం - 98

## విషయసూచిక



## 1. మనవి ప్రార్థనం

### 1. క్రీస్తే మనకు ప్రార్థన నేర్పుతాడు

క్రీస్తు ఓచోట ఒంటరిగా ప్రార్థనం చేసికొంటున్నాడు. అతడు జపం చేయడం చూచి శిష్యులు తామూ జపంచేయాలనుకొన్నారు. కాని వారికి ప్రార్థన కుదరలేదు. కనుక వాళ్లు ప్రభూ! స్నాపక యోహాను తన శిష్యులకు నేర్పినట్లుగా నీవు మాకుకూడ ప్రార్థన నేర్పించమని అడిగారు. క్రీస్తు మీరు ఈలా ప్రార్థించండి అని వారికి తన జప విధానం నేర్పించాడు. అదే పరలోక జపం - లూకా 11, 1-4.

ఆ రోజుల్లో ఒక్కో రబ్బయికి ఒక్కో ప్రార్థనా విధానముండేది. స్నాపక యోహాను ఒక రబ్బయిగా తన శిష్యులకు కొంతకాలం ప్రార్థనం నేర్పాడు. అతడు గతించాక అతని శిష్యులు యోహాను యాకోబు క్రీస్తు శిష్యులయ్యారు. క్రీస్తుకూడ ఓ రబ్బయి. కనుక యోహాను మొదలైన శిష్యులు క్రీస్తుని ఇక్కడ తమకు ప్రార్థనం నేర్పమని అడిగారు. ప్రభువు వారికి తన జప విధానాన్ని నేర్పాడు. అతని విధానం పరలోక జపంలో వుంది.

ఈనాడు మనకు ప్రార్థన నేర్పేదికూడ ప్రభువే. అతనిలా మరెవ్వరూ మనకు జపం నేర్పించలేరు. కనుక మనంకూడ ఆ శిష్యుల్లాగే ప్రభూ! నీవు మాకుకూడ ప్రార్థన నేర్పించు అని క్రీస్తుని నిరంతరం అడుగుకోవాలి. ఒకసారీ రెండుసార్లూ కాదు. చాలసార్లు అడుగుకోవాలి. అదీ ఆశతో. ప్రభువు అనుగ్రహంవల్ల మనంకూడ జపం నేర్చుకొంటాం.

### 2. ప్రార్థనంలో మొదట దేవుడు

క్రీస్తు శిష్యులకు ఏలా ప్రార్థనం నేర్పించాడు? అతడు వారికి పరలోక జపాన్ని బోధించాడు. అతని ప్రార్థనా విధానమంతా ఆ జపంలో ఇమిడివుంది. "ఆయన వారితో

ఈలా అన్నాడు. మీరీలా ప్రార్థించండి. తండ్రీ నీ నామం పవిత్రపరచబడునుగాక. నీ రాజ్యం వచ్చునుగాక" - లూకా 11,2.

క్రీస్తు బోధ ప్రకారం, ప్రార్థనం మన అవసరాలతో ప్రారంభంకాదు. దైవస్తుతితో ప్రారంభమౌతుంది. మనం మన అవసరాలకంటె ముందుగా దైవరాజ్యాన్ని గూర్చి తలంచాలి. కనుకనే ప్రభువు "మొదట దైవరాజ్యాన్నీ ఆయన నీతినీ వెదకండి. అప్పుడు అన్నీ మీకు అనుగ్రహింపబడతాయి" అని చెప్పాడు - మత్త 6, 33.

క్రీస్తు ప్రార్థనా అతని జీవితమూ కూడ తండ్రి మీదనే లగ్నమై యుండేవి. క్రీస్తు ప్రధానంగా ఇతరుల కొరకు జీవించినవాడు. విశేషంగా తండ్రి కొరకు జీవించినవాడు. సువిశేషాలను పరిశీలిస్తే అతడు ప్రధానంగా నరుల కొరకుగాక తండ్రి కొరకు జీవించాడని స్పష్టమౌతుంది. తండ్రి చిత్తాన్ని నెరవేర్చడమూ అతని పనిని పూర్తిచేయడమూ క్రీస్తుకి ఆహారం. తండ్రిపని సిలువ మరణమే - యోహా 4,34. తండ్రి చిత్తాన్ని నెరవేర్చేవాడు అతనికి సోదరుడు సోదరి తల్లిలాంటివాళ్లు అవుతారు - మత్త 12, 50. పరలోక రాజ్యం ప్రవేశించాలంటే క్రీస్తుని ప్రభూ ప్రభూ అని పిలిస్తే చాలదు. తండ్రి చిత్తాన్ని పాటించాలి - మత్త 7, 21. క్రీస్తు మనపైగల ప్రేమచేతనే సిలువపై మరణించాడు. కాని అంతకంటే ముఖ్యంగా తండ్రి ఆజ్ఞకు బద్ధుడై సిలువపై మరణించాడు. కనుకనే అతడు తండ్రిని ఉద్దేశించి నా యిష్టంగాదు. నీ యిష్ట ప్రకారమే జరగనీయి అని ప్రార్థించాడు - మార్కు 14, 36. ఈ వేద వాక్యాలనుబట్టి మనం ఓ సంగతిని అర్థంజేసికోవాలి. క్రీస్తు ఉద్దేశం ప్రకారం ప్రార్థనం ఎప్పుడు కూడ తండ్రితో ప్రారంభమౌతుంది. ఆ తండ్రి రాజ్యం, అతని స్తుతి, అతని చిత్తం నెరవేరడం - వీటితో మనం ప్రార్థనను ప్రారంభించాలి. మన అవసరాలకంటె ముందుగా ఈ విషయాలు రావాలి. మనకంటె ముందు దేవుడు ముఖ్యం గదా!

ఐతే, మన అవసరాల మాట యేమిటి? దేవుణ్ణి స్తుతించాక మన అవసరాలు కూడ ఆ ప్రభువుకి విన్నవించుకోవాలి. కనుకనే పరలోక జపంలోని రెండవ భాగంలో ప్రభువుని మన అవసరాలు తీర్చమని అడుగుకొంటున్నాం. "మా అనుదినాహారం మాకు దయచేయండి, మా పాపాలను మన్నించండి, శోధనలనుండి మమ్ము కాపాడండి" అని వేడుకొంటున్నాం - లూకా 11, 3-4. ఈ యవసరాలను దేవుడు కాకపోతే మరెవరు తీరుస్తారు?

## 3. మనవి జపం ప్రాముఖ్యం

పరలోక జపంలో క్రీస్తు నేర్పింది ముఖ్యంగా మనవిజపమే. మనవి జపమంటే మన అవసరాలను తీర్చమని దేవుణ్ణి అడుగుకోవడం. మనం తండ్రీ! నీ నామం పవిత్ర

పరచబడునుగాక, నీ రాజ్యం వచ్చునుగాక అని ప్రార్థిస్తున్నాం. మనం ఈలా మనవి చేయకపోతే దైవరాజ్యం రాదా? అది భూమిమీద వ్యాపించదా? వ్యాపిస్తుంది. ఐనా ఇక్కడ తండ్రి మనచే దైవరాజ్య వ్యాప్తికొరకు ప్రార్థన చేయిస్తున్నాడు. కనుక మనం ఆవశ్యం మనవి జపం చేయాలి.

మన తరపున మనం తప్పకుండా మనవి జపం చేయాలని తెలియజేయడానికి క్రీస్తు ఓ వుపమానం చెప్పాడు. ఒకడు రాత్రివేళ తన స్నేహితుని వద్దకు వచ్చి మూడు రొట్టెలు బదులీయమని అడిగాడు. ఆ మిత్రుడు రాత్రిలో లేచి రొట్టెలీయడానికి బద్ధకించాడు. కాని ఆ వచ్చినవాడు పదేపదే ప్రాధేయపడి అడిగినందున చివరకు లేచి మూడు రొట్టెలిచ్చాడు. ఈలాగే మనంకూడ దేవుణ్ణి మళ్లా మళ్లా అడిగితే అతడు మనం కోరినవి తప్పకుండా యిస్తాడు. అడిగిన ప్రతివానికి దయచేస్తాడు - లూకా 11, 5-10.

పై వేదవాక్యాలు దేవుడు అడిగిన ప్రతివాడికి యిస్తాడని చెప్తున్నాయి - 11, 10. అనగా ప్రార్థన చేసేవాడు నేను పాపాత్ముణ్ణా పుణ్యాత్ముణ్ణా అని శంకించనక్కరలేదు. మన తరపున మనం భక్తితో మనవి చేస్తే దేవుడు మన మనవి ఆలించి తీరుతాడు. సందేహించ నక్కరలేదు. కనుకనే ప్రభువు ఇక్కడ ఇంకో వుపమానం కూడ ఎత్తుకున్నాడు. తండ్రి తన బిడ్డడు ఆకలిగొని తినడానికి చేపనడిగితే పామునీయడు. గ్రుడ్డునడిగితే తేలునీయడు. భూలోకంలోని తండ్రులే తమ బిడ్డలు అడిగినప్పుడు ఈలా మేలివస్తువుల నిస్తూంటే, పరలోకంలోని తండ్రి మనం వేడినప్పుడు ఇంకా యెంతో అధికంగా మంచి వస్తువుల నీయడా? తప్పక యిస్తాడు - లూకా -11, 11-13.

కనుక క్రీస్తు ఉద్దేశం ప్రకారం మనం ప్రార్థనం చేయాలి. ప్రార్థనలో మన మడిగినవన్నీ దేవుడు దయచేస్తాడు. మన జపం ప్రధానంగా మనవి రూపంలో ఉంటుంది.

ఈ మనవి ప్రార్థనలో వుండే శక్తి అంతాయింతా కాదు. అందుకే నూత్నవేదం చాల తావుల్లో ఈ రకం ప్రార్థనను గూర్చి చెప్తుంది. ఇక్కడ కొన్ని ఉదాహరణలు చూద్దాం. ప్రార్థనలో మీరు దేన్ని అడిగినా దాన్ని తప్పక పొందుతామని విశ్వసించండి - మార్కు 11, 24. రేయింబవళ్లు తనకు మొరపెట్టుకొనే ప్రజలకు దేవుడు న్యాయం చేకూర్చకుండా వుంటాడా? - లూకా 18,7. మీరు నా పేరిట ఏమి యడిగినా నేను దాన్ని చేసిపెడతాను - యోహా 14,14. మీరు నా పేరిట తండ్రిని ఏమి యడిగినా ఆయన మీకు అనుగ్రహిస్తాడు - 16, 23. నీతిమంతుని ప్రార్థన మహా శక్తిమంతమైనది. ఏలీయా వానలు కురవవద్దని ప్రార్థిస్తే కురవలేదు. కురవాలని ప్రార్థిస్తే కురిసాయి - యాకో 1, 16-18. క్రీస్తు చిత్తానుసారంగా మనం ఏదైన కోరితే ఆయన తప్పక వింటాడు -1 యోహా 5,14. ప్రతి విషయంలోను ప్రార్థనలతో, కృతజ్ఞతా పూర్వకమైన విజ్ఞాపనలతో మీ విన్నపాలను దేవునికి

తెలియజేయండి - ఫిలి 4,6. ఈ వేదవాక్యాలనుబట్టి మనవి ప్రార్థనలో వుండే శక్తి ఎంత గొప్పదో అర్థం జేసికోవచ్చుగదా!

## 4. ప్రార్థనా రహస్యం

మామూలుగా మనం ధ్యానం చేసికోబోతాం. దానిలో కాసేపు మనసు దేవునిమీద నిల్చినట్లే వుంటుంది. అంతలోనే పరాకులు వస్తాయి. మళ్ళా మనసు దేవునిమీదికి త్రిప్పుకొంటాం. దేవుణ్ణి గూర్చి ఆలోచిస్తాం. మళ్ళా చిత్తసంచారం. మళ్ళా ప్రయత్నంచేసి మనసు దేవునిమీదికి త్రిప్పుకొంటాం. దేవుణ్ణి గూర్చి ఆలోచిస్తాం. మళ్ళా మనసు ఎక్కడికో వెళ్ళిపోతుంది. ఈలా పరాకులకు అంతమే వుండదు.

మామూలుగా ధ్యానంలో మనం చేసేదేమిటంటే దేవుణ్ణి గూర్చి ఆలోచించడం. కాని అతడు మన ఆలోచనలకు లొంగడు. అసలు మన ప్రయత్నంవల్ల దేవుణ్ణి పొందలేం. మనంతట మనం అతన్ని చేరలేం. ప్రభువుకి ప్రార్థన చేసికోవడమనే భాగ్యం అతని వరప్రసాదం వల్లనే లభిస్తుంది. ఈ భాగ్యం కోసం మనం వినయంతో అడుగుకోవాలి. బిచ్చగాడిలా అర్థించాలి. మరొక మార్గంలేదు. తలతో ఆలోచిస్తే దేవుడు దొరకడు. హృదయంతో ప్రేమిస్తే, భక్తితో గాలిస్తే అతడు దొరుకుతాడు.

ప్రార్థనా రహస్యమంతా మనవి ప్రార్థనం చేసికోవడంలోనే వుంది. మనం దేవుణ్ణి వినయంతో అడుగుకొంటే అతడు మనకు ప్రార్థనా విధానాన్ని నేర్పుతాడు. శిష్యులు "ప్రభూ! నీవే మాకు ప్రార్థన నేర్పించు" అని మనవి చేసారు. అతడు నేర్పించాడు. మనమూ ఈలాగే చేయాలి. ఈలా కాకుండ మన తలతో దేవుణ్ణి గూర్చి ఆలోచించబోతే అతడు దొరకడు. వినయంతో భక్తిపూరితమైన హృదయంతో ప్రభువునే ప్రార్థన నేర్పమని అడుగుకొంటే అతడు దొరుకుతాడు. ప్రార్థనా రహస్యం మనవి ప్రార్థనను నేర్చుకోవడంలోనే వుంది. ఈ ప్రార్థనను సాధిస్తే మనకు జపంజేసే విధానం తెలిసినట్లే.

మనకు చిన్నచిన్న సుకృత జపాలున్నాయి. వీటినే భక్తితీక్షణ జపాలని కూడ అంటారు. ఇవి తరచుగా వేదవాక్యాలే. ఈ లఘు జపాలను భక్తితో జపిస్తూ దేవునికి మనవి జేసికొంటూ బోతే ఎంతో భక్తి పుడుతుంది. మనసు దేవునిపై నిలుస్తుంది. ఉదాహరణకు - ప్రభువే నాకు కాపరి, నా దేవా నా ప్రభువా, నా యాత్మను నీ చేతుల్లోనికి సమర్పిస్తున్నాను, ప్రభూ నేను నీ నుండి ఎడబాయకుందునుగాక, నా యేసువా నాకు రక్షకుడివిగా నుండు మొదలైనవి సుకృత జపాలు. బైబులు ఈలాంటి వాక్యాలతో నిండి వుంటుంది. ఇవి మనవి ప్రార్థనకు బాగ వుపయోగపడతాయి. భక్తి పుట్టిస్తాయి కూడ.

చాలమంది పామర జనానికి గొప్పగొప్ప ప్రార్థనా పద్ధతులేమీ తెలియవు. వాళ్ళకు తెలిసింది పరలోక మంగళ వార్తజపాలూ, ఉత్తమ మనస్తాప జపం, విశ్వాస సంగ్రహం మొదలైన శాబ్దిక జపాలు మాత్రమే. వాళ్ళు ఈ జపాలనే మళ్ళామళ్ళా చెప్పుకొని దేవునిపట్ల గాఢమైన అనుభూతిని కలిగించుకొంటారు. ఈలాగే జపదండ, దేవమాత ప్రార్థన, అర్చ్యశిష్టుల ప్రార్థన మనకెంతో భక్తిని పుట్టిస్తాయి. ఇవన్నీ మనవి ప్రార్థనలే. వీటిద్వారా మనం సులువుగా ప్రార్థనం జేసికోవచ్చు. అనతి కాలంలోనే దైవానుభూతిని పొందవచ్చు.

## 5. మనవి జపంలోని శక్తి

మకేరియస్ అనే యెడారిముని ఈలా చెప్పాడు. "పసిబిడ్డ నడవలేదు. తల్లి దగ్గరికి పోలేదు. కాని తల్లి తనకవసరం గనుక ఆమె కొరకు ఏడుస్తుంది. తల్లి ఆ యేడ్పును జూచి జాలి జెందుతుంది. ఆ బిడ్డకు తాను అవసరమని గుర్తిస్తుంది. పసిబిడ్డ నడచి తన దగ్గరికి రాలేదు కనుక తానే ఆ బిడ్డ దగ్గరికి వెళ్తుంది. ఆమెలోని ప్రేమే ఆమెను కదిలించి బిడ్డ దగ్గరికి పంపుతుంది. తాను బిడ్డను లాలించి ఓదార్చి పాలిస్తుంది. ప్రేమమయుడైన భగవంతుడు కూడ భక్తునిపట్ల ఈ తల్లిలాగే ప్రవర్తిస్తాడు. భక్తుడు భగవంతుణ్ణి కోరుకొంటేచాలు ఆ ప్రభువు శీఘ్రమే అతని దగ్గరికి వస్తాడు."

ప్రార్థనం చేసికొనేపుడు మనం పై వుపమానంలోని పసిబిడ్డ లాంటివాళ్ళం. క్రీస్తు ఈ వుపమానంలోని తల్లిలాంటివాడు. మనం ఆ పసిబిడ్డలాగ క్రీస్తుకి మనవి చేసికొంటే అతడు తల్లిలాగ మనలను ఆదరిస్తాడు. క్రీస్తు మన మనవిని ఆలించడానికి మనం మహా భక్తులమై యుండనక్కరలేదు. ఏ పాపాలు చేయని పవిత్రులమై యుండనక్కరలేదు. క్రీస్తు మనకు అవసరమని గుర్తించి అతన్ని గాఢంగా వాంఛిస్తే చాలు. మనంతట మనం మన అవసరాలను తీర్చుకోలేమని గ్రహిస్తే చాలు. క్రీస్తు మనకు సాయం చేస్తాడని నమ్మి అతన్ని అడుగుకొంటే చాలు. అనగా భక్తితో మనవిప్రార్థనం చేసికొంటే చాలు. ఆ జపంలో దేవుణ్ణి మన దగ్గరకు తీసికొనివచ్చే శక్తి వుంది.

## 6. దేవుని మనసు మారుస్తామా?

కొందరు ఈలా ప్రశ్నిస్తారు. మనం ప్రార్థనం చేసినందువల్ల దేవుడు తన మనసు మార్చుకోడు. అతడు పూర్వం ఏలా నిర్ణయించాడో అలాగే జరుగుతుంది. ఆలాంటప్పుడు మన కష్టాలు అతనితో చెప్పుకోవడంవల్ల ప్రయోజన మేమిటి? మనవి ప్రార్థనంవల్ల లాభమేమిటి?

ఈ ప్రశ్నకు సమాధానం చెప్పడం కష్టమే. మన ప్రార్థనం దేవుని చిత్తాన్నీ మనసునీ మార్చదు. అతడు ఏ నాటికీ మారడు. మారేది మనమే. ఐనా అతడు మన సహకారాన్నీ ప్రార్థననూ కోరతాడు. మన ప్రార్థనను ముందుగా చూచే దేవుడు ఆయా నిర్ణయాలు చేస్తాడు. మన ప్రార్థన లేనిదే అతడు మనలను రక్షించడు. కనుక మన తరపున మనం ప్రార్థన చేయవలసిందే.

ఐతే, భక్తుల ప్రార్థనవల్ల ప్రభువు మనసు మార్చుకొన్నాడని బైబులు చాల తావుల్లో చెప్తుంది. కానావూరి పెండ్లిలో ద్రాక్షరసం తక్కువపడింది. పెండ్లివారికి ద్రాక్షరసం ఐపోయింది. వారికి సహాయం చేయమని మరియమాత క్రీస్తుని అడిగింది. క్రీస్తు నా గడియ ఇంకా రాలేదన్నాడు. ఐనా మరియ నిరుత్సాహ పడకుండా పనివారితో మీరు ఆయన ఆదేశించినట్లుగా చేయండని చెప్పింది. క్రీస్తు ఆమె కోరిక ప్రకారం నీటిని రసంగా మార్చాడు. ఇక్కడ నా గడియ ఇంకా రాలేదన్న క్రీస్తు మరియ మనవివల్ల తన మనసు మార్చుకొని అద్భుతం చేసాడు గదా?

హిజ్కియా భక్తిగల రాజు. ఓసారి అతడు జబ్బుపడ్డాడు. యెషయా ప్రవక్త నీవిక బ్రతకవు. చనిపోకముందే నీ కార్యాలను చక్కబెట్టుకో అని దైవసందేశాన్ని తెలియజేసాడు. ఆ సందేశం విని హిజ్కియా మనసు నొచ్చుకొన్నాడు. దిగులుతో ప్రభూ! ఇన్నాళ్లు చిత్తశుద్ధితో నిన్ను సేవించాను. నీ చిత్తప్రకారం జీవించాను. ఇప్పుడు నన్ను కాపాడవా అని ప్రార్థించాడు. ఆ ప్రార్థనకు యావే ప్రభువు మనసు కరిగింది. ప్రవక్త మొదటి సందేశం చెప్పి రాజప్రాసాదం దాటి పోకముందే ప్రభువు అతన్ని వెనక్కు పంపించి క్రొత్త సందేశం చెప్పించాడు. దాని సారాంశం ఏమిటంటే, హిజ్కియా వ్యాధినుండి కోలుకొని ఇంకా 15 ఏండ్లు బ్రతుకుతాడు. ఇక్కడ ప్రభువు తన మనసు మార్చుకొన్నాడు గదా? - 2 రాజు 20, 1-6.

మోషే పది ఆజ్ఞలు తీసికొని రావడానికి కొండమీదికి వెళ్ళాడు. కొండ క్రింద యిస్రాయేలు ప్రజలు విశ్వాసఘాతకులై దూడను ఆరాధించారు. ప్రభువు ఆగ్రహం జెంది యిస్రాయేలు ప్రజలను నాశం చేస్తానని శపథం చేసాడు. వారికి బదులుగా మోషే నుండి క్రొత్త జాతిని పుట్టిస్తానన్నాడు. కాని మోషే యిస్రాయేలును మన్నించి వదలివేయమని మనవి చేసాడు. నీవు ఈ ప్రజలను మన్నించకపోతే నా పేరును నీ జీవగ్రంథం నుండి కొట్టివేయమన్నాడు. భక్తిగల మోషే ప్రార్థనను జూచి దేవుడు మనసు మార్చుకొన్నాడు. యిస్రాయేలీయులను నాశం చేయలేదు - నిర్గ 32, 11-14.

యావే పాపపు నగరాలైన సొదొమ గొమఱ్ఱాలను నాశం చేయడానికి వచ్చాడు. కాని తన సంకల్పాన్ని ముందుగా తన భక్తుడైన అబ్రాహాముకి తెలియజేసాడు. వెంటనే అబ్రాహాము ఆ నగరాల కొరకు దేవునికి మనవి చేసాడు. మొదట 50 మంది

మంచివాళ్ళుంటే ఆ పట్టణాలను కాపాడమని దేవుణ్ణి అడిగాడు. తర్వాత ఈ సంఖ్యకు 45కి, 40కి, 30కి, 20కి, 10కి తగ్గించుకొంటూ వచ్చాడు. దేవుడు ఆ నగరాల్లో 10 మంది భక్తిమంతులున్నా వాటిని కాపాడతానన్నాడు. ఇక్కడకూడ దేవుడు అబ్రాహాము ప్రార్థనంవల్ల తన మనసు మార్చుకొన్నాడు గదా? - ఆది 18, 17-32

ఆమోసు ప్రవచనంలో ఈ వుదంతాలు కన్పిస్తాయి. ప్రభువు యిస్రాయేలును శిక్షించడానికి వారి దేశంమీదికి మిడుతల దండును పంపబోతున్నాడు. కాని ఆమోసు ప్రవక్త ఆ ప్రజల తరపున దేవునికి మనవి చేసాడు. ప్రభువు తన మనసు మార్చుకొని ఆ కీడును చేయడం మానివేసాడు. మళ్ళా దేవుడు రెండవసారి వారిని శిక్షించడానికి అగ్నిని పంపబోతున్నాడు. ప్రవక్త రెండవసారి కూడ దేవునికి మనవి చేసాడు. ప్రభువు మనసు మార్చుకొని ఆ యగ్నిని తొలగించాడు -7, 1-6.

ఈ వుదాహరణలన్ని ఏమి బోధిస్తున్నాయి? బైబులు మనుష్య భాషలో మాట్లాడుతుంది. దేవుడు తన మనసు మార్చుకోడు. ప్రార్థనవల్ల మన మనసే మారుతుంది. అతడు నరుల ప్రార్థనంవల్ల తాను అనుకొన్న కీడు చేయక మేలే చేస్తాడు. కనుకనే యాకోబు జాబు - ఈలా చెప్తుంది. "నీతిమంతుని ప్రార్థనం మహా శక్తితో పనిచేస్తుంది. ఏలియా మనలాంటి వాడే. అతడు భక్తితో ప్రార్థన చేయగా మూడేండ్లు వానలు ఆగిపోయాయి. అతడు మరల ప్రార్థించగా వానలు కురిసాయి - యాకో 5, 16-18. కనుక దేవుడు భక్తిగల నరుల ప్రార్థనకు లొంగుతాడు అనుకోవచ్చు.

## 7. మనవి ప్రార్థనం అవసరం ఏమిటి?

కొందరు మనవి ప్రార్థనం స్వార్థంతో కూడిందనీ, అది వట్టినాసిరకం జపం అనీ చెప్తారు. ఇది పొరపాటు. స్వార్థమున్నా ఇది చాల గొప్ప ప్రార్థన. అధిక సంఖ్యాకులు చేసికొనే ప్రార్థన యిదే. మామూలుగా మన ప్రార్థనాజీవితం ఈ జపంతోనే ప్రారంభమౌతుంది. సువిశేషాల్లో క్రీస్తుకూడ ఈ ప్రార్థననే చాలసార్లు శిష్యులకు నేర్పించాడు. అసలు బైబులు అంతటిలోను ఎక్కువగా కన్పించే ప్రార్థన యిదే. కనుక మనం ఈ జపాన్ని అవశ్యం వినియోగించుకోవాలి.

ఇంకా కొందరు అసలు మనం మనవి ప్రార్థనం ఎందుకు చేయాలని అడుగుతారు. ఆకాశ పక్షుల్ని పోషించేవాడు, పొలంలోని పిచ్చిమొక్కల్ని రంగురంగుల పూలతో అలంకరించేవాడు మనలను పట్టించుకోడా అంటారు. మన అవసరాలు అతనికి తెలుసు కదా, మళ్ళా మనం ప్రార్థనలో అడుగుకోవడం దేనికి అంటారు. నిజమే. దేవుడు పక్షులనూ మొక్కలనూ పోషించేవాడే. మన అవసరాలు తెలిసినవాడే. దీన్నిబట్టి మనం

ఆందోళనం చెందకూడదని మాత్రమే పర్యవసానం. దేవుణ్ణి అడుగుకోనక్కర్లేదని పర్యవసానం కాదు - మత్త 6, 25-33. మనం దేవుణ్ణి అడుగుకొనేది మన అవసరాలు అతనికి తెలియవని కాదు. అతని ముందు మన వినయాన్ని ప్రదర్శించుకోవడానికి. అతడు అనుగ్రహించందే మనం బ్రతకలేమని తెల్పుకోవడానికి. అతని వరాలను పొందడానికి మనలను మనం సిద్ధం జేసికోవడానికి - అంతే.

ఓ వుదాహరణం తీసికొందాం. పంట మిక్కుటంగా వుంది. కాని కోతగాండ్రు తక్కువగా వున్నారు. కనుక పంటను సేకరించడానికి కోతగాండ్రను పంపవలసిందని పంట యజమానునికి మనవి చేయండి అని ఆదేశించాడు క్రీస్తు - మత్త 9, 37-38. ఇక్కడ పంట దేవునిదే కదా? మనం ప్రార్థించకపోయినా దాన్ని సేకరించడానికి దేవుడు పనివాళ్ళను పంపుతాడు గదా? మరి మనం ప్రార్థించడం దేనికి? దేవుడు రక్షణకార్యంలో మన సహకారాన్ని గూడ అర్థిస్తాడు. కనుక మన ప్రార్థనం కూడ అవసరం.

త్రెంటు మహాసభ ఈలా బోధించింది. "దేవుడు మనలను అసాధ్యమైన పనులు చేయమని ఆజ్ఞాపించడు. సాధ్యమైన పనులను చేయమనే ఆజ్ఞాపిస్తాడు. అసాధ్యమైన పనులు తగిలినప్పుడు తన సహాయం అడుగుకోమని ఆజ్ఞాపిస్తాడు". ఈ దైవసహాయం కొరకే మనం మనవి ప్రార్థనం చేసేది.

మనం పాపాలన్ని విసర్జించి పుణ్యజీవితం గడపాలంటే వరప్రసాదం అవసరం. మనం మంచిని చేసినపుడెల్ల దేవుడే మనతో వుండి ఆ మంచి పనిని చేయిస్తున్నాడు. భక్తిమంతులు కూడ మరణం వరకు నిర్మలజీవితం గడపాలంటే వరప్రసాదం అవసరం. అది లేందే యెవడూ పుణ్యజీవితంలో నిలకడగా వుండలేడు. మన యీ భూలోక జీవితం యెడారిలాంటిది. దేవుడు మనపై వరప్రసాద జలాన్ని వర్షించందే మనం పుణ్యజీవితంలో కొనసాగలేం. ఈ వరప్రసాద జలాన్ని పొందడం కొరకే మనం మనవి ప్రార్థన చేస్తున్నాం. ఈ ప్రార్థన చేయమని క్రీస్తు పలుసార్లు శిష్యులను ఆదేశించాడు కూడ.

బైబులు ఉపమానంతో చెప్పాలంటే బిడ్డడు తల్లిదండ్రులమీద ఆధారపడినట్లే మన అవసరాల్లో మనం దేవుని మీద ఆధారపడాలి. అతన్ని అడుగుకోవాలి. తల్లిదండ్రులు బిడ్డడికి సాయం జేసినట్లే దేవుడు మనకు సాయం జేస్తాడు. బిడ్డడు తన అవసరాలను తానే తీర్చుకోనక్కరలేదు. ఆందోళనం చెందనక్కరలేదు. అతనికి సాయం జేయడానికి తల్లిదండ్రులున్నారు. ఈలాగే మనకు సాయం జేయడానికి దేవుడున్నాడు.

అడగందే అమ్మయినా పెట్టదు అని తెలుగు సామెత. మనం దేవుణ్ణి అడగకుండా మెదలకుండా కూర్చుంటే అతడు మనకు తోడ్పడడు. అతడు మన సోమరితనాన్ని గర్హిస్తాడు. మన కృషిని మెచ్చుకొంటాడు. కనుక మనం దేవుణ్ణి అడుగుకోవాలి. వేదశాస్త్రులు ఏమి

చెప్పారంటే, మన తరపున మనం అంతా మనమీదనే ఆధారపడిందో అన్నట్లుగా కృషిచేయాలి. ఆ మీదట అంతా దేవునిమీదనే ఆధారపడివుందో అన్నట్లుగా అతన్ని నమ్మాలి. దైవబలమూ మన యత్నమూ కలసి విజయాన్ని చేకూర్చి పెడతాయి. మనవిజపంలో మన యత్నమూ వుంది. దేవుని దీవెనా వుంది. కనుక అది బాగా ఫలిస్తుంది. ఫలితాంశమేమిటంటే, మనవి ప్రార్థనం సులువైంది, అవసరమైంది, ప్రభువే ఆజ్ఞాపించింది.

# 2. ప్రార్థనా విధులు

మామూలుగా మనం ప్రార్థనలో ఏమడిగినా ప్రభువు దయచేస్తాడని చెప్పాం. కాని కొన్నిసార్లు అతడు మనమడిగింది ఈయడు. ఇందుకు కారణాలు చాలవుండవచ్చు. ఒక కారణం, మన తరపున మనకు విశ్వాసం లేకపోవడం. ప్రార్థన ఫలించాలంటే మొదటి విధి పూర్ణవిశ్వాసం.

## 1. విశ్వాసం

క్రీస్తు అద్భుతాలు చేయకముందు నేనీ కార్యం చేయగలననే విశ్వాసం మీకుందా అని రోగులను అడిగేవాడు. అద్భుతాలు చేయకముందు అతడు పెట్టిన షరతు ఇదొక్కటే. అతడు స్వగ్రామమైన నజరేత్తూరు వెళ్ళినప్పుడు అక్కడ అద్భుతాలు చేయలేకపోయాడు. కారణం ఆ పట్టణ ప్రజలు అతన్ని నమ్మకపోవడమే - మత్త 13, 58.

మన ప్రార్థనం ఫలించాలంటే విశ్వాసం అత్యవసరమని క్రీస్తు నొక్కి చెప్పాడు. "ప్రార్థనలో మీరు ఏమడిగినా దాన్ని తప్పక పొందుతామని విశ్వసించండి. అప్పుడు మీరడిగింది లభిస్తుంది"- మార్కు 11,24. ఈ వాక్యాన్ని బట్టి, విశ్వాసముంటే చాలు మన ప్రార్థనం ఫలిస్తుందని రూఢిగా నమ్మవచ్చు.

యాకోబు జాబుకూడ ఈ సత్యాన్నే బోధిస్తుంది. "మీలో ఎవరికైన వివేకం లేకపోతే అతడు దేవుణ్ణి అడగాలి. ఆయన దాన్ని ప్రసాదిస్తాడు. దేవుడు ఎవరిని గద్దింపక అందరికి ఉదారంగా అనుగ్రహిస్తాడు. కాని నరుడు విశ్వాసంతో అడగాలి. ఏ మాత్రం అనుమానించరాదు. అనుమానించేవాడు గాలికి అటూయిటూ కొట్టుకొనే సముద్రతరంగంలాంటివాడు. ఈలాంటివానికి ప్రభువునుండి ఏమీ లభించదు. వాడు ద్విమనస్కుడు, చపలచిత్తుడు. వాడికి ఏ పనిలోను స్థిరత్వముండదు-యాకో 1, 5-8. ఈ వాక్యాలనుబట్టీ విశ్వాసంలేకుండాచేసే ప్రార్థన గాలికి అటూయిటూ కొట్టుకొనే అలలాంటిది. అవిశ్వాసి మనసులో నమ్మకమూ అపనమ్మకమూ రెండూ వుంటాయి. కనుక అతని వేడుదల ఫలించదు.

పూర్వభక్తులకున్న విశ్వాసం నేడు మనకు లేదు. ఫ్రాన్సిస్, అంతోని మొదలైన భక్తులు దేవుణ్ణి నమ్మి ప్రార్థన చేసారు. వాళ్ళు నమ్మినట్లుగానే దేవుడు వాళ్ల అడిగింది దయచేసాడు. ఈ విశ్వాసం నేటి ప్రజలకులేదు. కనుక మనం ఈ గుణాన్ని ఆవశ్యం పెంపొందించుకోవాలి.

సువిశేషంలో ఓ సంఘటనం విన్పిస్తుంది. ఓ కుర్రవాడికి మూగదయ్యం పట్టింది. అది పిల్లవాణ్ణి నేలపై పడవేసి కొయ్యబారిపోయేలాగ చేసేది. పిల్లవాడి తండ్రి ఆ బాలుణ్ణి శిష్యులవద్దకు తీసికొని వచ్చాడు. కాని శిష్యులు ఆ భూతాన్ని వెళ్ళగొట్టలేకపోయారు. అటుతర్వాత తండ్రి ఆ బాలుణ్ణి క్రీస్తు దగ్గరికి తీసికొనివచ్చి అయ్యా! నీకు సాధ్యమైతే ఈ దయ్యాన్ని వెళ్ళగొట్టు అని మనవిచేసాడు. క్రీస్తు నీవు నమ్మితేచాలు, నమ్మినవాళ్ళకు అంతా సాధ్యమేఅన్నాడు. ఆ తండ్రి నేను నమ్ముతూనేవున్నాను. నేను అవిశ్వాసం చెందకుండేలా నీవే నాకు సాయంచేయి అన్నాడు. ప్రభువు అతన్ని కరుణించి అతని కుమారుని నుండి దయ్యాన్ని వెళ్ళగొట్టాడు – మార్కు 9, 17–24. ఈ తండ్రి మనకు ఆదర్శంగా వుంటాడు. కనుక మన తరపున మనం ఈలా జపించాలి. "ప్రభూ! నేను నిన్నూ నీ శక్తినీ నమ్ముతూనే వున్నాను. ఈ విపత్తులో నీవు నాకు సహాయం చేస్తావని విశ్వసిస్తున్నాను. నా విశ్వాసంలో ఏమైనా కొరతవుంటే నీవే దాన్ని భర్తీచేయి".

మన మనవిజపం ఫలించకపోవడానికి రెండవ కారణం మనం శత్రువులను క్షమించకపోవడం. దీన్ని గూర్చి విపులంగా పరిశీలిద్దాం.

## 2. విరోధులను క్షమించడం

క్రీస్తు ఈలా బోధించాడు. "నీవు ప్రార్థించేపుడు నీ సోదరునిపై నీకేమన్నా మనస్పర్థవుంటే వానిని క్షమించు. అప్పుడు పరలోకంలోని మీ తండ్రి మీ తప్పిదాలనుగూడా మన్నిస్తాడు" – మార్కు 11, 25–26. అనగా మనం ఇరుగుపొరుగువారి పాపాలను మన్నించందే దేవుడు మన పాపాలను మన్నించడు. మన ప్రార్థన ఆలించడు.

మరో సందర్భంలో ప్రభువు ఈలా నుడివాడు. "నీవు నీ కానుకలను బలిపీఠం దగ్గరికి తెచ్చావనుకో. అప్పుడు నీ పొరుగువానికీ నీకూ స్పర్థలు వున్నాయని నీకు తడుతుంది. అలాంటి పరిస్థితిలో నీ కానుకను అక్కడే వదలివేయి. మొదట వెళ్ళి నీ పొరుగువానితో రాజీపడిరా. తర్వాత తిరిగివచ్చి కానుకను సమర్పించుకోవచ్చు" – మత్త 5,23–24. అనగా దేవుణ్ణి పూజించడంకంటె తోడివారిపట్ల ప్రేమతో మెలగడం ముఖ్యమని భావం. దైవప్రేమకంటె సోదరప్రేమ ఘనమైనదని అర్థం.

మనందరిలోను ద్వేషభావాలు గూడుగట్టుకొని వుంటాయి. ఈ ద్వేషాన్ని బయటికి కన్పించనీయం.కాని హృదయంలో మాత్రం ఎంతో పగ పేరుకొని వుంటుంది. చాలమంది

ఎంతోవిలువైన వస్తువునైనా వొదలుకొంటారుగాని పగను వదలుకోడానికి ఇష్టపడరు. ఇతరులమీద కోపతాపాలు వెళ్ళగ్రక్కుతూంటే, వీలైనపుడల్లా వాళ్ళకు కీడుచేస్తూంటే, మనకు ఎంతో సంతృప్తిగా వుంటుంది. కాని కరుణామయుడైన భగవంతునికి ఈ పద్ధతి నచ్చదు. కనుక అతడు మన ప్రార్థనను ఆలించడు.

మరి మనం ఏమి చేయాలి? మన శత్రువులను క్షమించడం నేర్చుకోవాలి. ఏలా? మనకు గిట్టనివాళ్ళ పేర్లను జాబితాగా వ్రాసికోవాలి. వారి కొరకు దేవుని ప్రార్థించాలి. ఈ ప్రార్థనవల్ల మనకు శత్రువులపట్లగల అనిష్టభావాలు క్రమేణ తొలగిపోతాయి. ప్రార్థన హృదయాన్ని పవిత్రంచేసి ద్వేషాన్ని పటాపంచలు చేస్తుంది.

శత్రువుని క్షమించడం చేతగానితనం అనుకోగూడదు. పగతీర్చుకోవడం పురుషలక్షణమనే దురభిమానానికి పోగూడదు. శత్రువుని క్షమించడం దైవగుణం. కనుక విరోధిని మన్నించడంద్వారా మనం దేవుడంతటివాళ్ళ మౌతాం.

ఇంత చెప్పినా శత్రువుని మన్నించడం కష్టంగానే వుంటుంది. నరుల మనసులు భిన్నభిన్నంగా వుంటాయి. కొందరైతే పగవాణ్ణి ఎంతమాత్రం మన్నించలేరు. ఆలాంటప్పుడు ఈ క్రింది మూడు సూత్రాలు ఉపయోగపడతాయి.

1. ముందే చెప్పినట్లు మన శత్రువుల కొరకు ప్రార్థనచేయాలి. ఈ కార్యాన్ని క్రీస్తు ఆజ్ఞాపించాడు. అతడు "మీ శత్రువులను ప్రేమించండి. మిమ్ము హింసించేవారి కొరకు ప్రార్థించండి" అన్నాడు - మత్త 5, 44. మనం ప్రార్థన చేసేవాళ్ళమీద మనకు సానుభూతి కలుగుతుంది. క్రమేణ వాళ్ళ తప్పులను క్షమించగలుగుతాం.

2. నాకు జరిగిన ఈ యపకారాన్ని దేవుడు అనుమతించాడు, అతడే దాన్ని నిర్ణయించాడు అనుకోవాలి. దేవుడు అనుమతించందే, అతడు నిర్ణయించందే, ఎవడూ మనలను బాధించలేడు. కనుక మనం ఇతరులు మనకు కలిగించే కష్టాల్లో అదృశ్యంగావున్న దేవుని హస్తాన్ని గుర్తించాలి. క్రీస్తు ఉత్థానానంతరం పేత్రు యెరూషలేములో ప్రసంగిస్తూ తండ్రి చిత్తప్రకారం, అతని భవిష్యద్ జ్ఞానం ప్రకారం, యేసు సిలువ మరణానికి అప్పగింపబడ్డాడు" అన్నాడు - అ.చ. 2,23. తండ్రి చిత్తంలేందే, అతనికి తెలియకుండా యూదులు క్రీస్తుని సిలువమీద కొట్టి చంపి వుండరుకదా? మన బాధలకుగూడ ఇదే సూత్రం వర్తిస్తుంది. దేవుడు నిర్ణయించందే ఎవడూ మనలను బాధించలేడు. ఈ జీవితంలో మన హేరోదులూ పిలాతులూ మనకుంటారు. కాని మనం ఈ హేరోదులమీదా పిలాతులమీదా మనస్తాపపడుతూ కూర్చోకూడదు. వారిని నడిపించే దేవుణ్ణి గుర్తించాలి.

ఆ ప్రభువు మనకు హింసలూ బాధలూ ఎందుకు రానిస్తాడో మనకు తెలియదు. కాని అవి మనకు తప్పక మేలుచేసిపెడతాయి కనుక మనం వాటిని ఓర్పుతో అంగీకరించాలి. వాటిని తలపెట్టినవారిని క్షమించాలి.

3. ఈ క్రింది భావనకూడ ఉపయోగపడుతుంది. క్రీస్తు సిలువవైపు చూడండి. అతడు నిర్దోషి. ఐనా అతన్ని అన్యాయంగా సిలువ వేసారు. మనకు అతనికి జరిగిందానికంటె గొప్ప అన్యాయాలు జరిగాయా? అంత గొప్ప అన్యాయాలుజరిగినాకూడ క్రీస్తు సుమ్మర్లు పడలేదు. మనం చిన్నచిన్న అన్యాయాలకే పెద్ద గొడవచేస్తాం. క్రీస్తులాగ కొన్ని సిలువలు అనుభవించకపోతే మనం శిష్యులం అయ్యేదెపుడు? "ధర్మం కోసం హింసలను అనుభవించే వాళ్లు ధన్యులు" అంటుంది ఓ అష్టభాగ్యం - మత్త 5,10. మన జీవితంలో మాత్రం ఈ వాక్యం సార్థకం గావద్దా? వేదసాక్షులు, పునీతులు తమ్ము హింసించేవాళ్ళకు వందనాలు చెప్పారు. ఎందుకు? హింసలద్వారా వాళ్లు క్రీస్తు సిలువను మోసే భాగ్యం కలిగింది కనుక.

ఇంకో విషయంగూడ. క్రీస్తు నిర్దోషియైనా శత్రువులు అతన్ని హింసించారు. కాని మనం హింసకు గురైనప్పుడు ఈ క్రీస్తులాగ మనంగూడ నిర్దోషులమని చెప్పుకోలేం. తరచుగా విరోధులు మనలను హింసించడానికి కారణం మన దుష్టబుద్ధే. మన దుష్కార్యాలవల్ల మనం విరోధులను రెచ్చగొడతాం. వాళ్ళు విజృంభించి మనలను పీడిస్తారు. ఈలాంటప్పుడు మన పాలబడిన హింసలను మనంగాకపోతే ఇంకెవరు అనుభవిస్తారు?

పైన పేర్కొన్న భావాలతో మనం శత్రువులను క్షమించడం నేర్చుకోవాలి. శత్రుక్షమాపణం, విశ్వాసం చాల ముఖ్యమైన ప్రార్థనా విధులు. ఇవిగాక వేరే చిన్న విధులుకూడ వున్నాయి. వాటినిగూడ పరిశీలిద్దాం.

## 3. ఇహలోక ప్రీతి పనికిరాదు

మన ప్రార్థనం ఇహలోక వస్తువులను హద్దుమీరి ఆశించేదిగా వుండకూడదు. కేవలం సుఖభోగాలను ఆర్థికలాభాలను కోరేదిగా వుండకూడదు. ఈ సందర్భంతో యాకోబు జాబు ఈలా చెప్తుంది. "మీకేమి కావాలో వాటికొరకై దేవుణ్ణి అర్థించకపోవడంచేత మీకు కావలసినవాటిని మీరు పొందలేకపోతున్నారు. మీకు దురుద్దేశాలు వుండటం చేతనే మీరర్థించినవి మీకు లభించడంలేదు. మీ భోగాల కోసమే మీరు వాటిని కోరుతున్నారు. విశ్వాసరహితులారా! ఈ లోకాన్ని ప్రీతితో జూచేవాడు దేవునికి విరోధి అని మీకు

తెలియదా?" - 4,2-4. ఈ వేదవాక్యాలు నిరసించేది హద్దు మీరిన భోగవాంఛనీ, ధనవాంఛనీ. కనుక మనం ఈ వాంఛలతో ప్రార్థనచేస్తే దేవుడు ఆలించడు.

క్రీస్తు భోగభాగ్యాలకు దూరంగా వున్నాడు. అతడు మనం అనుదినాహారం కొరకు ప్రార్థన చేయాలన్నాడు. తండ్రిమీద ఆధారపడి సరళజీవితం గడపాలన్నాడు. విపరీతమైన ధనవాంఛ అతని మనసుకి వ్యతిరేకమైంది. కనుక మనం అక్రమమైన ధనార్జన కొరకూ భోగాల కొరకూ ప్రార్థనచేస్తే ప్రభువు విన్పించుకోడు. అతడు మనం మొదట దైవరాజ్యాన్ని వెదకాలని బోధించాడుకదా? - మత్త 6, 33.

## 4. పేదలకు ఉదారంగా ఈయాలి

దేవుడు మన ప్రార్థనను ఆలించాలంటే మనం పేదసాదలకు ఉదారంగా దానం చేయాలి. మనం తోడివారికిస్తే దేవుడు మనకిస్తాడు. ఈ సందర్భంలో ప్రభువు ఈలా ఆదేశించాడు. "మీరు పరులకు ఈయండి. దేవుడు మీకిస్తాడు. కుదించి, అదిమి, పొర్లిపోయే నిండు కొలమానంతో ఇస్తాడు. మీరు ఏకొలతతో కొలుస్తారో దేవుడు మీకు అదే కొలతతో కొలుస్తాడు" - 6, 38. పేదసాదలూ అక్కరలోవున్నవాళ్ళూ మనలను అర్థిస్తారు. అప్పుడు మనకున్నంతమట్టుకు మనం ఉదారంగా ఈయాలి. మనం ఇతరులకు ఇచ్చేదాన్నిబట్టి దేవుడు మనకిస్తాడు. ఇది పై వేదవాక్యాల భావం. కనుక మనం పేదసాదలను పట్టించుకోకుండా దేవుడు మన మనవిని ఆలించాలంటే కుదరదు.

## 5. క్రీస్తు పేరుమీదిగా అడగాలి

మనం క్రీస్తుపేరుమీదిగా తండ్రికి ప్రార్థన చేయాలి. అప్పుడు తండ్రి మన మనవిని ఆలిస్తాడు. క్రీస్తు ఈలా బోధించాడు. "మీరు నా పేరిట తండ్రిని ఏమి యడిగినా ఆయన మీకు అనుగ్రహిస్తాడు - యోహా 16,23. "మీరు నా పేరిట నన్ను ఏమియడిగినా నేను చేసిపెడతాను" -14,14. తిరుసభ ప్రార్థనలన్నీ "మా ప్రభువైన క్రీస్తుద్వారా ఈ మనవిని చేస్తున్నాం" అనే మాటలతో ముగుస్తాయి. దీనికి కారణం పై వేదవాక్యాలే. కనుక మనం మన వ్యక్తిగత ప్రార్థనలో కూడ ఈ సూత్రాన్ని పాటించాలి.

కాని ఇక్కడ "క్రీస్తుపేరుమీదిగా" అడగడమంటే భావం ఏమిటి? క్రీస్తు సిలువమరణంచెంది తండ్రికి ప్రీతి కలిగించాడు. క్రీస్తు మనతరపున తండ్రికి ప్రార్థన చేస్తాడు. కుమారునిపట్ల గల ప్రీతిచే అతని పేరుమీదిగా మనం ఏమడిగినా తండ్రి చేసిపెడతాడు. కనుక క్రీస్తు మధ్యవర్తిత్వం ద్వారా మనం తండ్రికి ప్రార్థనం చేయాలి.

ఇంకా "క్రీస్తుపేరుమీదిగా" అడగడమంటే అతని యిష్టానికి అనుకూలంగా అడగడం కూడ. అనగా క్రీస్తు తండ్రిని అడగడానికి ఇష్టపడనివాటిని మనం అడగకూడదు. అతని మనసుకి నచ్చనివాటిని మనం కోరగూడదు. ఉదాహరణకు భోగభాగ్యాలు ఆడంబరాలు గౌరవాలు పదవులు క్రీస్తుకి ఇష్టంకావు. వీటిని మనం అడగకూడదు. వినయం సోదరప్రేమ దైవరాజ్యప్రీతి మొదలైనవి క్రీస్తుకి యిష్టం. వీటిని మనం అడగాలి.

### 6. ఎడతెగక ప్రార్థన చేయాలి

మనకు అవసరమైనవాటిని ఒక్కసారి మాత్రమే అడిగితే చాలదు. చాలసార్లు, మళ్ళీమళ్ళీ, ఎడతెగక అడుగుతూండాలి. ఈ సూత్రానికి క్రీస్తు చెప్పిన రెండుదాహరణలు మనకు తెలుసు. మూడు రొట్టెలకోసం రాత్రిపూట మిత్రుని దగ్గరికి వెళ్ళినవాడు పదేపదే ప్రాధేయపడి అడిగాడు. అప్పుడు అతనికి రొట్టెలు లభించాయి. ఆలాగే మనమూ దేవుణ్ణి మళ్ళీమళ్ళీ అడగాలి - లూకా 11, 8-9. ఇంకా పేదరాలు అన్యాయపు న్యాయాధిపతి దగ్గరికి చాలసార్లు వెళ్లి తనకు న్యాయం చేసిపెట్టమని అడిగేది. అప్పుడతడు ఆమెకు అనుకూలంగా తీర్పు చెప్పాడు. ఈలాగే మనం కూడ రేయింబవళ్లు దేవునికి మొరపెట్టుకోవాలి - లూకా 18, 5-7. మామూలుగా మనం కొంతకాలం ప్రార్థన చేస్తాం. దేవుడు మన మడిగింది త్వరగా ఈయకపోతే ఆ ప్రార్థనను అంతటితో ఆపివేస్తాం. ఈలాగైతే మన ప్రార్థన ఫలించదు. ఇది చెడ్డపద్ధతి.

ఇక్కడ మనవిప్రార్థనను గూర్చి చెప్తున్నాం. ప్రార్థన మనవి, విజ్ఞాపనం, పశ్చాత్తాపం, కృతజ్ఞత, ఆరాధన అని రకరకాలుగా వుంటుంది. ఈ ప్రార్థనలన్నిటినీ చేసికోవలసిందే. ఒక్కోసారి ఒక్కో ప్రార్థన నచ్చుతుంది. ఆత్మే మనచే రకరకాల ప్రార్థనలు చేయిస్తుంది. కాని మనం ఎన్నిరకాల ప్రార్థనలుచేసినా మనవిప్రార్థనం అవసరం మాత్రం తీరిపోదు. దాన్ని నిరంతరం చేయవలసిందే. ఇక, మనకు తెలిసిన ప్రార్థనల్లోకల్లా అతిశ్రేష్ఠమైంది పరలోక జపం. ఆ జపమంతా మనవే. కనుక మనం దాన్ని నిరంతరం వాడుకొంటూడాలి. గాంధీగారికి ఈ జపమంటే ఎంతో యిష్టం.

## 3. ప్రార్థనకు సహాయకారులు

ప్రార్థనాజీవితం బహు సుకుమారమైంది. జాగ్రత్తగా సంరక్షిస్తేనేగాని అది బ్రతకదు. ఈ లోకంలో చెట్లు, జంతువులు, నరులు మొదలైన ప్రాణికోటి జీవితమంతా సుకుమారమైందే. ప్రాణులు బ్రతకాలంటే తగుమాత్రం వేడివుండాలి. గాలి ఆహారం వుండాలి. జబ్బు సోకినపుడు మందులుండాలి. ఇవి లేకపోతే ప్రాణులు నశిస్తాయి. ఈలాగే

ప్రార్థనకూడ సుకుమారమైంది. అది మన హృదయాల్లో వర్థిల్లాలంటే మనం మౌనాన్నీ ఏకాంతాన్నీ పాటించాలి. ఆధ్యాత్మిక గ్రంథాలు చదవాలి. నియమితకాలంలో జపం చేసికోవాలి. లేకపోతే మన హృదయంలో ప్రార్థనం నిల్వదు. చచ్చిపోతుంది. కనుక మనం ప్రార్థన అనే మొక్కను జాగ్రత్తగా పెంచుకోవాలి.

ప్రార్థనకు దేహం, ఆసనం, స్థలం, కాలాన్ని వెచ్చించడం, దేవునిమీద కోర్కె పెట్టుకోవడం మొదలైన సహాయకారులు వున్నాయి. వీటిని క్రమంగా పరిశీలిద్దాం.

## 1. దేహం

జపానికి దేహం అతిముఖ్యమైన సహాయకారి. కలెక్టరు, గవర్నరు మొదలైన పెద్ద అధికారులను కలసికొన్నపుడు వారి యెదుట మేరమర్యాదలతో నిలబడతాం. కాని అధికారులందరికి అధికారి దేవుడు. ప్రార్థనం చేసేపుడు అతని ముందట వుంటాం. కనుక ప్రార్థనలో మన దేహాన్ని మేరమర్యాదలతోను భక్తితోను వుంచుకోవాలి. ఈ వెలుపలిభక్తి లోపలి ఆత్మమీద కూడ సోకుతుంది. దేహంలో భక్తిలేకపోతే లోపలి ఆత్మలోకూడ భక్తి వుండదు.

మనం కేవలం నోటితోనే మాట్లాడం. దేహంతోగూడ సంభాషిస్తాం. మన చేతులు, కాళ్లు ముఖం మొదలైన అవయవాలన్నీ మాటలాడతాయి. ఆలాగే మనం కేవలం ఆత్మతో మాత్రమే ప్రార్థనం చేయం. దేహంతోగూడ చేస్తాం. ఉదాహరణకు దేవునికి చేయెత్తి దండం పెడతాం. అతని ముందు చేతులు జోడించుకొని నిలబడతాం. ఆ ప్రభువు వైపు ఆశతో చూస్తాం. మన ముఖంలో భక్తినీ వినయాన్నీ దీనత్వాన్నీ ప్రదర్శిస్తాం. ఆ మహాప్రభువుముందు సాష్టాంగపడతాం. ప్రార్థనలో ఈ దేహసంజ్ఞలన్నీ వాడుకోవాలి. కేవలం మనసుతోనేగాక శరీరంతోగూడ ప్రార్థనం చేయడం అలవాటు చేసికోవాలి.

## 2. ఆసనం

మామూలుగా మనం మోకాళ్ళూనో, కూర్చుండో, నిల్చుండో, మెల్లగా అటూ యిటూ తిరుగుతూనో జపంజేస్తాం. ఈ దేహభంగిమలే ఆసనాలు. కొందరికి మోకాళ్ళ మీద వుంటే బాగా భక్తి పుడుతుంది. కొందరికి స్తిమితంగా కూర్చుంటే భక్తిపుడుతుంది. అభ్యాసంకొద్దీ, అనుభవం కొద్దీ ప్రార్థనలో ఏయాసనం మనకు బాగా వుపయోగపడుతుందో మనం గుర్తించే వుంటాం. మనకు బాగా వుపయోగపడే ఆసనాన్నే మనం ప్రార్థనలో వాడుకోవాలి. దాన్ని అనవసరంగా మార్చకూడదు. మారిస్తే ప్రార్థనం చెడిపోతుంది. మన ఆసనం మేరమర్యాదలనూ వినయాన్నీ సూచించాలి.

## 3. స్థలం

మనం జపం జేసికొనే తావుగూడ ముఖ్యం. క్రీస్తు కొండమీదనో, గెత్సెమని తోటలోనో, నిర్జన ప్రదేశంలోనో జపించేవాడు. ప్రార్ధనానుభవం కలిగిన ఆ ప్రభువు బుద్ధిపూర్వకంగానే ఈ తావులను ఎన్నుకొన్నాడు. ఎందుకు? ఈ స్థలాలలో ఏకాంతంగా వుండవచ్చు. నిష్ఠతో తండ్రికి ప్రార్థన చేసికోవచ్చు.

మామూలుగా మనం జపంజేసికోవడానికి కొండ, వనం, నదీసముద్రతీరాలు, రేయి చుక్కలతో నిండిన ఆకాశం బాగా వుపయోగపడతాయి. ఈ తావుల్లో రమ్యమైన ప్రకృతి వుంటుంది. ఈ సుందరప్రకృతి మనం మనసును దేవుని వైపు త్రిప్పుకొనేలా చేస్తుంది. మనకు భక్త్యావేశం పుట్టిస్తుంది. ఐనా అందరికీ ఈలాంటి తావులు లభించవు. మనకు దొరికిన తావుల్లోనే మనం జపం జేసికోవాలి.

ప్రార్థన చేసికోవాలంటే దేవాలయానికి మించినతావులేదు. దానిలోని బలిపీఠం, సిలువ, దీపాలు, స్వరూపాలు, చిత్రాలు అన్నీ భక్తిని పుట్టిస్తాయి. కనుక గుడిలో జపం జేసికోవడం ఉత్తమం. గుడి అందుబాటులో లేనివాళ్లు తమ యింటిలోనే ఓ గదిలోనో ఓ మూలనో జపం జేసికోవచ్చు. కాని రోజూ అదే గదిలో ప్రార్థనం జేసికోవడం మంచిది. కొన్నాళ్లు నిలకడగా ప్రార్థనం జేసికోవడంవల్ల ఆయాతావులు పవిత్రమౌతాయి. ఇక ఆ తావుల్లో జపం సులువుగా కుదురుతుంది.

ఇక్కడే పవిత్ర స్థలాలను గూర్చిగూడ రెండు మాటలు చెప్పాలి. చాలమంది భక్తులు చాలకాలంపాటు ప్రార్థనం జేయడంవల్ల కొన్ని తావులు పవిత్ర స్థలాలౌతాయి. ఆ తావుల్లో ప్రార్థన ప్రోగుపడి వుంటుంది. దేవాలయాలు పుణ్య క్షేత్రాలు ఈలాంటివే. మనం ఈ తావుల్లోకి వెళ్ళినపుడు జపం చేయకుండా వుండలేం. ఈ స్థలాల్లో ప్రార్థనాశక్తి నిక్షిప్తమై వుంటుంది. ఈ శక్తి మనలను ప్రార్థనకు పురికొల్పుతుంది. భక్త్యావేశం పుట్టిస్తుంది. ఈ స్థలాల్లో ప్రార్థన చేసికోవడం గొప్ప అదృష్టంగా భావించాలి. అవకాశం కలిగినప్పుడల్లా ఈ తావులకువెళ్ళి జపం జేసికోవాలి.

కడన దివ్యసత్ప్రసాద సన్నిధిని గూడ పేర్కొనాలి. ఇక్కడ సాక్షాత్తు దైవసాన్నిధ్యం వుంటుంది. ఇది పరమ పవిత్రమైన తావు. కనుక ఈ తావులో పుట్టేంత భక్తి మరెక్కడా పుట్టదు. ప్రార్థనకు యిది అతిశ్రేష్ఠమైన తావు. కావున మనం వీలైనంతవరకు దివ్యసత్ప్రసాద సన్నిధిలో ప్రార్థన చేయాలి. చాలమంది పునీతులు ఈలానే చేసారు.

ఇక, మనం ప్రార్థనం జేసికొనే తావు - అది యేదైనా - శుభ్రంగా వుండాలి. మన దేవాలయాన్నీ బలిపీఠాన్నీ గూడ శుభ్రంగా వుంచుకోవాలి.

## 4. కాలం వెచ్చించడం

చాలమంది బోలెడన్ని పనులతో సతమతమౌతూంటారు. భక్తిగా జీవించగోరే వాళ్ళుకూడ ప్రార్థనకు వ్యవధిలేదంటూంటారు. కనుక ఎక్కువ కాలం ప్రార్థనకు వినియోగించరు. కాని ప్రార్థనమీద కాలం వెచ్చించందే దేవుడు అనుభవానికి రాడు.

నిత్యజీవితంలో మిత్రులూ, భార్యాభర్తలూ, తల్లిదండ్రులూ బిడ్డలూ మొదలైనవాళ్ళు ఒకరితో వొకరు ఎంతో కాలం గడుపుతారు. దీనివల్ల వాళ్ళకు సఖ్యసంబంధాలు పెరుగుతాయి. ఒకరితో ఒకరు ఐక్యమౌతారు. ఇదే సూత్రం దేవుడికి గూడ వర్తిస్తుంది. మనం దేవుని సన్నిధిలో గూడ గంటల కొలది కాలం గడపాలి. దీర్ఘ కాలం ప్రార్థన చేయాలి. అప్పుడే ఆ ప్రభువుతో మనకు సఖ్యసంబంధాలు పెరిగేది. అప్పుడే అతడు మనకు అనుభవానికి వచ్చేది. ప్రార్థనమీద కాలం వెచ్చించడానికి ఇష్టపడనివాడికి దేవుడు చచ్చినా అనుభవానికి రాడు.

వ్యవసాయం మొదలైన వృత్తుల్లో, టెన్నిస్ మొదలైన క్రీడల్లో ఆరితేరాలనుకొనేవాళ్ళు ఆ కార్యాలకు ఎంతో కాలం వినియోగిస్తారు. ఎడతెగని కృషిచేస్తారు. అప్పుడే వాళ్ళకు ఫలితం దక్కేది. అరకొరలుగా పనిచేసే రైతుకి పొలం పండుతుందా? కొద్దికాలం మాత్రమే అభ్యాసంజేసే ఆటగాడు ప్రవీణుడు ఔతాడా? మరి మనం కొద్దికాలం మాత్రమే ప్రార్థనజేస్తే దేవుడేలా అనుభవానికి వస్తాడు?

కొంతమంది ప్రార్థనమీద కాలం గడపడం దండుగ అనుకొంటారు. ఆ కాలంలో ఏదైనా పనిజేసికొంటే ఎక్కువ ఫలితం కలుగుతుందనుకొంటారు. ఇది పొరపాటు. ప్రార్థనకు వినియోగించిన కాలం వ్యర్థమైపోదు. అమూల్యమౌతుంది. దేవుని యెదుట గడిపిన కాలంతో దేవుణ్ణి కొనుక్కొంటాం. ఇంతకంటె మహాభాగ్యం ఏముంటుంది?

పునీతులు దేవునికి ప్రార్థన చేసేపుడు దేవుని ప్రజలకు సేవలు చేయాలని తపించిపోయారు. దేవుని ప్రజలకు సేవలు చేసేపుడు దేవునికి ప్రార్థన చేయాలని ఉవ్విళ్ళూరారు. వాళ్ళు ప్రార్థనకూ సేవాకార్యాలకూ సమానమైన విలువనిచ్చారు. నేడు మనం సేవాకార్యాలకు ఎక్కువ కాలం వెచ్చించి ప్రార్థనను నిర్లక్ష్యం చేస్తున్నాం. ఇది తప్పు. ఎప్పుడుగూడ మన భక్తికి కొలతబద్ద మనం ప్రార్థనంమీద ఎంత కాలం వినియోగిస్తున్నామన్నదే.

## 5. దేవునిమీద కోరిక

ప్రార్థనాభ్యాసం కలగాలంటే దేవునిమీద గాఢమైన కోర్కె వుండాలి. ఈ కోర్కెను ప్రభువే పుట్టిస్తాడు. దీని ద్వారా మనం ప్రభువుపట్ల ఆకర్షితులమౌతాం.

ఆకలివేసి తిన్న అన్నం రుచిగా వుంటుంది. బాగా అరిగి దేహానికి పుష్టినిస్తుంది. ఈలాగే మనకు దేవునిమీద ఆకలివేయాలి. ఈ యాకలి కల్గినవాడు దేవుణ్ణి వెదకుతాడు. అతనికొరకు తపించిపోతాడు. అతనికి ప్రార్థనం చేస్తాడు.

మామూలుగా మనం లౌకిక వస్తువుల్లో పడి దేవునిమీద ఆకలి కలిగించుకోవడం మర్చిపోతాం. దేవుణ్ణి మర్చిపోయినవాళ్లు జపాన్ని గూడ మర్చిపోతారు.

ఒడ్డున బడవేసిన చేప నీటికొరకు తపిస్తుంది. ఆలాగే భక్తుడు భగవంతుని కొరకు తపించాలి. అగస్టీను భక్తుడు "ప్రభూ! మా హృదయాన్ని నీ కొరకే చేసావు. నీయందు విశ్రమించిందాకా దానికి విశ్రాంతిలేదు" అని వాకొన్నాడు. నరుడు విశ్రాంతిలేని హృదయంతో, తీరని దాహంతో దేవుని కొరకు గాలించాలి.

రామకృష్ణ పరమహంస ఈ వుపమానం చెప్పాడు. దొంగ ఓ గదిలో పండుకొని నిద్రపోబోతున్నాడు. దాని ప్రక్కగదిలో బంగారముంది. ఆ గదికీ దొంగవున్న గదికీ మధ్య ఓ పల్చని గోడ మాత్రమే అడ్డముంది. ఈ పరిస్థితుల్లో ఆ దొంగ నిద్రిస్తాడా? రాత్రంతా మేల్కొనివుండి ఆ పల్చని గోడను పగలగొట్టి ఆ బంగారాన్ని దోచుకొని పోవడానికి యత్నించడా? ఆలాగే మనంకూడ దేవుడనే బంగారాన్ని సంపాదించుకోవడానికి నిరంతరం యత్నించాలి.

ప్రభువే మనకు తనమీద కోర్కెను దయచేస్తాడు. మన తరపున మనం ఈ వరంకోసం అతన్ని మాటిమాటికి అడుగుకోవాలి. ఓసారి ఈ కోర్కె పుడితే ప్రార్థనం సుకరమౌతుంది.

# 3. వివిధ ప్రార్థనలు

బైబులు భాష్యం - 112

## 1. దైవచిత్తానికి లొంగాలి

ఓ ప్రభూ! నేను నీ చిత్తానికి లొంగివుండే భాగ్యాన్ని దయచేయి. నిన్ను నమ్మినవాళ్ళకు అన్ని సంఘటనలూ మంచినే చేకూర్చిపెడతాయని గ్రహించేలాచేయి. కష్టాలూ అపజయాలూ కూడ నన్ను నీ దగ్గరికి చేరుస్తాయి. నీవు నా శక్తిని మించిన పరీక్షకు నన్ను గురిచేయవని నాకు తెలుసు. ఏ తండ్రికూడ తన బిడ్డణ్ణి అనవసరంగా శ్రమలపాలు చేయదు. కనుక నీవు మా మంచినికోరే మమ్ము ఇక్కట్టులకు గురిచేస్తూంటావు. తండ్రీ! నన్ను నేను నీ చేతుల్లోకి అర్పించుకొంటున్నాను. నేను ఎల్ల వేళల నీ దివ్యచిత్తానికిలొంగి జీవించేలా అనుగ్రహించు.

## 2. సత్యప్రీతి

ప్రభూ! నాకు సత్యాన్ని తెలిసికోవాలనే తపనను దయచేయి. ఓమారు సత్యాన్ని గ్రహించాక ఇతరులు ఏమనుకొంటారో అని జంకక ఆ సత్యంవైపే మొగ్గేలా చేయి. నష్టమైనా కష్టమైనా ఆ సత్యాన్ని అనుసరించిపోయేలాచేయి. సంపూర్ణ సత్యానివి నీవే కనుక సత్యప్రీతి కలవాడు నిన్ను చేరతాడని గ్రహించేలా చేయి. దురభిమానానికి లొంగికాని, తాత్కాలిక లాభాన్ని ఆసించికాని నిజాన్ని మరుగుపరచకుండా వుండేలాచేయి. నా జీవితకాలమంతా నీ సత్యదీపం నాకు దారిజూపుతూండునుగాక.

## 3. చెడ్డకుకాక మంచికి కారకుణ్ణి

ప్రభూ! నేను ప్రియాప్రియ సంఘటనల్లోను మృదువుగాను శాంతంగాను మెలిగేలా చేయి. ఇతరులు నా ఆశలను వమ్ముజేసినపుడూ, నన్ను వంచించినపుడూ, నాకు నమ్మకద్రోహం చేసినపుడూ నేను కోపతాపాలకు గురిగాకుండా వుండేలా చేయి.

నన్ను నేను కాస్త మరచిపోయి ఇతరుల సౌఖ్యాన్ని గూర్చి ఆలోచించేలాచేయి. ఇతరులమీద సుమ్మర్లు పడకుండ నా బాధలను ఓర్పుతో సహించేలా చేయి.

జీవితంలో నాకెదురయ్యే శ్రమలవల్ల లాభాన్ని పొందేలాచేయి. ఆ శ్రమలవల్ల నేను అధముణ్ణిగా గాక ఉత్తముణ్ణిగా మారేలా చేయి. కష్టాలవల్ల కోపాన్ని గాక ఓర్పుని

అలవర్చుకొనేలా చేయి. నా బాధలవలన ఇతరుల వేదనలను సానుభూతితో అర్థంజేసికొనే భాగ్యాన్ని కూడ దయచేయి.

నా ప్రభావానికి గురైనందున ఏ నరుడూ అధముడు గాకుందునుగాక. నాతో కలియడంవల్ల ఏ జనుడూ తన మంచితనాన్నీ, శీలన్నీ ఔన్నత్యాన్నీ కోల్పోకుందునుగాక. నా ప్రభావానికి గురైనవాళ్లు మంచివైపేగాని చెడ్డవైపు మొగ్గకుందురుగాక. నేను లోకంలో చెడ్డకు గాక మంచికి కారకుణ్ణి అగుదునుగాక.

## 4. ఆరోగ్యవరానికి వందనాలు

ప్రభూ మేము నీవు మాకు దయచేసిన వరాలకు అలవాటు పడిపోతాం. వాటిని అట్టే విలువతో చూడం. కాని ఆ వరాలను పోగొట్టుకొన్నపుడు వాటి విలువను అర్థంజేసికొంటాం. నీవు మాకు దయచేసిన ఆరోగ్యవరం ఈలాంటిదే. ఆరోగ్యంగా వున్నంతకాలం మాకు దాని విలువ తెలియదు. వ్యాధి వచ్చినపుడు ఆరోగ్యం ఎంత గొప్పవరమో అర్థంజేసికొంటాం. నీవు నాకు చక్కని ఆరోగ్యాన్ని ప్రసాదించావు. నా దేహమూ మనస్సూకూడ బలంగావున్నాయి. అన్ని అవయవాలు సంతృప్తికరంగా పనిజేస్తున్నాయి. ప్రశాంతంగా రోజులు సాగిస్తున్నాను. ఇందుకు నీకు వందనాలు చెప్తున్నాను. ప్రభూ! ఆరోగ్యంగా జీవిస్తున్న నాకు రోగులపట్ల సానుభూతిని దయచేయి. వ్యాధికి గురైనవారిని చిన్నచూపుచూచి చీదరించుకోకుండా వుండేలా చేయి. జబ్బుగా వున్నవాళ్ళను కాస్త పట్టించుకొని వాళ్ళకు నాకు చేతనైన సాయంచేసేలా అనుగ్రహించు. ఆరోగ్యమూ అనారోగ్యమూ రెండూ కూడ నీనుండి వచ్చే వరాలేనని గ్రహించే భాగ్యాన్ని కూడ దయచేయి.

## 5. నేను నిన్ను నమ్మి జీవిస్తాను

ప్రభూ! నేను నీకేదో ప్రత్యేక సేవచేయాలనే నీవు నన్ను సృజించావు. నీవు నాకు ఒప్పజెప్పిన పనిని మరొకరికి ఒప్పజెప్పలేదు. ఈ లోక కళ్యాణం కొరకు నీవు తయారుచేసిన రక్షణ ప్రణాళికలో నాకూ స్థానంవుంది. నే నీలోకంలో ఏమి మంచిని సాధించాలని నన్ను పుట్టించావో నాకిప్పుడు తెలియదు. కాని పరలోకంలో తెలుస్తుంది. ఐనా నేను ఇక్కడ సాధించవలసిన మంచియేదో వుంది. కనుక నిన్ను నమ్మి జీవిస్తాను. నాకు వ్యాధిసోకితే ఆ వ్యాధే నీ సేవకు ఉపయోగపడుతుంది. భయాందోళనలూ విచారమూ పీడిస్తే అవే నీ సేవకు ఉపయోగపడతాయి. నీవు నిరుపయోగంగా దేన్నీ చేయవు. నీవు చేసే పని నీకు బాగా తెలుసు. నీవు నా బంధుమిత్రులను తీసికొని పోవచ్చు. నన్ను పరాయి వాళ్ళమధ్య వదలివేయవచ్చు. లోకం నన్ను విస్మరించేలా చేయవచ్చు. నాకు నిరుత్సాహం

కలిగించవచ్చు. నా భవిష్యత్తును నాకు తెలుపకపోవచ్చు, ఇంకా యేమైనా చేయవచ్చు. ఐనా నీవుచేసేదేమిటో నీకు బాగా తెలుసు. నీవు నాకు చేసేకార్యం ఏదైనాసరే నాకు తప్పక మేలుచేస్తుంది. కనుక నేను నిన్ను నమ్మి జీవిస్తాను.

## 6. పని బాగా చేసేందుకు

పనివారికి మాదిరిగావుండే మహిమగల పునీత జోజప్పగారా! నేను నా పనిని బాగాచేసి నా పాపాలకు ప్రాయశ్చిత్తంచేసికొనే భాగ్యాన్ని సంపాదించిపెట్టు. నేను నా పనిని శ్రద్ధతోను ఉత్సాహంతోను చేసేలా చేయి. నా పనిద్వారా దేవుడు నాకిచ్చిన శక్తిసామర్థ్యాలను వృద్ధిచేసికొనేలా చేయి. ఓ క్రమపద్ధతిలో నెమ్మదిగా ఓర్పుతో నా పనిని నేను చేసికొనేలా చేయి. మంచి ఉద్దేశంతో నా పనిని చేసేలా చేయి. నేను ఓ దినం చనిపోతాననీ అటుపిమ్మట నా పనినిగూర్చి దేవునికి ఖండితమైన లెక్క ఒప్పజెప్పాలనీ గ్రహింతునుగాక. నేను చేయవలసిన పనిని చేయనందుకూ, సోమరితనంగా వుండిపోయినందుకూ, విజయం కలిగినప్పుడు మిడిసిపడినందుకూ దేవునికి లెక్కఒప్పజెప్పాలని గ్రహింతునుగాక. నిన్ను ఆదర్శంగా బెట్టుకొని మరియమాతద్వారా నా పనినంతా క్రీస్తుకి అర్పించుకొందునుగాక. నేను మంచి పనివాణ్ణిగా తయారగుదునుగాక.

## 7. ప్రభువే నాకు సర్వస్వం

ప్రభూ! నేను నన్ను నిన్నుగూడ తెలిసికొందునుగాక. నిన్ను దప్ప మరిదేన్ని కోరుకోకుందునుగాక. నన్ను నేను మరచిపోయి నిన్ను గుర్తుంచు కొందునుగాక. ప్రతికార్యం నీ కొరకే చేయుదునుగాక. నన్ను నేను తగ్గించుకొని నిన్ను హెచ్చింతును గాక. నిన్ను దప్ప మరి దేన్నిగూర్చి ఆలోచింపకుందునుగాక. నా స్వార్థాన్ని వదలుకొని నీ కొరకు జీవింతునుగాక. నాకు సంభవించే మంచిచెడ్డలన్నీ నీవల్లనే జరిగాయని గ్రహింతునుగాక. నన్ను నేను త్యజించుకొని నిన్ను వెంబడింతును గాక. ఎల్లప్పుడు నిన్ననుసరించాలని కోరుకొందునుగాక. నానుండి నేను పారిపోయి నీ మరుగు జొత్తునుగాక. నేను నీ రక్షణకు నోచుకొందును గాక. నీ నుండి వేరుపడుటకు ఇష్టపడకుందునుగాక. నీ వెన్నుకొనిన వారిలో నేనును ఒకడనగుదును గాక. నా బలముపై నేను ఆధారపడక నిన్ను నమ్మి జీవింతునుగాక. నీకు విధేయుడనై యుందునుగాక. నన్ను కరుణతో వీక్షించి నేను నిన్ను ప్రేమించేలా చేయి. నా బుద్ధికి ప్రబోధం కలిగించి నేను నిన్ను అర్థంచేసికొనేలాచేయి. నా చిత్తాన్ని ప్రేరేపించి నేను నిన్ను వెదికేలాచేయి. నీవు నన్ను పిలవగా నేను నీ చెంతకు వచ్చేలా చేయి. నేను నీ ప్రేమను పొంది శాశ్వతనందాన్ని అనుభవింతునుగాక.

## 8. పునీతుల్లాగే

ప్రభూ! పునీతుల్లాగే మేముగూడ నిత్యానిత్యవస్తు వ్యత్యాసాన్ని గ్రహింతుముగాక. వారిలాగే మేముకూడ చిన్నవాటిలోని గొప్పతనాన్నీ, గొప్పవాటిలోని అల్పత్వాన్నీ అర్థంజేసికొందుముగాక. నరులు సంతోషించే సంఘటనల్లో వుండే దుఃఖాన్నీ, దుఃఖించే సంఘటనల్లో వుండే సంతోషాన్నీ అర్థంజేసి కొందుముగాక. వారిలాగే మేముకూడ మా జీవిత ధ్యేయానివి నీవేననీ, మేము ప్రేమింపదగినవాడవు నీ వొక్కడవేననీ, అసలు మాకు జీవిందచడమంటే నీ జీవితాన్ని జీవించడమేనని గ్రహింతుముగాక. ఓ ప్రభూ! నీవు నీయంతటివాడివి కనుక నిన్ను స్తుతిస్తున్నాం. నీ కొరకే నిన్ను స్తుతిస్తున్నాం. నీ యర్చ్యశిష్టులను బట్టి నీకు స్తుతి కలుగునుగాక. నీవు వాళ్లకు చేసిన మేళ్ళకుగాను నీకు వినుతి కలుగునుగాక. నీవు సృజించిన ప్రాణికోటి అంతా నిన్ను స్తుతించునుగాక. నీకే సదా మహిమ కలుగునుగాక.

## 9. తండ్రీ! నీ చేతుల్లోనికి

తండ్రీ ! నన్ను నేను నీ చేతుల్లోనికి అర్పించుకొంటున్నాను. నన్ను నీ యిష్ట మొచ్చినట్లు చేయి. నీవు నన్ను ఏమి చేసినా నేను నీకు వందనాలు అర్పిస్తాను. నేను అన్నిటికీ సిద్ధమే, అన్నీ అంగీకరిస్తాను. నా జీవితంలోను సకల నరుల జీవితంలోను నీ చిత్తం నెరవేరునుగాక. ఇంతకంటే నేను కోరుకొనేదేమీ లేదు. ప్రభూ! నేను నిన్ను పూర్ణంగా ప్రేమిస్తున్నాను. కనుకనే నన్ను నేను నీ కర్పించుకోగోరుతున్నాను. ఏమీ దాచుకోకుండ నన్ను నేను సంపూర్ణంగా నీకర్పించుకొంటున్నాను. నీవు నాకు తండ్రివి కనుక నిన్ను పూర్తిగా నమ్ముతున్నాను.

## 10. శ్రీసభ కొరకు

కరుణగల తండ్రీ! పవిత్రమైన తిరుసభ కొరకు నీకు ప్రార్థన చేస్తున్నాం. ఆ సభను నీ సత్యంతో నింపు. నీ శాంతితో కాపాడు. దాని లోపాలను నీవే సంస్కరించు. దాని తప్పులను నీవే సవరించు. దాని హక్కులను నీవే నిలబెట్టు. దాని అవసరాలను నీవే తీర్చు. అది విభజనకు గురైనపుడు నీవేదాన్ని ఐక్యపరచు. నీ యాత్మబలంతో దాన్ని నడిపించు. మా రక్షకుడూ నీకుమారుడూ ఐన క్రీస్తుద్వారా ఈ మనవులన్నీ ఆలించు.

## 11. పేదసాదల కొరకు

ఓ ప్రభూ! ఈ లోకంలో చాలమంది పేదరికానికీ ఆకలిదప్పులకూ గురౌతున్నారు. వారికి మాకు చేతనైన సేవలు చేసే భాగ్యాన్ని దయచేయి. మా చేతుల ద్వారా వారికి కూడూ గుడ్డా యిప్పించు. మేము చూపే ఆదరాభిమానాల వలన వారు సుఖశాంతులు అనుభవించేలా చేయి.

## 12 మనకున్నవీ లేనివీ

ప్రభూ! నాకున్నవి లేనివారితో సంతోషంగా పంచుకొందునుగాక. నాకు లేనివి ఉన్నవారినుండి వినయంతో అడుగుకొందునుగాక. ఇతరులకు నేను చేసిన కీడునకు చిత్తశుద్ధితో పశ్చాత్తాపపడుదునుగాక. ఇతరులకు కలిగిన మేలునకు అసూయ చెందకుందునుగాక. నీవు నా ప్రార్థన ఆలించినందులకు నీకు వందనాలు అర్పింతునుగాక.

## 13. నరులంతా తోబుట్టువులు

తండ్రీ! నీవు నరులను ఎరుపు తెలుపు పసుపు నలుపు మొదలైన పెక్కు రంగులతో సృజించావు. వారిని పెక్కుజాతులనుగా చేసావు. వారిని పొట్టివారిని గాను పొడుగు వారినిగాను, లావాటి వారినిగాను సన్నని వారినిగాను, సంపన్నులను గాను పేదలనుగాను వృద్ధులనుగాను యువకులను గాను, పురుషులనుగాను స్త్రీలనుగాను పెక్కు రకాలుగా చేసావు. ఐనా నరులంతా నీ బిడ్డలే. నీవు అందరికీ తండ్రివి. కనుక మేమంతా తోబుట్టువులం. అందుచే మేము తోడివారితో పోటీకి దిగక వారితో సహకరింతుముగాక. ఇతరులను చిన్నచూపు జూడక వారిని గౌరవింతుముగాక. ఇతరులపై తప్పుమోపక వారిని క్షమింతుము గాక. నీ కుమారుడైన క్రీస్తు అందరినీ అంగీకరించి ఆదరించాడు. అతనిలాగే మేముకూడ నరుల్లోని దివ్యత్వాన్ని గుర్తింతుము గాక. నరులంతా నీ కుమారులూ కొమార్తెలేనని గ్రహింతుముగాక. మేము అందరినీ ప్రేమించి అందరితో కలసి ఐకమత్యముగా జీవింతుముగాక. నరజాతి అంతా ఒకే కుటుంబమని విశ్వసింతుముగాక.

## 14. మన కుటుంబం కొరకు

ప్రభూ! నీవు తండ్రులందరికీ తండ్రివి, తల్లులందరికీ తల్లివి. నీవు స్త్రీ పురుషులను సృజించి వివాహం ద్వారా వారి కలయికను పవిత్రపరచావు. వారిని ఒకరికొకరిని అండగా వుంచావు. వారి సంతతిని అనంతమైన మానవసమాజంగా రూపొందించావు. ఈ బ్రహ్మాండ

సమాజాన్ని మళ్లా కుటుంబాలుగా విభజించావు. నేడు మా కుటుంబాన్ని దీవించు. మేమంతా నిస్వార్థ బుద్ధితో ఒకరినొకరం ప్రేమించేలా చేయి. మేము శాంతి సంతోషాలతో జీవించి నిన్ను సదా స్తుతించేలా చేయి.

## 15. గర్భవతియైన తల్లి వేడికోలు

ఓ ప్రభూ! నా గుండెకు చేరువలో వున్న ఈ పసికందు పుష్టిమంతంగాను సంపూర్ణంగాను ఎదుగునుగాక. నేను తెలివి తేటలూ అనురాగమూ గల తల్లినై ఈ శిశువును చక్కగా పెంచుదునుగాక. తల్లులకు తల్లివైన మరియమాతా! ఈ గర్భధారణ సమయంలో నీవు నన్ను కాపాడు. నేను పాపానికి లొంగక నా మనస్సును నిర్మలంగా వుంచుకొందునుగాక. ప్రేమనూ పవిత్రతనూ నా బిడ్డలోనికి వూదుదును గాక.

## 16. ప్రార్థించమని అడిగినవారికొరకు

ప్రభూ! చాలమంది నన్ను తమ కొరకు ప్రార్థించమని అడిగారు. వారి అక్కరలు కూడ చాలవున్నాయి. నన్నడిగినవారి కొరకు జపం చేయడం నా బాధ్యత. కాని నేను అశ్రద్ధవల్ల వారు అడిగినంతగా వారి కొరకు ప్రార్ధన చేయలేదు. చాలసార్లు వారినీ వారి అక్కరలను పూర్తిగా మర్చిపోయాను గూడ. కనుక దేవా! నన్నడిగినవారందరి కొరకు ఇప్పుడు భక్తితో ప్రార్థిస్తున్నాను. కరుణతో వారి అవసరాలను తీర్చు. నీ చిత్తమైతే వారి యిక్కట్టులను తొలగించు. నీ చేయెత్తి వారినందరినీ దీవించు. వారు నాకు చేసిన మేళ్ళకుగాను నీవు వారిని బహూకరించు.

## 17. దేవుణ్ణి తెలిసికోవడం

పరిశుద్ధుడవు కరుణామయుడవునైన దేవా! నాకు నిన్నర్థం జేసికొనే బుద్ధిశక్తిని దయచేయి. నిన్ను గుర్తించే తెలివిని ప్రసాదించు. నిన్ను వెదికే వివేకాన్నీ, నిన్ను కనుగొనే భాగ్యాన్ని ప్రసాదించు. నిన్ను ధ్యానించే మనసునీ, నీ పలుకులను ఆలించే చెవులనూ, నిన్ను దర్శించే నేత్రాలనూ, నిన్ను ఇతరులకు ప్రకటించే జిహ్వానూ దయచేయి. నేను నీకు ప్రీతి కలిగేలా జీవింతునుగాక. ఓర్పుతో నీకొరకు వేచియుందునుగాక. విసుగు విరామంలేక నిన్ను అన్వేషింతును గాక. నేను నీసన్నిధిలో ప్రశాంతంగా కన్నుమూయుదును గాక. కడన ఉత్థాన భాగ్యాన్ని పొంది మోక్షంలో సదా నిన్ను దర్శించి ఆనందింతునుగాక.

## 18. అంతర్దృష్టి

ప్రభూ! నీవు ఆనాడు గ్రుడ్డివారి నేత్రాలనువలె నేడు మా నేత్రాలను గూడ విప్పు. మాకు అంతర్దృష్టిని దయచేయి. మేము కంటికి కన్పించే భౌతిక వస్తువుల్లోకూడ కంటికి కన్పించని దివ్యవస్తువులను దర్శించేలా చేయి. మా కన్నులు వర్తమాన వస్తువులనేగాక రాబోయే దివ్యవస్తువులను గూడ దర్శించేలా చేయి. ఏది శాశ్వతమో ఏది అశాశ్వతమో గ్రహించి శాశ్వత వస్తువులకు ఈయవలసిన విలువను ఇచ్చేలా చేయి.

## 19. తోడివారికి సేవ

తండ్రీ! నీవు నన్ను సృజించినవాడివి. నా కెన్నో శక్తిసామర్థ్యాలు దయచేసి నేనేదో మంచిని సాధించాలని కోరుకోన్నవాడివి. నీవు నాకు దయచేసిన వరాలతో నేను నీకు ఉచితమైన సేవ చేయాలి. నా హృదయాన్నీ మేధనూ ప్రేరేపించి నేను నేటి దేశావసరాలను చక్కగా గుర్తించేలా చేయి. అక్కరలోవున్న తోడివారికి ఏదైనా మేలు చేయాలనే బలమైన సంకల్పాన్ని నాలో రేకెత్తించు. నేను చేయగల ఓ ఉత్తమ సేవను ఎన్నుకొని దాన్ని పట్టుదలతో చేసి ముగించే భాగ్యాన్ని దయచేయి. నేను తోడివారికి మేలుచేసి నీకు కీర్తినీ మహిమనూ కొనివచ్చేలా అనుగ్రహించు.

## 20. దైవసహాయం కొరకు

నాకు సహాయకుడవూ రక్షకుడవూ ఐన ప్రభూ! నా ప్రార్థనను ఆలించు. నేను అసత్యాన్ని విడనాడి సత్యాన్ని చేపట్టేలా చేయి. కామప్రవృత్తిని విడనాడి నిర్మల హృదయంతో జీవించేలా చేయి. అపవిత్రాలోచనలను త్రోసివేసి నా మనస్సును దివ్యమైన భావాలతో నింపుకొనేలా చేయి. నిరాశను విడనాడి నిన్ను నమ్మి జీవించేలా చేయి. నులివెచ్చనితనాన్ని విడనాడి దైవభక్తితో జీవించేలా చేయి. తొందరపాటును పరిత్యజించి ఓర్పుతో మెలిగేలా చేయి. శోధనలను త్రోసివేసి ప్రార్థనకు పూనుకొనేలా చేయి. సోమరితనానికి లొంగక కష్టపడి పనిచేసికొనేలా అనుగ్రహించు.

## 21. మరణ పర్యంతం వరప్రసాదస్థితిలో

మాకు రక్షకుడవైన ప్రభూ! నీ సిలువ మరణం ద్వారా నీవు మాకు పాపవిమోచనాన్నీ, మరణ పర్యంతం వరప్రసాదస్థితిలో స్థిరంగా వుండిపోయి అటుపిమ్మట మోక్షంలో నిన్ను దర్శించి ఆనందించే భాగ్యాన్నీ దయచేస్తావని నమ్ముతూన్నాం. దయాపూరితాలైన నీ వాగ్దానాల ద్వారా ఈ భాగ్యం మాకు లభిస్తుందని విశ్వసిస్తున్నాం.

## 22. మన కార్యాల్లో మంచి ఉద్దేశం

మానవకోటికి విమోచకుడవైన ప్రభూ! నా హృదయంలో సదుద్దేశం లేనందున నేను చేసే పనులు నిష్ప్రయోజనమై పోకుందునుగాక. తరచుగా నేను ప్రజల మెప్పుకొరకే ఆయా కార్యాలు చేస్తుంటానని వినయంతో ఒప్పుకొంటున్నాను. ప్రభూ! నేను చేసే పనుల్లో మంచి ఉద్దేశం లోపింపకుండునుగాక. నీ ప్రీతికొరకూ మోక్షభాగ్యం కొరకూ మాత్రమే నా పనులను చేయుదునుగాక. ప్రజల మెప్పుకొరకూ, స్వార్థ ప్రీతికొరకూ, నా బడాయి కొరకూ ఏ పనులూ చేయకుందునుగాక. తల్లీ మరియమాతా! రహస్యంగా అందరి కార్యాలను గుర్తించే తండ్రి నన్నుగూడ బహూకరించేట్లు నా పనులను నేను సదుద్దేశంతో నెరవేర్చే భాగ్యాన్ని నీవు నాకు సంపాదించిపెట్టు.

## 23. పవిత్రాత్మమా! నన్ను పవిత్రపరచు

పవిత్రాత్మమా! నీ శ్వాసను నా మీదకు ఊది నా యాలోచనలు పవిత్రంగా వుండేలా చేయి. నాపై నీ ప్రభావంజూపి నా క్రియలు పవిత్రంగా వుండేలా చేయి. నన్ను ఆకర్షించి నేను పవిత్రమైన కార్యాలను మాత్రమే కోరుకొనేలా చేయి. నన్ను బలపరచి నేను పవిత్రమైన విషయాలను మాత్రమే సమర్థించేలా చేయి. పాపం నుండి నన్ను కాపాడి నేను నిరంతరం పవిత్రంగా జీవించేలా చేయి.

## 24. అభయదానం కొరకు

ప్రభూ! చాలసారులు నేను భవిష్యత్తులో ఏంజరుగుతుందోనని ఆందోళనం చెందుతూంటాను. నాకేమి కీడుమూడుతుందోననీ, నా పనికి ఏమి అంతరాయం కలుగుతుందోననీ, నా ఉద్యోగానికి ఏమి ప్రమాదం కలుగుతుందోనని భయబడుతూంటాను. నామీద ఆధారపడి జీవించేవాళ్ళకు ఏమికీడు వాటిల్లుతుందోననీ, నా కుటుంబ సభ్యులకు ఏమిహాని కలుగుతుందోననీ శంకిస్తూంటాను. నన్ను ఏమివ్యాధి పీడిస్తుందోననీ, నాకు మళ్లా పూర్ణారోగ్యం చేకూరుతుందో లేదోననీ అనుమానిస్తూంటాను. నాకు విజయం సిద్ధిస్తుందో లేదోననీ, ఓటమి పాలై అవమానం తెచ్చుకొంటానేమోననీ భయపడుతూంటాను. ఒకోసారి చిన్న ఆటంకాలకే కంగారుపడిపోతూంటాను. ఈ యాందోళనలన్నిటినీ అణచుకోవాలన్నా అణచుకోలేక పోతున్నాను. ప్రభూ! నేను నా మంచి చెడ్డలను నీకే వదలివేసి చిత్త శాంతితో జీవించేలా చేయి. నీ సాన్నిధ్య బలాన్నీ నీ యాశీస్సులనూ నమ్మి జీవిస్తే నాకుగాని నావారికిగాని ఏయాపదా రాదని విశ్వసించే భాగ్యాన్ని దయచేయి.

నా శాంతిని మీకు దయచేస్తున్నాను, లోకం ఇచ్చినట్లుగాగాక స్థిరంగాను శాశ్వతంగాను వుండేశాంతిని మీకు ప్రసాదిస్తున్నాను అన్న నీ వాగ్దానాన్ని నమ్ముకొని జీవించే భాగ్యాన్ని దయచేయి.

## 25. స్నేహితుల కొరకు

పితపుత్రుల ప్రేమబంధానివైన పవిత్రాత్మమా! నేనెవరిపట్ల ప్రేమా స్నేహమూ చూపుతూంటానో వాళ్ళందరినీ కనికరించు. నా స్నేహితులను సకలాపదలనుండి కాపాడు. వారి కార్యాల్లో వారికి తోడుగావుండి విజయాన్ని ప్రసాదించు. బాధల్లో వారికి ఓదార్పుని దయచేయి. ఆందోళనం చెందినపుడు వారికి ధైర్యాన్ని ప్రసాదించు. ఎల్లవేళల వారికి చిత్తశాంతినీ ఆనందాన్నీ అనుగ్రహించు. వారి హృదయాలను ప్రేమభావంతో నింపి వారిని నీచెంతకు రాబట్టుకో.

## 26. చిరాకు కలిగినప్పుడు

ప్రభూ! నేను కొన్నిసారులు నిరుత్సాహానికీ అధైర్యానికీ విషాదానికీ గురౌతూంటాను. ఇతరులు పలికే పలుకులూ, చేసే పనులూ, నా చుట్టూ జరిగే సంఘటనలూ నన్ను చీకాకు పెడతాయి. ఈలాంటి వ్యాకుల పరిస్థితుల్లో నేను నిన్ను శరణు వేడేలా అనుగ్రహించు. నామీద నేను జాలిపడుతూ క్రుంగిపోయేపుడు నన్ను ఓదార్చి నాకు మనోబలాన్ని దయచేసేవాడివి నీవే. నీవు నాకు గుండె నిబ్బరాన్ని దయచేస్తే చాలు, నేనెంతటి వేదననైనా సహించగలను.

## 27. దేవునికి వందనాలు

ప్రభూ! మేము వసించే ఈ యింటికిగాను నీకు వందనాలు. మేమందరం కలసి ప్రేమతో ఐక్యభావంతో జీవిస్తున్నందులకు నీకు వందనాలు. మేము ఆరోగ్యంగా వున్నందుకూ రోజూ కష్టపడి పనిజేసి భోజనం సంపాదించు కొంటూన్నందుకూ నీకు వందనాలు. మాకు ఇరుగు పొరుగు వారినీ స్నేహితులనూ బంధువులనూ దయచేసినందులకు నీకు వందనాలు. నీవు మా బంధుమిత్రాదులను కాపాడు. మా శత్రువులకూ మాకూగల విరోధాన్ని రూపుమాపు. నీచేయెత్తి మమ్ము దీవించు. జీవితంలో ఎదురయ్యే ఒడుదుడుకులను మేము ఓర్పుతో భరించేలా చేయి. కష్టాల్లో ధైర్యంగా వుండేలా దయచేయి.

## 28. క్రైస్తవ సమైక్యత కొరకు

క్రీస్తూ! మా ప్రధాన యాజకుడవైన నీవు చనిపోకముందు శిష్యుల కొరకు ప్రార్థించావు. తండ్రి నీయందూ, నీవు తండ్రియందూ నెలకొనియున్నట్లే నీ శిష్యుల కూడ ఐక్యమత్యంతో జీవించాలని జపించావు. నేడు క్రైస్తవులమైన మేము వివిధ శాఖలుగా విడిపోయాం. మా దౌర్భాగ్యానికిగాను మమ్ము కనికరించు. మా యహంకారంవల్లనైతేనేమి పిశాచం దుష్టత్వంవల్లనైతేనేమి మేము తెచ్చిపెట్టుకొన్న గాయాలను మాన్పు. మాలో మమ్ము విభజించే అడ్డుగోడలను కూల్చివేయి. మేము మాలోని విభేదాలనుగాక సామ్యాలను గుర్తించేలా చేయి. క్రైస్తవ బృందాలు ఒకదానికొకటి దూరమయ్యేలాగాక దగ్గరయ్యేలా చేయి. మా విభజనలనుజూచి లోకం నవ్విపోకుండా వుండేలా అనుగ్రహించు. మాలోని శాఖలనూ మఠాలనూ రూపుమాపి మేమందరం నీపేరు మీదిగా ఐక్యమయ్యేలా చేయి. మేమంతా మళ్ళా ఆదిలో వున్న ఏక, పవిత్ర, విశ్వవ్యాప్త, ప్రేషిత క్రైస్తవ సమాజంగా మారిపోయి, ఒకేమంద ఒకే కాపరిగా రూపొందే భాగ్యాన్ని దయచేయి.

## 29. వ్యాధిగా వున్నపుడు

దేవా! నీవు సర్వశక్తిమంతుడవు, శాశ్వతుడవు. నేను నా బాధలను క్రీస్తు శ్రమలతో చేర్చి నీకు సమర్పిస్తున్నాను. తండ్రీ! క్రీస్తు లోకరక్షణార్థం ఘోరయాతనలు అనుభవించాలని నీవు నిర్ణయించావు. నేడు నా శ్రమలను క్రీస్తు శ్రమలతో జోడించి నా పాపాలకూ ఇతరుల పాపాలకూ గూడ ప్రాయశ్చిత్తం చేస్తూన్నాను.

క్రీస్తు ప్రభూ! నేను నా వ్యాధిని మంచి మనసుతో అంగీకరించేలా చేయి. నీ చిత్తమైతే నాకు శీఘ్రమే ఆరోగ్యాన్ని ప్రసాదించు. నీవు ఆనాడు పేత్రు అత్తకు వ్యాధినయంచేయగా ఆమె మళ్లా తన పనులకు పూనుకొంది. ఆలాగే నేనుకూడ రోగవిముక్తిని పొంది నా పనులను నేను కొనసాగించుకొనిపోయే భాగ్యాన్ని ప్రసాదించు. కాని నేను త్వరగా కోలుకోవడం నీ చిత్తం కాకపోతే ఈ వ్యాధిని మంచి మనసుతో అంగీకరించేలా చేయి. నా జీవితంలోని ప్రతి సంఘటనంలోను నీ సంకల్పాన్ని గుర్తించేలా దయచేయి. నీ కోరిక ప్రకారమే నా జీవితాన్ని కొనసాగించుకొని పోవడం మహాభాగ్యమని యెంచేలా చేయి.

## 30. ఇతరులను శ్రమపెట్టే రోగిని

ప్రభూ! నన్నుగూర్చి నేను ఆలోచించుకొంటే నాకే సిగ్గువేస్తుంది. నేను అంతసులువైన.రోగిని కాను. నేను జబ్బుగా వున్నపుడు ఇతరులు నాకు సేవలు చేయాలని

దబాయిస్తాను. ఇతరులచే పరిచర్యలు చేయించుకోవడం నా హక్కు అన్నట్లుగా ప్రవర్తిస్తాను. నేను జబ్బు పడినపుడల్లా అన్యులు నాకు సేవలు చేస్తూనే వున్నారు. కనుక నాలో స్వార్థం పెరిగిపోయింది. నేను నా మంచిచెడ్డలు తప్పితే ఇతరుల కష్టసుఖాలేవీ లెక్కలోకి రావన్నట్లుగా ప్రవర్తిస్తుంటాను. నా కిష్టమైన పద్ధతిలోనే ఇతరులు నాకు సేవలు చేయాలని పట్టుబడతాను. ఇతరులు నాకు సేవలు చేస్తుంటే నేను వాటినట్టే గుర్తింపను. మెచ్చుకోను. చాలసార్లు సహనాన్ని కోల్పోయి సుమ్మర్లు పడుతూంటాను. అసంతృప్తికి గురై చిత్తశాంతిని కోల్పోతూంటాను. నన్నుగూర్చి నేను ఆలోచించుకొన్నపుడు నా పోకడలు సరిగాలేవని గుర్తిస్తూనే వుంటాను. ఐనా నా యవలక్షణాలను మాత్రం సవరించుకోను. ప్రభూ! నా దుర్గుణాలను సవరించుకొనే వరప్రసాద బలాన్ని దయచేయి. విశేషంగా నాకు ఓర్పునీ, నిస్వార్థబుద్ధినీ, సంతృప్తినీ దయచేయి. ఇతరులు నాకు చేసిన సేవలకు నేను కృతజ్ఞుణ్ణయి వుండేలాచేయి. నేను జబ్బు పడినపుడు ఇతరులను శ్రమపెట్టని రోగినిగా వుండేభాగ్యాన్ని దయచేయి.

## 31. క్రీస్తు శ్రమలతో చేరి

క్రీస్తుప్రభూ! నీవానాడు కల్వరి మార్గంలోను సిలువ మీదాను నానా బాధలు అనుభవించావు. కనుక నేడు నేననుభవించే బాధలను అర్థంజేసికోగలవు. నావేదనలన్నిటినీ నీకే అర్పిస్తున్నాను. నా శ్రమలలో కొన్నిటిని గురువుల కొరకు వినియోగించు. వాళ్ళు మంచిగురువులుగా ప్రవర్తించేలా చేయి. మరికొన్నిటిని గురుజీవితానికి సిద్ధమయ్యే వారికొరకు వినియోగించు. వాళ్ళు మంచిగురువులుగా తయారయ్యేలా చేయి. నీ శ్రమలూ మరణం లోకానికి మేలు చేసాయి. నరులను పాపంనుండి రక్షించాయి. నీ శ్రమలతో చేరి నా శ్రమలుకూడ లోకానికి మేలుచేసి పెట్టునుగాక. పౌలు చెప్పినట్లుగా , నీ శ్రమల్లో లోపించిన భాగాన్ని నా శ్రమలు పూరించునుగాక. నేను నా నొప్పినీ బాధనూ నీకే అర్పిస్తున్నాను. నేను అర్పింపగలిగింది ఇంతే. దయతో అంగీకరించు.

## 32. ఇతరరోగుల కొరకు

ఓ ప్రభూ! లోకంలో నేనొక్కడనే జబ్బుగా వున్నాను అన్నట్లుగా ఆలోచించకూడదు. ప్రపంచం నలుమూలలా కోట్లకొలది రోగులు బాధలు అనుభవిస్తున్నారు. కనుక వారందరి కొరకు నీకు విన్నపాలు చేస్తున్నాను. ప్రభూ! ఈ లోకంలో వంటరితనంవల్ల బాధపడేవారినీ, బిడియంవల్ల వేదనలు అనుభవించే వారినీ, ఆందోళనంవల్ల పీడింపబడేవారినీ, నొప్పికి గురై పరితపించేవారినీ, రోగం తిరగబెట్టడంవల్ల శ్రమపడేవారినీ, మొండి వ్యాధులకు

గుర్త్రైనవారినీ, నయంగాని రోగాలకు బలైనవారినీ, ఇంకా బాధార్తులనూ కరుణించు. నాకు చేతనైనంతవరకు నేను ఇతర రోగులకు సాయపడేలా చేయి. నేను బాధల్లోవున్నవారికి దయా సానుభూతీ చూపేలాచేయి. నన్ను నేను మరచిపోయి ఇతరులను కాస్త పట్టించుకొనేలా చేయి.

## 33. ప్రభూ! ఆరోగ్యాన్ని దయచేయి

యేసుప్రభూ! నీవు మా యాత్మలనూ దేహాలనూ గూడ నయంజేసే వాడివి. నీవు ఈ భూమిమీద జీవించినపుడు ఎల్లయెడల మంచిని చేస్తూ సంచరించావు. వ్యాధిగ్రస్తులను ఓదారుస్తూ బాధార్తులకు ధైర్యం కలిగిస్తూ అనేక రకాల రోగాలను నయంజేస్తూ పర్యటించావు. మేము ఆరోగ్యంగాను ఉల్లాసంగాను జీవించాలని నీవు కోరుకొంటావు. వ్యాధికీ మృత్యువుకీ నీవు శత్రువ్వి. నీ వరప్రసాద సహాయంతోను, నీ ద్వారాను మేము రోగాన్నీ మరణాన్నీ జయిస్తాం. ప్రభూ! ఆరోగ్యదాయకాలైన నీ హస్తాలను మాపై చాపు. మా రోగాలను తొలగించు. మేము పరిపూర్ణరోగ్యాన్ని పొంది నిన్ను స్తుతించే భాగ్యాన్ని దయచేయి.

## 34. దేవా! నీ చిత్తప్రకారమే జరగనీయి

దేవా! ప్రేమగలతండ్రీ! అంతా నీ చిత్తప్రకారమే జరగనీయి. నా వ్యాధిబాధలను, ఆనాడు క్రీస్తు నా కొరకు అనుభవించిన బాధలతో చేర్చి నీకే సమర్పిస్తున్నాను. నీ చిత్తమైతే క్రీస్తు అనుభవించిన ధన్యమైన శ్రమలనుజూచి నన్ను కరుణించు. నాకు ఆరోగ్యాన్నీ బాధావిముక్తినీ దయచేయి. జననమరణాలకు కారకుడైన దేవా! నా జీవాన్నీ మరణాన్నీ నీకే సమర్పిస్తున్నాను. నన్ను నీ యిష్టమొచ్చినట్లుగా చేయి. ఆరోగ్యాన్నీ వ్యాధినీగూడ సమానంగానే నీ చేతులనుండి స్వీకరించాలని నా కోరిక. నా యీ మనవిని ఆలించు.

## 35. ఆరోగ్యమాతా! కరుణించు

ఆరోగ్యమాతవైన మరియా! లోకంలోని రోగులనందరినీ చల్లని చూపున జూడు. స్పృహ కోల్పోయిన వారినీ, చనిపోయేవారినీ, మరణవేదనలో వున్నవారినీ, ఇక నాకు నయం కాదని నిరాశచెందినవారినీ, నొప్పికి తాళలేక విలపించేవారినీ, నిరుపేదలైనందున రోగులైకూడ చికిత్సపొందలేనివారినీ, విశ్రాంతి అవసరమైనాకూడ దారిద్ర్యం వలన తప్పనిసరిగా పనిచేయవలసివారినీ, పడకపై పరుండి నొప్పికి తాళలేక మరోప్రక్కకు జరగాలనుకొనిగూడ జరగలేనివారినీ, నిద్రబట్టకుండానే రాత్రులు గడిపేవారినీ, కుటుంబ

బాధలతో సతమతమయ్యేవారినీ, భావిలో తాము సాధింపగోరిన కార్యాలను వదలి వేయవలసి వచ్చిందే అని వేదనజెందేవారినీ, అపార్థాలవలన మనోవేదనకు గురై ఏమీ చేయలేక దుఃఖించేవారినీ, అన్నిటికంటె అధికంగా మృత్యువు చేరువైనా గూడ పరలోక జీవితంమీద నమ్మకంలేనివారినీ, దేవుణ్ణి నిరాకరించి దూషించేవారినీ, క్రీస్తు తమకొరకు ముందుగానే శ్రమలనుభవించి తమ శ్రమలను పవిత్రపరచాడని గుర్తించలేనివారినీ అమ్మా! ఆదరంతో కరుణించు.

## 36. నొప్పిగా వున్నపుడు

యేసు ప్రభూ! నొప్పి యెంత బాధను కలిగిస్తుందో నీకు బాగా తెలుసు. నీ విరోధులు నీ వీపును కొరడాలతో బాదారు. నీ తలపై ముళ్లకిరీటం పెట్టి కొట్టారు. నీ కాలుసేతుల్లో చీలలు దిగగొట్టారు. కనుక నొప్పి ఎంత వ్యధను కలిగిస్తుందో నీకు అనుభవపూర్వకంగా తెలుసు. ఇప్పుడు భరింపరాని నొప్పి నా శరీరాన్ని తొలిచివేస్తూంది. ప్రభూ! నేనీ బాధను ధైర్యంతోను సహనంతోను భరించేలా చేయి. నీవు నా శక్తికి మించిన బాధను నాకు పంపవని నేను గ్రహించేలా చేయి. ఈ కారుచీకటిలోగూడ నీవు నాతో వుండి నాకు వెలుగును దయచేస్తూ వుంటావని నేను మరచిపోకుండేలా చేయి.

## 37. బాధలవల్ల లాభాలు

ఓ ప్రభూ! అనేక కారణాలవల్ల నీవు మాకు వ్యాధిబాధలు పంపుతూంటావు. ఆ బాధలు మాకు ఎన్నో వుపకారాలు చేసిపెడతాయి. అవి మేము నిన్ను జ్ఞప్తికి తెచ్చుకొనేలా చేస్తాయి. మేము ఈలోక సుఖభోగాలకు అంటిపెట్టుకొని వుండకుండేలా చేస్తాయి. మా పాపాలకూ తోడివారి పాపాలకూ మేము ప్రాయశ్చిత్తంచేసేలా చేస్తాయి. కనుక నీవు పంపే బాధలను నేను మంచిమనసుతో అంగీకరించేలా చేయి. నా మంచి చెడ్డలు నాకంటె నీకు యెక్కువగా తెలుసు. కావున నన్ను నేను నీ చేతుల్లోకి అర్పించుకొంటున్నాను. ఓర్పుతో నీ చిత్తానికి లొంగి వుంటే నా కెంతో మనశ్శాంతి కలుగుతుందని నేను గ్రహించేలా చేయి.

## 38. ఒంటరితనంవల్ల బాధపడేపుడు

ప్రభూ! నేను వంటరితనంవల్ల బాధపడుతూన్నాను. కాని నీవు సిలువమీద వ్రేలాడుతూ లోకంలోని వంటరితనాన్నంతటినీ నీ వొక్కడివే అనుభవించావు. సిలువమీద వంటరిగా చనిపోయి, నేడు వంటరితనంవల్ల బాధపడే నా బోటివాళ్ళ కందరికీ ధైర్యాన్ని

చేకూర్చి పెట్టావు. నా వొంటరితనాన్ని నాలాగే బాధపడేవాళ్ళ శ్రేయస్సు కొరకు అర్పిస్తున్నాను. ఆదరంతో అంగీకరించు. నీ సిలువబలం నా బలహీనతలో నన్నాదుకొనునుగాక.

## 39. మానసికమైన వత్తిడికి గురైనపుడు

ఓ దేవా! నాకు నిద్రపట్టడంలేదు. విరామంలేని ఆలోచనలు నా మనసులో గూడుకట్టుకొంటున్నాయి. ఏదో వత్తిడీ, ఆయాసమూ, కలతా నన్ను పీడిస్తున్నాయి. ఏపని చేయాలన్నా కష్టంగా వుంది. మనసుకి విశ్రాంతిలేదు. ఇక మీదట మందులూ మాత్రలూ నిద్రబిళ్లలూ నా రోగాన్ని నయంచేయలేవు. ప్రభూ! నీవే నా మనస్సుకి విశ్రాంతి దయచేయి. నా హృదయానికి శాంతిని ప్రసాదించు. నేను నిన్నాశ్రయించి నీ నుండి విశ్రాంతిని పొందగోరుచున్నాను. నా బరువునీ భారాన్నీ నీ భుజాలమీదనే మోపుతున్నాను. నన్ను కరుణించు.

## 40. ముసలివాళ్ళం అయ్యామనిపించినపుడు

ప్రభూ! నా జీవితం కలలాగ త్వరగా దాటిపోయింది. ప్రొద్దులాగ క్రుంకింది. ఇప్పుడు ముసలితనంవచ్చి పెద్దపులిలాగ మీదికి దూకుతూంది. నేను నా పనులను నిన్ననో మొన్ననో ప్రారంభించానా అన్పిస్తూంది. ఇక నేను ఎంతో కాలం కష్టించి పనిచేయలేను. నేను ముసలివాడనై పోయానని అర్థంజేసికొంటూన్నాను. నా పనిలో సులువుగా అలసిపోతున్నాను. గట్టిగా ప్రయత్నం చేస్తేనేగాని పనిచేయలేకపోతున్నాను. నా జీవితాన్ని పరిశీలించి చూచుకొంటే ప్రతి సంఘటనంలోను నీ హస్తం కన్పిస్తూనే వుంది.

జరిగిపోయిన కాలంలో అడుగడుగునా నీవు నన్ను ఆదుకొంటూ వచ్చావు. ఇకమీదటగూడ నన్ను చేయి విడువవని నమ్ముతున్నాను. ప్రభూ! నేను పండు ముదుసలినై అవయవాల పటుత్వాన్ని కోల్పోయినపుడుగూడ నీవునన్ను విస్మరించకు.

## 41. ముసలితనం వల్ల అశక్తులమైనపుడు

ప్రభూ! నేను చాల ముసలివాడనయ్యాను. ఇక పనిచేయలేను. నన్ను నేను పరామర్శించుకోలేనుగూడ. నాకు పెద్దజబ్బేమీలేదు. పండుముసలినయ్యాను అంతే. నా దేహంలో సత్తువలేదు. జ్ఞాపకశక్తి సన్నగిల్లింది. నిద్ర మందగించింది. కొన్నిసార్లు సరిగా ఆలోచించలేక పోతున్నాను. చాలా పర్యాయాలు వొంటరితనంవల్ల బాధపడుతూన్నాను. నా స్నేహితులూ నన్ను విలువతో చూచినవాళ్లూ ఒకరితర్వాత వొకరు దాటిపోయారు. ఐనా నేను నీకు వందనాలు అర్పిస్తున్నాను. నా రోజులు ప్రశాంతంగానే సాగిపోతున్నాయి.

ఇక్కడ నేను సురక్షితంగానే వున్నాను. వైద్యులూ నర్సులూ నన్ను పట్టించుకొని పరామర్శిస్తూనే వున్నారు. అప్పుడప్పుడూ నాకు తెలిసినవాళ్లు కొందరైనా వచ్చి నన్ను పలకరించి పోతున్నారు. నేనింకా బ్రతికేవున్నాను. నీకు భక్తితో ప్రార్థన చేయగల్గుతున్నాను. నా మనసు నిమ్మళంగానే వుంది. నా జీవితపు ప్రొద్దు పడమటికి వాలిన యీ కాలంలో నేను సుమ్మర్లు పడకుండా సంతృప్తిగా జీవించేలా చేయి. ఈ ప్రాయంలో నేను ఏమి చేయగలనో ఏమి చేయలేనో సరిగా గ్రహించేలా చేయి. నా నిస్సత్తువను నేను అంగీకరించేలా చేయి. నీవు నాకు ఇన్నియేండ్ల ఆయుస్సును దయచేసావు. ఇన్ని వరాలిచ్చావు. ఇన్ని విజయాలు ప్రసాదించావు. వీటన్నిటికి నేను కృతజ్ఞుడనై యుండేలా చేయి. నా శేషజీవితాన్ని వివేకంతో గడిపేలా చేయి. ఇక నాకు ఎన్నో రోజులు మిగిలిలేవు. నేను వాటిని వ్యర్థంచేసికోగూడదు. కనుక నా భావిదినాలను జాగ్రత్తగా వినియోగించుకొనేలా చేయి. అన్నింటికంటె ముఖ్యంగా నేను నిన్ను నమ్మి జీవించేలా చేయి.

## 42. మంచి మరణం కొరకు

ఓ సర్వేశ్వరా! నీవు నరులందరు చనిపోవాలని నిర్ణయించావు. ఐనా మా మరణకాలం మాకు ముందుగా తెలియకుండేలా చేసావు. నేను ఈ లోకంలో భక్తిగా జీవించి నిర్మలమైన అంతరాత్మతో పాపరహితంగా చనిపోయేలా అనుగ్రహించు. దివ్య సంస్కారాలను స్వీకరించి వరప్రసాదస్థితిలో కన్నుమూసేలా దయచేయి. నా మరణకాలంలో మరియమాత, సన్మనస్కులు అర్చ్యశిష్టులు నాకు ఊరటను దయచేయుదురుగాక. నా కావలిసన్మనస్కుడు నా యాత్మను నీ సన్నిధిలోనికి చేర్చునుగాక. నేను నీ దర్శన భాగ్యాన్ని పొంది సకల పునీతులతోపాటు శాశ్వతానందాన్ని అనుభవింతునుగాక.

## 43. చనిపోయేవారి కొరకు

క్రైస్తవుడా! నీవు ఈ లోకాన్ని విడచిపో. నిన్ను సృజించిన సర్వశక్తిగల తండ్రిపేరు మీదిగా, నీ కొరకు సిలువ మరణం అనుభవించిన దేవుని కుమారుడగు క్రీస్తు పేరుమీదిగా, నీ హృదయంలో వసించి నిన్ను పవిత్రపరచిన పవిత్రాత్మ పేరుమీదిగా, పునీత జోజప్పగారి పేరుమీదిగా, సకలసన్మనస్కుల పేరుమీదిగా, పితరులు ప్రవక్తలు ప్రేషితులు సువిశేషకారుల పేరుమీదిగా, వేదసాక్షులు స్తుతీయులు సన్యాసులు వనవాసుల పేరుమీదిగా, కన్యల పేరుమీదిగా, సకలార్చ్యశిష్టుల పేరుమీదిగా, ఈ లోకాన్ని విడచిపో. ఈ దినం నీకు శాంతి లభించునుగాక. ఇకమీదట నీవు మోక్షంలో వసింతువు గాక. కరుణామయుడవు

దయా పూరితుడవునైన ప్రభూ! పశ్చాత్తాపపడేవాళ్ళ అపరాధాలను నీవు మాటిమాటికి క్షమిస్తూంటావు. వాళ్ళ పాపమాలిన్యాన్ని తొలగిస్తుంటావు. నీ యీ దాసుని కరుణించి ఇతని పాపాలను క్షమించు. ఇతడు నిండు మనస్సుతో తాను తప్పు చేసానని వొప్పుకొంటున్నాడు. ఇప్పుడు వినయంతో నిన్ను మన్నింపు అడుగుకొంటున్నాడు. మానవ బలహీనతవల్లనైతేనేమి, పిశాచ తంత్రాలవల్లనైతేనేమి ఇతని ఆత్మ పాపంలో పడిపోయి చాల మలినమైపోయింది. ఇతన్ని మళ్ళా నీ తిరుసభలో సభ్యునిగాజేయి. ప్రభూ! ఈ భక్తుని పశ్చాత్తాప ప్రార్ధనలను ఆలించు. ఇతని కన్నీటిని జూచి ఇతనిపై దయజూపు. ఇప్పుడు నీ కరుణ వొక్కటితప్ప ఇతనికి దిక్కేమీ లేదు. కనుక ఇతన్ని కరుణించి మళ్లా నీ చెంతకు చేర్చుకో. మా ప్రభువైన క్రీస్తుద్వారా ఈ మనవిని ఆలించు.

## 44. చనిపోయే వారికొరకు ఆత్మకు ప్రార్ధనం

పావనాత్మమా! చనిపోయే వారినందరినీ నీ సాన్నిధ్యబలంతో ఆదరించు. వారిని నీ శక్తితో దృఢపరచు. నీ ప్రేమతో ఓదార్చు. వారి కష్టాల్లో వారికి ఓర్పుని దయచేయి. వారు ఈ లోకంలో కన్నుమూయగానే పరలోకంలో శాశ్వతజ్యోతిని దర్శించేలా చేయి. ఈ లోకాన్ని వదలగానే పరలోకంలో నిత్యానందాన్ని పొందేలాచేయి. అక్కడ కలకాలం నిన్ను దర్శించి సుఖించేలా దయచేయి.

## 45. మృతులైన విశ్వాసులందరికొరకు

క్రీస్తుప్రభూ! నీవు మృత్యుంజయుడవై ఆర్జించిన దివ్యఫలాలను జూచి మృతులైన విశ్వాసులను మరణ శృంఖలల నుండి విడిపించు. నీ నిత్య నివాసంలో వారికి విశ్రామస్థానాన్ని దయచేయి. విశ్వాసం ద్వారా మా కందరికి తండ్రియైన అబ్రాహాము ఒడిలో వాళ్ళు విశ్రమించేలా చేయి. ఆదాము ఏవల నాటినుండి నేటివరకు నిన్ను చిత్తశుద్ధితో సేవించిన వారికందరికీ ఈ భాగ్యాన్ని ప్రసాదించు. మా తల్లిదండ్రులకూ తోబుట్టువులకూ బంధుమిత్రులకూ స్నేహితులకూ అందరికీ ఈ వరాన్ని ప్రసాదించు. ఓ ప్రభూ! ఈ లోకంలో నిన్ను భక్తితో సేవించినవారి కందరికీ పరలోక రాజ్యంలో భాగం దయచేయి. నీపై మనసునిల్పి జీవించినవారి కందరికీ మోక్షబహుమతిని ప్రసాదించు.

## 46. అందరూ చెప్పుకోదగిన ప్రార్థనం

ఓ ప్రభూ! నేను నిన్ను విశ్వసిస్తున్నాను, నా విశ్వాసాన్ని పెంచు
నిన్ను నమ్ముతూన్నాను, నా నమ్మకాన్ని బలపరచు

నిన్ను ప్రేమిస్తున్నాను, నా ప్రేమను దృఢతరం చేయి
నా పాపాలకు పశ్చాత్తాపపడుతున్నాను, నా పశ్చాత్తాపాన్ని అధికంజేయి.

నీవు నాకు ఆది కారణానివి గనుక, నిన్ను ఆరాధిస్తున్నాను
నాకు అంత్యగతివి కనుక, నీకొరకు ఆశగొంటున్నాను
నాకు నిరంతరం సాయంచేస్తుంటావు కనుక, నిన్ను స్తుతిస్తున్నాను
నన్ను కాపాడుతుంటావు కనుక, నీ సహాయాన్ని అర్థిస్తున్నాను.

నీ జ్ఞానంతో నన్ను నడిపించు
నీ న్యాయంతో నన్ను సవరించు
నీ కరుణతో నన్ను ఓదార్చు
నీ శక్తితో నన్ను కాపాడు.

ఓ ప్రభూ! నాయాలోచనలు నీపై నిల్చునుగాక
నా పలుకులు నిన్ను వివరించునుగాక
నా క్రియలు నాకు నీ పట్లగల ప్రేమను రుజువు చేయునుగాక
నా శ్రమలు నీ మహిమ కొరకు అనుభవింతునుగాక.

నేను నీవు కొరుకొన్నది చేయుదునుగాక
నీవు కోరిన రీతినే చేయుదునుగాక
నీవు కోరుకొన్నంతకాలము చేయుదునుగాక
కేవలము నీవు కోరినందుననే చేయుదునుగాక.

ప్రభూ! నా బుద్ధిశక్తిని ప్రబోధించు
నా చిత్తశక్తిని బలపరచు
నా హృదయాన్ని శుద్ధిచేయి
నన్ను పవిత్రపరచు.

ప్రభూ! నేను పూర్వపాపాలకు పశ్చాత్తాపపడేలా చేయి
భవిష్యత్తులో రాబోయే శోధనలను ఎదుర్కొనేలా చేయి
నా సహజ బలహీనతకు లొంగకుండవుండేలా చేయి
నా క్రైస్తవ జీవితాన్ని బలపరుచుకొనేలా చేయి.

నేను నాదేవుడవైన నిన్ను ప్రేమింతునుగాక

నేనీ లోకంలో యాత్రికుణ్ణని గ్రహింతునుగాక
నాపై అధికారం నెరపేవాళ్లనీ
నా క్రింద పనిజేసేవాళ్లనీ
నా మిత్రులనూ శత్రువులనూగూడ
ప్రేమగౌరవాలతో ఆదరింతునుగాక.

నా కోపాన్ని శాంతగుణంతోను
దురాశను ఔదార్యంతోను
నులివెచ్చనితనాన్ని భక్తితోను జయింతునుగాక
నన్ను నేను మరచిపోయి
ఇతరులను పట్టించుకొందునుగాక.

నేను వివేకంతో ప్రణాళికలు వేసికొందునుగాక
ధైర్యంతో ప్రమాదభరిత క్రియలనుగూడ చేపట్టుదునుగాక
బాధల్లో ఓర్పునీ, విజయాల్లో వినయాన్నీ ప్రదర్శింతునుగాక
నేను ఏకాగ్రతతో ప్రార్థన చేయుదునుగాక
అన్నపానీయాల్లో సంయమనాన్ని పాటింతునుగాక
శ్రద్ధతో పనిజేయుదునుగాక
నా సదాశయాలను విడనాడకుందునుగాక.

నా అంతరాత్మ నిర్మలంగాను,
నా ప్రవర్తన దోషరహితంగాను,
నా వాక్కు పాప విరహితంగాను,
నా జీవితం క్రమబద్ధంగాను ఉండునుగాక.

నేను నా సహజ బలహీనతకు లొంగకుందునుగాక
నీ ప్రేమపై ఆధారపడి జీవింతునుగాక
నీయాజ్ఞలను పాటింతునుగాక
కడన నీ రక్షణాన్ని చేకొందునుగాక.

ఈ లోకం నీటిబుడగలాంటిదనీ
మోక్ష భాగ్యమే ముఖ్యమైనదనీ
ఇహలోక జీవితం క్షణికమైనదనీ
రానున్న జీవితం శాశ్వతమైనదనీ గ్రహింతునుగాక.

ఓ వైపు నీ తీర్పునకు భయపడుతూ
మరోవైపు నీ మంచితనాన్ని నమ్ముతూ
నేను మరణానికి సిద్ధపడుదునుగాక
నీవు నాకు మంచి మరణాన్ని దయచేసి
నిత్యానందదాయకమైన మోక్షాన్ని ప్రసాదింతువుగాక

- 11వ క్లెమెంట్ పోపుగారు

## 47. క్రీస్తే మనకు సర్వస్వం

క్రీస్తూ ! నేను నిన్నూ నన్ను గూడ తెలిసికొందును గాక
నిన్ను దప్ప మరిదేన్నీ ఆశింపకుందును గాక
నన్ను నేను ద్వేషించుకొని నిన్ను ప్రేమింతునుగాక
నన్ను నేను తక్కువ జేసికొని నిన్ను ఘనపరతునుగాక
నిన్నుదప్ప మరి దేన్నిగూర్చి తలంపకుందునుగాక
నాకు నేను చనిపోయి నీ యందు జీవింతునుగాక
నాకు జరిగేవన్నీ నీవల్లనే జరిగాయని యెంతును గాక
నానుండి నేను పారిపోయి నీ శరణు జొత్తునుగాక
నన్ను తలంచుకొనీ నిన్ను తలంచుకొనీ భయపడుదునుగాక
నిన్ను దప్ప మరి దేన్నీ ఆశ్రయింపకుందునుగాక
నీవలె నిరుపేదనూ విధేయుడనూ అగుదునుగాక
నీ వెన్నుకొనినవారిలో నేనును ఒకడనగుదునుగాక
కడన నిన్ను దర్శించి నీ యందు ఆనందింతునుగాక.

# 48. వినయం

వినయమూ నమ్రతకల యేసూ! నన్ను గూడ నీలాంటివాణ్ణిగా చేయి
ఇతరులు నన్ను గౌరవించి పొగడాలనే కోర్కెనుండి నీవు నన్ను కాపాడు
ఇతరులు నన్ను సలహా అడగాలనే కోర్కెనుండి నీవు నన్ను కాపాడు
ఇతరులు నన్ను చిన్నచూపు చూస్తారనే భయంనుండి నీవు నన్ను కాపాడు
ఇతరులు నా మీద నిందలు మోపుతారేమో,
నన్ను ఎగతాళి చేస్తారేమో అనే భయంనుండి నీవు నన్ను కాపాడు
ఇతరులు నన్ను మర్చిపోతారేమో అనే భయం నుండి నీవు నన్ను కాపాడు
ఇతరులు నాకు అపకారం చేస్తారేమో,
నన్ను శంకిస్తారేమో అనే భయం నుండి నీవు నన్ను కాపాడు
ఇతరులు నా కంటె ఎక్కువ ప్రేమను పొందాలని
కోరుకొనే వరప్రసాదాన్ని నీవు నాకు దయచేయి
ఇతరులు నాకంటె ఎక్కువ గౌరవాన్నీ ప్రసిద్ధినీ పొందాలని
కోరుకొనే వరప్రసాదాన్ని నీవు నాకు దయచేయి
లోకం ఇతరులను ఎన్నుకొని నన్ను తృణీకరించాలనీ,
ఇతరులను కీర్తించి నన్ను విస్మరించాలనీ
కోరుకొనే వరప్రసాన్ని నీవు నాకు దయచేయి
లోకం ఇతరులను నా కంటె యోగ్యులనుగా గణించాలని
కోరుకొనే వరప్రసాదాన్ని నీవు నాకు దయచేయి.

# 4. క్రీస్తు ప్రార్థనం

బైబులు భాష్యం - 22

## విషయసూచిక



# 1. క్రీస్తు ప్రార్థనం

## 1. యూదుల ప్రార్థనా పద్ధతులు

క్రీస్తు ప్రార్థనాభ్యాసాన్ని అర్థంచేసికోవాలంటే పూర్వ వేదపు యూదుల ప్రార్థనా పద్ధతులను తెలిసికొని వుండాలి. పూర్వవేదకాలంలో యూదుల ప్రార్థన షేమ, టఫిల్ల, భోజనప్రార్థనం అని మూడురకాలుగా వుండేది.

1. షేమ ద్వితీయోపదేశ కాండంలోని 6, 4-9 వచనాలు. ధర్మశాస్త్రోపదేశకుడు ఆజ్ఞలన్నింటిలోను ప్రధానమైనదేదని ప్రశ్నించినపుడు క్రీస్తు పైవాక్యాలనే ఉదహరించాడు: "యిస్రాయేలూ విను! మన దేవుడైన ప్రభువు ఏకైక దేవుడు. నీ దేవుడైన ప్రభువును పూర్ణహృదయంతోను, పూర్ణాత్మతోను, పూర్ణశక్తితోను ప్రేమించాలి" - మార్కు 12, 30. యూదులు ఈ ద్వితీయోపదేశ గ్రంథ వాక్యాలను రోజూ రెండుసార్లు వల్లించేవాళ్ళు. ఉదయం నిద్రలేచినపుడూ, సాయంకాలం నిద్రబోవకముందూను. 12 యేండ్లకు పైబడిన మగవాళ్ళంతా ఈ ప్రార్థన చెప్పేవాళ్ళు. స్త్రీలు, పిల్లలు, బానిసలు ఈ జపం చెప్పనక్కరలేదు. హీబ్రూభాషలో "షేమ" అంటే వినడం అని అర్థం. ఈ ప్రార్థనారంభంలో "యిస్రాయేలూ విను!" అనే మాట వస్తుంది గనుక దీనికి షేమ అని పేరు వచ్చింది. ఈ షేమలో యూదులు మత సత్యాలన్నీ సంగ్రహంగా యిమిడివున్నాయి. కనుక ఇది వాళ్ళకు ఓ చిన్న విశ్వాససంగ్రహం లాంటిది. తొలినాటి క్రైస్తవసమాజంలో యూద మతంనుండి క్రైస్తవంలో చేరిన యూదులంతా ఈ ప్రార్థనచేసేవాళ్ళు.

2. టఫిల్ల అనగా స్తుతి. పూర్వ వేదగ్రంథాలనుండి ఎత్తి తీసిన 18 స్తుతి వాక్యాలతో యూదులు ప్రభుని స్తుతించేవాళ్ళు. ఉదయమూ, మధ్యాహ్నాము మూడింటికీ, రాత్రిపూట – రోజుకి మూడుసార్లు ఇలా ప్రభుని స్తుతించేవాళ్ళు. ఈ ప్రార్థనలో మగవాళ్ళు ఆడవాళ్ళు పిల్లలూ బానిసలూ అంతా పాల్గొనేవాళ్ళు. అపోస్తలుల కార్యాలు 3,1 తొలినాటి యూదక్రైస్తవులు మధ్యాహ్నం మూడింటికి దేవాలయానికి ప్రార్థనకు వెళ్లారని చెప్తుంది. ఇది టఫిల్లా ప్రార్థనే. ప్రవక్త దానియేలు రోజు ఈ ప్రార్థన చేసేవాడని దానియేలు గ్రంథము 6,10 వాకొంటుంది.

3. ఇక భోజనప్రార్థనం భోజనానికి ముందూ వెనుకా ప్రభుని స్తుతించి చెప్పే ప్రార్థనం. యూద ప్రజలు మామూలుగా కుటుంబమంతా కలసే భోజనం చేసేవాళ్ళు. ఆ భోజనానికి ముందు వెనుకా కుటుంబయాజమానుడైన తండ్రి ఈ ప్రార్థనం చేసేవాడు.

పూర్వవేద ప్రజలు రోజురోజు తప్పనిసరిగా చేయవలసిన ప్రార్థనలు ఈ మూడే. తతిమ్మా ప్రార్థనలను ఎవరెవరి అక్కర కొలదీ భక్తి కొలదీ వాళ్ళు చేసికొంటూ వుండేవాళ్ళు.

## 2. క్రీస్తు ప్రార్థనం

ఈ లాంటి వాతావరణంలో పుట్టిపెరిగినవాడు క్రీస్తు. కనుక అతడు తన పూర్వుల ప్రార్థనా పద్ధతులలో చక్కగా తర్ఫీదు పొందినవాడే. ఐనా యూదుల ప్రార్థనతో పోల్చి చూస్తే క్రీస్తు ప్రార్థనలో కొన్ని ప్రత్యేకాంశాలు గోచరిస్తాయి.

1. ప్రభువు రాత్రుల్లో ఏకాంతంగా నిర్జన ప్రదేశాల్లో ప్రార్థనం చేసికొనేవాడు. విశేషంగా విజన ప్రదేశాలైన కొండలూ అరణ్యాలూ అతని ప్రార్థనా స్థలాలు. అతడు వేకువజాముననే లేచి ఓ నిర్జన ప్రదేశానికి వెళ్ళి ప్రార్థన చేసికోవడం మొదలెట్టాడు అంటుంది మార్కు సువార్త 1.35. ప్రార్థనచేయడానికి యేసు కొండసీమకు వెళ్ళాడు అంటుంది అదేగ్రంథం 6,46. యేసు ఏకాంతంగా ప్రార్థన చేసికోవడానికి అరణ్యానికి వెళ్ళాడు అంటుంది లూకా సువిశేషం 5,16. ప్రభువు కొండకువెళ్ళి రాత్రంతా ప్రార్థనలో గడిపాడు అని చెపుతుంది అదే పుస్తకం 6,12. ప్రభువు ఒంటరిగా ప్రార్థన చేసికొంటుండగా ఆయన శిష్యులు గూడ అచటికి చేరుకొన్నారు అంటుంది అదే గ్రంథం 9,18. పూర్వవేదపు యూదులు ఈలా వాడుక ప్రకారంగా ఏకాంత ప్రార్థన చేసినట్లుగా వినం. పైపెచ్చు ఆనాటి యూదులు దంబంతో వీధుల్లో నిలబడి పదిమంది చూచేలాగా టఫిల్లా మొదలైన ప్రార్థనలు చేస్తుండేవాళ్ళు. ప్రభువు ఈ బాహ్యాడంబరాన్ని నిరసించాడు. అదృశ్యుడైయున్న దేవుని సన్నిధిలో ఏకాంతంగా ప్రార్థన చేసికోవాలని బోధించాడు. మన ప్రార్థనలకు బహుమానమిచ్చేది అదృశ్యుడైయున్న ఆ ప్రభువేగాని తోడినరులు కాదని హెచ్చరించాడు – మత్త 6,5-6.

2. క్రీస్తు దీర్ఘకాలం ప్రార్థన చేసేవాడు. ఓమారు ప్రభువు ఓ నిర్జన ప్రదేశంలో ప్రార్థనం చేసికొంటుండగా పేత్రు మొదలైన శిష్యులంతా ఆయన్ను వెదక్కుంటూ వచ్చారు. జనులంతా నిన్ను వెదకుతున్నారని గూడ చెప్పారు. ఈ సన్నివేశం ప్రకారం క్రీస్తు దీర్ఘకాలం ప్రార్థనలో నిమగ్నుడైవుండాలి - మార్కు 1, 35-37. ఐదువేలమందికి ఆహారం పెట్టాక శిష్యులను పడవపై బెత్సయిదాకు పంపి ప్రభువు ఏకాంతంగా కొండసీమకు వెళ్ళి ప్రార్థన చేసికోమొదలెట్టాడు. ఆ పడవ గాలిలో జిక్కి అతలకుతల మౌతుండగా నాల్గవ జామున, అనగా ఉదయం మూడింటికి, ప్రభువు నీటి మీద నడచి శిష్యుల వద్దకు వచ్చాడు. అనగా ఆ రాత్రంతా ప్రభువు ప్రార్థనలో గడిపాడనే ఊహించాలి. - మార్కు 6,45-48. అలాగే క్రీస్తు శిష్యుల నెన్నుకోవడానికి ముందటి దినం గూడ రాత్రంతా కొండమీద ప్రార్థనలో గడిపాడు - లూకా 6,12.

యూద ప్రజలు మీద నుడివిన మూడు రకాల ప్రార్థనలూ స్వల్పకాలంలోనే చేసి ముగించేవాళ్ళు. యూదులు దీర్ఘకాలం ప్రార్థన చేసేవాళ్ళని పూర్వవేద మెక్కడా పేర్కొనదు. కనుక క్రీస్తు దీర్ఘప్రార్థనం యూదుల ప్రార్థన చరిత్రలో ఓ ప్రత్యేకాంశం అనాలి.

3. క్రీస్తు మాతృభాషలో ప్రార్థించేవాడు. క్రీస్తు నాడు యూదులు హీబ్రూ భాషను అట్టేవాడలేదు. దాని స్థానే హీబ్రూ సోదర భాషయైన అరమాయిక్‌ను వాడుతూవచ్చారు. కాని నాటి యూదులు షేమ టఫిల్ల మొదలైన ప్రార్థనలన్నీ హీబ్రూ భాషలోనే జపించేవాళ్ళు. ఐన క్రీస్తుమాత్రం అరమాయిక్ భాషలోనే ప్రార్థన చేసేవాడు. అతడు పరలోకజపం గూడ శిష్యులకు అరమాయిక్ భాషలోనే నేర్పాడు. ఆ భాషలో తండ్రికి వాడిన "అబ్బా" అనే పదాన్ని గ్రీకు నూత్నవేదం కొన్నితావుల్లో పదిలపరచింది - మార్కు 14,36.

4. ఆయా ముఖ్యకార్యాలను ప్రారంభింపకముందు గూడ ప్రభువు ప్రార్థనలో గడిపేవాడు. అతడు జ్ఞానస్నానం పొందుతూ ప్రార్థించాడు - లూకా 3, 21. ఈ జ్ఞానస్నానం ప్రభు జీవితంలో చాల ముఖ్య ఘట్టం. దానితో అతడు బహిరంగ జీవితం ప్రారంభించాలి. పరలోకరాజ్యాన్ని గూర్చి బోధించాలి. తన బోధను అద్భుతాలతో సమర్థించాలి. కనుక ఈ ప్రార్థనం అత్యవసరమైంది. అలాగే శిష్యులను ఎన్నుకోకముందూ అతడు రాత్రంతా ప్రార్థనలో గడిపాడు - లూకా 6, 16. క్రీస్తు ప్రారంభించిన రక్షణ కార్యాన్ని అతని తర్వాత అతని శిష్యులు కొనసాగించాలి. అంతటి ముఖ్యమైన శిష్యులను ఎన్నుకోవాలంటే ప్రార్థనం అవసరంగదా! క్రీస్తు తబోరు పర్వతంమీద గూడ ప్రార్థించినట్లు చెప్తుంది లూకా

సువార్త 9,28. ఈ పర్వతంమీదనే మోషే యేలీయా, ప్రభువు యెరూషలేములో మరణించాడాన్ని గూర్చి ముచ్చటిస్తారు. ఇలాంటి ముఖ్య ఘట్టానికి ముందు ప్రభువు మరి ప్రార్థన చేయవద్దా? అలాగే ప్రభువు ఒలీవ వనంలో బాధలనుభవించడానికి ముందు గూడ ప్రార్థించాడు - లూకా 22, 41.

ఈ సన్నివేశాలను బట్టి చూస్తే ప్రభు జీవితంలో, ప్రార్థనమూ కార్యక్రమాలు రెండూ కలగలుపుగా వుండేవని తెలుస్తుంది. మనం నిత్యం ఆయాపనుల్లో మునిగిపోయి ప్రార్థనం జేయడం మానివేస్తుంటాం. లేదా ప్రార్థనలో మునిగి పోయి ఆయా పనుల్లో పాల్గొనడమైనా మానివేస్తుంటాం. ఇవి రెండూ అపమార్గాలే. క్రీస్తు అవలంభించిన పద్ధతినిబట్టి చూస్తే మన జీవితంలో ప్రార్థనమూ పనీ రెండూ పూవూ తావీలాగ కలసి పోతుండాలి.

5. ప్రభువు క్లిష్ట సమస్యల్లోను ఆపదల్లో చిక్కుకొన్నపుడూను ప్రార్థించేవాడు. అతడు ఐదువేలమందికి భోజనంపెట్టాక ప్రార్థించాడు. - మార్కు 6,46. ఎందుకంటే ఈ ప్రజలు ఉత్సాహం మిన్నుముట్టగా అతన్ని బలవంతంగా రాజును జేయబోయారు. కాని క్రీస్తు ఆలా రాజై కూర్చుంటే తానువచ్చిన రక్షణకార్యాన్ని సాధించలేడుగదా! - యోహా 6,15. ఆలాగే అతడు విరోధులు తన్ను బంధించడానికి రాకముందూ ప్రార్థించాడు - మార్కు 14, 35-39.

ప్రభువు పేత్రుకోసం ముందుగనే ప్రార్థించాడు - లూకా 22, 31-32. ఈ వాక్యంలో పిశాచం పేత్రుని కళ్లంలోని జల్లెడలో గోదుమలను జల్లించినట్లుగా జల్లించాలని కోరుకొందని చెప్పబడింది. అనగా పిశాచం పేత్రుని బలంగా శోధించాలని కోరుకొంది అనిభావం. ఈ శోధనవల్లనే అతడు ప్రభుని ఎరుగనని ముమ్మారు బొంకాడు. కాని ప్రభుప్రార్థనా ఫలితంగా అతడు మళ్ళా పశ్చాత్తాపపడ గలిగాడు. ఇంకా, తన ఆపదనూ శిష్యుల ఆపదనూ పురస్కరించుకొని ప్రభువు ముందుగనే ప్రార్థించాడు - మార్కు 14, 36. శోధనల్లో ప్రవేశించకుండా వుండేందుకై ముందుగనే ప్రార్థించమనిగూడ శిష్యులను హెచ్చరించాడు - మత్త 26, 41.

కాని అన్నిటికంటె ముఖ్యమైంది సిలువమీది ప్రభు ప్రార్థన. అతడు చనిపోకముందు తండ్రిని ప్రార్థించాడు. తన ఆత్మను తండ్రి చేతుల్లోనికి సమర్పించుకొని గాని ప్రాణాలు విడువలేదు - లూకా 23, 46. ఈ ఘట్టాలన్నీ కష్టకాలంలో ప్రభువు తన తండ్రిమీద ఎలా ఆధారపడేవాడో తెలియజేస్తాయి.

## 3. క్రీస్తు ప్రార్థనలోని రెండు ముఖ్యాంశాలు

యూదుల ప్రార్థనతో పోల్చిచూస్తే క్రీస్తు ప్రార్థనలో కనిపించే విశేషాలను కొన్నిటిని పైన పేర్కొన్నాం. కట్టకడన క్రీస్తు ప్రార్థనలో కనిపించే ముఖ్యాంశాలను రెండింటిని వివరించాలి. మొదటిది, క్రీస్తు పరలోకపితను అరమాయిక్ భాషలో "అబ్బా" అని సంబోధించేవాడు - మార్కు 14, 36. ఆ భాషలో ఈ శబ్దానికి "నాన్న" అని అర్థం. ఇది దేవునిపట్ల అతనికున్న చనువును సూచిస్తుంది. పూర్వవేదపు యూదులెవరూ పరలోకపితను వ్యక్తిగతంగా నాన్న అని పిలువలేదు. సాముదాయికంగా మాత్రం యూదులు దేవుణ్ణి నాన్న అని పిల్చిన ఘట్టాలు పూర్వవేదంలో కొన్ని వున్నాయి. ఈ సంబోధనాన్నిబట్టి క్రీస్తు తండ్రికి ఎంతో సన్నిహితంగా మెలిగేవాడనీ, ఆ దేవునికి తాను ఎంతో చనువుతో ప్రార్థన చేసికొనేవాడనీ విశదమౌతుంది. కనుక ప్రార్థనలోని మొదటి ముఖ్యాంశం భగవంతునిపట్ల వ్యక్తిగతమైన పరిచయమూ, అనుభవమూ, చనువూ పెంపొందించుకోవటం. మన ప్రార్థనంలో ఈ లక్షణం తరచుగా లోపిస్తూంటూంది.

క్రీస్తు ప్రార్థనలోని రెండవ ముఖ్యాంశం ఇది. అతడు "తండ్రీ! ఈ పాత్రను నా యొద్దనుండి తొలగించు. ఐనా నీ యిష్ట ప్రకారమే జరుగనీయి" అని ప్రార్థించాడు - మార్కు 14, 36. దీన్నిబట్టి అతడు ఆ తండ్రి చిత్తానికి కట్టువడివుండేవాడని వ్యక్తమౌతుంది. ఆ తండ్రి పట్ల తాను కుమారుల్లా ప్రవర్తించేవాడని తెలుస్తుంది. క్రీస్తు ఇక్కడ పాత్రను, అనగా సిలువ మరణాన్ని, తొలగించమని అడిగినా తండ్రి తొలగించలేదు. కనుక అతడు క్రూరమైన సిలువ మరణం మరణించ వలసివచ్చింది. అలాంటి ఘోరవిపత్తులో గూడ క్రీస్తు తన తండ్రి చిత్తాన్ని జవదాటలేదు. నా యిష్టం గాదు, తండ్రి యిష్టమే నెరవేరాలి అనుకొన్నాడు.

ఇది చాల గొప్ప సత్యం. దేవుని చిత్తానికి కట్టువడి వుండడం అనే యీ లక్షణం మన ప్రార్థనల్లో చాలవరకు లోపిస్తుంది. మనం దేవుణ్ణి ఏదో అడుగుతాం. అతడు దాన్ని ఈయకపోతే ఇక సుమ్మర్లు ప్రారంభిస్తాం. అనగా మనం దేవుని చిత్తానికి కట్టువడం. దేవుడు మన చిత్తానికి కట్టువడాలని కోరుకుంటాం. మన మడిగింది పథ్యమైందైనా కాకపోయినా, దేవుడు ఇచ్చితీరాలని పట్టుపడతాం. ఇది దేవునికి లొంగడంగాదు, దేవుణ్ణి లొంగదీసికోవడ మౌతుంది. ఈలాంటి మనస్తత్వంతో చేసే ప్రార్థన భగవంతునికి ప్రియపడుతుందా?

## ఉపసంహారం

క్రీస్తు ప్రార్థనం నుండి మనం ముఖ్యంగా మూడంశాలు గుర్తించాలి. మొదటిది మన జీవితంలో పనీ జపమూ రెండూ కలగలుపుగా కలసి పోతుండాలి. చాలమందికి జీవితంలో పని త్రోవ పనిదే, జపం త్రోవ జపానిదే. దానికీ దీనికీ పొత్తు కుదరదు. దానికీ దీనికీ సంబంధమున్నట్లుగా కనిపించదు. ఇది పెద్ద పొరపాటు. మనం చేసే పనిని సఫలంచేయమని ప్రభుని ప్రార్థించాలి. ఆ ప్రార్థనవలన మనంచేసే పనిలో చిత్తశుద్ధి అధికం గావాలి.

రెండవది, క్రీస్తుకు ప్రార్థనం అనేది ఓ అలవాటు, ఓ జీవిత విధానం. అతడు ప్రార్థనాన్ని బలవంతంగా తెచ్చిపెట్టుకోలేదు. నిత్యం తన తండ్రి సన్నిధిలో జపిస్తూ వచ్చాడు – అంతే. ఈలాగే మనకూ ప్రార్థనమనేది ఓ అలవాటు, ఓ జీవితవిధానమూ కావాలి. మనం ఎంత సులభంగా జీవిస్తుంటామో, ఎంత సులభంగా ఆయా పనులను పూనుకొంటుంటామో, అంత సులభంగానే ప్రార్థనకూడ చేసికొంటుండాలి.

మూడవది, మన ప్రార్థనం ఆ పరలోకపిత చిత్తాన్ని నెరవేర్చడానికి గాని మన చిత్తాన్ని నెరవేర్చడానికి గాదు. మన కవసరమని తోచిందేమో ఆ ప్రభువుకి తప్పకుండా విన్నవించుకోవలసిందే. కాని మనమడిగిందల్లా అడిగినట్లే ఆ ప్రభువు ఇచ్చితీరాలని మొండిపట్టు పట్టగూడదు. మనకు అవసరమైందీ మేలైందీ ఆ తండ్రి తప్పకుండా ఇస్తాడు. కాని మనకు హితం కానిది మన మడిగినా ఆ ప్రభువు ఈయడు. ఈయకూడదుగూడ. ఈ సత్యాన్ని గుర్తించి మన ప్రార్థనలో దైవచిత్తానికి బద్ధులమై యుండటం నేర్చుకోవాలి. క్రీస్తే ఇందుకు పరమాదర్శం.

# 2. పరలోకజపం

## 1. ప్రారంభ విషయాలు

### 1. సందర్భం

శిష్యులు క్రీస్తును ప్రార్థన నేర్పమని అడిగారు – లూకా 11,1. వాళ్లకు క్రీస్తు లాగ ప్రార్థన చేయాలనే కోరిక పుట్టింది. పైగా, క్రీస్తు ఏకాంతంగా ప్రార్థన చేసికోవడం చూసాకనే వాళ్లకు ఈ యభిలాష కలిగింది. అందుకే లూకా సువిశేషం "యేసు ఓ తావులో జపంచేసికొనిన తరువాత ఆయన శిష్యుడొకడు మాకూ ప్రార్థన నేర్పించమని అడిగాడు" అని చెప్తుంది. ప్రభువు ఈలా ఒంటరిగా ప్రార్థన చేసికొంటూవుండేవాడని

మనకు తెలుసు - లూకా 6,12. పైగా శిష్యులు "యోహాను తన శిష్యులకు ప్రార్థన నేర్పినట్లే నీవూ మాకు నేర్పించు" అని అడిగారు. ఆ రోజుల్లో ఒక్కో బృందానికి ఒక్కో ప్రార్థనా పద్ధతి వుండేది. పరిసయులు, ఎస్సీనులు, స్నాపక యోహాను శిష్యులు - ఎవరి ప్రార్థనా పద్ధతి వాళ్లదే. క్రీస్తు శిష్యులు మెస్సీయా చుట్టూ చేరిన వాళ్ళు, వాళ్ళది మెస్సీయా బృందం. కనుక వాళ్లకుగూడ ఓ ప్రత్యేక ప్రార్థనావిధానం వుండాలి. అందుకే వాళ్ళు యోహాను తన శిష్యులకు నేర్పినట్లే నీవూ మాకు ఓ ప్రత్యేక ప్రార్థనా విధానం నేర్పమని ప్రభుని అడిగారు. పరలోకజపం నానా జపాల్లో వొకటి కాదు. అది ఓ ప్రార్థనా పద్ధతి.

## 2. విషయం

పరలోకజపం దైవరాజ్యాన్ని గూర్చి బోధిస్తుంది. ఆ రాజ్య వ్యాప్తిని వర్ణిస్తుంది. కనుక అది వర్తమాన భాగ్యాలనూ భావి భాగ్యాలనూ గూడ పేర్కొంటుంది. ఈ ప్రార్థనను ఈలా విభజించవచ్చు : మొదట పరలోక పితను తండ్రీ అని సంబోధిస్తాం. అటుపిమ్మట దేవుని గూర్చి మూడు విన్నపాలు వస్తాయి. అవి దేవుని నామం, దేవుని రాజ్యం, దేవుని చిత్తమూను. ఆ తరువాత నరుని గూర్చి మూడు విన్నపాలు ఉంటాయి. అవి అనుదినాహారం, పాపక్షమాపణం, శోధనలనుండీ కీడులనుండీ విమోచనం. కనుక మొదటి నుండి చివరిదాక ఈప్రార్థన ఓ క్రమపద్ధతిలో రచింపబడిందని తెలుస్తుంది.

ఈ జపంలో బైబులులో విన్పించే ఓ ప్రధానాంశం వస్తుంది. అది, భగవంతుడు తండ్రి లాంటివాడు నరుడు అతని బిడ్డలాంటివాడు అనే సత్యం. కనుక ఈ ప్రార్థనను దేవునిపై పితృభావముంచి జపించాలి. చిన్నబిడ్డ తన తండ్రితో మాటలాడినట్లుగా చనువుతో, నమ్మికతో, ప్రేమతో దేవునికి మనవి చేయాలి. పరలోకమంత్రం మంత్రాలన్నిటికీ రాజమంత్రం. కనుక దీన్ని ఏదో మామూలు మంత్రంలాగ పెదవులతో గబగబ ఉచ్చరిస్తేచాలదు. పరధ్యానంతో రామచిలుకలాగ వల్లిస్తుపోతే చాలదు. మరి అవధానంతో భక్తిభావంతో జపించాలి.

## 3. ఇద్దరు రచయితలు

నూత్న వేదంలోని పరలోకజపం ఇద్దరు రచయితలనుండి లభిస్తుంది. వీరు మత్తయి; లూకా. మత్తయి సువార్త 6,9-13 వచనాలూ, లూకా సువిశేషం 11,2-4 వచనాలూ ఈ ప్రార్థనను పేర్కొంటాయి. కాలక్రమంలో మొదటి రచన మత్తయిదే. మత్తయి యూద ప్రజలకొరకు సువిశేషాన్ని వ్రాసాడు. కనుక అతని పరలోకజపంలో యూదులు మాత్రమే వాడుకొనే పదాలూ భావాలూ ఉన్నాయి. లూకా గ్రీకుక్రైస్తవుల కొరకు తన

సువిశేషాన్ని వ్రాసాడు. అతడు మత్తయి వ్రాసిన పరలోకజపాన్నీ, ఆ జపానికి ఆధారమయిన మూలరచనలనూ చూచాడు. తాను మాత్రం గ్రీకు క్రైస్తవులకు అర్థమయ్యేలాగ ఆ జపాన్ని కొలది మార్పులతో రచించాడు. మత్తయి పరలోకజపం కొంచెం దీర్ఘంగాను, లూకా పరలోకజపం కొంచెం సంగ్రహంగాను వుంటుంది. ఈ యిద్దరిలో ఎవరి పరలోకప్రార్థన క్రీస్తు బోధించిన తొలి పరలోక ప్రార్థనకు దగ్గరగా వుంటుంది అనే ప్రశ్నవస్తే, లూకా రచనేనని విజ్ఞుల ఊహ. ఇక్కడ మనం మత్తయి రచననే అనుసరిద్దాం. అతని ప్రార్థనలో ఉన్న అంశాలన్నీ లూకా ప్రార్థనలో లేవు.

### 3. ప్రాచీన పద్ధతి

ఇప్పుడు హిందువులు, బౌద్ధులు, మహమ్మదీయులు, మొదలైన క్రైస్తవేతరులుగూడ పరలోక జపాన్ని వాడుకొంటుంటారు. కాని ప్రాచీన క్రైస్తవ సమాజంలో ఈజపాన్ని క్రైస్తవులు మాత్రమే వాడుకొనేవాళ్లు. దివ్యసత్ప్రసాదాన్ని లాగే ఈ జపాన్ని గూడ క్రైస్తవేతరులకు అందీయకుండా గుప్తంగా వుంచేవాళ్లు. దీని పట్ల అంత భక్తి భావం ఎందుకు? ఇది క్రీస్తే స్వయంగా నేర్పిన జపం. పైగా ఈ జపంలో దేవుణ్ణి అబ్బా (నాన్న) అని పిలుస్తాం. క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొందినవాళ్లేగాని ఈలా పిలువలేరు. కనుక ఈ జపాన్ని రహస్యంగా వుంచారు. దివ్యసత్ప్రసాదాన్ని లాగే దీన్ని గూడ క్రైస్తవులకు మాత్రమే పరిమితం జేసారు. ఇక ఈ జపంపై వ్యాఖ్యను తిలకిద్దాం.

## 2. ప్రార్థనా వ్యాఖ్య

### 1) మా తండ్రి

ఈ ప్రార్థనారంభంలో దేవుణ్ణి పరలోకంలో వుండే మా తండ్రీ అని సంబోధిస్తున్నాం. అన్ని మతాలవాళ్లు దేవుణ్ణి తండ్రి అని పేర్కొన్నారు. ప్రాచీన గ్రీకుమతం దేవుణ్ణి "సేయస్ పాతెర్" అని పిలిచింది. అలాగే రోమను మతం "దివిస్ పాతెర్" అని పేర్కొంది. మన దేశంలో ఆర్యులనాటి వైదిక మతం "ద్యౌస్ పితా" అని పేర్కొంది.

పూర్వవేద ప్రజలకు సుపరిచితులైన సుమేరియనులు బాబిలోనియనులు కూడ దేవుణ్ణి తండ్రి యని పిలిచారు. అతడు సృష్టికర్త అన్న భావంతో వాళ్లు ఆలా పిలిచారు. ఇక పూర్వవేదం దేవుణ్ణి 14 సార్లు తండ్రీ అని సంబోధిస్తుంది. సకలజాతులనుండి దేవుడు తమ్ము ఎన్నుకొన్నాడు అన్నభావంతో వాళ్లు అతన్ని ఆలా పిలిచారు. ఉదాహరణకు నిర్గమకాండ 4, 23లో ప్రభువు ఫరోతో "యిస్రాయేలు నా కుమారుడు, నా జ్యేష్ఠపుత్రుడు" అన్నాడు. హోషేయా 11,1లో ప్రభువు యిస్రాయేలీయుల నుద్దేశించి "నా కుమారుని ఐగుప్తునుండి

పిలిపించాను" అంటాడు. యెషయా ప్రవచనం 63,16లో ప్రజలు ప్రభువు నుద్దేశించి "నీవే మాకు తండ్రివి. అబ్రాహాము మమ్మంగీకరించక పోవచ్చుగాక. యాకోబు మమ్మాద రించక పోవచ్చుగాక. ఐనా యావే ప్రభూ! నీవే మా తండ్రివి. అనాది కాలంనుంచీ మా విమోచకుడవని నీకే పేరుగదా!" అంటారు. ఈ యూదాహరణ లన్నిటిలోను దేవుడు తండ్రి అనే భావం. కాని ఇక్కడ ఒక్క విశేషముంది. ఈ యుదాహరణల్లో దేవుడు ప్రజలకు సాముదాయికంగా తండ్రిగాని వ్యక్తిగతంగా గాదు. పూర్వవేదమెక్కడా దేవుణ్ణి వ్యక్తిగతంగా తండ్రి అని పేర్కొనదు.

ఈ లాంటి పరిస్థితుల్లో భగవంతుణ్ణి మొట్టమొదటిసారిగా వ్యక్తిగతంగా తండ్రిఅని పేర్కొన్నవాడు క్రీస్తు. ఆ దేవుణ్ణి తండ్రి అని పిలవడానికి అతడు వాడిన అరమాయిక్ పదం "అబ్బ". ఈ శబ్దానికి "నాన్న" అని అర్థం - మార్కు 14,36.

క్రీస్తుకాలంలో యూదుల చిన్నబిడ్డలు ఇంటిలో వాళ్ల సొంత తండ్రిని "అబ్బ" అని సంబోధించేవాళ్ళు. ఈ పదంలో ఎంతో పరిచయమూ చనువూ ప్రేమభావమూ ఇమిడివుండేది. ఈలాంటి శబ్దాన్ని యూదులు పరలోకంలోని దేవునికి వాడ్డానికి జంకేవాళ్ళు. అసలు ఆ దేవుడంటేనే వాళ్ళకి విపరీతమైన మర్యాదా భయమూను. అందుకే వాళ్ళు అతని పేరు కూడ ఉచ్చరించే వాళ్ళు గాదు. హీబ్రూ బైబుల్లో యావే అనే పేరు వచ్చినపుడెల్లా దేవుని పట్లగల గౌరవంచేత ఆ పేరును ఉచ్చరించకుండ "అదోనాయి" అనే మరో అరమాయిక్ మాటను ఉచ్చరించేవాళ్ళు. ఈ శబ్దానికి ప్రభువు లేక యజమానుడు అని భావం. మన దేశంలో ఈ కాలపు ఆడవాళ్ళు గాదుగాని, వెనుకటితరం ఆడవాళ్ళు భర్త పేరు ఉచ్చరించేవాళ్ళు కాదు. అదొక సంప్రదాయమూ గౌరవమూను. ఈలాగే యూద ప్రజలుగూడ భగవంతునిపేరు ఉచ్చరించేవాళ్ళుగాదు. అతని పేరు వచ్చినపుడెల్ల యజమానుడనీ ప్రభువనీ చెప్పుకొంటూండేవాళ్లు. ఈలాంటి పరిస్థితుల్లో వాళ్లు దేవుణ్ణి "అబ్బా" అని పిలవడం దేవదూషణంగా భావించేవాళ్లే.

ఐనా క్రీస్తు ఆ దేవుణ్ణి తొలిసారిగా "అబ్బా" అని సంబోధించాడు అని చెప్పాం. ఆ దేవునిపట్ల అతనికుండే పరిచయమూ చనువూ అలాంటిది. అతడు దేవునికి ఏకైక కుమారుడు. ఆ తండ్రి తప్ప మరెవ్వరు కుమారునెరుగరు. కుమారుడు తప్ప మరెవ్వరు ఆ తండ్రి నెరుగరు. ఆ కుమారుడు తండ్రిని మనకు తెలియజేయబట్టే మనంకూడ అతన్ని పరలోకంలోని మా తండ్రీ అని పిలువగల్గుతున్నాం - మత్త 11,27. క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొంది, అతనిలోనికి ఐక్యమై, మనంకూడ అతని తండ్రిని నాన్నా అని సంబోధించ గల్గుతున్నాం - రోమా 8, 15. నరుడు దేవుణ్ణి నాన్న అని పిలువడం సామాన్యమైన భాగ్యంకాదు.

ఈ తండ్రిని "పరలోకంలోవుండే మా తండ్రీ అని సంబోధిస్తున్నాం. దేవుణ్ణి పరలోకంలో వుండే దేవుడని పేర్కొనడం యూద ప్రజల సంప్రదాయం. అతడు అంతటా వుంటాడు. విశేషంగా నరుల హృదయాల్లో నెలకొని వుంటాడు. ఐనా యూదులు గౌరవార్థం అతడు పరలోకంలో వుంటాడనీ, మోక్షంలో వుంటాడనీ చెప్తూంటారు.

## 2) దేవుని నామం

మొదటి విన్నపంలో దేవుని నామం పూజింప బడాలి అని ప్రార్థిస్తున్నాం. బైబుల్లో నామమంటే వ్యక్తి. కనుక ఇక్కడ తండ్రీ! నీవు పూజింపబడాలి అని అర్థం. బైబులు భగవంతుడు మహా పవిత్రుడు. అతడు తన పావిత్ర్యాన్ని కనపరుస్తాడు. దేవుడు యిస్రాయేలీయుల నడుమ తన్ను పవిత్ర పరచుకొన్నాడు అంటుంది సంఖ్యాకాండం 20, 13. ఈలా దేవుడు తన పావిత్ర్యాన్ని వెల్లడిచేయగా, నరుడు ఆ పావిత్ర్యాన్ని అంగీకరిస్తాడు. ఆ ప్రభుని పూజిస్తాడు. అతని నామాన్ని స్తుతిస్తాడు.

కాని నరుడు దేవుని నామాన్ని ఏలా పూజిస్తాడు? ఆతని పావిత్ర్యాన్ని స్తుతించడంవల్ల. అతనిని ఆరాధించి పూజించడం వల్ల. అతని ఆజ్ఞలను పాటించడం వల్ల. తాను అతని చిత్తానికి బద్ధుడు కావడంవల్ల. ఇక, ఈ దేవుణ్ణీ అతని నామాన్ని పూజించే శక్తిని మనకు ప్రసాదించేది పవిత్రాత్మ. ఆ యాత్మ ద్వారానే మనం దేవుణ్ణి ఆరాధించగల్గుతున్నాం.

## 3) దేవుని రాజ్యం

రెండవ విన్నపంలో దైవరాజ్యం కొరకు ప్రార్థిస్తాం. ఇక్కడ రాజ్యమంటే పరిపాలనం. కనుక దేవుడు నరులను పరిపాలించాలని ఈ విన్నపం భావం. ఇక, దేవుడు తన ప్రతినిధియైన మెస్సీయాద్వారా నరులను పరిపాలిస్తాడు. ఈ మెస్సీయా క్రీస్తు. క్రీస్తుతోనే దైవరాజ్యం ప్రారంభమౌతుంది. ఆ రాజ్యాన్ని స్థాపించేవాడుగూడ క్రీస్తే. క్రీస్తు నెలకొల్పే ఈ దైవరాజ్యం వ్యాప్తిచెందాలి. దానికి నరుని సహకారం అవసరం. కనుక ఈ విన్నపంలో క్రీస్తు నెలకొల్పే దైవరాజ్యం మన తోడ్పాటుతో పెంపుజెందాలని ప్రార్థిస్తున్నాం.

కాని ఈ దైవరాజ్యం ఎక్కడ పెంపుజెందుతుంది? నరుల హృదయాల్లోనే. నరుడు నిండుహృదయంతో పరలోక పితనూ అతడు పంపిన క్రీస్తునూ అంగీకరించాలి. తన హృదయంలో ఆ దేవుణ్ణి ఆరాధించాలి. ఈ హృదయారాధనమే దైవరాజ్యం. మనం తరచుగా దైవరాజ్యాన్ని నెలకొల్పడమంటే బళ్లూ గుళ్లూ ఆసుపత్రులూ నిర్మించడ మనుకొంటాం. ఈ సంస్థలకు పెద్దపెద్ద భవనాలను నిర్మించడ మనుకొంటాం. అందుకే మన శక్తినీ డబ్బునీ

ఈ కట్టడాలమీద వ్యయం జేస్తాం. కాని కట్టడాలవలన దైవరాజ్యాన్ని నెలకొల్పలేం. రాయిరప్పలూ సున్నమూ సిమెంటూ మొదలైన వానితో కట్టిన కట్టడాల్లో దేవుడు నెలకొంటాడా? అతడు వసించేది ప్రప్రథమంగా నరుల హృదయాల్లో. కనుక దైవరాజ్యాన్ని వ్యాప్తిచేయడమంటే నరుల హృదయాలను సిద్ధం చేయడం. నరులకు తర్ఫీదునిచ్చి వాళ్ళు నిండు హృదయంతో భగవంతుని ఆరాధించేలాగ చేయడం.

మొదటి విన్నపంలో నీ నామం పూజింపబడునుగాక అన్నాం. దేవునినామం పూజింపబడాలి అన్నా, దేవుని రాజ్యం రావాలి అన్నా భావం ఒక్కటే. నూత్న వేద కాలంలో దైవరాజ్యమంటే క్రైస్తవ సమాజమే. పరిశుద్ధాత్మద్వారా దేవుడు ఈ సమాజంలో నెలకొని వుంటాడు. ఈ క్రైస్తవ సమాజానికి మెస్సీయా తన భాగ్యాలనన్నిటినీ అందిస్తాడు.

## 4) దేవుని చిత్తం

మూడవ విన్నపంలో దేవుని చిత్తం నెరవేరాలని ప్రార్థిస్తున్నాం. దీనిభావం దేవుడు తన చిత్తాన్ని నెరవేర్చుకోవాలి అనిగాదు. మనం ప్రార్థించినా ప్రార్థించుకపోయిన అతడు తన చిత్తాన్ని ఏలాగైనా నెరవేర్చుకొని తీరతాడు. కనుక ఈ విన్నపం భావం, మనతరపున మనం దేవుని చిత్తాన్ని నెరవేర్చాలి అని.

నరులంతా రక్షణం పొందాలని దేవుని చిత్తం అంటాడు పౌలు -1తిమో 2,4. ఏమి రక్షణం? మనం ఆ దేవునికి పుత్రులం కావాలి. అతనిలాగ పవిత్రులంకావాలి. అతనినుండి నిత్య జీవంపొందాలి. ఇది రక్షణం. కాని ఈ రక్షణం పొందాలి అంటే నరుడు ఓ బిడ్డలాగ దేవునికి విధేయుడు కావాలి. నమ్మికతో ప్రేమతో ఆ తండ్రి ఆజ్ఞలను పాటించాలి. ఈ విధేయత నరునికి కష్టమనిపిస్తుంది. దేవునికి లొంగిఉండడమంటే అతనికి ప్రియపడదు. "తండ్రీ నీచిత్తమే నెరవేరాలి" అని ప్రార్థించిన క్రీస్తు విధేయతే మనకీసందర్భంలో ఆదర్శ మౌతుంది - మత్త 26, 42. ఈ విన్నపంలో విశేషంగా భగవంతునిపట్ల నరుడు చూపవలసిన విధేయతను గూర్చి ప్రార్థిస్తున్నాం.

ఎందుకోగాని లూకా రచించిన పరలోకజపంలో ఈ విన్నపం పూర్తిగా లోపించింది.

ఇంతవరకు పరలోకజపంలోని తొలిభాగాన్ని పరిశీలించాం. ఈ భాగంలో దేవుణ్ణి తండ్రీ అని సంబోధించడమూ, అతన్ని గూర్చిన మూడు విన్నపాలూ వివరంగా తెలిసికొన్నాం. ఇక, రెండవభాగంలో నరునిగూర్చిన మూడు విన్నపాలూ వస్తాయి.

## 5) నేటికి కావలసిన ఆహారం

నాల్గవ విన్నపంలో ప్రభుని మనకు కావలసిన ఆహారాన్ని ప్రసాదించమని అడుగుతున్నాం. ఇక్కడ "ఆహారం" అన్న పదాన్ని విస్తృతార్థంలో స్వీకరించాలి. మనం

భుజించే భోజనం ఈ యాహారంలో ఒక భాగంమాత్రమే. మెస్సీయా మనకోసం దేవునినుండి కొనివచ్చే వరాలూ దీవెనలూ అన్నీ ఈ విన్నపంలో ఆహారశబ్దంతో సూచింపబడ్డాయి. ఈ దీవెనలు మన ఆత్మకూ దేహానికిగూడ సంబంధించినవి. ఈ దీవెనలను పొందాలంటే బిడ్డలు తండ్రిమీదలాగ మనమూ దేవుని మీద ఆధారపడాలి. ఆకాశపక్షులనూ పొలంలోని పూవులనూ వర్ధిల్లజేసేతండ్రి, వాటికంటె శ్రేష్ఠప్రాణులైన నరులను తప్పకుండా పోషిస్తాడుగదా! - మత్త 6,25-34.

భగవంతునినుండి మనం పొందే ఆహారాన్ని పదిమందిమీ కూడి భుజిస్తాం. ఈ యాహారాన్ని భుజించేనరులంతా ఒక్క కుటుంబంగా ఐక్యమౌతారు. దీనివలన మనకు సమాజభావమూ సోదరభావమూ సిద్ధిస్తుంది. ఆ తండ్రి చేతులలోనుండి ఒకే ఆహారాన్ని భుజించేవాళ్లంతా అన్నదమ్ములూ అక్కచెల్లెళ్లలాగ ఒకేకుటుంబంగా ఏకమౌతారు.

ఈ యాహారం మన్నా ఆహారాన్నిగూడ గుర్తుకుతెస్తుంది. ప్రభువు యిస్రాయేలీయులను ఎడారిలో నలువదియేళ్లు మన్నా ఆహారంతో పోషించాడు - నిర్గ 16, 35. నూత్నయిస్రాయేలీయులమైన మనం మరోయెడారిలో ప్రయాణంజేస్తున్నాం. ఈ లోకమనే యెడారిగుండ పయనంజేసి పరలోకమనే వాగ్దత్తభూమిని చేరుకొంటాం. ఈ మహాప్రయాణంలో క్రీస్తే మనమన్నా. అతడే మన ఆహారం. కనుకనే ప్రభువు "పరలోకంనుండి దిగివచ్చిన జీవాహారాన్ని నేనే. ఈ యాహారాన్ని భుజించేవాడు నిత్యం జీవిస్తాడు. లోకం జీవించడానికి నేనిచ్చే ఆహారం నా శరీరమే" అన్నాడు - యోహా 6,47.

ఈలాగ మనం ఈ విన్నపంలో అడుగుకొనే ఆహారం చాల వస్తువులను సూచిస్తుంది. అది మన ఆత్మకు అవసరమైన వరప్రసాదాన్ని సూచిస్తుంది. మనదేహానికి అవసరమైన భౌతిక అన్నాన్నీ సూచిస్తుంది. ప్రభుని అంగీకరించే మనమంతా సోదరీసోదరుల్లాగ ఐక్యమౌతామనీ సూచిస్తుంది. ఇంకా, మనం స్వీకరించే దివ్య సత్ప్రసాదాన్నీ సూచిస్తుంది.

### 6) మా యప్పులను మీరు మన్నించండి

మనం బలహీనతవల్ల తండ్రియైన దేవునికి విరోధంగా పాపంజేస్తాం. అతడు నెనరుతో మన తప్పిదాలను క్షమిస్తాడు. ఆ కరుణామయుడు జాలితో తప్పిపోయిన గొర్రెను వెదుక్కుంటూ వెళ్తాడు. ఇల్లువిడిచి వెళ్ళిపోయిన కుమారుని రాకకొరకు తెన్నులు జూస్తుంటాడు - లూకా 15. ఈలాంటి కరుణా మయునికి బిడ్డలమైన మనంకూడ ఆ తండ్రిలాగే జాలిగుణాన్ని అలవర్చుకోవాలి. అందుకే ప్రభువు "మీ తండ్రిలాగే మీరూ కనికరంతో మెలగండి" అని బోధించాడు - లూకా 6, 36.

అందువలన మనతరపున మనమూ ఇతరులను క్షమించడం నేర్చుకోవాలి. ఓ యజమానుడు తన సేవకునికి పెద్ద అప్పును క్షమించాడు. కాని ఆ సేవకుడు తనకు బాకీపడివున్న మరోసేవకునికి చిన్న అప్పును క్షమించలేక పోయాడు. అతన్ని గూర్చి "నేను నీ పట్ల దయ జూపినట్లే నీవు నీ తోడిదాసునిపట్ల దయ జూపవలదా?" అనే వాక్యం విన్పిస్తుంది - మత్త 18, 33. పైగా మార్కు 11, 25లో "నీవు ప్రార్థనకు పూనుకొన్నప్పుడు నీ సోదరుని పై నీకేమైన మనస్పర్ధ వున్నట్లయితే ముందుగా అతన్ని క్షమించు" అనే వాక్యం కన్పిస్తుంది. ఈ వాక్యాలనుబట్టి మనం సోదర ప్రజలను క్షమించడం ఎంత అవసరమో స్పష్టమౌతుందిగదా!

ఇంకో సంగతిగూడ. లూకా మత్తయి రచించిన పరలోక జపాలను గ్రీకుభాషలో చదివిచూస్తే ఓ సత్యం బోధపడుతుంది. లూకా రచించిన పరలోక జపంలో "మేము మా యొద్ద అప్పుపడిన వారిని క్షమిస్తున్నాం గనుక నీవూ మా యప్పులను క్షమించు" అనివుంది - 11, 4. ఇక్కడ "కనుక" అనేమాట షరతును తెలుపుతుంది. అనగా "మేము మా సోదరులను క్షమిస్తేనే నీవు మమ్ము క్షమించు, లేకపోతే క్షమించవద్దు" అని భావం. మత్తయి రచించిన పరోకజపంలో "మా యొద్ద అప్పుబడిన వారిని మేము క్షమించినట్లే నీవు మా యప్పులను క్షమించు" అని వుంది - 6,12. ఇక్కడ "అట్లే" అనే మాట పరిధిని తెలుపుతుంది. అనగా "మేము మా సోదరులను ఎంతవరకు క్షమిస్తున్నామో నీవు మమ్ము అంతవరకు క్షమించు" అని భావం. ఈ రీతిగా లూకా భావించినట్లు షరతును తీసికొన్నా, లేక మత్తయి భావించినట్లు పరిధిని తీసికొన్నా, మనం తోడి ప్రజలను క్షమిస్తుండాలనే ఫలితార్థం. కనుక పరస్పర క్షమాపణమూ, భగవత్ క్షమాపణమూ ఈ యైదవ విన్నపంలోని అంశాలు.

### 7) మమ్ము శోధనలో చిక్కుకోనీయవద్దు

శోధనం రెండు విధాలుగా వుంటుంది. దేవుడు అబ్రాహామును శోధించాడు - ఆది 22, 1. అనగా ఇక్కడ దేవుడు అబ్రాహాము తన ఏకైక కుమారుడైన ఈసాకును బలిగా సమర్పించాలని కోరాడు. మన విశ్వాసం ఏపాటిదో తెలిసికోవడం కోసం దేవుడు అప్పుడప్పుడూ ఈలాంటి పరీక్షలిస్తుంటాడు. ఈలాంటి శోధనలవలన పాపమేమి ఉండదు. ఇటువంటి సన్నివేశాలద్వారా మనలను పాపంలోనికి లాగాలని దేవుని ఉద్దేశమూగాదు.

ఇక, మరోరకమైన శోధనలు కూడ వున్నాయి. ఈ శోధనలు మనలను పాపంలోనికి కూలద్రోయడానికే వస్తాయి. ఇవి పిశాచం నుండైనావస్తాయి. లేదా మన పతన స్వభావంనుండైనా పుడతాయి - యాకో 1,13-14. ఈలాంటి శోధనలు వచ్చినపుడు మనం వాటిని ప్రయత్న పూర్వకంగా ఎదిరించాలి. లేకపోతే పాపంలో పడిపోతాం.

ఈ కడపటి విన్నపంలో ఈ రెండవరకపు శోధనలనుండి, విశేషంగా పిశాచం తెచ్చిపెట్టే శోధననుండి, దేవుడు మనలను రక్షించాలనిభావం. మన శుద్ధికొరకు శోధనలేమో అవసరమే. మనంవద్దనుకొన్నా అవేమో రాకమానవు. కానిమనం వాటికి లొంగిపోకూడదు. ఈ విన్నపంలో అసలు శోధనలే రాకుండా వుండాలని గాదు, వాటికి లొంగిపోకుండా వుండాలని మాత్రమే ప్రార్థిస్తున్నాం. అనగా దైవసహాయంతో ఈ జీవితంలో సంభవించే శోధనలను జయించాలని వేడుకొంటున్నాం.

## దుష్టునినుండి మమ్ము రక్షించండి.

చివరివిన్నపంలో రెండు భాగాలున్నాయి. మొదటిభాగాన్ని మీద పరిశీలించాం. రెండవభాగంలో దుష్టునినుండి మనలను కాపాడాలని దేవుని వేడుకొంటున్నాం. లూకా సువార్తలో ఈ రెండవ భాగం లేదు. ఇక్కడ మూలాన్ని "కీడునుండి మమ్ము రక్షించండి" అనిగాని, లేదా "దుష్టునినుండి మమ్ము రక్షించండి" అనిగాని అనువదించవచ్చు. ఈ దుష్టుడు ఎవరోగాదు, నరజాతికి శత్రువైన పిశాచమే. అనగా పాపంలో కూలద్రోయాలనే తలంపుతో నరులను శోధించే పిశాచంనుండి మనలను కాపాడమని దేవునికి మనవి జేస్తున్నామన్నమాట. "కీడునుండి" అనే పదాన్ని స్వీకరించినట్లయితే పిశాచం మనలను పాపంలో కూలద్రోయకుండా వుండేలా తోడ్పడమని దేవుని మనవి జేస్తున్నాం.

చివరిరోజుల్లో క్రీస్తును విడనాడ్డమనే పెద్ద శోధనకూడ వస్తుంది - మత్త 24, 10. ఇదే మతభ్రష్టత. క్రీస్తుని నిరాకరించడమనే ఘోరశోధననుండి కాపాడమనిగూడ ఈ చివరి విన్నపంలో ప్రార్థిస్తున్నాం.

## 8) క్రీస్తు ప్రార్థనం

క్రీస్తు శిష్యులకు పరలోకజపాన్ని నేర్పించడం మాత్రమే గాదు. అతడు తనతరపునా శిష్యులతరపునా ఆ ప్రార్థనను స్వయంగా ప్రార్థించాడు. అదేలాగో చూద్దాం.

దేవుడు క్రీస్తుతండ్రికూడ. కనుక అతడు "పరలోకంలోని తండ్రీ" అని దేవుణ్ణి సంబోధించాడు. క్రీస్తు తండ్రిమహిమ కొరకు అంకితుడైనవాడు -యోహా 12, 28. కనుక "నీ నామం పూజింపబడునుగాక" అని మనవిచేసాడు. అతడు తండ్రి రాజ్యం కొరకు ఉవ్విళ్లూరాడు. అందుచే "నీ రాజ్యం వచ్చునుగాక" అని వేడాడు. ఆ ప్రభువు దైవచిత్తాన్ని నెరవేర్చడంకొరకే జీవించినవాడు. కావున "నీ చిత్తం నెరవేరాలి" అని విన్నవించు కొన్నాడు - లూకా 22, 42.

అతడు తండ్రినుండే తన అనుదినాహారాన్ని పొందుతూ వచ్చాడు. కనుక "మాకు నేటికి కావలసిన అన్నం దయ చేయ" మని ప్రార్థించాడు. క్రీస్తు శత్రువుల కొరకు ప్రార్థించాడు - లూకా 23, 34. కావున "మా యొద్ద అప్పుపడిన వారిని" అని విన్నవింప గలిగాడు. ఆ ప్రభువు శిష్యులు శోధనలో ప్రవేశింపకుండా వుండాలని ప్రార్థించాడు - లూకా 22, 32. తండ్రి మనలనందరినీ కాపాడాలని మనవి చేసాడు - యోహా 17,11. కనుక అతడు "మమ్ము శోధనలో ప్రవేశింపనీయక దుష్టుని నుండి కాపాడు" అని అడిగాడు. ఈలాగ పరలోకజపం క్రీస్తు జపంకూడ. మనలాగే అతడూ పితను ఆరాధించినవాడు.

పరలోకజపం దైవరాజ్యాన్ని గూర్చి బోధిస్తుంది అన్నాం. క్రీస్తే ఆ రాజ్యం అనిచెప్పాం. మనమూ ఆ రాజ్యం కొరకు కనిపెట్టుకొని వుండాలి. ఆ రాజ్యం మన హృదయాల్లో నెలకొనాలని ఉవ్విళ్లూరుతుండాలి.

# 3. క్రీస్తు విజ్ఞాపనం

హెబ్రీయుల జాబు ఉత్థానక్రీస్తు తండ్రి సమక్షంలో నిరంతరం జీవిస్తుంటాడనీ, తనద్వారా దేవునివద్దకు వచ్చేవాళ్లకొరకు విజ్ఞాపనంచేస్తూ వాళ్లను సంపూర్ణంగా రక్షిస్తుంటాడని చెప్తుంది - 7,25. అలాగే రోమీయుల జాబు కూడ ప్రభువు మృతులలోనుండి లేచి దేవుని కుడిపార్శ్వాన నెలకొనివుండి మనకొరకు విజ్ఞాపనం చేస్తూంటాడని వాకొంటుంది - 8,34. ఈలా వుత్థాన క్రీస్తు మోక్షంలో తన తండ్రి సమక్షంలో మన తరపున ప్రార్థింస్తూంటాడనేది చాలాగొప్ప సత్యం

యోహాను తొలిజాబు ఉత్థానక్రీస్తుని "ఆదరణకర్త" లేక "ఉత్తరవాది" అని పేర్కొంటుంది -2,1. అనగా అతడు మన తరపున దేవునియెదుట వాదించేవాడు. మానవజాతి శత్రువైన పిశాచం మనమీద మోపే నేరానికి ప్రతిపక్షం చేసేవాడు. పిశాచాన్ని ఓడించి మనకు విజయం సాధించిపెట్టేవాడు. మన కోపు దీసికొనేవాడు. క్రీస్తు విజ్ఞాపనంలో ఈ భావాలన్నీ ఇమిడివున్నాయి. అతడు దేవుని యెదుట మనకొరకు, మనతరపున మనవి చేసేవాడు.

కాని ఉత్థానక్రీస్తు దేవుని యెదుట మనకోసం ఏలా మనవి చేస్తాడు? ప్రభువు తండ్రి యెదుట ఏమీ మాటలాడనక్కరలేదు. తండ్రి సమక్షంలో నిలవడమే అతని విజ్ఞాపనం. అతడు మన కోసం మానుషదేహాన్ని స్వీకరించాడు. ఆ దేహం ఇప్పుడు ఉత్థానమైయుంది. ఆ వుత్థానదేహాన్ని క్రీస్తు తనతండ్రియెదుట ప్రదర్శిస్తాడు. ఆ ప్రదర్శనమే అతని విజ్ఞాపనమౌతుంది. పైగా ఆ ప్రభు హృదయంలో మనలను రక్షించాలనే కోరిక మిక్కుటంగా వుంటుంది. తండ్రికి ఆ కోరిక అర్థమౌతుందిగూడ. కనుక ఈ కోరికగూడ క్రీస్తు విజ్ఞాపనమే.

ఈలా ఉత్థానక్రీస్తు తన సాన్నిధ్యం ద్వారానే దేవునియెదుట మనతరపున విన్నపం చేస్తూంటాడు.

ఈ విజ్ఞాపన ఫలితంగా మనం పాపాలకు పశ్చాత్తాపపడి హృదయం శుద్ధి చేసికొంటూంటాం. దేవునితో ఐక్యమౌతూంటాం. తోడిప్రజలను ప్రేమభావంతో ఆదరిస్తూంటాం. ఆ దేవుని కొరకూ సోదరప్రజల కొరకూ ఏవో సత్కార్యాలు చేస్తూంటాం. ఈ విధంగా మనం నిత్యం క్రీస్తు విజ్ఞాపన ఫలితాన్ని పొందుతూనే వుంటాం. ఐనా ఈ సత్యం మనలో చాలామందికి తెలియనే తెలియదు. అందుకే దేవదూతలనూ అర్చ్యశిష్టులనూ మన కొరకు ప్రార్థించమని వేడుకొంటూంటాంగాని, ఉత్థానక్రీస్తును మనకొరకు ప్రార్థించమని అడుగుకొనే అడుగుకోం. కాని బైబులు క్రైస్తవులు ఉత్థాన క్రీస్తు ప్రార్థనలను వినియోగించుకోవాలి. మన ప్రతిదిన జీవితంలో ప్రభు ప్రార్థనా ఫలితాన్ని చవిజూస్తుండాలి.

రోమీయులు 8,26-27లో పరిశుద్ధాత్ముడు మనకోసం విజ్ఞాపనం చేస్తుంటాడని చెప్పబడింది. ఆయాత్ముడు మనహృదయంలోనేవుండి మనకొరకు విన్నపం చేస్తుంటాడు. మోక్షక్రీస్తుమాత్రం మనకువెలుపల, తండ్రి సమక్షంలోవుండి, మనకొరకు విన్నపం చేస్తుంటాడు. ఈ యిద్దరు దైవవ్యక్తుల ప్రార్థనా ఫలితంగా మనం ఒకపాటిగానైన దేవుణ్ణి విశ్వసించగల్గుతున్నాం. లేశమాత్రంగానైన క్రైస్తవ జీవితం గడపగల్గుతున్నాం. కనుక ఈ దైవవ్యక్తులను మనకొరకు ప్రార్థించమని అడుగుకొంటూండాలి. ఈ దైవవ్యక్తుల ప్రార్థనల తర్వాతనే దేవదూతల ప్రార్థనలూ పునీతుల ప్రార్థనలూను. ఇక్కడ ఒక సత్యంగుర్తించాలి. పునీతులకంటె దైవవ్యక్తులు ఎంత గొప్పవాళ్లో, పునీతుల ప్రార్థనలకంటె ఆదైవ వ్యక్తుల ప్రార్థనలూ అంత శ్రేష్ఠమైనవి. అనగా పునీతుల ప్రార్థనలు అవసరంలేదనిగాదు. దైవవ్యక్తుల ప్రార్థనలను మాత్రం అత్యవసరముగా వినియోగించు కోవాలనిభావం - అంతే.

# 4. క్రైస్తవుల ప్రార్థనం

## అబ్బా - నాన్నా

క్రీస్తు తన తండ్రిని అబ్బా అని పిల్చేవాడు అనిచెప్పాం. ఆ క్రీస్తులాగే మనం కూడ పరలోకపితను అబ్బా అని పిల్వాలి అని బోధించాడు పౌలు. యూదుల్లాగ మనం దాస్యపు ఆత్మను పొందలేదు. దత్తపుత్రుల ఆత్మను పొందాం. ఆ యాత్మ సాయంతో దేవునికి - అబ్బా - నాన్నా అని మొరపెట్టు కొంటున్నాం - రోమా 8,15. అనగా పూర్వవేద ప్రజలు దేవునికి దాసుల మనుకొన్నారు. నూత్నవేద ప్రజలమైన మనం దేవునికి

దత్తపుత్రులమనుకొంటాం. మనలను ఈలా పుత్రులను చేసేది పరిశుద్ధాత్మ. ఈ యాత్మ ప్రబోధం వల్లనే ఆ దేవుణ్ణి చనువుతో నాన్నా అని సంబోధించ గల్గుతున్నాం. మరో తావులో పౌలు "మీరు కుమారులయ్యారు. కనుక అబ్బా - నాన్నా అని మొరపెట్టే తన కుమారుని ఆత్మను దేవుడు మీ హృదయాల్లోనికి పంపాడు" అని చెప్పాడు - గల 4,6. ఇక్కడ కుమారుని ఆత్మఅంటే క్రీస్తు పొందిన పరిశుద్ధాత్మ. ఈ ఆత్మ మన హృదయాల్లో నెలకొని వుండి మనచేత దేణ్ణి నాన్నా అని పిలిపిస్తుంటుంది.

క్రీస్తు పరలోక పితకు ఏకైక కుమారుడు, సహజపుత్రుడు. ఆ క్రీస్తునందు మనంగూడ పరలోక పితకు పుత్రులమౌతాం. క్రీస్తువలె మనం సహజ పుత్రులం గాముగాని, దత్తపుత్రులమౌతాం. దత్త పుత్రులమైనా మన పుత్రత్వం ఊహామాత్రమైందికాదు. యథార్థమైందే. అందుకే "మనం దేవుని బిడ్డలమని పిలువబడుతున్నాం, యథార్థంగా బిడ్డలంగూడ" అంటుంది యోహాను తొలిజాబు - 3, 1. క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొంది అతనిలోనికి ఐక్యం గావడంద్వారా ఈ దత్తపుత్రత్వం సిద్ధిస్తుంది. "యేసుక్రీస్తును విశ్వసించడం వలన మీరందరూ దేవుని కుమారులౌతున్నారు, క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొందిన వాళ్లందరూ క్రీస్తును ధరిస్తున్నారు" అని చెప్పాడు పౌలు - గల 3, 26-27.

క్రీస్తునందు మనం దేవుని పుత్రుల మౌతామని చెప్పాం. కాని ఈలా క్రీస్తునందు మనం పుత్రులమయ్యేలా చేసేది పరిశుద్ధాత్మ. ఆ యాత్మ ఓ దివ్యశక్తి. ఈ శక్తి మనకు దైవపుత్రత్వమిస్తుంది. ఆ యాత్మ మన హృదయంలో నెలకొనివుండి మనచేత దేవుణ్ణి అబ్బా, అనగా నాన్నా అని పిలిపిస్తుంది.

అబ్బా అనేమాట చాలా గొప్పపదం. ఈ శబ్దం ముగ్గురు దైవ వ్యక్తులనూ తలపిస్తుంటుంది. మనం క్రీస్తుకు సోదరులమౌతాం. ఆ క్రీస్తుఆత్మ మన హృదయంలో నివాస మేర్పరచుకొంటుంది. ఆక్రీస్తు తండ్రికి మనం బిడ్డల మౌతాం. ఈలా పరమత్రీత్వాన్నంతటినీ తలపునకు దెచ్చే శబ్దం, ఆత్రీత్వాన్నంతటినీ తనలో ఇముడ్చు కొనే శబ్దం అబ్బా. ఈ శబ్దాన్ని భక్తితో ఉచ్చరించడంద్వారా మనం త్రీత్వంతో సంబంధం కలిగించుకొంటాం. ఆ ముగ్గురు దైవ వ్యక్తులకు ప్రార్థన చేసికొంటాం. ఆ వ్యక్తులను మన హృదయంలో నిలుపుకొంటాం.

హిందూ సాధకులు కొన్ని మంత్రాలను వాడుతుంటారు. ఈ మంత్రాల్లో బీజాక్షరాలు ఉండడం వల్ల అవి శక్తితో పనిచేస్తాయని నమ్ముతుంటారు. క్రైస్తవులమైన

మనం కూడ వాడుకోవలసిన ఓ మహా మంత్రం వుంది. అదే "అబ్బా" అనే పదం. ఈ పదంతో దేవుణ్ణి అనురాగంతోను చనువుతోను నాన్నా అని పిలుస్తాం. ఈలా పిలవమని బోధించాడు పౌలు తన క్రైస్తవ సమాజాలకు.

నరుడు దేవుణ్ణి నాన్నా అని సంబోధించగల్గడం మహాభాగ్యం. ఈ భాగ్యం క్రైస్తవ మతానికి ప్రత్యేకం. అన్యమతాల్లోని భక్తులకు భగవంతునిపట్ల ఇంత చనువూ సన్నిహితత్వమూ ఉన్నట్లు కన్పించదు. నరుడెక్కడ దేవుడెక్కడ? ఓ పేద నరుడు పరమేశ్వరుణ్ణి "నాన్నా" అని పిలవడం సామాన్యంగా లభించే భాగ్యమా! పరిశుద్ధాత్మ క్రైస్తవ ప్రజలకు ఈ భాగ్యాన్ని ప్రసాదిస్తుంది.

క్రీస్తు ప్రార్థనలోని ఓ ముఖ్యాంశం భగవంతుణ్ణి చనువుతో నాన్నా అని పిలవడమని ఈ వరకే చెప్పాం. క్రైస్తవుల ప్రార్థనలో గూడ ఈ లక్షణం వుండాలి. ఆ భగవంతుణ్ణి తండ్రిలాంటివాణ్ణిగా భావనకు తెచ్చుకోవాలి. అనుభవానికీ తెచ్చుకోవాలి. ఈ యనుభవం కుదరక పోతే కేవలం పెదవులతో ప్రార్థనం చేసినవాళ్ళమౌతాం. రామచిలుకల్లాగ అర్థమూ పర్థమూ లేని వాక్యాలను వల్లించుకొంటూ పోయినవాళ్ళమౌతాం. అప్పుడు "ఈ ప్రజలు నన్ను పెదవులతో గౌరవిస్తున్నారుగాని వీళ్ళ హృదయం నాకు చాలా దూరంగావుంది" అన్నప్రవక్తవాక్యం మనకూ అక్షరాల వర్తిస్తుంది - యెష 29,13.

# 5. ప్రార్థనమూ - వ్యక్తిగతానుభావమూ

## 1. బైబులు భక్తుల అనుభవం

ప్రార్థనలో వ్యక్తిగతానుభవం చాలా ముఖ్యం. ఈ యనుభవంలేని ప్రార్థన రుచిలేని భోజనం లాంటిది. బైబులు భక్తుల్లో ఈ యనుభవం గాఢంగా వుండేది. మచ్చునకు కొన్ని ఉదాహరణలు చూద్దాం. మొదట పౌలు వాక్యాలను కొన్నిటిని పరిశీలిద్దాం. అతడు ఇప్పుడు నేనుగాదు నాయందు క్రీస్తే జీవిస్తున్నాడా అని చెప్పుకున్నాడు - గల 2, 20. నాకు జీవించడమంటే క్రీస్తుని జీవించడమే అని వ్రాసికొన్నాడు - ఫిలి 1,21. తన జీవితాంతంలోగూడ పౌలు పాపుల్లో నేను ప్రధానుణ్ణి అని చెప్పుకున్నాడు - 1తిమో 1,15. క్రీస్తుతో పోల్చుకొంటే ఈ లోకంలోని విలువలన్నీ పెంటప్రోవుతో సమానం అని భావించాడు - ఫిలి 3,8. ఆ ప్రభువు పట్ల అతనికి కలిగిన భక్తిపారవశ్యం ఆలాంటిది.

యోహాను, మేమెవర్ని తాకి చూచామో, ఎవర్ని కన్నులార దర్శించామో, ఎవరి వాక్యాలను చెవులార విన్నామో ఆ క్రీస్తునకు సాక్ష్యమిస్తున్నాము అన్నాడు - 1యోహా 1,1. క్రీస్తు మన పాపాలకు శాంతిచేసేవాడు అని నమ్మాడు -1యోహా 2,2. కొమ్మలు తల్లి తీగలోనికి లాగే మనమూ ఆ ప్రభువులోనికి ఐక్యమౌతామనీ, తల్లి తీగలోని సారం కొమ్మల్లోనికి ప్రసరించినట్లే క్రీస్తు వరప్రసాదమూ మనలోనికి ప్రసరిస్తుందనీ బోధించాడు -15,4. ప్రభుని అతడు ఆకళింపునకు తెచ్చుకొన్న తీరు అలాంటిది.

ఓ మారు ప్రభువు మీరూ నన్ను విడిచి వెళ్తారా అని శిష్యులను ప్రశ్నించాడు. పేత్రు "ప్రభూ! మే మెక్కడికి వెళ్తాం. నిత్యజీవమిచ్చే పలుకులు నీ నోటినుండి వెలువడుతున్నాయి" అని జవాబిచ్చాడు - యోహా 6,68. క్రీస్తుని ఎరుగనని బొంకిన పేత్రు ప్రభువు తనవైపు తేరి పారజూచేప్పటికల్లా గుండెగరగి బోరునయేడ్చాడు - లూకా 22,62. ఆ ప్రభువు పట్ల అతనికున్న అనుభవం అలాంటిది.

మరియ మగ్దలీన ఉత్థానక్రీస్తుని జూచి తోటమాలి అనుకొంది. నీవు క్రీస్తుని తీసికొనిపోయినట్లయితే అతన్నెక్కడ దాచి వుంచావో చెప్పు, నేనాయన్ను ఎత్తుకొనిపోతాను అంది - యోహా 20,15. అంతట ప్రభువు ఆమెను పేరెత్తి "మరియా" అని పిలువగానే మరియ భక్తిపారవశ్యంతో ప్రభుపాదాలపై వాలింది. ఈ విధంగా "నా గొర్రెలకు నా స్వరంతెలుసు" అన్న ప్రభువాక్యం ఆమె పట్ల సార్థకమయింది - యోహా 10,4. ప్రభువు మీద ఆమెకున్న పరమానురక్తి అలాంటిది.

మరియొక మరియకూడ వుండేది. ఈమె ప్రభుపాదాల చెంత గూర్చుండి అతని వాక్యాలను భక్తిభావంతో ఆలిస్తూండేది. తన అక్క మార్త నిష్ఠురలాడినా ఆమె ప్రభుపాదాల చెంతనుండి లేవలేదు - లూకా 10,39. ప్రభువు మీద ఆమెకున్న ప్రేమభావం అలాంటిది.

ఈ యుదాహరణలను బట్టి బైబులు భక్తులకు భగవంతుని పట్ల వ్యక్తిగతమైన అనుభవముండేదని రూఢమౌతుందిగదా! ఈ యనుభవం లేందే ప్రార్థనం లేదు. క్రైస్తవ జీవతమూ లేదు. క్రైస్తవమతమంటే నిర్జీవమైన కొన్ని సిద్ధాంతాలను అనుసరించడం గాదు. కొన్ని ఆచారాలను పాటించడంగాదు. మరి సజీవుడైన ఓ వ్యక్తిని అనుసరించడం. ఉత్థానక్రీస్తుని నాయకునిగా స్వీకరించడం. అతనితో పరిచయమూ అనుభవమూ పెంపొందించుకోవడం. కాని నేటి మన క్రైస్తవమతం అనుభవంలేని మతమైపోయింది. గ్రుడ్డితనంగా ఏవో కొన్ని ఆచారాలనూ, నియమాలనూ, కర్మ కాండలనూ పాటించే

మతమై పోయింది. ఇది ఓ పెద్ద దురదృష్టమని చెప్పాలి. ఈ లాంటి పరిస్థితుల్లో క్రైస్తవుడు ప్రార్థనం ద్వారా గాని భగవంతునితో వ్యక్తిగాతానుభవం కలిగించుకోలేదు.

## 2. ప్రార్థనలో ఎదురయ్యే చిక్కులు

నేటి క్రైస్తవుల ప్రార్థనా జీవితంలో భగవంతుని పట్ల వ్యక్తిగతానుభవం అట్టే కన్పించదని చెప్పాం. దీనికి కారణాలు చాలావున్నాయి. ఇక్కడ కొన్నిటిని పేర్కొందాం.

1. మన జపాలు తరచుగా ఓ కర్మకాండలాగ, ఓ తంతులాగ తయారౌతాయి. వాటిని నోటితో వల్లెవేయడమేగాని హృదయంతో జపించడమంటూ వుండదు.
2. దేవునికి అన్నీ తెలుసు. మన అక్కరలూ తెలుసు. మరి ఇక మనం జపించడం దేనికి అనే భావం కలుగుతుంది.
3. దేవునియందు మనకు విశ్వాసం వుండదు. అతనిపట్ల మనకు వ్యక్తిగతమైన అనుభవం వుండదు. అతని సాన్నిధ్యాన్ని కలిగించుకోం. అతడు తండ్రిలాంటి వాడని అర్థంచేసికోం.
4. అంతరాయంలేని పనిని నెత్తినవేసికొని దానితోనే సతమతమౌతుంటాం. అలసట జెందుతుంటాం. ఇక ప్రార్థనకు వ్యవధివుండదు. పైగా పనినీ ప్రార్థననూ ఒకదానితోవొకటి జోడించడం మనకు చేతగాదు. దేనిలోవుంటే దానిలోనే వుండిపోతుంటాం.
5. మనకు వివిధ ప్రార్థనా పద్ధతులు తెలియవు. ఒకే పద్ధతిని వాడు కోవడంవల్ల విసుగు జెందుతుంటాం. అసలు చాలమందికి ప్రార్థన అంటే యేమిటో గూడ తెలియదు.
6. భగవంతునిపట్ల అనుభవం గలవాళ్లూ, ప్రార్థనను వివరించి చెప్పగలిగేవాళ్లూ, మనచేత ప్రార్థనను చేయించగలిగేవాళ్లూ అట్టే దొరకరు. ప్రార్థనయందు అనుభవం గల ఆత్మ గురువులు అరుదు.
7. మనం జనం ప్రార్థనను ఓ గొప్ప విలువగా భావించరు. లౌకిక విషయాల్లో చూపినంత శ్రద్ధ పారమార్థిక విషయాల్లో చూపరు. అందుచేత చిన్ననాటినుండే మనకు ప్రార్థన మీద మోజుపుట్టదు.
8. మనం సృష్టి వస్తువుల కంటిపెట్టుకొని వుండిపోతాం. ధనం, ఉద్యోగం కీర్తిప్రతిష్ఠలు, శారీరక సుఖభోగాలు - వీటిని వెదుకుతుంటాం. ఈ సృష్టి వస్తువుల్లో చిక్కుకొని సృష్టికర్తను విస్మరిస్తుంటాం. కనుక మనకు ప్రార్థనమీదికి మనసుపోదు.

9. దేవుడు మనకంటికి కన్పించడు. విశ్వాసం ద్వారానే గాని అతనితో పరిచయం గలిగించుకోలేం. కంటికి కన్పించే ప్రాపంచిక వస్తువుల ఆకర్షణకు లొంగిపోయి కంటికి కన్పించని భగవంతుని విస్మరిస్తుంటాం.
10. మన ప్రజలకు బైబులుతో పరిచయంవుండదు. మనం అలవాటు పడిన ప్రార్థన ద్వారా మనం దేవునితో మాటలాడ్డమే గాని, బైబులు వాక్యాలద్వారా దేవుడు మనతో మాటలాడుతుంటే వినే అభ్యాసం కలిగించుకోం. ఎందుకంటే బైబులు చదువుకోం గనుక.
11. మనచేత ప్రార్థన చేయించే దివ్యశక్తి పరిశుద్ధాత్మ. కాని ఆ యాత్మనుగూర్చి మనకట్టే తెలియదు. ఆ యాత్మపట్ల మనకు భక్తీ పరిచయమూ ఉండదు.
12. మనం దైవచిత్తానికి లోబడం. స్వార్థాభిలాషల ప్రకారం జీవించగోరుతాం. ఆత్మనిగ్రహాన్ని పాటించం. సిలువను అంగీకరించం. ఈలాంటి పరిస్థితుల్లో ప్రార్థన ఎలా కుదురుతుంది?
13. చాలమందికి దివ్యపూజపట్ల అభిరుచి సన్నగిల్లి పోయింది. దివ్యసత్ప్రసాదాన్ని భక్తితో స్వీకరించరు. క్రీస్తుకు సన్నిహితులు కారు. అలాంటివాళ్లకు సహజంగానే ప్రార్థన కుదరదు.
14. మనం స్వార్థంతో గూడిన ప్రార్థనలకు పూనుకొంటాం. అవిగావాలి ఇవి గావాలి అని దేవుణ్ణి దబాయిస్తాం. ఈలాంటి ప్రార్థనలు ఫలించక పోవడంవల్ల నిరాశజెంది జపం పట్ల వైముఖ్యం జూపుతాం.
15. ఇక మన అజాగ్రత్త, సోమరితనం, పట్టీపట్టనితనం, రాగద్వేషాలు మొదలైన దుర్గుణాలు ఉండనే వున్నాయి.

## 3. మన అనుభవం యథార్థమైందేనా?

క్రైస్తవులంగా మనం ఏవో కొన్ని ప్రార్థనలు చేస్తూంటాం. ఈ ప్రార్థనల వల్ల మనకు కొంతభగవదనుభవం కలిగినట్లుగా గూడ వుంటుంది. కాని మనకు కలిగిందనిపించే ఈ యనుభవం నిజమైందో కాదో నిర్ణయించడం ఏలాగ? యథార్థమైన భగవదనుభవం గడించినవాళ్లల్లో కొన్ని లక్షణాలు కన్పిస్తాయి. వాటిని సంగ్రహంగా ఈ క్రింద పొందుపరుస్తున్నాం.

1. హృదయంలో శాంతీ, సంతృప్తీ, ఆనందానుభూతీ నెలకొంటాయి. బాధల్లో వున్నప్పుడుగూడ ఒకోమారు ఈ లక్షణాలు కన్పిస్తాయి.

2. విశ్వాసమూ నమ్మికా దేవప్రేమా వృద్ధిజెందుతాయి.
3. దైవసాన్నిధ్యాన్ని గుర్తించగల్గుతాం. మన జీవిత సన్నివేశాల్లో నైతేనేమి, చుట్టుపట్ల జరిగే సంఘటనల్లో నైతేనేమి దేవుణ్ణి చూడగల్గుతాం.
4. దేవుణ్ణి ప్రధానమైన విలువగానూ మిగతా వాటినన్నిటినీ అప్రధానమైన విలువగానూ భావిస్తాం. పౌలు చెప్పినట్లు క్రీస్తుతో పోల్చిచూస్తే ఈ ప్రపంచంలోని విలువలన్నీ పెంట ప్రోవుతో సమానంగా కన్పిస్తాయి.
5. హృదయ పరివర్తనం కలుగుతుంటుంది. పాపభీతి జనిస్తుంది. మన పాపాలకు మనమే పశ్చాత్తాప పడతాం. హృదయశుద్ధికై ప్రాకులాడతాం.
6. సిలువలను అనుభవించడానికి జంకం. ఆత్మనిగ్రహాన్ని అవలంబిస్తాం. మనలను మనం తగ్గించుకొంటాం. కష్టాల్లోను వ్యాధి బాధల్లోను ఓర్పును చూపెడతాం.
7. సోదర ప్రేమను అలవరచు కొంటాం. స్నేహశీలురమౌతాం. ఇతరులను సులభంగా క్షమిస్తాం. ఇతరుల మేలుకై కృషి చేస్తాం. సేవాభావం అలవడుతుంది.
8. మన భగవదనుభవం క్రైస్తవ సత్యాలకూ బైబులు బోధలకు వ్యతిరేకంగాబోదు. అధికారంలోవున్న పెద్దలకు విధేయులమౌతాం. తిరుసభ ఆజ్ఞలకు కట్టుపడి వుంటాం.
9. సరళ స్వభావం, నిష్కాపట్యం, వినయం అలవడుతుంది.
10. ఇతరులకుగూడ క్రీస్తును తెలియజేయాలి అనే కోరి కలుగుతుంది. ఏదో రూపంలో మన చుట్టుపట్ల వున్నవాళ్లకు క్రీస్తును అందీయడానికి పూనుకొంటాం.
11. వివేకం అలవరచుకొంటాం. ఆత్మచే నడిపింపబడతాం. పౌలు పేర్కొనిన ప్రేమ, సంతోషం, సమాధానం, దీర్ఘశాంతం, దయాళుత, మంచితనం, విశ్వాసం, సాత్వికం, ఆశానిగ్రహం మొదలైన ఆత్మఫలాలను పొందుతాం - గల 5, 22-23.

యథార్థమైన భగవదనుభవం కలవాళ్లల్లో ఈ లక్షణాలన్నీ కాక పోయినా, వీటిల్లో కొన్నయినా కన్పిస్తాయి. కనుక పండును జూచి చెట్టును నిర్ణయించవచ్చు.

# 5. పరలోక జపం

బైబులు భాష్యం - 138

## పరలోక జపం - ప్రభువు ప్రార్థనం

క్రీస్తు ఒకచోట ఏకాంతంగా ప్రార్థన చేసుకొంటుంటే చూచి శిష్యులు తమకు కూడ ప్రార్థన నేర్పమని అడిగారు. ఆ సందర్భంలో అతడు పరలోకజపం నేర్పాడు - లూకా 11,1. లూకా సువిశేషంలో ఈ జపానికి 5 విన్నపాలు మాత్రమే వున్నాయి. కాని మత్తయి సువిశేషంలో 7 విన్నపాలున్నాయి. దీనిలో సువిశేషబోధ అంతా సంగ్రహంగా ఇమిడి వుంది.

ఈ జపంలో లేని అంశాలేవీ బైబుల్లోని ఇతర జపాల్లో కన్పించవని అగస్టీను భక్తుడు నుడివాడు. మన క్రైస్తవ సంప్రదాయంలో ఈ జపానికి మించింది మరొకటిలేదు. ఇది అన్ని విధాల పరిపూర్ణమైన జపం. దీనిలో మనకు అవసరమైన వరాలన్నీ దేవునినుండి అడుగుకొంటాం. పైగా వాటిని అడుగవలసిన వరుసక్రమంలో గూడ అడుగుతాం.

పర్వత ప్రసంగం క్రీస్తు బోధల సారం. దానిలో మన జీవితానికి అవసరమైన అంశాలన్నీ వున్నాయి. కాని ఈ యంశాలు మనకు ఏలా లభిస్తాయి? ప్రార్థన ద్వారానే. ఐతే, ఉత్తమ ప్రార్థనం పరలోకజపమే. కనుక దీనిద్వారానే మనం పర్వత ప్రసంగం పేర్కొనే భాగ్యాలను పొందాలి.

ఈ జపానికి "ప్రభువు ప్రార్థనం" అని పేరు. ఇది క్రీస్తు స్వయంగా తండ్రికి చేసింది. దీన్ని మనకు నేర్పినవాడు క్రీస్తు. తండ్రి తనకు తెలియజేసిన సత్యాలనే క్రీస్తు ఈ ప్రార్థనలో మనకు తెలియజేసాడు. నరులమైన మన అవసరాలన్నీ గుర్తించే క్రీస్తు ఈ జపాన్ని సిద్ధంజేసాడు. అతడు మనకు బోధకుడూ ఆదర్శమూర్తీ కూడ.

ఐతే మనం ఈ జపాన్ని యాంత్రికంగా చేస్తే సరిపోదు. పవిత్రాత్మ శక్తితోను ప్రేరణంతోను దీన్ని జపించాలి. దేవుడు మన హృదయాల్లోనికి ఆత్మను పంపాడు. ఆ యాత్మ సహాయంతోనే మనం దేవుణ్ణి తండ్రీ! అని సంబోధిస్తాం - గల 4,6. కనుక ఆత్మ బలంతోనే మనం తండ్రినుద్దేశించి ఈ ప్రార్థనను జపించాలి. జపం ద్వారా మన కోరికలను దేవునికి తెలియజేసేది ఆత్మే. అందుచే ఈ ప్రార్థనలో క్రీస్తు, ఆత్మ - ఇద్దరి ప్రమేయం వుంది.

తిరుసభ మొదటినుండి ఈ మంత్రాన్ని జపిస్తూ వచ్చింది. “18 ఆశీర్వాదాలు” అనే ప్రార్థనను యూదులు ప్రతిరోజు మూడుసార్లు జపించేవాళ్ళు. తొలినాటి క్రైస్తవులు ఈ యూద ప్రార్థనకు బదులుగా పరలోక జపాన్ని రోజుకి మూడుసార్లు జపించారు. దైవార్చన ప్రార్థనలో ఈ జపం వస్తుంది. జ్ఞానస్నానం దివ్యసత్ప్రసాదం అనే ప్రారంభ సంస్కారాల్లో ఈ ప్రార్థన వస్తుంది. తొలినాటి క్రైస్తవ బోధకులు క్రొత్తగా క్రైస్తవ సమాజంలో చేరేవాళ్ళకు ఈ జపాన్ని నేర్పించి వాళ్ళచే దీన్ని చెప్పించారు.

పూజలో దివ్యసత్ప్రసాదానికి ముందు ఈ జపం వస్తుంది. అంతవరకు మనం పూజలో చేసిన మనవులన్నీ దీనిలో పునరావృతమౌతాయి. కాని పూజలో ఈ జపం క్రీస్తు రెండవ రాకడను జ్ఞప్తికి తెస్తుంది. ప్రభువు మళ్ళా తిరిగి వచ్చిందాకా మనం అతని ఆగమనంకోసం ఎదురు చూస్తుంటాం.

## సాహసిస్తున్నాం

పూజలో పరలోక జపం చెప్పడానికి ముందు “మనరక్షకుడు ఇచ్చిన పరమోపదేశాన్ని అనుసరించి ప్రార్థింప సాహసింతము” అంటాం. దేవుణ్ణి పేరెత్తి పిలవడానికీ, తండ్రీ అని సంబోధించడానికీ మనం నిజంగా సాహసించాలి. పూర్వం మోషే మండుతూన్న పొదను సమీపింపగా “దగ్గరికి రావద్దు చెప్పులు విడువు. నీవు నిలుచున్న చోటు పవిత్రభూమి సుమా!” అని దివ్యవాణి విన్పించింది – నిర్గ 3-14. నరుడు దేవుని చెంతకు రాలేడు అని ఈ సంఘటనం భావం. దేవుని సన్నిధిలోనికి ప్రవేశింప గలిగినవాడు క్రీస్తు వొక్కడే. పాపపు నరులమైన మనకు ఆ భాగ్యంలేదు. బానిసలమైన మనం ఈ మట్టిలో కలసిపోవలసిందే. కాని తండ్రీ, అతని కుమారుని ఆత్మా మనం దేవుణ్ణి అబ్బా – నాన్నా అని పిల్చేలా చేస్తారు. దేవుడు అనుగ్రహించందే నరుడు దేవుణ్ణి తండ్రి అని పిలువలేడు కదా!

దేవుని ఆత్మే మనకు పరలోక జపాన్ని చెప్పుకొనే ధైర్యాన్ని దయచేస్తుంది. మనం దేవుని బిడ్డలం, దేవుడు మన మొర వింటాడు, మనం అతన్ని నమ్మవచ్చు, సరళ స్వభావంతో వినయంతో అతన్ని సమీపించవచ్చు- ఈ మొదలైన భావాలన్నీ పై “ధైర్యం” అన్నమాటలో ఇమిడి వున్నాయి.

## తండ్రీ

దేవుణ్ణి తండ్రీ అని పిలుస్తున్నాం. కాని ఆ తండ్రి మన భూలోకంలో తండ్రుల్లాంటివాడూ తల్లుల్లాంటివాడూ కాదు. కుమారుడు తప్ప మరెవ్వరు తండ్రిని

ఎరుగరు. కుమారుడు ఎవరికి ఎరిగింప యిష్టపతాడో వాళ్ళు మాత్రమే తండ్రిని ఎరుగుతారు – మత్త 11,27. ఈ సత్యాన్ని మనం వినయంతో అంగీకరించాలి. ప్రాచీన కాలంలోనే టెర్టూలియను అనే వేదశాస్త్రి చెప్పినట్లుగా, దేవుణ్ణి తండ్రీ అని పిలిచే జ్ఞానం నరులెవరికీ లేదు. పూర్వం మోషే నీవెవరివని ప్రశ్నింపగా దేవుడు నేను ఉన్నవాడను అని మాత్రమే చెప్పాడు. దేవుణ్ణి తండ్రి అని పిలవాలనే జ్ఞానం మనకు మొదట కలిగించినవాడు కుమారుడు. అసలు కుమారుడు అనే మాటే తండ్రి అనేపదాన్ని జ్ఞప్తికి తెస్తుంది.

క్రీస్తు అతని ఆత్మా దేవుణ్ణి తండ్రి అని పిలవాలని మనకు తెలియజేసారు. క్రీస్తుకి తండ్రికీ వుండే సంబంధం మనకు కాదు గదా సన్మనస్కులకు కూడ తెలియదు. ఐనా ఆత్మ మనకు ఆ దివ్య సంబంధంలో భాగం దయ చేస్తుంది. మనం దేవునినుండి జన్మించామని తెలియజేస్తుంది. ఆ దేవుణ్ణి తండ్రి అని పిలవమని ప్రోత్సహిస్తుంది.

పరలోక జపం చెప్పుకొనేపుడు మనకు దేవునితోను అతని కుమారునితోను ఐక్యత సిద్ధిస్తుంది. దేవుణ్ణి తండ్రి అని సంబోధించినపుడు మొట్టమొదట అతనిపట్ల ఆరాధన భావాన్ని చూపుతాం. ఆ పిమ్మటనే అతనికి మన విన్నపాలు తెలుపుకొంటాం. దేవుని పేరు తెలిసికోవడం, అతన్ని తండ్రినిగా భావించడం, అతన్ని నమ్మడం, అతడు మన హృదయంలోనే వసిస్తున్నాడని గ్రహించడం మహా భాగ్యాలు కదా!

పరలోకజపం మనకు దేవుణ్ణి తెలియజేస్తుంది. ఇంకా అది మన మెవరిమో మనకు తెలియజేస్తుంది కూడ. ఆంబ్రోసు భక్తుడు ఈలా వాకొన్నాడు. "నరుడా! మంటి వైపు జూచే నీవు దేవునివైపు చూడలేకపోయావు. దిడీలున క్రీస్తు వరప్రసాదాన్ని పొంది నీ పాపాలను ప్రాయశ్చిత్తం చేసికొన్నావు. దుష్టసేవకుడవైన నీవు మంచి కుమారుడవయ్యావు. తండ్రి జ్ఞానస్నానం ద్వారా నీకు నూత్న జన్మనిచ్చాడు. కుమారుని ద్వారా నిన్ను రక్షించాడు. కనుక అతన్ని మా తండ్రి అని పిలువు."

మన భాగ్యమంతా క్రీస్తు ద్వారా తండ్రికి దత్తపుత్రులం కావడంలోనే వుంది. ఈ దత్తత అనే వరం మనకు రెండు సత్యాలను నేర్పుతుంది. మొదటిది, బిడ్డలమైన మనం మన తండ్రిలాంటివాళ్ళం కావాలి. అతడు మనలను తనకు పోలికగా చేసాడు – ఆది 1,27. మనం పాపం వలన పోగొట్టుకొన్న దైవపోలికను తిరిగి వరప్రసాదం ద్వారా పొందాం. కనుక మనం ఎప్పుడూ దేవుని బిడ్డలంగా ప్రవర్తించాలి. దేవుని దివ్యగుణాలు, కారుణ్యం మనలోగూడ కన్పించాలి. మనం నిరంతరం దేవుని ధ్యానించుకోవాలి. మన ఆత్మను అతని సాన్నిధ్యంతో నింపుకోవాలి.

రెండవది, మనం వినయంతోను నమ్మకంతోను చిన్నబిడ్డల్లా దేవుణ్ణి సమీపించాలి. పసిబిడ్డల్లాంటివాళ్ళే కాని అతన్ని తెలిసికోలేరు – మత్త 11,25. ఇంకా మనం ప్రార్థనం

ద్వారా దేవునితో ప్రేమతోను చనువుతోను సంభాషించాలి. అతడు మనకు తన బిడ్డలమయ్యే భాగ్యాన్ని దయచేసాడు. కనుక బిడ్డలమైన మన మడిగింది నేడు తప్పక దయచేస్తాడు.

## మా యొక్క తండ్రి

"మా యొక్క తండ్రి" అన్న పదాల ద్వారా మనకు దేవునిపట్ల చనువు వుందని సూచిస్తాం. పూర్వవేద ప్రవక్తలు ఆ తండ్రి ప్రేమను మనకు తెలియజేసారు. ఆ ప్రేమ యిప్పుడు క్రీస్తు మరణోత్థానాల ద్వారా పూర్తిగా నెరవేరింది. అలాంటి ప్రేమగల తండ్రి యిప్పుడు మనకు దేవుడు ఔతాడు, మనం అతని ప్రజలమౌతాం. ఈ నూత్న సంబంధం మనకు క్రీస్తు ద్వారా లభించింది.కృపాసత్యాలు ఆ ప్రభువునుండే వస్తాయి కదా! యోహా 1,17.

మనం మా యొక్క తండ్రీ అనిపిల్చే వ్యక్తీ అచ్చమైన పరమత్రీత్వం. కుమారుడు అతనినుండి శాశ్వతంగా జనిస్తాడు. ఆత్మడు అతనినుండి నిరంతరాయంగా బయలుదేరుతాడు. ఐనా ఆ వ్యక్తి ఒకే దేవుడు.. మనకు ఆత్మద్వారా క్రీస్తునందు తండ్రితో ఐక్యత చేకూరింది. మనం ఆ దైవ వ్యక్తులను విడదీయక ఐక్యభావంతోనే ఆరాధిస్తాం.

"మాయొక్క తండ్రీ" అన్నపుడు ఆ తండ్రి క్రీస్తుని విశ్వసించి అతనిలోనికి జ్ఞానస్నానం పొందిన వాళ్ళందరికీ తండ్రి ఔతాడు. అనగా అతడు క్యాతలిక్, ప్రోటస్టెంటు సమాజాలకు గూడ తండ్రి. వీళ్ళంతా క్రీస్తులోనికి జ్ఞానస్నానంపొంది ఆత్మనుండి జనించిన వాళ్ళే. యెరూషలేములోని ఉమ్మడి సమాజం ఒకే మనస్సుతోను ఒకే హృదయంతోను జీవించింది - అ.చ. 4,32. ఆ సమాజ జీవితం నేడు మనకు కూడ ఆదర్శం కావాలి. ఈ పరలోకజపం క్రైస్తవ శాఖలన్నీ కలసిపోయి పరస్పర ప్రేమతో జీవించాలని హెచ్చరిస్తుంది. తన శిష్యులంతా ఒకే మంద కావాలని ప్రభువు కోరాడు కదా! - యోహా 10,16.

కాని పరమపిత ఒక్క క్రైస్తవులకేకాక లోకంలోని నరులందరికీ తండ్రి. మన భారతదేశంలోనే నానా మతాలవాళ్ళు నానా జాతులవాళ్ళు వసిస్తున్నారు. ఆ దివ్య జనకుడు హిందువులకు, బౌద్ధులకు, సిక్కులకు గూడ తండ్రి. కనుక మన విద్యాసంస్థల్లో ఆస్పత్రుల్లో సాంఘిక సేవా కార్యక్రమాల్లో అన్యమతస్థులను కేటాయించకూడదు. నరులంతా దేవుని బిడ్డలే.

మనలో బోలెడంత వ్యక్తిత్వవాదం వుంటుంది. అనగా నేను, నా శ్రేయస్సు ముఖ్యమనుకొంటాం. తోడివారిని పట్టించుకోం. క్రైస్తవుడు ఈ వ్యక్తిత్వ వాదాన్ని వదలుకొని తోడివారితో కలసిపోవాలని గూడ మా యొక్క తండ్రీ అనే మాటలు సూచిస్తాయి.

దేవుడు జ్ఞానస్నానం ద్వారా మనకందరికీ తండ్రి. కనుక మన ప్రార్థనలో ఈ నరులందరినీ స్మరించుకోవాలి. తండ్రి వీరందరికొరకు తన కుమారుని అప్పగించాడు కదా! దేవుని ప్రేమకు హద్దులు లేవు. అలాగే మన ప్రార్థనకు కూడ హద్దులుండకూడదు. ఇంకా, మనం క్రీస్తునీ అతని తండ్రినీ ఎరుగనివాళ్ళకొరకు కూడ ప్రార్థించాలి. చెల్లాచెదరైన దేవుని సంతానాన్ని ఏకం చేసేవాడు క్రీస్తు – యోహా 11,52. భక్తులు పునీతులు నరులందరి కొరకు ప్రార్థన చేసారు. మాయొక్క తండ్రి అన్నపదంలో ఇన్ని భావాలున్నాయి.

# పరలోకమందుండే తండ్రి

ఈ జపంలో వచ్చే "పరలోకం" అనే మాట ఎక్కడో వున్న ఏదో స్థలాన్ని సూచించదు. దేవుని గొప్పతనాన్ని తెలియజేయడానికి ఇక్కడ ఈ మాటను వాడారు అంతే. దేవుడు ఏ వొక్క తావులోనోగాక లోకమంతటా వుంటాడు. అతడు పరమ పవిత్రుడు. కనుక వినయాత్ములూ పశ్చాత్తాప హృదయులూ ఐన వారికి దగ్గరగా వుంటాడు. అగస్టీను భక్తుడు చెప్పినట్లు "దేవుడు పరలోకంలో వుండేవాడంటే భక్తిమంతుల హృదయాల్లో ఓ దేవాలయంలో లాగ వసించేవాడని భావం. దేవునికి ప్రార్థన చేసేవాళ్ళు ఆ ప్రభువుని తమ హృదయంలో వసించమని అడుగుకోవాలని గూడ అర్థం! కనుక పరలోకంలో వుండే దేవుడంటే మన హృదయాల్లో వసించే పవిత్ర ప్రభువనే అర్థం.

పరలోకం దేవుని గృహం. మన పయనం గూడ ఆ యింటివైపే. పాపం వలన మనం ఆ యింటినుండి వెళ్ళిపోయాం. ఇపుడు పరివర్తనం వల్ల మళ్ళా ఆ యింటికి తిరిగి వస్తాం. క్రీస్తు ద్వారా యిపుడు పరలోక భూలోకాలు ఐక్యమయ్యాయి. పరలోకంనుండి దిగివచ్చిన మనుష్య కుమారుడే మనం మళ్ళీ పరలోకానికి ఎక్కిపోయేలా చేస్తాడు – యోహా 3,13. అతని మరణోత్థానాల్లో పాలుపొంది మనం పరమపదాన్ని చేరుకొంటాం.

ఈలా మనం పరలోకజపం చెప్పేపుడు ఈ లోకంలో వుండగానే పరలోకంలో క్రీస్తు చెంత ఆసీనులమై వున్నామని తెలియజేస్తాం – ఎఫే 2,6. ఆ దివ్యగృహం కొరకు నిరీక్షిస్తూ నిట్టూర్పు విడుస్తున్నామని సూచిస్తాం – 2కొ 5,2. ఎప్పుడు కూడ మన యిల్లు ఇక్కడకాదు, అక్కడే.

# ఏడు విన్నపాలు

పరలోకజపంలో మొత్తం ఏడు విన్నపాలున్నాయి. వీటిల్లో తొలిమూడు దేవుణ్ణి స్తుతించేవి. చివరి నాల్గు మన అక్కరలను కరుణగల దేవునికి తెలియజేసికొనేవి. మొదటి మూడింటిలో దేవుని నామాన్ని, రాజ్యాన్ని, చిత్తాన్ని పేర్కొంటాం. ఇక్కడ మనలను గూర్చి

ఏమీ అడుగుకోం. దేవుణ్ణి మాత్రమే స్మరిస్తాం. ఉత్తమప్రేమ చేయవలసింది ఇదే. క్రీస్తు తన సిలువ మరణంలోనే దేవునికి ఈ మూడు విన్నపాలు విన్నవించాడు. తండ్రి వాటిని అంగీకరించాడు గూడ. కాని లోకాంతందాక గూడ ఇవి పూర్తిగా నెరవేరవు. కనుక నేడు మనంకూడ మన ప్రార్థనలో వీటిని కొనసాగించాలి. వీటిద్వారా నేడు మన విశ్వాసమూ, నిరీక్షణా, ప్రేమా పెరుగుతాయి.

చివరి నాల్గు విన్నపాల్లో మన కొరకు కరుణగల దేవుణ్ణి వేడుకొంటాం. మన ఆహారం కొరకూ, పాప పరిహారం కొరకూ, శోధనం నుండి విముక్తి కొరకూ, పిశాచంనుండి రక్షణం కొరకూ అతన్ని వేడుకొంటాం. ఇవి మన అక్కరలు. ఇక, ఈ యేడు విన్నపాలను కొంచెం విపులంగా పరిశీలిద్దాం.

## 1. నీ నామం పవిత్రపరచబడునుగాక

ఇక్కడ "పవిత్రపరచబడునుగాక" అంటే పవిత్రంగా గణింపబడునుగాక అని అర్థం. అనగా దేవుని దివ్యనామం పవిత్రంగా ఎంచబడాలని కోరుకుంటున్నామన్నమాట. ఈ విన్నపంలో దేవుడు క్రీస్తు ద్వారా చేసిన రక్షణ ప్రణాళికను స్మరించుకొంటున్నాం. ఆయన యెదుట మనం నిర్దోషులంగాను పవిత్రంగాను మెలగాలని కోరుకుంటున్నాం - ఎఫే 1,4.

దేవుడు తనంతట తాను పరమ పవిత్రుడు. ఈ పవిత్రతనే బైబులు "మహిమ" అని కూడ పిలుస్తుంది. దేవుడు తన మహిమను నరులకు కూడ యిచ్చాడు - కీర్త 8,5. ఐతే పాపంవల్ల మనం ఈ మహిమను కోల్పోయాం. కాని ప్రభువు తన దివ్యనామం ద్వారా తన మహిమను వెల్లడిచేసి మనం కోల్పోయిన దైవ మహిమను తిరిగి పొందేలా చేస్తాడు.

అతడు అబ్రాహాముకి కూడ తెలుపని తన దివ్యనామాన్ని మొట్టమొదట మోషేకు వెల్లడిచేసాడు. నేను ఉన్నవాడను అని అతనితో చెప్పాడు - నిర్గ 3,14. అనగా తాను యిస్రాయేలీయులకు సహాయంచేసే దేవుడని అర్థం. పవిత్రుడైన దేవుని ప్రజ కనుక యిస్రాయేలు కూడ పవిత్రంగా జీవించాలని ఆజ్ఞాపించాడు. కాని ఆ ప్రజలు మాటిమాటికి దేవునినుండి వైదొలగారు. అతని దివ్యనామాన్ని జాతుల మధ్య అమంగళ పరచారు - యెహె 20,9. కాని పూర్వవేదంలోని భక్తులూ ప్రవక్తలూ శేషజనమూ దివ్యనామ మహిమ కొరకు తపించిపోయారు.

కడన తండ్రినామాన్ని మనకు పరిపూర్ణంగా తెలియజేసినవాడు క్రీస్తు - యోహా 17,8. అతడు విశేషంగా సిలువ మరణం ద్వారా తండ్రి నామాన్ని మనకు తెలియజేసాడు.

సిలువ మరణం ద్వారా తనకు విధేయుడై నందుకు మెచ్చుకొని తండ్రి తన దివ్యనామాన్నే క్రీస్తుకిచ్చి సత్కరించాడు - ఫిలి 2,9. అదే ప్రభువు అనే బిరుదం.

ఈ క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొంది మన రక్షణాన్ని స్వీకరిస్తాం. ఇది తండ్రి చిత్తం. నేడు మనం ఈ తండ్రి నామాన్ని పవిత్రపరచాలి. కాని అందరినీ పవిత్రపరచే దేవుణ్ణి మనమేలా పవిత్ర పరుస్తాం? మనం జ్ఞానస్నానంలో పొందిన పావిత్ర్యాన్ని నిలబెట్టుకోవడం ద్వారానే. ఆ పావిత్ర్యాన్ని మనలో వదిలపరచమని మనం మాటిమాటికి దేవుణ్ణి అడుగుకోవాలి. మన పవిత్ర జీవితం ద్వారానే మనం దేవుని నామాన్ని పవిత్రపరుస్తాం. మనం నిర్మలంగా జీవించినపుడు దేవుని నామానికి కీర్తికలుగుతుంది. పాపజీవితం గడిపినపుడు నానా జాతులమధ్య అతనికి అపకీర్తి కలుగుతుంది - యెహె 36,21.

ఇక, దేవుని నామాన్ని మనం మాత్రమే పవిత్ర పరస్తే చాలదు. అన్యులు కూడ పవిత్ర పరచాలి. ఆలా జరగాలని మనం ఆశించాలి, ప్రార్థించాలి. నరులందరు తమ నిర్మల జీవితం ద్వారానే దేవుని పవిత్రనామాన్ని స్తుతించి కీర్తించాలి.

## 2. నీ రాజ్యం వచ్చునుగాక

ఇక్కడ "రాజ్యం" అనే మాటను "పరిపాలనం" అని కూడ అనువదించవచ్చు. అనగా మన హృదయంలో దేవుని పరిపాలనం నెలకొనాలని ఈ వాక్యం భావం. దేవుడు మన హృదయాలను పరిపాలించాలని ఫలితార్థం. దైవరాజ్యాన్ని (పరిపాలనను) మన దగ్గరికి తీసికొని వచ్చినవాడు క్రీస్తు. సువిశేషాల్లో అతడు ప్రధానంగా బోధించింది దీన్నే. అతని మరణోత్థానాలతో దైవరాజ్యం రానే వచ్చింది. అంత్య భోజనంతోనే ఈ రాజ్యం ఆవిర్భవించింది. నేడు దివ్యసత్ప్రసాదం ద్వారా మన మధ్యలో నెలకొనివుంది. సిప్రియను భక్తుడు వాకొన్నట్లుగా అసలు క్రీస్తే దైవరాజ్యం. కనుక అతని రాకతోనే దైవరాజ్యం వచ్చిందనాలి. ఒకనాడు అతనితోపాటు మనం కూడ ఉత్థానమౌతాం. అతనితోపాటు మనం కూడ రాజ్యపాలనం చేస్తాం.

ఆత్మా వధువూ "యేసు ప్రభూ! రమ్ము" అని పల్కుతున్నారు - దర్శ 22,20. తిరుసభ ఆశతో ప్రభువు రాజ్యం కొరకు ఎదురుచూస్తుంది. టెర్టూలియను చెప్పినట్లుగా, వేదసాక్షులు ప్రభూ! నీవు త్వరగా విజయం చేసి మా నెత్తుటిని చిందించిన వారిపై పగతీర్చుకో అని అరుస్తారు. కనుక ప్రభువు స్వయంగా నేర్పింపకున్నా ఈనాడు మనం నీ రాజ్యం వచ్చునుగాక అని ప్రార్థించేవాళ్ళమే.

నీ రాజ్యం వచ్చునుగాక అనే వాక్యం ప్రధానంగా క్రీస్తు రెండవమారు వచ్చి దైవరాజ్యాన్ని పరిపూర్ణంగా స్థాపించడాన్ని సూచిస్తుంది. కనుక ఈ విన్నపం భావికాలానికీ ప్రస్తుత కాలానికీ గూడ వర్తిస్తుంది. దైవరాజ్యం ఇప్పుడు బలాన్ని పుంజుకొని భవిష్యత్తులో పరిపూర్ణమౌతుంది అనుకోవాలి. ఆత్మ శిష్యులమీదికి దిగివచ్చిన నాటినుండి తానే దైవరాజ్యాన్ని పరిపూర్ణం చేస్తున్నాడు. క్రీస్తు పనిని పరిపూర్తిచేసి మనకు వరప్రసాదాన్ని దయచేసేది అతడే.

దైవరాజ్యమంటే ఆత్మ దయచేసే పవిత్రత శాంతి సంతోషాలే - రోమా 15,17. ఈ యంత్యకాలంలో దేవుడు మనకు తన ఆత్మను సమృద్ధిగా దయచేసాడు. ఆత్మ దిగివచ్చిన నాటినుండి శరీరానికి అతనికీ మధ్య పోరాటం జరుగుతూనే వుంది - గల 5,16-17. పాపానికి దైవరాజ్యానికి ఏ మాత్రం పొత్తులేదు. కనుక "మీ భౌతిక శరీరాల్లో పాపం పరిపాలనం చేయకూడదు" అన్న పౌలు వాక్యం ప్రకారం జీవించే విశుద్ధ వర్తనులేగాని నిజంగా నీ రాజ్యం వచ్చునుగాక అని దేవుణ్ణి ప్రార్థించలేరు - రోమా 6,12.

దైవరాజ్యపు రాకడ భావికాలానికి సంబంధించింది అన్నాం. ఐనా అది వర్తమానాన్ని విస్మరించదు. ఐతే యిప్పుడు దైవరాజ్యం పెంపు చెందుతుంది అనడానికి గుర్తు ఏమిటి? ఇప్పటి క్రైస్తవుల్లో, శాంతి, న్యాయం సేవ అభివృద్ధి చెందాలి. నేను తోడివారిని ఆదరించి వారికి సేవలు చేస్తే నా హృదయంలో దైవరాజ్యం వేరుపాతుకొన్నట్లు. తోడివారిని పట్టించుకోకపోతే, వారికి అన్యాయం చేస్తే నా యెదలో దైవరాజ్యం ఇంకా వేరూననట్లే. సోదర ప్రేమ లేనిచోట దైవరాజ్యం వుండదు.

## 3. నీ చిత్తం పరలోకంలోలాగే భూలోకంలో కూడ

దేవుని చిత్తం ఏమిటి? మనం క్రీస్తు ద్వారా రక్షణం పొందాలనే. మానవులందరూ రక్షణాన్ని పొందాలనీ సత్యాన్ని తెలిసికోవాలనీ దేవుని కోరిక - 1 తిమో 2,4. ఈ కోరిక నెరవేరాలనే మనం ఇక్కడ ప్రార్థించేది.

క్రీస్తు దేవుని చిత్తాన్ని పరిపూర్ణంగా నెరవేర్చాడు. అతడు ఈ లోకంలోకి వచ్చినపుడు దేవా! నేను నీ చిత్తాన్ని నెరవేర్చడానికే వచ్చాను అన్నాడు - హెబ్రే 10,7. గెత్సెమని తోపులో నా చిత్తంగాదు నీ చిత్తమే నెరవేరనీయి అని ప్రార్థించాడు - లూకా 22,42. కడన అతడు తండ్రి చిత్తప్రకారమే చనిపోయాడు. ఆమరణం వల్లనే మనకు రక్షణ కలిగింది - హెబ్రే 10,10.

క్రీస్తు తన శ్రమల ద్వారా విధేయత నేర్చుకొన్నాడు. అతనిలాగే మనం కూడ విధేయులం కావాలి. మనం క్రీస్తుకి విధేయులమైతే దేవునికి విధేయులమైనట్లే. మన

చిత్తం తన కుమారుని చిత్తంతో ఏకీభవించాలనే దేవుని కోరిక. అలా ఏకీభవించడం ద్వారా నేడు లోకంలో దేవుని రక్షణ ప్రణాళిక నెరవేరుతుంది. కాని మన చిత్తం క్రీస్తు చిత్తానికి లొంగేలా చేయడం ఎంతమాత్రం సులభంకాదు. దీనికి ఆత్మవరప్రసాదం అవసరం. వరప్రసాదబలం వలనకాని మనం తండ్రి చిత్తంతో ఏకీభవించిన క్రీస్తు చిత్తంతో ఏకీభవించలేం. మనం క్రీస్తు చిత్తంతో ఏకీభవించినపుడు ఆ చిత్తం పరలోకంలోలాగే భూలోకంలో గూడ నెరవేరుతుంది.

పరలోకంలోని నా తండ్రి చిత్తాన్ని నెరవేర్చినవాడే గాని దైవరాజ్యాన్ని పొందండని క్రీస్తు వాకొన్నాడు - మత్త 7,21. కాని ఆయా సందర్భాల్లో దేవుని చిత్తాన్ని తెలిసికోవడం ఏలా? ప్రార్థన ద్వారానే.

దేవుణ్ణి ఆరాధించి అతని చిత్తాన్ని నెరవేర్చేవాడి మనవిని దేవుడు వింటాడు - యోహా 9,31. ఈ పద్ధతిలోనే తిరుసభ క్రీస్తు పేరుమీదిగా దేవునికి ప్రార్థన చేస్తుంది. పరమ పవిత్రురాలైన దేవమాత పునీతులు మొదలైన వారితో ఐక్యమయ్యే తిరుసభ ప్రార్థన చేస్తుంది. "నీ చిత్తం భూలోకంలో నెరవేరునుగాక" అంటే తిరుసభలో నెరవేరాలనే భావం. క్రీస్తులోలాగే అతని వధువులో గూడ దేవుని చిత్తం నెరవేరాలి. మనం క్రీస్తు చిత్తానికీ, దేవుని చిత్తానికి అంటిపెట్టుకొని వున్నపుడే మన జీవితం పవిత్రమయ్యేది.

## 4. నేటికి కావలసిన మా అనుదిన భోజనం

ఈ విన్నపంలో చాల భావాలున్నాయి. వాటిని క్రమంగా పరిశీలిద్దాం. మొదట "భోజనం" అంటున్నాం. మనకు ప్రాణాన్నిచ్చిన దేవుడు దాన్ని సంరక్షించే భోజనాన్ని కూడ దయచేస్తాడు. ఈ భోజనం భౌతికమైందీ ఆధ్యాత్మికమైందీ కూడ. మనం దేవుని ప్రాణిపోషణా చాతుర్యాన్ని నమ్మాలి. కనుక మన తరపున మనం ఏమితిందామా ఏమి కట్టుకొందామా అని ఆందోళనం చెందకూడదు - మత్త 6,25. అన్ని వస్తువులూ దేవునివే కనుక భగవంతుణ్ణి పొందినవాళ్ళకు అన్ని వస్తువులూ లభిస్తాయి.

నేడు లోకంలో చాలమంది పేదలు భోజనంలేక అల్లాడుతున్నారు. పేద లాజరును పట్టించుకోని ధనవంతులున్నారు. నా సోదరులకు చేసిన కరుణ కార్యం నాకు చేసినట్లే భావిస్తాను అనే ప్రభువు వాక్యం గూడ వుంది. ఈ భావాల ప్రకారం, ఉన్నవాళ్ళు లేనివాళ్ళతో తమ భోజనాన్ని పంచుకోవాలి. ఆర్థిక సాంఘిక రంగాల్లో న్యాయాన్ని పాటించాలి. అనేకులమైన మనమందరం ఒకే రొట్టెలో పాలు పొందాలి. కనుక నిరంతరం మనకున్న వాటిని లేనివాళ్ళతో పంచుకోవాలి. నిర్బంధానికి గురై కాక ప్రేమతోను ఈ పంపిణీ జరగాలి.

దేవుడు మన ఆహారాన్ని మనకు దయచేస్తాడు. ఇట్లంటే మనం సోమరులంగా వుండిపోవచ్చునని భావం కాదు. పునీత ఇగ్నేష్యసుగారు చెప్పినట్లు, మనం అంతా మనమీదనే ఆధారపడి వుందో అన్నట్లు పనిచేయాలి. కాని అంతా దేవునిమీదనే ఆధారపడి వుందో అన్నట్లు అతన్ని నమ్మాలి. మనం చేసిన పనివల్లనే భోజనాన్ని పొందడానికి అర్హులం కాము. దేవుడు మనకు దాన్ని ఉచితంగానే దయచేస్తాడు. కనుక ఆహారాన్ని ఎప్పుడూ కృతజ్ఞతా భావంతో స్వీకరించాలి. అందుకే భోజనానికి ముందూ వెనుక జపం చెప్తాం.

ఈ విన్నపంలో పేర్కొనే "భోజనం" మామూలు అన్నాన్నేగాక దివ్యసత్ప్రసాద భోజనాన్నీ వాక్యభోజనాన్నీ గూడ సూచిస్తుంది. నరుడు వట్టి ఆహారం చేతనే జీవించడు. దేవుడు పలికే ప్రతి వాక్కువలనా జీవిస్తాడు - మత్త 4,4. కనుక క్రైస్తవులు ఎప్పుడూ పేదలకు సువార్తను బోధించాలి. దేశంలో ఎప్పుడూ కరువు వుంటుంది. ఆ కరువు కూటికీ నీటికీ కాదు. ప్రభువు వాక్కుకే - ఆమోసు 8,11. కనుక దైవవాక్కును ఎప్పుడూ ప్రకటిస్తూనే వుండాలి. వాక్కు దివ్యసత్ప్రసాదమూ కూడ మన భోజనాలు. ప్రస్తుత విన్నపం ఈ రెండు భోజనాలను గూడ పేర్కొంటుంది.

"నేటికి" కావలసిన మా అనుదిన భోజనాన్ని దయచేయమని వేడుకొంటున్నాం. ఈ "నేడు" అనే పదం దేవునిపట్ల మన కుండవలసిన నమ్మకాన్ని సూచిస్తుంది. అతడు ఏ రోజు అన్నం ఆ రోజు మనకు దయచేస్తాడు. మనం అతన్ని నమ్మవచ్చు. ఏ యాందోళనమూ అక్కర్లేదు.

"అనుదిన" భోజనం అంటున్నాం. "అనుదినం" అనే మాటకు కాలం అని ఒక అర్థం. దేవుడు ఏ రోజు భోజనం ఆ రోజు దయచేస్తాడు కనుక మనం అతన్ని నమ్మి ఆ భోజనాన్ని స్వీకరిస్తాం. ఇంకా, అనుదినం అనే మాటకు ఫలానాలాంటి భోజనం అని కూడ అర్థముంది. ఈ భావాన్ని తీసికొంటే, దేవుడు మన జీవితానికి అవసరమైన వస్తువులన్నీ దయచేయాలని భావం. ఐతే ఇక్కడ ఈ అనుదినం అనే మాట ప్రధానంగా దివ్యసత్ప్రసాదాన్ని సూచిస్తుంది. అది మనకు అమరత్వాన్ని దయచేసే మందు. అది లేందే మనకు జీవం లేదు. అసలు మన భోజనం క్రీస్తే. ఆ క్రీస్తనే దివ్యభోజనాన్ని దయచేయమని మనం తండ్రిని వేడుకోవాలి.

ఈ భోజనాన్ని మనకు "దయచేయమని" దేవుణ్ణి నమ్మకంతో అడుగుతున్నాం. ఆ తండ్రి మంచివాడు. మనకు కావలసిన వాటినన్నిటినీ అతనినుండే అడుగుకొంటాం. అతడు దుర్జనులకూ సజ్జనులకూగూడ తన సూర్యరశ్మినీ వర్షాన్నీ దయచేస్తాడు. అనగా ఎవరినీ కేటాయించడు - మత్త 5,45. ఇంకా అతడు ప్రతిప్రాణికీ సకాలంలో తిండిపెట్టేవాడు - కీర్త 104,27. దేవుడు యోగ్యుడైన తండ్రి. అతడు పూర్వమే మనతో

నిబంధనం చేసికొన్నాడు. ఆ ప్రభువు మనకూ, మనం అతనికీ చెందివుంటాం. ఈలాంటి తండ్రినుండి మనం నమ్మకంతో వినయంతో ఆహారం అడుగుకొంటున్నాం.

కడన "మాకు" అంటున్నాం. దేవుడు అందరికీ తండ్రి. అందరికీ భోజనం అవసరం. కనుక మనం అందరికొరకు విన్నపం చేస్తున్నాం. ఈలా ఈ వాక్యంలో ప్రతి పదానికీ అర్థముంది.

## 5. మాయొద్ద అప్పుబడినవారిని మేము క్షమించినట్లే

ఈ విన్నపంలో ఓ షరతు వుంది. మనం ఇతరులను క్షమిస్తేనే దేవుడు మనలను క్షమించేది. ఈ షరతు ముఖ్యమైంది. ఈ విన్నపంలో "అప్పులు" అంటే తప్పిదాలనే భావం.

పూర్వ విన్నపంలో నీ నామం పవిత్రపరచబడును గాక అని దేవునితో చెప్పాం. మనం పవిత్రులం కావడం ద్వారానే దేవుని నామాన్ని పవిత్రపరుస్తాం. ఐనా మనం జ్ఞానస్నానం పొందాక కూడ పాపంజేసి దేవునికి దూరమౌతాం. కనుక ఈ విన్నపంలో దేవుణ్ణి మన తప్పిదాలను మన్నించమని అడుగుకొంటున్నాం. ఈ వేడుదల ద్వారా ఓ సుంకరిలాగ, ఓ తప్పిపోయిన కుమారునిలాగ దేవుని దగ్గరికి మళ్ళా తిరిగివస్తాం. ఈ వాక్యం ద్వారా మన తప్పుని ఒప్పుకొంటున్నాం. దేవుని కరుణను విశ్వసిస్తున్నాం. దేవుని కుమారుని ద్వారా మనకు రక్షణమూ పాపపరిహారమూ లభించాయని నమ్ముతున్నాము. కొలో 1,14. దేవుని తిరుసభలో దేవద్రవ్యానుమానాల ద్వారా మనకు మన్నింపు లభిస్తుంది.

కాని మనం ఇతరులను మన్నించకపోతే దేవుని కరుణ మన్నింపు మనకు లభించవు. కంటితో జూచిన నరుణ్ణి ప్రేమించకపోతే కంటితో చూడని దేవుణ్ణి ప్రేమించలేం గదా! - 1 యోహా 4,30. తోడి నరుని క్షమించనపుడు మన గుండెలు బండలా కఠినమౌతాయి. దేవుని కరుణ ఈ బండవారిన గుండెల్లోకి ప్రవేశింపలేదు. కాని మనం పశ్చాత్తాపపడినపుడు దేవుని వరప్రసాదం ఈ గుండెలు మెత్తబడేలా చేస్తుంది.

తోడివారిని క్షమించాలనేది ప్రభువు బోధల్లో అతి ముఖ్యమైంది. ఈ బోధ పర్వత ప్రసంగంలోకి గూడ ప్రవేశించింది - మత్త 6, 14-15. ఇతరులను క్షమించే గుణం మనంతట మనకు సులువుగా అలవడదు. దేవుని వరప్రసాదం వలనా, అతని ఆత్మవలనా ఈ భాగ్యం లభిస్తుంది.

ఈ క్షమాపణం మన హృదయంలోనుండి రావాలి. ఈలా రావాలంటే దేవుని పవిత్రతా, కరుణా, ప్రేమా మన హృదయాన్ని సోకి దాన్ని పునీతం చేసివుండాలి. ఆత్మ అనుగ్రహంవల్ల క్రీస్తు మనస్తత్వం మనకు కూడ అలవడివుండాలి - ఫిలి 2,5. అప్పుడుగాని దేవుడు మనలను క్షమించినట్లే మనమూ ఒకరినొకరం క్షమించం - ఎఫే 4,32.

క్షమాగుణం మన జీవితంలో నిత్యసత్యం కావాలి. క్షమించనొల్లని సేవకుని కథ మనకు తెలుసు. అక్కడ ప్రభువు "మీరు మీ తోడివారిని హృదయ పూర్వకంగా క్షమించకపోతే పరలోకంలోని నా తండ్రి కూడ మీ పట్ల ఆలాగే ప్రవర్తిస్తాడు" అన్నాడు - మత్త 18,35. మన్నింపు హృదయంలోనుండి రావాలని చెప్పాం. మనకు అపకారం చేసిన వాళ్ళమీద మనకు కోపం పుడుతుంది. వారిమీద పగతీర్చుకోగోరుతాం. కాని పవిత్రాత్మ మనహృదయాన్ని సోకినపుడు మనం అపకారిమీద జాలిజూపుతాం. అతనిమీద కోపాన్ని వదలుకొని అతని కొరకు దేవునికి విన్నపం చేస్తాం. ఈలా దేవుని ఆత్మ మన హృదయాన్ని తాకి అది శత్రువుని మన్నించేలా చేస్తుంది.

మనం శత్రువు కొరకు గూడ ప్రార్థించాలి. దేవుని జాలిని అర్థంజేసికొని విరోధి కొరకు జపించాలి. ప్రేమ పాపంకంటె గూడ బలమైంది. తోడినరులను ప్రేమించేవాడు వారి తప్పిదాలను క్షమిస్తాడు. వేదసాక్షులు, పునీతులు ఈలా చేసారు. ఒకరినొకరం క్షమిస్తేనేగాని తండ్రియైన దేవునితోను, ఇరుగు పొరుగువారితోను రాజీపడలేం.

క్షమాపణం ద్వారా తోడివారితో రాజీపడతాం. వారిపట్ల సమాధానాన్ని పెంపొందించుకొంటాం. సిప్రియను భక్తుడు వాకొన్నట్లుగా, విభజనలను తెచ్చిపెట్టేవాడి బలిని దేవుడు అంగీకరించడు. అతన్ని తన బలిపీఠం చెంతనుండి వెళ్ళిపొమ్మని ఆజ్ఞాపిస్తాడు. దేవుణ్ణి శాంతింపజేసేది సమాధాన క్రియ. శాంతి, ఐక్యత, ప్రేమ దేవునికి ప్రీతి కలిగించే బలులు.

## 6. మమ్ము శోధనలో చిక్కుకోనీయకు

ముందటి విన్నపంలో దేవుణ్ణి మన తప్పిదాలను మన్నించమని అడుగుకొన్నాం. కాని మన తప్పిదాలు మన శోధనలనుండే వస్తాయి. కనుక ఇక్కడ మమ్ము శోధనలో చిక్కుకోనీయకు అని అడుగుకొంటున్నాం. ఈ సందర్భంలో "మమ్ము శోధనలో చిక్కుకోనీయకు" అంటే మమ్ము శోధనలకు లొంగనీయకు అని భావం. అనగా మమ్ము పాపంలో పడనీయకు అని అర్థం. ఏ దుష్టశక్తీ దేవుణ్ణి శోధించలేదు. అతడు ఎవరినీ శోధించడు - యాకో 1,13. కనుక దేవుడు మనం పాపంలో పడాలని కోరడు. పాపంనుండి బయటపడాలని కోరుతాడు. కావున ఇక్కడ మనం అతన్ని మమ్ములను పాపపు త్రోవలోపోనీయవద్దని వేడుకొంటున్నాం. ఈ లోకంలో మనం శరీరానికి ఆత్మకు జరిగే యుద్ధంలో పాల్గొంటున్నాం. ఈ యుద్ధంలో దేవుని ఆత్మ మనకు వివేకాన్ని దయచేయాలని ఈ విన్నపంలో వేడుకొంటున్నాం.

మన ఆధ్యాత్మిక జీవితం బలపడ్డానికి కొన్ని పరీక్షలు అవసరమే. కాని చాల పరీక్షలు మనలను పాపంలోకి లాగుతాయి. ఈ రెండు రకాల పరీక్షలకు మధ్య వుండే తేడాను తెలిసికొనే వివేకాన్ని ఆత్మే మనకు దయచేస్తుంది. పైగా శోధనలకు గురికావడం వేరు, వాటికి లొంగడం వేరు. ఈ రెండింటికీ గల తేడాను గూడ ఆత్మే మనకు తెలుపుతుంది. ఎప్పుడూ గూడ పాపవస్తువు కంటికి ఇంపుగాను ఆకర్షణీయంగాను కన్పిస్తుంది. కాని అది కడన మృత్యువుని తెచ్చిపెట్టే విషఫలం ఔతుంది. ఈ సంగతి గూడ ఆత్మ మనకు తెలియజేస్తుంది - ఆది 3,6 శోధనను తప్పించుకోవాలంటే మాత్రం ఆత్మ ప్రసాదించే వివేకం అత్యవసరం.

పరీక్షవల్ల కొన్ని ప్రయోజనాలున్నాయి. మన ఆత్మ ఏ స్థితిలో వుందో, ఎంతవరకు ఎదిగిందో మనకే తెలియదు. పరీక్ష వచ్చినపుడు మనకున్న పుణ్యమెంతో పాపమెంతో తెలిసిపోతుంది. ఈ విధంగా అది మనకు ఆత్మజ్ఞానం కలిగిస్తుంది.

మమ్ము శోధనలో చిక్కుకోనీయకు అనే విన్నపం మన హృదయశుద్ధిని తెలియజేస్తుంది. మన సంపద ఎక్కడుందో అక్కడే మన హృదయం కూడ వుంటుంది - మత్త 6,21. ఎవడూ ఇద్దరు యజమానులను సేవింపలేడు - 6,24. మనం ఆత్మను అనుసరించి జీవించే వాళ్ళమైతే ఆ యాత్మ నడిపించినట్లుగా నడచుకోవాలి - గల 5,25. కనుక మనం నిజాయితీతో, పాపానికి దూరంగా వుండాలన్న భావంతో ఈ విన్నపాన్ని జపించాలి. శోధనలో దేవుడే మనకు కావలసిన బలాన్ని దయచేస్తాడు. అతడు మన శక్తికి మించిన శోధనలు రానీయడు. పరీక్షను భరించే శక్తి, దానినుండి బయటపడే బలమూ అతడే దయచేస్తాడు - 1 కొరి 10,13.

కాని మనం శోధనను జయించాలంటే ప్రార్థన చేయాలి. క్రీస్తు ఎడారి తపస్సులోను, ఒలీవ కొండపై అనుభవించిన ఆవేదనలోను ప్రార్థన ద్వారానే పిశాచశోధనను జయించాడు. మన శోధనల్లో ప్రార్థనం చేసికొన్నపుడు క్రీస్తు విజయం మనమీద సోకుతుంది. ఐతే ప్రభువు మనం ఎల్లపుడు మన హృదయాన్ని అదుపులో వుంచుకోవాలని కోరుకొంటాడు. కనుక పిచ్చి కోరికలను మన యెదలోనికి రానీయకూడదు. దాన్ని ఎప్పుడూ దేవునివైపు త్రిప్పుకొంటుండాలి. ఇంకా అతడు శిష్యుల నుద్దేశించి తండ్రీ! నీ శక్తితో వీరిని సురక్షితంగా వుంచు అని ప్రార్థించాడు - యోహా 17,11. ఈ ప్రార్థన నేడు మనమీద సోకితీరుతుంది. పవిత్రాత్మ కూడ మనలను నిరంతరం జాగరూకులనుగా వుంచుతుంది. ఇదంతా మన మేలుకొరకే.

మన ప్రధాన శోధన మన చివరి గడియల్లో వస్తుంది. అప్పుడు కొందరు ప్రభువుని నిరాకరిస్తారు, కొందరు అంగీకరిస్తారు. ఆ చివరి గడియల్లో మనలను అదుకొమ్మని గూడ ఈ విన్నపంలో దేవుణ్ణి అడుగుకొంటున్నాం.

## 7. దుష్టునినుండి మమ్ము రక్షించు

ఈ విన్నపం గూడ క్రీస్తు యాజక ప్రార్థనలో వుంది. అతడు తండ్రి నుద్దేశించి "వారిని లోకంనుండి తీసికొని పొమ్మని కాదు, దుష్టునినుండి కాపాడమని నిన్ను ప్రార్థిస్తున్నాను" అన్నాడు - యోహా 17,15. కనుక ఈ విన్నపంలో పిశాచ ప్రభావం నుండి మనలను కాపాడమని తండ్రిని వేడుకొంటున్నాం. ఈ ప్రార్థనం కూడ వ్యక్తిగతమైంది కాదు, సాముదాయికమైంది. తిరుసభ అంతా కలసి ఈ జపం చేస్తుంది.

ఈ వాక్యంలో మనం సూచించే వ్యక్తి పిశాచం. అతడు దేవుని రక్షణప్రణాళికకు అడ్డు తగిలేవాడు. ప్రపంచాన్నంతటినీ మోసగించేవాడు. మొదటినుండి నరహంత, అబద్ధాలకోరు - యోహా 8,44. అతని ద్వారానే పాపం లోకంలోనికి ప్రవేశించింది. ఇప్పుడు లోకమంతా అతని ప్రభావానికి లొంగి వుంది - 1 యోహా 5,19. అతని వోటమి ద్వారా నరజాతికి పాపంనుండీ మృత్యువు నుండీ విముక్తి కలుగుతుంది.

మన పాపాలను పరిహరించిన ప్రభువు మనలను పిశాచ తంత్రాలనుండి గూడ కాపాడతాడు. తన్నుతాను దేవుని కాపుదలకు అర్పించుకొనేవాడు పిశాచానికి భయపడనక్కరలేదు. దేవుడు మన పక్షాన వుంటే ఎవడైన మనకు హాని చేయగలడా?

ప్రభువు తన సిలువమరణం ద్వారానే ఈ లోకనాయకుణ్ణి జయించాడు. ఈ లోకాధికారిని వెలుపలకు త్రోసివేసాడు - యోహా 12,31. మరియమాత పిశాచ శక్తికి లొంగలేదు. మనకు కూడ ఆ దుష్టశక్తి నుండి విమోచనం కలుగుతుంది.

భూతభవిష్యద్వర్తమాన కాలాల్లో పిశాచం తెచ్చిపెట్టే అనర్థాలన్నిటినుండి కాపాడమని కూడ ఈ విన్నపంలో దేవుణ్ణి అడుగుతున్నాం. లోకంలోని బాధలన్నీ తొలగించమని కూడ ఈ చివరి విన్నపంలో తిరుసభ దేవుణ్ణి మనవి చేస్తుంది.

ఇంకా తనకు శాంతినీ, విశ్వాసమందు నిలకడగా వుండే భాగ్యాన్ని దయచేయమని దేవుణ్ణి అడుగుతూంది. క్రీస్తు రెండవ రాకడ ద్వారా ఈ వరాలు మనకు లభిస్తాయి. మృత్యువుకీ నరకానికీ అధికారి అతడే - దర్శ 1,18. పూజలో పరలోకజపం తర్వాత వచ్చే ఈ క్రింది ప్రార్థన ఈ సందర్భానికి బాగా తగుతుంది. "ఏలినవారా! అన్ని కీడులనుండి మమ్ము రక్షించండి. మా యీ రోజులతో మాకు శాంతిని ప్రసాదించండి. మీ దయానుగ్రహము వలన మేము పాపంనుండి విముక్తులమై ఎట్టి కలతలకు గురికాకుండునట్లు చేయండి. మేము మోక్షానందమును మా రక్షకుడైన యేసు క్రీస్తు ఆగమమును నిరీక్షిస్తున్నాం."

పరలోకజపం చివరలో "మీదే రాజ్యం, అధికారం, మహిమ" అనే మాటలు వస్తాయి. పిశాచం గర్వంతో ఈ మూడు లక్షణాలను తనకు ఆరోపించుకొంది. అందుకే క్రీస్తు ఇక్కడ ఈ మూడు లక్షణాలను తిరిగి దేవునికే ఆరోపించాడు.

# 6. బాధాతత్వం

## మున్నుడి

ఈ పొత్తంలో రెండు బైబులు భాష్యం సంచికలను కలిపి ప్రచురించాం. మొదటిది, బాధాతత్వం. దీనిలో సిలువ మార్గంమీద ధ్యానాలు వస్తాయి. దీన్ని పూర్వమే బైబులు భాష్యం 90వ సంచికగా ప్రచురించాం. రెండవది, సప్తవాక్యాలు. ఇవి క్రీస్తు సిలువమీదనుండి పలికిన వాక్యాలు. దీన్ని పూర్వమే బైబులు భాష్యం 50వ సంచికగా అచ్చువేసాం. ఈ రెండు పొత్తాలు క్రీస్తు శ్రమలను వర్ణించేవే. ఈ గ్రంథం విశేషంగా తపస్సుకాలంలో వాడుకోదగ్గది. సంవత్సరం పొడుగునాకూడ ప్రార్థనకు వినియోగించు కోవచ్చు. ఇది నాల్గవ ముద్రణం.

### విషయ సూచిక



# 1. బాధాతత్వం

## ఉపోద్ఘాతం

బాధాతత్వం అనే యీ చిన్ని పుస్తకంలో సిలువ మార్గాన్ని గూర్చిన ధ్యానాలు 14 పొందుపరచాం. ఇందలి భావాలను రొమానో గ్వార్దీనిగారు రచించిన The Way of the Cross అనే పుస్తకంనుండి గ్రహించాం.

యెరూషలేములోని తొలి క్రైస్తవులు క్రీస్తు చనిపోయిన కొలది నాళ్ళనుండే, అతడు సిలువను మోసికొని పోయిన త్రోవవెంట భక్తితో నడుస్తూ ఆ ప్రభువు అనుభవించిన ఆయా శ్రమలను మననం చేసికొనేవారు. రానురాను ఇతర ప్రాంతాలనుండి యెరూషలేమునకు యాత్ర వచ్చిన భక్తులకుకూడ ఈ యాచారం అలవాటైపోయింది. క్రైస్తవ భక్తులు క్రీస్తు సిలువమార్గం వెంట బోతూ యేసు ఆయాఘోరబాధలు అనుభవించిన ఆయా స్థలాల్లో కొంతకాలం ఆగి భక్తి ప్రేమ కృతజ్ఞతలతో ఆ ప్రభువు అనుభవించిన

బాధాకర సంఘటనలనుగూర్చి కొలదికాలం మననం చేసికొంటూండేవాళ్ళు. ఈలాంటి "స్థలాలు" పూర్వకాలంలో ఎన్ని వుండేవో ఇప్పుడు మనకు రూఢిగా తెలియదు.

మరి కొన్నాళ్ళయిన పిదప యెరూషలేమునకు యాత్ర చేయలేని క్రైస్తవులకోసం తిరుసభ, నాడు సిలువ మార్గంలో యథార్థంగా సంభవించిన ఘట్టాలను పదునాల్గింటిని చిత్రాల రూపాన ఆయా దేవాలయాల్లో నెలకొల్పింది. నేడు మనం ఆచరించే సిలువ మార్గానికి ఇదే ప్రారంభం.

ఈ స్లీవమార్గంద్వారా మనకు సిద్ధించే ప్రయోజనాలు ముఖ్యంగా రెండు. మొదటిది, క్రీస్తు బాధలను జ్ఞప్తికి తెచ్చుకొని, అతనితో ఐక్యమై, అతనికి సానుభూతిని దెల్పుతూ మన పాపాల కొరకు పశ్చాత్తాపపడతాం. ఈ భక్తికార్యంద్వారా మన హృదయం శుద్ధినీ పావిత్ర్యాన్నీ పొందుతుంది.

రెండవది, బాధాతత్వంయొక్క రహస్యాన్ని తెలిసికొంటాం. ఇష్టంతోగాని కష్టంతోగాని మనమందరమూ ఈ జీవితంలో ఎన్నో బాధలు అనుభవించవలసిందే. క్రైస్తవ దృష్టి లేనివాళ్ళకు ఈ బాధలు వ్యర్థమనిపిస్తాయి. దాని వలన ఈ శ్రమలు మరింత బాధాకరమౌతాయి. కాని క్రైస్తవదృష్టిగల మన విషయం వేరు. బాధల ఆవశ్యకాన్నీ ప్రయోజనాన్నీ, వాటిని అనుభవించవలసిన తీరునీ క్రీస్తే మనకు నేర్పించిపోయాడు. శ్రమలను గూర్చి క్రీస్తు నాడు నేర్పిపోయిన ఆ సత్యాలనే ఈ పుస్తకంలో ధ్యానాల రూపాన వివరించాం. కావుననే దీనికి "బాధాతత్వం" అని పేరు పెట్టాం.

విశ్వాసులు ఈ పుస్తకంలోని అంశాలను చదువుకోవడంతో మాత్రమే తృప్తి చెందగూడదు. వాటిని ధ్యానించుకొని జీర్ణంజేసికోవాలి. జీవితంలో మనకుపయోగపడేది మనం తిన్న అన్నంగాదు, జీర్ణంచేసికొన్న అన్నం మాత్రమే. ఇంకా ఈ ధ్యానాలను సిలువమార్గాన్ని ఆచరిస్తూ మననం చేసికొంటే ఎక్కువ ఫలితం కలుగుతుంది. వీటిని వ్యక్తిగత ప్రార్థనకుగాని, సిలువమార్గాన్ని చేయడానికిగాని వాడుకోవచ్చు.

ఇక, ఈ బాధాతత్వాలను జీర్ణంచేసికొన్న పిదప వీటిని మన జీవితంలోని ఆయా విషమఘట్టాలకు అన్వయించుకోవాలి. ఆలా అన్వయించుకొని మన బాధలను ఓర్పుతోను అర్థవంతంగాను సహించుకోగల్గిననాడే గాని క్రీస్తు శ్రమలు మనపట్ల సత్ఫలితాన్ని ఈయవు.

## ప్రారంభ ప్రార్థనం

నా రక్షకుడవైన ప్రభూ! నా శిష్యుడు కాగోరేవాడు తన స్లీవను తాను మోసికొంటూ ప్రతిదినం నన్ననుసరించాలని నీవే సెలవిచ్చావు. కావున నేనుకూడ నీవు త్రొక్కిన

త్రోవవెంటనే నడుస్తూ జీవితాంతం నీ దుఃఖపథాన్ని అనుసరింపగోరుతున్నాను. ఆనాడు నా కొరకై నీవనుభవించిన బాధలను జ్ఞప్తికి తెచ్చుకొని ధ్యానంచేసికొనే భాగ్యాన్ని నా కనుగ్రహించు. నా కొరకై నీవు చూపిన మహత్తర ప్రేమను కొద్దిగానైనా అర్థంజేసికోవడానికి నా నేత్రాలను విప్పు. నా హృదయాన్ని స్పందింపజేయి. నా ఆత్మను ప్రబోధించు. నీ బాధలకు కారణమైన నా పాపాలను పరిత్యజించి, నీ కృపవలన ఇకమీదట నైనా సన్మార్గంలో నడిచే భాగ్యాన్ని దయచేయి.

నేను గతాన్ని వదలి నూత్న జీవితాన్ని ఆరింభింపగోరుతున్నాను. నీవు నడచిన త్రోవవెంటనే నడువగోరుతున్నాను. తండ్రీ! నా యీ ప్రయత్నాన్ని దీవించి, నీ చేయిచ్చి నన్ను ముందుకు నడిపించు.

బాధామయుడవైన ప్రభూ! నీవలెనే నేనుగూడ నా సిలువను మోసికొని రాగల శక్తిని దయచేయి. ఉపదేశపూర్వకంగాను, ఆచరణ పూర్వకంగాను ఆనాడు నీవు వివరించిన బాధాతత్వాన్ని నేడు నేను అర్థంచేసికొనేలా చేయి. నీ బాధల ఫలితంగా, నేడు నా పాలబడే శ్రమలన్నిటినీ మంచి మనస్సుతో స్వీకరింతునుగాక. నీ శ్రమల వరప్రసాదం నా శ్రమలమీద సోకి వాటిని ఫలప్రదం చేయునుగాక. ఆమెన్

# మొదటి స్థలం

## పిలాతు యేసునకు మరణపు తీర్పు విధించడం

యేసుక్రీస్తువా! మిమ్ము ఆరాధించి మీకు స్తోత్రము చేయుచున్నాము.

ఏలయనగా మీ తిరుస్లీవచేత లోకమును రక్షించితిరి.

క్రీస్తు న్యాయస్థానంలో నిల్చుండి వున్నాడు. కూటసాక్షులు అతనిపై నేరం మోపుతూన్నారు. న్యాయమూర్తియైన పిలాతు శీలసంపత్తిలేని స్వార్థపరుడు. అసలు క్రీస్తుని అచటికి తీర్పుకి కొనివచ్చిందే న్యాయవిరుద్ధమైన పద్ధతిలో. అట్టి అన్యాయపు పరిస్థితిలో క్రీస్తుని ద్రోహియని నిర్ణయించారు. ఆ తీర్పు ఫలితంగా క్రీస్తు అనుభవింపబోయే శిక్ష చాల అవమానకరమైంది, ఘోరమైంది, భయంకరమైంది.

తాను నిర్దోషినని, నిష్కల్మషచిత్తుడనని, క్రీస్తుకి బాగా తెలుసు. అతడు ప్రజలను గాఢంగా ప్రేమించి వారి మేలుకొరకు, రక్షణం కొరకు అహోరాత్రులు క్షీణించిపోయినవాడు. ఐనా పరులమేలుగోరే తన్ను ఆ ప్రజలూ, ఆ న్యాయమూర్తీ విడ్డూరంగా ద్రోహియని నిర్ణయించినపుడు అతని హృదయం తీరని బాధతో కుమిలిపోయింది. ఆరని వ్యథతో కృంగిపోయింది.

ఈ లోకంలో ఎవరైనా మన అక్రమాలకు తగినట్లుగా మనలను దండింపబూనితే, మన హృదయం ఎంతో బాధపడుతుంది గదా! మనకు అంతటి దండనం విధించడం సబబుకాదని పదేపదే వాపోతాంగదా? శిక్షార్హులమైగూడ శిక్షను పొందడానికి ఇష్టపడంగదా? కాని క్రీస్తో అంటే ఏ నేరమూ చేయకుండానే, ఏ పాపమూ కట్టుకోకుండానే, అధర్మంగా శిక్షార్హుడని నిర్ణయింపబడ్డాడు. ఆ సమయంలో అతని సుకుమార హృదయం ఎంతగా బాధపడిందో ఎవరు ఊహింపగలరు?

ప్రభువు కాదనలేదు. పల్లెత్తి మాటాడలేదు. నిండు మనస్సుతో ఆ దండనాన్ని అంగీకరించాడు. ఎందుకంటే అది పిత చిత్తం, మన రక్షణానికి అవసరం.

## ప్రార్థనం

పురోగామివైన ప్రభూ! నీవు ముందు సాగిపోతూ నాకు మార్గాన్ని ఏర్పరచావు. నా గడియ వచ్చినపుడు నేను కూడ నీవు నడచిపోయిన కష్టపుత్రోవ వెంటనే, నీ వెనువెంటనే, నడచివచ్చే భాగ్యం దయచేయి. తోడి ప్రజలు నిన్ను వలె నన్నును నిందించినపుడు, నాకు అన్యాయపు తీర్పు విధించినపుడు, నీ కొరకు ఆ నిందనూ అన్యాయాన్నీ ఓర్పుతో భరించే వరప్రసాదాన్ని నాకు అనుగ్రహించు. ఇతరులు అసంమంజసబుద్ధితో నన్ను వేధించేపుడు నీవలె నేనుగూడ మౌనం వహించి నిజనిజాలు ఎరిగిన ఆ పరలోకపిత చేతుల్లోనికే నా తీర్పును సమర్పించుకొందునుగాక. నా బాధ్యతలు నిర్వహించడం కష్టమని తోచినపుడు, అది పిత చిత్తమని గ్రహించి ఆ భారాన్ని ఓర్పుతో మోయుదును గాక. వ్యాధిబాధలవలనా కష్టనష్టాలవలనా క్రుంగిపోయినపుడు నీవలె నేనుకూడ పిత చిత్తానికి లొంగివుండే విధేయ గుణాన్ని మాత్రం నాకు ప్రసాదించు.

# రెండవ స్థలం

## క్రీస్తు సిలువను భుజాలమీదికి ఎత్తుకొనడం

పిలాతు తీర్పు విధించాడు. క్రీస్తు మౌనంగా శిక్షను అంగీకరించాడు. సిలువగూడ సిద్ధంగానే వుంది. దోషిగా నిర్ణయింపబడిన క్రీస్తే దాన్ని వధ్యస్థానానికి మోసికొని పోవాలి.

క్రీస్తు సిలువను చేకొంటున్నాడు. బంట్రౌతులు సిలువనెత్తి తన భుజాలమీద పెడుతుంటే క్రీస్తు చేసేదేమీ లేక వెర్రిగాజూస్తూ వట్టినే నిలబడిపోలేదు. అతడు స్వయంగా చేతులుచాచి సిలువను పైకెత్తి భుజాలమీద నిల్పుకొన్నాడు.

శిక్షను తప్పక అనుభవించాలా లేక తప్పించుకొనే మార్గం వుందా అనే ఆలోచనకిక తావులేదు. జరుగబోయే ఘోరవిపత్తు బొమ్మగీసినట్లుగా అతని కన్నులయెదుట కన్పిస్తూంది. ఇక తిరుగులేదు. ఐనా క్రీస్తుని ముందుకి నడిపించింది ఇక తప్పించుకొనే మార్గం లేదే అన్న నిరాశకాదు. అతని స్వేచ్ఛాప్రవృత్తే. అతడు పూర్ణస్వాతంత్ర్యంతో, పూర్ణచిత్తంతో, మన కొరకు బాధలనుభవించాలని నిర్ణయించుకొన్నాడు.

పిత చిత్తం, మానవుల రక్షణకార్యం – ఇవి రెండూ క్రీస్తుకి ఆ సిలువలో కన్నులకు కట్టినట్లుగా కన్పిస్తూనే వున్నాయి. అతడు పూర్ణహృదయంతో ఈ రెండంశాలకీ తన అంగీకారాన్ని తెల్పుతూన్నాడు. ఆ ఘోరసమయంలో గూడ అతని ఆత్మ, గాలిలేనితావులో నిశ్చలంగా వెలిగే దీపంలా, ప్రశాంతంగా వుంది. అలలులేని మడుగులోలాగే అతని హృదయంలోగూడ ఆందోళనం ఏమిలేదు. అదిగో! ప్రభువు ముందుకి అదుగిడి మెల్లగావంగి సిలువను భుజాల మీదికి ఎత్తుకొన్నాడు.

## ప్రార్థనం

శ్రమమూర్తివైన ప్రభూ! ఆపదలు రానంతవరకు దేవుడు పంపే బాధలన్నీ భరించడానికి సిద్ధంగానే వున్నాను అని చెప్పడం ఒక యెత్తు. కాని ఆ బాధలు వచ్చినపుడు వాటిని ఓర్పుతో అంగీకరించడం ఇంకో యెత్తు. కష్టాలు నిజంగా పైనబడినపుడు మానవ హృదయం భయపడి, బెండువోయి, మొదటి మంచి మాటపట్టులన్నిటినీ మెల్లమెల్లగా జారవిడుస్తుంది.

కావున ప్రభూ! పరీక్షా సమయం వచ్చినపుడు నీవు నా దాపులోనే వుండి నాకు అండాదండా ఐయుండు. నా హృదయాన్ని హెచ్చరించు. బహుశః నీవు పంపే సిలువలు నా దాపులోకే వచ్చివుండవచ్చు. వాటి చీకటి నీడలు నాపై యిపుడే వాలుతూండవచ్చు. ఐనా నీ కృపా సహాయాలతో వాటిని భరించడానికి సిద్ధంగానే వున్నాను. నీ చిత్తపద్ధతినీ, నీ పిత కోరికనూ మీరకూడదనే ఔదార్యభావాన్ని మాత్రం నాకు అనుగ్రహించు. నీవు దయచేసే దార్ఢ్యం వలన నా హృదయం చేవదేలునుగాక. నేను మంచి మనస్సుతో నీవు పంపే బాధలను స్వీకరిస్తే, అవి యెంత ఘోరమైనవైనా సరే అంతగా బాధ అనిపింపవు.

## మూడవ స్థలం

### యేసు మొదటిసారి స్లీవక్రింద కూలబడ్డం

రాత్రంత క్రీస్తుకి నిద్రలేదు. ముందటిదినపు సాయంత్రంనుండి అతడేమి భుజించలేదుకూడ. గంటల కొలది యూదులు అతన్ని ఒక న్యాయస్థానంనుండి ఇంకో

న్యాయస్థానానికి లాక్కొనిపోతూ వచ్చారు. శ్రమలవలనను, నెత్తురు కారిపోవడం వలనను అతనిలో బలహీనత పెచ్చుపెరిగింది. చుట్టుముట్టియున్న వారి నీచత్వం, తోడివారి క్రూరత్వం అతన్ని క్రుంగదీసాయి. కనుక అతడు అలసిసొలసి యున్నాడు.

ఆ స్లీవకూడ చాల బరువైంది. క్రీస్తుకి మించిన భారమది. కాళ్ళు తొట్రిల్లు తుండగా, హృదయం వేగంగా కంపిస్తూండగా, కొంతదూరం స్లీవను మోసికొని నడచి పోయాడు క్రీస్తు. అంతలో రాతిని తట్టుకొనో లేక ఆ వెంట వచ్చే గుంపులో ఎవరైన నెట్టినందుననో, గబాలున స్లీవ క్రింద కూలబడ్డాడు. ఆలాంటి సమయాల్లో మనుష్యులు మొరటుగా ప్రవర్తిస్తారు. నేలమీద కూలబడిన ప్రభువునిజూచి కొందరు ఎగతాళిగా నవ్వారు. కొందరు తిట్టారు. కొందరు కొట్టి గద్దించారు.

క్రీస్తు అంతలో శక్తిని దెచ్చుకొని మెల్లగా పైకి లేచాడు. బహుకష్టంతో సిలువను మళ్ళా పైకి లేపుకొని, ఇదివరకే గాయపడివున్న భుజాలమీద నిల్పుకొని ముందుకి అడుగులు వేసాడు.

# ప్రార్థనం

శోకభరితుడవైన స్వామి! నీకు మించిన బరువు ఆ సిలువ. ఐనా పితచిత్తం గావున, మా రక్షణానికి అవసరం గావున, నీవా బరువుని ఓర్పుతో భరించావు. ఇది నాకు మించిన బరువని నీవా సిలువను ఆవల పారవేయలేదు. క్రిందబడి, మరల ప్రయత్నపూర్వకంగా పైకిలేచి, ఎట్టులో ముందుకి సాగిపోయావు. నేను అనుభవించే బాధలుకూడ ఒకనాడు ఇక వీటిని నేను అనుభవింపలేను అనేంతటి విషమపరిస్థితికి రావచ్చు. మనుష్యులు కష్టంకొరకుకాక సుఖంకొరకు సృష్టింపబడ్డారు. కనుక ప్రతి స్లీవ వాళ్ళకు దుర్భరంగానే కన్పిస్తుంది. కనుక ఈ బాధలను నేనిక భరించలేను అనే పలుకులు కష్టాల్లో జిక్కిన ప్రతి మానవుని నోటినుండి వెలువడతాయి. ప్రభూ! ఈలాంటి దుఃఖకరమైన సమయాల్లో నీ ఓర్పు, నీ బలమూ నాకు శక్తినిచ్చి నన్ను ముందునకు నడిపించునుగాక. స్లీవ యెంత భారమైనదో, ఎంతగా క్రుంగదీసేదో నీ వెరుగుదువు. కావున నేను నా స్లీవను మోయలేనపుడు, నా బలం క్షీణించిపోయినపుడు నీవు నాపై కోపపడవు. కరుణతో నన్ను లేవనెత్తుతావు. తండ్రీ! నీవు చూపిన శాంతం, ఓర్పు నా హృదయమందును, నీవు ప్రదర్శించిన బలం, దార్ఢ్యం నా అవయవాల్లోను నెలకొనేలా చేయి. నీ శక్తి నా యాత్మలోనికి ప్రవేశించినపుడు నేను క్రిందబడినాగూడ పైకి లేవగలను. క్రుంగిపోయినాగూడ నా బరువుని నేను మోసికొని ముందుకి సాగిపోగలను. నీవు నాయందు ప్రవేశించిన క్షణంలో నేను నేనుగా ఉండను. నీవే నేనై యుంటాను. ఇంతకంటే దొడ్డ భాగ్యం ఏంకావాలి?

# నాల్గవ స్థలం

## క్రీస్తు తన తల్లిని కలసికొనడం

ప్రక్క త్రోవవెంటవచ్చి మరియ తన కుమారుని కలసి కొనివుండవచ్చు. వాళ్ళిద్దరూ ఒకరినొకరు చూచుకున్నారేగాని, ఒకరితో ఒకరు మాట్లాడలేదు. అట్టి పరిస్థితుల్లో ఏమి మాట్లాడగలరు? చుట్టూ ముట్టివున్న శత్రుజనంమధ్య వాళ్ళిద్దరూ ఒకరి కండ్లలోనికి ఒకరు దృష్టిని ప్రసరిస్తూ ఒకరి హృదయాన్నొకరు అర్థంజేసికొంటూ, ఒక్క క్షణకాలం అట్టే నిలుచుండిపోయారు. ఆ సమయంలో వాళ్ళ హృదయాల్లో నుండి ఎంతటి ప్రేమ భావాలు, ఎంతటి పరితాప భావాలు పెల్లుబికాయో ఎవరు చెప్పగలరు?

కాని ఒకరినొకరు చూచుకొన్నందున వాళ్ళ హృదయాలు మెత్తబడి సత్తువను గోల్పోలేదు. ఎన్ని ప్రేమభావాలు చెలరేగుతున్నా, ఏ ఉద్దేశం కొరకు దివ్యపిత క్రీస్తు పాటులను నిర్ణయించాడో ఆ వుద్దేశం, ఆ తల్లీకొడుకుల మనస్సులో నుండి మాసిపోలేదు. బిడ్డలనుగూర్చి దుర్భర వేదనలు అనుభవించే తల్లుల హృదయాలు సాధారణంగా మొద్దువారిపోతాయి. కాని స్త్రీలలో ఆశీర్వదింపబడిన ఆ ధన్యమాత హృదయం మాత్రం తన సున్నితత్వాన్ని ఏ మాత్రం కోల్పోక ఘోరవ్యధను అనుభవించింది. అప్పుడు మాటలులేని ఆ కుమారుని చూపులే "తల్లీ! పిత చిత్తం ఈలా నెరవేరాలి" అని మాట్లాడాయి. కదలికలేని ఆ పునీతమాత ముఖభంగిమలే "కుమారా! పితకూ నీకూ సమ్మతమైన రీతినే సమస్తమూ నెరవేరునుగాక" అని సూచించాయి.

## ప్రార్థనం

ప్రేమపూరితుడవైన ప్రభూ! నీకూ నీ తల్లికీ మధ్య ఎడబాటును కలిగించిందీ, మీ యిరువురి బాధను పెంచిందీ నా పాపాలే. తండ్రీ! నీ గారాబు తల్లినుండి వైదొలగడంలో నీవు చూపించిన త్యాగం నాపట్ల వ్యర్థంగాకుందు గాక. నీవేదైనా పనిని నెరవేర్చడం కొరకు నన్ను పిల్చినపుడు, నన్ను కన్నవారు ప్రేమించినవారు నాకంటిపెట్టుకొని ఉండగోరుతారు. అలాంటి సమయాల్లో, నీవు చూపించిన త్యాగం నాలో ఔదార్యగుణాన్ని పెంపొందించునుగాక. నిన్ను ప్రకటించవలసిన బాధ్యత ఒకవైపునా, నీ పట్ల సుముఖులుగాని నా బంధువుల నిర్బంధం మరొక వైపునా నన్ను చిక్కుల్లో బెట్టినపుడు మీ తల్లీ కుమారుల పుణ్యచరితం నాకు ధైర్యాన్ని దయచేయునుగాక. మనుష్యుల ప్రేమవలన – ఆ ప్రేమ యెంత బలీయమైనదైనా, ఎంత నిర్మలమైనదైనా, ఎంత పవిత్రమైనదైనా – నేను నీ ప్రేమకు దూరంగాకుందునుగాక. ఆ మానుషప్రేమకంటె నీ దివ్యప్రేమ నాయందు

ప్రబలంగా ఉండునుగాక. ఐనా ఆ మానుష ప్రేమను నేను మొరటుతనంతోను ఎడ్డెతనంతోను నిరాకరింపకుందునుగాక. నీ వలె మృదు హృదయంతోను ఉదాత్తాశయంతోను ఈ ప్రపంచంలోని ప్రేమమూర్తుల నుండి వైదొలగుదునుగాక. ఒక్క విషయం మాత్రం నాకు స్పష్టంగా తెలుసు. నావైపునకు ఏపుగా యెదిగే ప్రేమలతలను నేను నీ కోసమై ప్రక్కకు త్రోసివేసినపుడు, అవి యెండిపోవు. నీవు దయచేసే బలంతో ఇంకా యేపుగా ఎదుగుతాయి. నీ కొరకై ఏ మానుష ప్రేమను పరిత్యజిస్తామో ఆ ప్రేమ నీ దీవెన వలన నూరంతలు అధికంగా ఫలిస్తుంది.

# ఐదవ స్థలం

## కురేనియా సీమోనుని సిలువను మోయడానికి నిర్బంధించడం

క్రీస్తు ఒక్క నిమిషకాలం మాతృమూర్తి ప్రేమను అనుభవిస్తూ తన్ను తాను మరచిపోయాడు. ఆ నిమిషం ఐపోయింది. ఇక తాను ముందుకి సాగిపోవాలి. సిలువభారం అడుగడుక్కీ ముందటికంటే అధికమైనట్లుగా తోస్తూంది. మోయలేని బరువును ఒంటరిగా మోస్తూన్నాడు ప్రభువు. తన్ను ప్రేమించేవాళ్ళు అక్కడ కొందరున్నా ముందుకి వచ్చి సాయపడే ధైర్యం వారికి లేదు. ధైర్యం వున్నవాళ్ళుకూడ ఆ పరిస్థితుల్లో ముందుకు రాలేరు.

క్రీస్తు క్షణక్షణానికి క్రుంకిపోయే సూర్యుళ్ళా బలహీనుడు కావడం జూచి సైనికులు అటూఇటూ పారజూచారు. ఆ క్షణంలోనే పొలంనుండి మరలివచ్చే సీమోననే సేద్యగాడొకడు వారికంటబడ్డాడు. సైనికులు సిలువ మోయడంలో క్రీస్తుకి సాయపడమని అధికార పూర్వకంగా అతన్ని ఆజ్ఞాపించారు. సీమోనుకి మాత్రం ఈ కార్యం ఎంతమాత్రం ఇష్టంలేదు. తాను పొలం పనివలన ప్రేగులు త్రెంచుకొని ఆకలిగొని యింటికి వస్తున్నాడు. పైగా మోసగాడని పలువురు ఆడిపోసుకొనే ఈ క్రీస్తుకి తానెందుకు సాయపడాలి?

సీమోనుని అనిష్టభావంజూచి సైనికులు అతన్ని నిర్బంధించారు. తప్పించుకొనే మార్గంలేక తప్పనిసరై అతడు సిలువమీద చేతులు వేసాడు. కాని మనసు లేనపుడు వట్టిచేతులు ఏపాటి సాయంచేస్తాయి? కనుక సీమోను అందించిన సాయం క్రీస్తుకి పెద్దగా ఉపకరించలేదు.

# ప్రార్థనం

పరోపకారుడవైన క్రీస్తూ! నీవు ఆపదలో ఉన్నవారికి ఎందరికో సాయం చేసావు. కాని అవసరమొచ్చినపుడు నిన్నాదుకొనేవాడు ఒక్కడూ దొరకలేదు. నా కొరకు, నాకు మార్గంగాను బలంగాను ఉండడం కొరకు, నీవు చివరివరకు సమస్త బాధలు

అనుభవించావు. నేను ఒంటరిగా కష్టాలు అనుభవించవలసి వచ్చినపుడు, పరుల సహాయం పొందలేని నీ దీనస్థితిని ధ్యానించుకొంటాను.

బాధలను అనుభవించేవాళ్ళను అందరూ చేయివిడుస్తారు. ఘోరవేదనల్లో చిక్కినపుడుకూడ బాధితులు ఒంటరిగా నిలువవలసిందే. వారి హృదయంలోని వ్యధను అర్థంజేసికొని పాపం అనేవాళ్ళు ఎవ్వరూ వుండరు. ఆలాంటి సమయంలో కష్టాలనుభవించే వ్యక్తి ఓదార్పుకై ఇతరులను సమీపించినా వాళ్ళు అది ఒక తగులాటకంగా భావించి ప్రక్కకు తొలగిపోతారు. నాయనా! మా తిప్పలు మాకు జాలు. నీ సొదతో మాకేమి పని అన్నట్లుగా ప్రవర్తిస్తారు.

ఈలాంటి దారుణ పరిస్థితి సంభవించినపుడు ప్రభూ! నీవు నాచెంత నిలచి ఒంటరితనానికి బెంగపడవలదని నన్ను హెచ్చరించు. చీటికిమాటికి కన్నీరొలుకుతూ ఓదార్పు కోసం నేనితరుల చెంతకు పరుగెత్తరాదు. నీ సహాయంతో నాయంతట నేను నిలువాలి.

చిట్టచివరన, ప్రతివ్యక్తి తన బాధలను తాను ఒంటరిగా భరించవలసిందే. ఒకరి వేదనలను మరొకరు తీర్చలేరు. ఈ సత్యం ఈనాడుగాకున్న రేపన్న ప్రతి వ్యక్తికి అర్థమౌతుంది. నేనుగూడ ఈ సత్యాన్ని గ్రహించిననాడు నీవు పంపే బాధలను ఓర్పుతో సహిస్తాను. కనుక నా విపత్తులలో కలతపడి అనవసరంగా మనసు పాడుచేసికోక నమ్మకంతో నిన్నాశ్రయింతునుగాక.

నీవు విశ్వాసపాత్రుడవు, నిన్ను నమ్మినవారిని చేయి విడువవు అనే నమ్మకం మాత్రం నాలో పెంపొందించు. నాకు అదే పదివేలు.

## ఆరవ స్థలం

### వెరోనిక క్రీస్తుకి వస్త్రం అందించడం

అందరూ క్రీస్తుని విడనాడారు. ఇరువైపుల మూగివున్నవారంతా నిర్దయతో అతన్ని బాధిస్తున్నారు. ప్రభువు అడుగడుక్కి సత్తువను గోల్పోయి, అధికమౌతున్న ఆయాసం వలనా దప్పిక వలనా బాధపడుతున్నాడు. దేహంలోను ఆత్మలోను క్రుంగదీసే ఘోరవ్యధ. స్లీవభారం నిమిషనిమిషానికీ ఎక్కువౌతూంది. ప్రభువు ఏ క్షణంలో ఎటువైపు పడిపోతాడో తానే ఎరుగడు.

ఈలాంటి విషమ పరిస్థితుల్లో జిక్కినపుడు మానవులు తీరని నిరాశకు గురౌతారు. ఎదుటివారి పలుకులనూ చేతలనూ అనాదరణంచేసి పిచ్చివాళ్ళలాగ ఒక్క బిగిని ముందుకు

సాగిపోతారు. వెరోనికవంటి పుణ్యస్త్రీలు ప్రక్కనుండి ఏదైనా సాయం జేయబోయినా దాన్ని గమనించకుండానే ముందుకి వెళ్ళిపోతారు.

కాని క్రీస్తు అలా చేయలేదు. తాను పుట్టెడు దుఃఖలో మునిగివున్నా, స్లీవతో సతమతమగుతూన్నా, పరులమంచితనాన్ని గుర్తించే తన మార్దవ గుణాన్ని ఏమాత్రం కోల్పోలేదు. ఆ పేద స్త్రీ అందించే చేతి గుడ్డను ఆదరంతో గైకొని ఆమెను బహూకరించాడు. ఆ బట్టతో తన ముఖాన్ని తుడుచుకొన్నాడు. తత్ఫలితంగా తన దివ్యముఖం ముద్రింపబడిన ఆ వస్త్రాన్ని నెనరుతో తిరిగి ఆమె చేతికి అందించాడు.

## ప్రార్థనం

స్నేహమూర్తివైన ప్రభూ! నీ మనసెంత మృదువైనది! ఉదాత్త హృదయాలన్నిటికంటె ఉత్తమమైనది నీ స్నేహ హృదయం. ఈ ప్రపంచంలోని సుఖదుఃఖాలను అనుభవిస్తున్నా వాటిని సులభంగా దాటిపోగలది నీ విశాల హృదయం.

జీవన్ముకుడవైన క్రీస్తూ! నన్ను కూడ ఈ ప్రపంచంలోని సుఖదుఃఖాలనుండి ఆవలకు నడిపించు. నేను వ్యథలలో చిక్కి మనసు చెడగొట్టుకొని నా తోడివారిని అనాదరం చేస్తూంటాను. అలాంటప్పుడు బాధిత హృదయులకు సులభంగా అలవడే స్వార్థబుద్ధినుండి నన్ను కాపాడు. నిరంతరం నన్నుగూర్చే నేను తలంచుకోవడం, నా బాగోగులను గూర్చే నేను ఆందోళనం చెందడం అనే పెనుభూతం నుండి నన్ను రక్షించు. ఇతరుల పరిచర్యలకీ ఆదరణకీ ఏదో హక్కుగలవానివలె ప్రవర్తించడం, ఇతరులకు భారం కావడం, నా బాధల నెపంతో ఇతరుల ఆనందాన్ని చెడగొట్టడం మొదలైన అనిష్టగుణాలనుండి నన్ను ఉద్ధరించు.

నేను ఇతరుల ప్రేమతోజేసే ప్రతి స్వల్ప పరిచర్యను వెంటనే గుర్తించి సంతోషంతో స్వీకరించి కృతజ్ఞతను తెలియజేయుదునుగాక. పరులకు నావలన ఏదైనా కొంచెంమేలు జరగాలనే తలంపుతో జీవింతునుగాక. నా దృష్టి నానుండి ఇతరుల వైపునకు మరల్చిన వెంటనే నా బాధలు చాలవరకు తీరిపోతాయి.

కావున ప్రభూ! ఇతరులను అర్థంచేసికొని వారి బాగోగులనుగూడ విచారించే విశాలహృదయాన్ని నాకు అనుగ్రహించు. నీ కృపవలన నా తోడివారిని గూర్చి ఒక మంచి పలుకు పల్కి, వారి వేదనలను కొంచెం ఉపశమింపజేసి, నన్ను నేను కాస్త మరచిపోయి స్వార్థంలేని పరోపకార జీవితం గడుపుదునుగాక.

# ఏడవ స్థలం

## యేసు రెండవసారి శ్లీవక్రింద కూలబడ్డం

సీమోను చేసిన సహాయం అంతగా ఉపయోగపడలేదు. కొంతసేపైన పిదప అతడు ఆ కొద్దిపాటి సహాయాన్ని గూడ మానివేసి పూర్తిగా వైదొలగి వుండవచ్చు. ఇక క్రీస్తుని ఆదుకొనేవారు ఎవరున్నారు? సైనికులు క్రీస్తు ఎదుటవున్న మరియమాతను ప్రక్కకు పంపివేసారు. శిష్యులు అంతకుముందే పారిపోయారు. సానుభూతి చూపేవాళ్ళు ఎవరైనా వెంట వస్తున్నా అచటి గుంపును త్రోసికొని ముందుకు రాగలరా?

క్రీస్తుని ఓ ప్రక్క సిలువభారం, వేరొక ప్రక్క అంతకన్న అధికంగా నరుల కృతఘ్నుతా భారం క్రుంగదీస్తున్నాయి. నిర్మల ప్రేమభావంతో ప్రభువు ఆ ప్రజలకు భగవత్సా మ్రాజ్యాన్ని గూర్చి బోధించాడు. క్రీస్తు వ్యాధులు నయంచేసినవాళ్లూ, రొట్టెలతో ఆహారం పెట్టిన వాళ్లూ కొందరైన ఆ గుంపులో వుండేవుంటారు. కాని వాళ్లు ఆ క్షణంలో క్రీస్తునుండి అన్యాయానికి గురైన వాళ్ళలాగ, దుర్బుద్ధితో ప్రవర్తించారు. ఈ రీతిగా మంచిని మరచిపోయిన ఆ ప్రజల నీచప్రవృత్తి క్రీస్తుని రెండవసారి నేలకొరిగేలా చేసింది.

క్రీస్తు గబాలున క్రిందగూలి నేలకు కరచుకొని వున్నాడు. అప్పుడు అతని హృదయంలో ఓ దివ్యమైన వెలుగు ప్రకాశించింది. ప్రజలు తనపట్ల జూపే క్రూరకృత్యాల ద్వారానే యేసు వారిని ఉద్ధరింపనున్నాడు. తన బాధలద్వారా మానవలోకాన్ని అధోగతినుండి లేవనెత్తనున్నాడు. అతడు ఈ వెలుగుయొక్క బలంతో ఏలాగో పైకిలేచి ముందుకి సాగిపోయాడు.

# ప్రార్థనం

బాధాపథగామివైన ప్రభూ! ఇతరుల కొరకు బాధలు అనుభవించడం ఎంత దొడ్డకార్యమోగదా? నీ బాధలన్నిటిలోను గుప్తమైయున్న ఒకానొక మాధుర్య గుణం గోచరిస్తుంది. నీ బాధలద్వారానే మా బాధలు తీరుతాయని నీకు తెలుసు. మేము బాధావిముక్తులం కావడంకంటె నీకు కావలసింది యేమీలేదు. ఈ గొప్ప సత్యాన్ని నేనుకూడ జీర్ణించుకొని నా తోడివారికి దానిని అన్వయింపజేయుదునుగాక. నా కష్టాలూ బాధలూ శ్రమలూ పరిత్యాగాలూ నీ శ్రమలతో చేర్చి తోడివారి మేలుకొరకు పరలోక పితకు అర్పింతును గాక.

ప్రభూ! నా బాధలు నీ బాధలతో కలసి ఇతరులకు ఉపయోగపడతాయి. ఈ విషయాన్ని నేను బాగా అర్థం జేసికొంటే, నాకు కలిగే బాధలు నన్నంతగా క్రుంగదీయలేవు.

# ఎనిమిదవ స్థలం

## క్రీస్తు యెరూషలేము స్త్రీలను ఓదార్చడం

క్రీస్తుని సిలువ వేయడానికి తీసికొని పోతున్నారు. ఒక తావులో యెరూషలేములోని స్త్రీలు అతని ఘోరబాధలను జూచి గుండెలు కరగి బోరున యేడ్చారు. అతన్ని ఓదార్చబోయారు. కాని వాళ్ళు యేసుని ఓదార్చడంకంటె అధికంగా యేసే వాళ్ళను ఓదార్చాడు. ప్రభువు ఎప్పుడు కూడ స్త్రీలపట్ల దయా ఆదరభావమూ చూపేవాడు. అతడు నాయీను విధవను ఓదార్చి ఆమె కుమారుని జీవంతో లేపాడు. మగ్దలమరియను ప్రేమతో ఆదరించాడు. వ్యభిచారంలో పట్టుపడిన స్త్రీని దయతో క్షమించాడు. తన అంగీ అంచును ముట్టుకొనిన స్త్రీ వ్యాధిని కరుణతో నయంజేసాడు. కననీయ స్త్రీ కొమార్తెనుండి దయ్యాన్ని పారదోలాడు. యాయీరు కొమార్తెను జీవంతో లేపాడు. ఆలాంటి దయామయుడు ఈ స్త్రీలనుమాత్రం ఓదార్చకుండా వుంటాడా?

ప్రభువు తన బాధలను తాను మరచిపోయి యెరూషలేము మహిళలకు సంభవింపనున్న విపత్తులను జ్ఞప్తికి తెచ్చుకొన్నాడు. క్రీస్తు మరణానంతరం యూదులు రోమను ప్రభుత్వంమీద తిరుగుబాటు చేసారు. రోము టైటస్ అనే సైన్యాధిపతిని పంపగా అతడు యెరూషలేమును ముట్టడించి దాన్ని సర్వనాశం చేసాడు. ఈ సంఘటనను మనసులో పెట్టుకొనే ప్రభువు ఆ స్త్రీలతో "మీరు నా కొరకు పరితపించకండి. మీ కొరకూ మీ బిడ్డల కొరకూ పరితపించండి. కొద్ది యేండ్లలోనే ఈ నగరం నేలమట్టమౌతుంది. మీ బిడ్డలందరూ చనిపోతారు" అని చెప్పాడు.

# ప్రార్థనం

ప్రభూ! నీవు ఘోరకష్టాలను అనుభవిస్తూగూడ నిన్ను ఓదార్చ వచ్చినవాళ్ళను ఓదార్చావు. నిన్ను నీవు మరచిపోయి ఎదుటివాళ్ళకు కలుగబోయే కీడునుగూర్చి పరితపించావు. మాకు దుఃఖాలు కలగినపుడు మా బాధలతోనే మేము సతమతమైపోక, ఎదుటివారి కష్టాలనుగూడ గమనించే భాగ్యం దయచేయి. తోడివారు మమ్ము ఓదార్చడానికి వచ్చినపుడు వారి సానుభూతికి కృతజ్ఞులమైయుండే భాగ్యాన్ని గూడ ప్రసాదించు.

# తొమ్మిదవ స్థలం

## యేసు మూడవసారి స్లీవ క్రింద కూలబడ్డం

రెండవసారి కూలబడి యెంతోసేపు కాలేదు. ఇంతలోనే ప్రభువు మరల మూడవసారి బోర్లగిలబడినాడు. ఔను, అంతటి ఘోరబాధలను అనుభవించే ప్రభువు నేలకు ఒరిగిపోక యెంతసేపని నిలువగలడు? అతని ఆత్మ మరణాన్ని అనుభవించేంతగా క్రుంగిపోయింది. అట్టి పరిస్థితిలో అట్టి గుంపులో, అట్టి భారంతో, అన్నిసారులు నేలకు ఒరిగిపోవడమంటే యేమిటో మనం ఊహింపనైన ఊహింపలేం.

క్రీస్తు శరీరంలోని బలమంతా వ్యయమైపోయింది. ఇక మిగిలింది నిస్సత్తువే. ఐనా ఏ బలంచేతనో ఎరుగంగాని అతడు నిదానంగా పైకిలేచాడు. తన్ను తాను ఈడ్చుకొంటూ తనవెంట స్లీవను ఈడ్చుకొంటూ, పట్టుదప్పి తొట్రుపడే అడుగులతో, అట్టిటు ఊగులాడే దేహంతో, ఎట్టకేలకు కొండ కొమ్ముకు వచ్చాడు. అచట అతనికి సిద్ధింపబోయేది విడుదలగాదు, మరణం.

# ప్రార్థనం

ప్రేమగల తండ్రీ! నీ వెంత బలవంతుడవు! ఎంత చిత్తస్థైర్యం గలవాడవు! నీవు నాయందూ నేను నీయందూ నెలకొనివుండే భాగ్యాన్ని దయచేయి. నీతో ఐక్యమై, నీ సత్తువలో పాల్గొంటూ నేనూ నీలాగే చివరి గడియ వరకు, ఒంటిలోని వెలుగు ఆరిపోయేంత వరకూ స్థిరచిత్తంతో నిలువ గలను. నీ సహాయంతో నా బాధ్యతలను - అవి యెంత భారమైనవైనాసరే - సక్రమంగా నిర్వహింపగలను. ఆపదలు వచ్చినపుడు పిరికితనానికి లోనై, యెదలోని చేవను గోల్పోయి, చేయవలసినదానిని చేయకపోవడం, చేయగూడని దానిని చేయడం అనే అనర్థంనుండి నన్ను కాపాడు.

నేను చేవనుగోల్పోయి క్రిందికొరిగి నేలకు కరచుకొని యున్నపుడు నీ యమృత హస్తంతో నన్ను మరల పైకిలేపు. మూడుసార్లు క్రిందబడి మూడుసార్లు మరల పైకిలేచినవాడవు నీవు. కావున మేము బలహీనతతో పడిపోగూడదని నీవు కోరుకోవు. పడిపోయిన పిదప నేలకు అంటిపెట్టుకొని వుండకుండా మరల పైకిలేచి ముందుకి సాగిపోవాలని మాత్రం కోరుకొంటావు. మా యిహలోక జీవితయాత్ర అంతా మాటిమాటికి పడిపోవడం, మాటిమాటికి పైకిలేచి ముందడుగు వేయడమేనని మేము గ్రహించేలా చేయి.

# పదవ స్థలం

## క్రీస్తు వస్త్రాలను విప్పడం

యూదులు క్రీస్తు స్వాతంత్ర్యాన్ని అపహరించారు. ఇప్పుడు అతని మానగౌరవాలనుగూడ దోచుకోడానికి సిద్ధమయ్యారు. ఆ మద్దెతనపు ప్రజలు అతన్ని వస్త్రహీనుని గావించి అవమానపరచారు. దారివెంట బోయేవాళ్ళుకూడ క్రీస్తువైపు వ్రేలెత్తిచూపి వహ్వాయని గేలిచేసారు. పూర్వం దీర్ఘదర్శి అని మెస్సీయా అని పెద్దగా పొగడినవాళ్ళంతా ఇప్పుడు క్రీస్తుని దిక్కులేని పేదనరునిక్రింద లెక్కగట్టి చిన్నచూపు చూచారు.

క్రీస్తు హృదయం అగాధం, నిబ్బరం, సుకుమారం ఐంది. కావున ఈ యవమానాలు అతనికెంతో చింత కలిగించాయి. ఐనా అతడు పిత చిత్తానికి తలయొగ్గి నిండు మనస్సుతో ఆ యవమానాలను భరించాడు.

# ప్రార్థనం

అవమానితుడవైన ప్రభూ! నా గౌరవానికి భంగం కలిగినపుడు నీ వనుభవించిన అవమానాన్ని స్మరింతునుగాక. ప్రజలు నా వుద్దేశాన్ని అపార్థంజేసికొని, నా కార్యకలాపాలను వక్రబుద్ధితో విమర్శించి, నా పేరు ప్రతిష్ఠలను మంట గలపినపుడు నీ వనుభవించిన ఈ యవమానాన్ని గుర్తుకి తెచ్చుకొందునుగాక. నాకొరకై నీవింతటి అగౌరవాన్ని సహించావు. నీ కష్టానుభవాల ఫలితంగా నాకు సంభవించే అగౌరవాల్లో నన్ను ఆదుకో.

ప్రభూ! అన్యులు నన్ను తూలనాడినపుడు శాంతభావాన్ని విడనాడకుందునుగాక. నన్ను నిందించేవారిపై ప్రతినిందలు మోపకుందునుగాక. నాకు ద్రోహం చేసే వాళ్లపై హృదయం కాలుష్యం పెంచుకోకుందునుగాక. విశాల హృదయంతో ఉదాత్తభావాలతో నీయందు మాత్రం విశ్వాసముంచి, నిందాపవాదాలనే పెనుగాలికి తట్టుకొని నిల్తునుగాక.

# పదకొండవ స్థలం

## క్రీస్తుని సిలువకు అంటగొట్టడం

కండ్లతోచూచి సహించలేక ప్రజలు ప్రక్కకు తొలగిపోయేంతటి ఘాతుక కృత్యమది. సజీవుడైయున్న క్రీస్తుని సిలువపై పరుండబెట్టి కాలుసేతుల్లో ఇనుపచీలలు దిగగొట్టారు. సిలువతోపాటు అతన్ని పైకెత్తారు. ఎంత హృదయవిదారకమైన దృశ్యమది! ఐనా మనం

క్రీస్తునుండి ముఖం త్రిప్పుకొని అవతలకు పోరాదు. మనకొరకు ప్రభువు ఘోరయాతనలు అనుభవిస్తూంటే మనం ప్రక్కకు తొలగిపోకూడదుగదా!

ఇంతవరకు క్రీస్తుదారిలో కనీసం నడవనైన నడుస్తూ, కదిలాడనైన కదిలాడాడు. ఇక యిప్పటినుండి ఆ యవకాశం గూడ లేదు. ప్రక్కకు మెదలడానికైనా వీల్లేదు. సిలువపై వ్రేలాడుతూ నిస్సహాయుడై నిశ్శబ్దంతో సర్వం సహిస్తూ వూరకుండవలసిందే. ఆ దుస్థితి శోకభరితం. ఆ దురవస్థ దుఃఖపూరితం.

కొరడా దెబ్బలకు చినిగి నజ్జయిన దేహమందూ, వ్రణమయమయిన శిరస్సునందూ నొప్పి నిప్పులాగ మండుతూంది. క్షణక్షణానికి అధికమయ్యే దప్పిక ముప్పుతిప్పలు పెడుతూంది. దేహం సిలువపై వ్రేలాడుతూ క్రిందికి కుదించుకొనిపోవడంచే సరిగా గాలియైన పీల్చుకొనే అవకాశంలేక హృదయం ఆయాసపడుతూంది. ప్రభువు తనకుతాను కొద్దిపాటి సహాయమైన చేసికోలేని దురవస్థలో ఉన్నాడు. కనీసం తలను అటూఇటూ కదల్చడానికైన అవకాశంలేదు. మరణం దానంతటది సమీపించేవరకూ అతడు ఈ ఘోరయాతనలను ఈ రీతిగా సహిస్తూ ఊరుకోవలసిందే. ఈ సమయంలోనైన ప్రక్కనున్న యూదుల హృదయాలు కరగలేదుకదా, వారి జంతుప్రవృత్తి మరింత విజృంభించింది.

# ప్రార్థనం

యాతనావహుడవైన ప్రభూ! నీ బాధలన్నిటికీ కారణం నా పాపాలే. కనుక పాపినైన నన్ను క్షమించు. నీ వనుభవించిన సిలువబాధలు నాపట్ల వ్యర్థంగాకుండును గాక. నీ దివ్యశాంతం నాయందు వేరుబాతుకొనునుగాక.

నిందావమానాలు వ్యాధిబాధలూ అనుభవిస్తూ ఏమీచేయలేక సహనంతో పడివుండవలసిన విషమదశ మాకూ ఒకనాడు ప్రాప్తించవచ్చు. మా చివరి గడియల్లో తరచుగా ఈ దురవస్థ ప్రాప్తిస్తుంది. ఈ దశలో మేమూ సిలువకు అంటగొట్టబడతాం. ఇక కదిలాడలేం. నోరు మెదపలేం. ఈ దురవస్థలో ఇక మేము చేయగలిగింది ఒక్కటే. మా చిత్తాన్ని నీపై నెలకొల్పి మేమూ నీ బాధలతో ఐక్యంగావాలి. నీవలె చివరిగడియ కొరకు ఎదురుజూస్తూ, కేవలం విశ్వాసంతోనే జీవిస్తూ సహనంతో వుండిపోవాలి.

ప్రభూ! నా చివరి గడియల్లో నన్ను చేయి విడువకు. నీవు సిలువపై అనుభవించిన దౌర్బల్యం నా అవసాన సమయంలో నాకు చాలినంత బలాన్ని చేకూర్చి పెట్టునుగాక.

# పంద్రెడవ స్థలం

## క్రీస్తు సిలువపై ప్రాణాలు విడవడం

క్రీస్తు మూడుగంటలకాలం ఓర్పుతో సిలువపై వ్రేలాడాడు. స్లీవ ప్రక్కనే నిలచియున్న మాతృమూర్తి మరియను యోహానుకీ, యోహానుని మరియకూ అప్పగించాడు.

ఒంటరిగా మన పాపాలన్నీ తన భుజస్కంధాలపై నిలుపుకొని పితయెదుట దీనతతో నిలబడ్డాడు ప్రభువు. ఈ గడియలో అతని హృదయంలో ఏలాంటి భావాలు చెలరేగాయో మనుష్యమాత్రులకు ఎవ్వరికీ తెలియదు. అంతట క్రీస్తు "నాపితా! నాపితా! నన్నేల చేయివిడిచావ" ని యెలుగెత్తి అరచాడు. దేవుని కుమారుని దేవుడే చేయివిడవడం ఏలాగో మనకు అర్థంకాదు. మనకు తెలిసిందల్లా ఒక్కటే. ఇంతవరకు క్రీస్తు హృదయం పితసన్నిధిలో మెలగగిల్గింది. ఇప్పుడు ఆ పితసన్నిధికూడ దూరమైపోయింది. రెండంశాలు మాత్రం క్రీస్తుని చివరిగడియ వరకు సహించుకొని వుండేలా చేసాయి. మొదటిది, అతడు పితచిత్త పద్ధతికి లొంగడం. రెండవది, అతనికి మనపైగల ప్రేమ.

మనపైగల ప్రేమచే క్రీస్తు దహించుకొనిపోయాడు. ఆ దహనం పూర్తికాగానే అతడు సమస్తం నెరవేరిందని చెప్పి తలవంచి ప్రాణాలు విడిచాడు.

పాపినైన నేను క్రీస్తు ప్రాణాలనే బలిగోరిన పితయొక్క న్యాయదృష్టికి తలవంచి నమస్కరిస్తాను. నా కొరకై ప్రాణాలొడ్డిన క్రీస్తుకి ఆరాధన, కృతజ్ఞత చెల్లిస్తాను.

## ప్రార్థనం

పరార్థ ప్రేమైకజీవివైన ప్రభూ! నీపట్లగల ప్రేమవలన నా బాధలను నేనుగూడ సహించాలని నేర్పుతున్నావు. నీవలె నేనుగూడ పితచిత్త పద్ధతిని అంగీకరిస్తాను. పితపై దృష్టి నిల్పినపుడు నా యాతనలను నేను ఓర్పుతో సహింపగల్గుతాను. నా బాధలు వ్యర్థంకావు. అవి నీ బాధలతో గలసి లోకాన్ని ఉద్ధరింపగలవు. ఈ సత్యం నాకెంతో ఓదార్పుని కలిగిస్తుంది.

నా చివరి గడియలు సమీపించి, యిక జీవించి ప్రయోజనం లేదని తోచినపుడుగూడ నేను చేయగల మహత్తర కార్యం వొకటుంది. నీతో ఐక్యమై నా బాధలను నా ప్రాణాన్ని నా చేతగానితనాన్ని గూడ ఇతరుల మేలు కొరకై నీకప్పగిస్తాను. నా జీవితము నా సహాయత్వమూ మాత్రమేగాక, నా మరణమూ నా నిస్సహాయత్వమూ గూడ నీకు సమర్పణ యోగ్యాలే. ఈ సమర్పణం దప్ప బాధలనూ మృత్యువును జయించే మార్గం మానవులమైన మాకు మరొకటి దొరకదు.

# పదమూడవ స్థలం

## క్రీస్తు దేహాన్ని స్లీవనుండి క్రిందికి దింపడం

క్రీస్తు చివరివరకు శ్రమలనుభవిస్తూ చనిపోయాడు. మిత్రులు అతని మృతదేహాన్ని క్రిందికిదింపి మరియమాత ఒడిలో పరుండబెట్టారు.

దేవునియొక్క విచిత్రకార్యం క్రీస్తు జీవితం. కాని ఈ జీవితపుష్పం పూర్తిగా విప్పారక మునుపే తలవని తలంపుగా వాడి నేలకొరిగింది. మామూలు ప్రకారంగా చెప్పాలంటే, క్రీస్తు ఇంకా యెన్నో యేండ్లు జీవించి వుండవలసింది. అలా జీవించివుంటే, అతడు ఇంకా యెన్ని సత్కార్యాలు చేసి వుండడు? ప్రజలకెన్ని మహత్తర సత్యాలను బోధించి వుండడు? లోకానికెంత మేలు చేసివుండడు? మరి యీ యెలప్రాయంలోనే క్రీస్తు ప్రాణాలు విడువనేల? ప్రభువు ఆరంభించిన పని పూర్తిగా పునాదులైనా ముగియక మునుపే ఆగిపోనేల?

క్రీస్తు ఎన్నుకొన్నది “సిలువయొక్క తెలివితక్కువతనం”. నేలలోబడి చివికిపోయిన పిదపనేగాని గోదుమగింజ నూరంతలుగా ఫలింపదు.

ప్రపంచంలోని ప్రశ్నలన్నిటిలోను చిక్కు ప్రశ్నలివి. జనులు బాధపడనేల? సంతోషింప గలిగీ దుఃఖింపనేల? ఏదైనా సాధింపగలిగీ సాధింపక పోవడమేల? జీవించగలిగీ చనిపోవడమేల? జీవితపు మొగ్గ పూర్తిగా వికసింపక పూర్వమే గిల్లివేయబడనేల? ఇంత మధురంగా వుండే ఈ జీవితాన్నీ, ఈ లోకాన్నీ మనుష్యప్రాణి ఇంత త్వరగా వదలిపెట్టిపోనేల?

ఈ ప్రశ్నలకు మనుష్యబుద్ధి తృప్తికరమైన సమాధానాలను చెప్పలేదు. వీటికి సిలువ యిచ్చే సమాధానమే సమాధానం. నేలలోబడి చివికిపోతేనేగాని గోదుమగింజ సత్ఫలితాన్ని ఈయలేదు. మన త్యాగం, బాధ, మరణం అసలు మన జీవితమే ఈ గోదుమగింజలాంటిది. బాధలకు జిక్కి ప్రాణాలు కోల్పోయిన నాడేగాని మన జీవితం, మనతోపాటు ఇతరుల జీవితం, సత్ఫలితాన్ని ఈయలేవు.

## ప్రార్థనం

ప్రభూ! నీవే సెలవిచ్చిన ఈ సత్యాన్ని, నీవే ఆచరణలో పెట్టి చూపించిన ఈ పరతత్వాన్ని, అనగా తనకుతాను చనిపోవడాన్ని, పూర్ణహృదయంతో విశ్వసిస్తున్నాను. నీ పట్లగల నమ్మకంచే నా ప్రాణాలను కానుకగా అర్పించదానికి సిద్ధంగా వున్నాను.

కునికిపాట్లుపడి ఆరిపోయే నా వెలుగు నాకును ఇతరులకునుగూడ మంచి ఫలితాలన్నీయాలని ఆశిస్తున్నాను.

# పదునాల్గవ స్థలం

## క్రీస్తుని భూస్థాపనం చేయడం

క్రీస్తు దేహాన్ని నారవస్త్రాలతో జుట్టి అరిమత్తయియా యోసేపుని సమాధిలో వుంచారు. క్రీస్తు బంధువులు శిష్యులు ఆ సమాధి ద్వారంపై పెద్ద రాతిపలకను బోర్లించి విచారంతో వెళ్ళిపోయారు.

ఇప్పుడు అంతా నిశ్శబ్దం. ఆ భయంకరమైన తుఫాను ఆగిపోయింది. పెద్ద నెమ్మదికూడ కన్పిస్తూంది. అది పూర్వవేద ప్రవచనాల నెరవేరుదలయొక్క చిహ్నం. ఆ సమాధిలో పవ్వళించియున్న అమృతమూర్తి పిత విధించిన బాధ్యతను బహుజాగ్రత్తతో నిర్వహించి ముగించాడు. ఆ బాధాతత్వబోద్ధ తన బడలికనుండి యిపుడు విశ్రాంతి తీసికొంటున్నాడు.

పాస్క ఆదివారపు మహిమకూడ ఆ సమాధిచుట్టు అప్పుడే తొలకరి మెరుపులాగ మెరుస్తూంది.

కాని శిష్యులు ఈ యంశాన్ని గ్రహించలేదు. క్రీస్తు మరణంతో సమస్తం గతించిపోయిందనే వారి భావం. ఆశలన్నీ అడుగంటాయనే వారి విచారం.

ఆ నిరాశా హృదయులకు క్రీస్తు శీఘ్రంగానే దర్శనమిచ్చాడు. తన నూత్న శక్తినీ జీవనజ్యోతినీ వారిపై ప్రసరింపజేసాడు. మెస్సీయా బాధలనుభవించిన పిదపగాని మహిమలో అడుగుపెట్టడని అప్పుడు వారికి అర్థమైంది. మన కొరకు క్రీస్తు ప్రాణాలు అర్పించాడని అప్పుడు వాళ్ళకు అవగతమైంది.

# ప్రార్థనం

ఉత్థానపాదుడవైన ప్రభూ! పెద్ద శుక్రవారం తర్వాత పాస్క ఆదివారంగూడ వస్తుంది అన్న సత్యాన్ని నీ ఉత్థానం బోధిస్తూంది. ఊటబుగ్గనుండి జలధారలాగ, బాధలనుండీ మరణంనుండీ ఆనందమూ జీవమూ జాలువారుతాయని నీ యద్భుత చరిత్ర చాటిచెప్తూంది. నేను ఈ సత్యాన్ని చక్కగా జీర్ణించుకొందునుగాక. క్రీనీడలు నాపై వాలేపుడు ఈ సత్యపు వెలుగు నాకు దారిచూపునుగాక. బాధలను ఎదుర్కొనే ప్రతి నరుడూ గాలి తాకుళ్ళను ఎదుర్కొనే వృక్షంలాగ బలపడతాడు. ధీరతతో అంధకారంలో పయనించే

ప్రతి మనిషీ వెలుగు చూస్తాడు. నేలకు వాలే ప్రతిప్రాణమూ మళ్ళా జీవంతో మొలకెత్తుతుంది. నీవు బోధించే ఈ సత్యం ప్రేరణంవలన నేను ఇకమీదట బాధలకు జంకను. నీయందు నెలకొనినవాడు పడిపోడు. నీతో జీవించి నీతో బాధలు అనుభవించేవాళ్ళు ఆ బాధల్లో గూడ సంతోషాన్ని చవిజూస్తారు. నీతో శ్రమలు అనుభవించే వాళ్ళు నీతో విజయాన్ని పొందుతారు. ఇంతకంటె దొడ్డభాగ్యం ఏముంది?

## అంత్య జపం

కార్యసాధకుడవైన ప్రభూ! ఈ బాధామార్గాన్ని ముగించి, యింటికిబోయి దైనందిన కార్యాలను చేపట్టమని నీవు నాకు బోధిస్తున్నావు. మేము మా బాధలను బలవంతంగా అనుభవింపనక్కరలేదనీ, వాటివలన మేము నిరాశచెందకూడదనీ, ఈ కష్టపథం ద్వారా నీవు మమ్ము హెచ్చరిస్తున్నావు. శ్రమలు దుఃఖాన్ని కలిగించి తీరతాయి.ఐనా వాటిద్వారా మాకు రక్షణమూ మహిమా చేకూరుతాయి.

నీయందు నమ్మకముంచి నా బాధలను నేను ఓపికతో అనుభవించాలని నీవు నన్ను మందలిస్తున్నావు. సోదరప్రేమతో తోడి మానవుల మేలు కొరకు నా శ్రమలను అనుభవిస్తే అవి తెచ్చిపెట్టే దుఃఖం తొలగిపోతుందని నీవు హెచ్చరిస్తున్నావు. ఈ సత్యాన్ని నా హృదయ ఫలకంపై స్పష్టంగా లిఖించు. ఇప్పుడూ ఎప్పుడూ, విశేషంగా ఆపదల్లో జిక్కినపుడు, నీవు అనుగ్రహించే వెలుగు నాకు త్రోవను జూపుతూ నన్నావలకు నడిపించునుగాక. నీవు కోరినట్లే ఇక యింటికిబోయి నా పనులను నేను చేసికొంటూ నీవు నేర్పే యీ గొప్ప సత్యాన్ని నెమరునకు దెచ్చుకుంటాను. ఆమెన్.

# 2. సప్తవాక్యాలు

## ఉపోద్ఘాతం

ప్రభువు సిలువమీద ప్రాణాలు విడుస్తూ ఏడుమాటలు చెప్పాడు. అవే సప్తవాక్యాలు.

బైబులు చనిపోయేవాళ్ళ మాటలు క్రీస్తువికాక మరి ముగ్గురివి మాత్రమే ఉదాహరించింది. వాళ్ళు మోషే, యాకోబు, స్తెఫను. నరులు చనిపోతూ చెప్పిన వాక్యాలను వినాలంటే మనకందరికీ కుతూహలంగానే వుంటుంది. మన దగ్గరి బంధువులు చనిపోతూ చెప్పిన మాటలను మనంఎంత ఆదరంతో గుర్తుంచుకోం ! ప్రభువు సిలువపీఠమెక్కి ఏడు

వాక్యాలను ఏడు సందేశాల్లాగ విన్పించాడు. రెండువేల యేండ్లనుండి క్రైస్తవ ప్రపంచం ఈ పలుకులను భక్తిభావంతో మననం చేసికొంటూ వస్తూంది. వాటిల్లోని భావాలను తరచితరచి చూస్తూవస్తూంది. ప్రభువులాంటి బోధకుడు లేడు. నాడు కల్వరిచుట్టు మూగిన ప్రజల్లాంటి శ్రోతల్లేరు. సప్తవాక్యాల్లాంటి ప్రసంగమూ లేదు. ఈ ప్రసంగాన్ని ఫుల్టెన్ జె.షీన్‌గారి క్రీస్తు చరిత్రనుండి గ్రహించాం.

## మొదటి వాక్యం

*"తండ్రీ! వీళ్ళేమి చేస్తున్నారో వీళ్ళకే తెలియదు. కనుక వీళ్ళను క్షమించు"*

– లూకా 23, 34.

సిలువ మరణాన్ని అనుభవించేవాళ్ళు ఆ బాధను భరించలేక పెడబొబ్బలుపెట్టి వెర్రికేకలు వేసేవాళ్ళు. సెనెకా వ్రాతల ప్రకారం సిలువమీద వ్రేలాడేవాళ్ళు తాము పుట్టిన దినాన్నీ తమ్ము కొరతవేసేవాళ్ళనూ, కడకు తమ్ము కన్న తల్లులనూగూడ శపించేవాళ్ళట. తమచుట్టూ వున్నవాళ్ళ మొగాలమీద ఉమ్మివేసేవాళ్ళట. సిసిరో కూడ సిలువవేదనలు అనుభవించేవాళ్ళు దుర్భాషలూ దేవదూషణలూ పలికేవాళ్ళనీ, కనుక సైనికులు ఒకోసారి వాళ్ళ నాలుకలను కోసివేసేవాళ్ళనీ వ్రాసాడు. క్రీస్తుని కొరత వేసేవాళ్ళుకూడ అతని నోటినుండి దూషణలు వెలువడతాయనుకొన్నారు. క్రీస్తు పూర్వం "మీ శత్రువులను ప్రేమించండి" "మిమ్ము ద్వేషించేవాళ్ళకు మంచిని చేయండి" అని బోధించాడు. కాని ఇప్పుడు అతని కాలుసేతుల్లో చీలలు దిగగొట్టారు. అతన్ని సిలువమీద వ్రేలాడదీసారు. కనుక ఈ బాధల్లో అతడు తన పూర్వబోధలన్నీ గాలికి వదిలివేస్తాడనుకొన్నారు పరిసయులూ సద్దూకయులూ. అందరూ క్రీస్తు నోటినుండి పరుషవాక్యాలు వెలువడతాయనుకొన్నారు. కాని వాళ్ళ ఊహలు విఫలమయ్యాయి. అతని నోటినుండి కటువైన దూషణవాక్యాలుకాక, మృదువైన క్షమావాక్యాలు వెలువడ్డాయి. మంచి గంధపు చెట్టు తన్నునరికే గొడ్డళ్ళను సుగంధంపూసి సత్కరిస్తుంది. అలాగే క్రీస్తుకూడ తన్ను హింసించేవాళ్ళను పల్లెత్తిమాట అనలేదు. పై పెచ్చు వాళ్ళను క్షమించమని తండ్రికి మనవిచేసాడు. వాళ్ళేమి చేస్తున్నారో వాళ్ళకే తెలియదు. కనుక వాళ్ళను శిక్షించవద్దనీ మన్నించి వదిలివేయమనీ ప్రార్థించాడు.

అతన్ని హింసించే శత్రువులెవరు? కయిఫా యింటి ముంగిటిలో తన్ను గుద్దులు గుద్దిన సైనికులు, కైజరు మన్నన పొందడం కొరకు తనకు అన్యాయంగా శిక్ష విధించిన పిలాతు, తనను పిచ్చివానినిగా గణించిన హెరోదు తన్ను సిలువవేసే రోమను బంట్రౌతులు, కపటంతో తన్ను నాశం చేయగోరిన అన్నా కయిఫాలాంటి వక్రబుద్ధులు. క్రీస్తు ఈలాంటివాళ్లనందరినీ క్షమించమని తండ్రిని వేడాడు.

తండ్రి ఈ పాపులను ఎందుకు క్షమించాలి? వాళ్ళు చేసేదేమిటో వాళ్ళకే తెలియదు కనుక. ఆ పాపులకే గనక క్రీస్తు దైవసుతుడని తెలిస్తే, తెలిసీ అతన్ని చంపిస్తే, ఇక వాళ్ళకు విమోచనం వుండదు. వాళ్లు అతని నెత్తురుద్వారా తమకు పాపవిమోచనం కలుగుతుందని అర్థంచేసికొంటే, ఆలా అర్థంచేసికొనిగూడ అతన్ని వధిస్తే ఇక వాళ్ళకు రక్షణంగాదు శిక్షణం కలుగుతుంది. కనుక క్రీస్తు విరోధులు అజ్ఞానంవల్ల బ్రతికిపోయారు. ఒకోమారు విజ్ఞానంకాదు అజ్ఞానం మనలను రక్షిస్తుంది -1కొ 2, 8.

శిక్షకు గురై చనిపోయేవాళ్లు తాము నిర్దోషులమని చెప్పుకొని తమకు దండన విధించినవాళ్ళను నిందించనైనా నిందిస్తారు, లేదా తాము దోషులమని ఒప్పుకొని క్షమాపణం అడగనైనా అడుగుతారు. కాని నిర్దోషియైన క్రీస్తు ఈలా క్షమాపణం ఏమీ అడగలేదు. తాను దేవునికీ నరునికీ మధ్య మధ్యవర్తి కనుక అతడే తన్ను హింసించే పాపులకు క్షమాపణాన్ని అనుగ్రహించాడు. అతడు తన్ను తానే బలిగా అర్పించుకొనిన యాజకుడు కనుక పాపాత్ముల నేరాలను పరిహరించమని తండ్రికి మనవి చేసాడు.

పూర్వం ఆదాము పాపం చేసినపుడు దేవుడు అతన్ని క్షమిస్తానని మాటయిచ్చాడు. స్త్రీ సంతానం పిశాచం తల చితుకగొడుతుందని ప్రమాణం చేసాడు - ఆది 3,15. ఇప్పుడు క్రీస్తు బాధామయ సేవకుడి రూపంలో వచ్చాడు. సిలువ మీద వ్యథ ననుభవిస్తూ పూర్వం తన తండ్రి చేసిన ప్రమాణాన్ని నెరవేర్చాడు.

నరులు సామాన్యంగా శత్రువులను క్షమించరు. క్షమాపణం ఒక్క దేవునికే చెల్లింది. క్రీస్తు సిలువమీదినుండి శత్రువులను క్షమించినతీరు తొలినాటి క్రైస్తవ భక్తులను చాల ప్రభావితం చేసింది. ఆ ప్రభువు క్షమాపణాన్ని మనస్సులో పెట్టుకొనే స్తెఫను తన విరోధులను క్షమించాడు. "ప్రభూ! ఈ పాపాన్ని వాళ్ళమీద మోపవద్దు" అని మనవి చేసాడు - అ.చ. 7,60. అలాగే, రోములో చెరలోవున్న పౌలుని స్నేహితులందరూ వదలివేయగా అతడు, అందరూ నన్ను విడిచి వెళ్ళిపోయారు. ప్రభువు వారి తప్పిదాన్ని మన్నించుగాక అని వ్రాసాడు - 2 తిమో 4,16. మన కాలంలో గాంధీ క్రీస్తు క్షమావాక్యాలకు చాల ముగ్ధుడైపోయాడు. నూత్నవేదంలోని పర్వత ప్రసంగంలాగే ఈ వాక్యంగూడ గాంధీని చాల ప్రభావితం చేసింది.

పూర్వం హేబెలు నెత్తురు కయీనుని శిక్షించమని దేవునికి మొరపెట్టింది. దేవుని కోపాన్ని రెచ్చగొట్టింది - ఆది 4,10. కాని హేబెలులాంటి పుణ్యపురుషులందరినీ సూచించిన క్రీస్తు నెత్తురు మాత్రం శిక్షణనుగాక రక్షణను కోరింది. కనుకనే సిలువమీద నెత్తురోడ్చి ప్రాణాలు విడిచే క్రీస్తు శత్రువులను శిక్షింపమనిగాక క్షమించమని తండ్రికి మనవి చేసాడు - హెబ్రే 12, 24.

శత్రువులను క్షమించడం కష్టమని చెప్పాం. విరోధుల మీద పగ తీర్చుకోకపోతే మన మగతనమేముంది అనుకొంటాం. పౌరుషాలు పలుకుతాం. శత్రుశేషం మిగలనీయరాదని కూడ మనదేశంలో ప్రాచీనసూక్తి. కాని విరోధిమీద పగతీర్చుకోవడమనేది ప్రాకృతికమానవుని లక్షణం. విరోధిని క్షమించడం ఆధ్యాత్మిక మానవుని లక్షణం. ప్రాకృతిక మానవులం గనుక మనంతట మనకు ఈ గుణం అలవడదు. కాని క్రీస్తు ఈ క్షమాగుణాన్ని ఓ వరంగా మనకు ప్రసాదించగలడు. కనుక క్రీస్తు క్షమాగుణాన్ని ఆదర్శంగాబెట్టుకొని మనంగూడ పగవారిని మన్నించాలి. ఇంకా, క్షమాగుణం శిష్యధర్మాల్లో ఒకటి. సువిశేష కథలో క్షమింపనొల్లని సేవకునికి ఏ గతి పట్టిందో మనకు తెలుసు. కనుక ఈ క్షమాగుణం లేందే మనం అచ్చమైన క్రీస్తు శిష్యులం కాలేమని గుర్తించాలి - మత్త 18,35.

# రెండవ వాక్యం

## *"నేడే నీవు నాతోకూడ పరలోకంలో ప్రవేశిస్తావు"* - లూకా 23, 43.

ప్రభువు సిలువపీఠమనే న్యాయసింహాసనం మీది నుండి తీర్పు చెప్పాడు. అతనికి కుడివైపున గొర్రెలూ ఎడమవైపున మేకలూ వున్నాయి. లోకాంతంలో ప్రభువు న్యాయాధిపతిగా వచ్చి తీర్పు చెప్పేపుడు అతని సిలువకూడ వుంటుంది. కాని అప్పుడు సిలువ ఇప్పుడులాగ అవమానాన్ని బాధలనూ సూచించదు. సంతోషాన్ని విజయాన్ని సూచిస్తుంది. ఐనా ఆ లోకాంతపు తీర్పులాంటిదే ఇప్పుడు సిలువమీది తీర్పు కూడాను.

క్రీస్తుకి ఇరువైపులా ఇద్దరు దొంగలనుగూడ సిలువ వేసారు. వాళ్ళిద్దరికీ చాల వ్యత్యాసముంది. ఎడమప్రక్క ఉన్నవాడు క్రీస్తుని నిందించాడు. "నీవేగనుక మెస్సియావైతే మొదట నిన్ను నీవు రక్షించుకొని ఆ మీదట మమ్ము గూడ రక్షించు చూద్దాం" అన్నాడు - లూకా 23, 39. అతడు సిలువ వేదనలను భరించలేక ఈలా దుర్భాషలాడాడు. నరులు కేవలం బాధలవల్లనే పునీతులు కారు. శ్రమలను మంచి మనసుతో స్వీకరించకపోతే, వాటినిగూర్చి సుమ్మర్లు పడితే అవి మనలనింకా చెడగొడతాయి. ఇందుకు ఈ యెడమవైపు దొంగే నిదర్శనం.

కాని ఎడమవైపు దొంగ తన్ను సిలువమీదినుండి క్రిందికి దింపమని అడిగితే కుడివైపు దొంగ తన్ను సిలువ మీదినుండి పైకెత్తమని అడిగాడు. తన్ను కరుణింపమని క్రీస్తుని వేడాడు. అతడు తోడి దొంగను మందలిస్తూ "మిత్రమా! నీవు ఇతనిలాగే శిక్షకు గురయ్యావు. ఇతని లాగే మరణించనున్నావు. ఐనా నీకు దైవభయం ఏమాత్రం లేదా? ఈ మూర్ఖప్రజల్లాగే నీవూ ఇతన్ని నిందిస్తున్నావా? మన నేరాలకు తగినట్లుగానే మనకు శిక్షపడింది. పాపం ఇతడు ఏ నేరమూ చేయలేదు. కనుక నీవు ఇంతటితో నోరుమూసికొంటే బాగుంటుంది" అని పల్కాడు.

నూత్నవేద గ్రంథాలు కాదుగాని తొలి శతాబ్దాల్లోనే వెలసిన కల్పిత గ్రంథాలు కొన్ని ఈ మంచిదొంగ పేరు డిస్మస్ అని చెప్తున్నాయి. చెడ్డదొంగపేరు జెస్టస్ అనికూడ చెప్తున్నాయి.మంచిదొంగపేరు ఏదైనా, అతనికి ఇంతకు పూర్వమే క్రీస్తునిగూర్చి తెలుసు. అతడు ఆ ప్రభువు బోధలు వినివుంటాడు, అద్భుతాలు చూచివుంటాడు. క్రీస్తు తెలిపిన దైవరాజ్యాన్ని గూర్చిగూడ కొంత అర్థంచేసికొనే వుంటాడు. కనుకనే "నీవు నీ రాజ్యంలోకి ప్రవేశించినపుడు నన్నుగూడ జ్ఞాపకముంచుకో" అని మనవి చేసాడు. అదే అతని విశ్వాసానికి నాంది.

అతడడిగింది తన్ను గుర్తుంచుకొమ్మని మాత్రమే. కాని అడిగినదానికంటె అదనంగా క్రీస్తు అతన్ని బహూకరించాడు. నేడే నీవు నాతో కూడా పరలోకం చేరుకొంటావని అతనితో పల్కాడు. అనగా అతడు మోక్షం చేరుకొని క్రీస్తు సన్నిధిలో వుంటాడు. క్రీస్తుతోపాటు తానూ రాజ్యపాలనం చేస్తాడు. మనమందరమూ చనిపోయాక మనకు మోక్ష బహుమానం లభిస్తుందనే మాట వింటాం. కాని యితడు బ్రతికివుండగానే తనకు మోక్ష బహుమానం సిద్ధిస్తుందనే అమృతవాక్కు విన్నాడు.

చనిపోయేవాడొకడు చనిపోయే మరొకనిని తనకు నిత్యజీవమీయమని అడిగాడు. తనకు దైవరాజ్యం ప్రసాదింపమని వేడాడు. తాను కోరినట్లే ఆ రాజ్యాన్ని పొందాడు. కనుక అతడు చనిపోతూగూడ దొంగగానే చనిపోయాడు. దైవరాజ్యాన్ని దోచుకున్నాడు. క్రీస్తు సిలువ మరణంవల్ల మొదటిసారిగా విమోచనం పొందింది అబ్రాహాము లాంటి పుణ్యపురుషుడెవడూకాదు, ఓ దొంగ.

క్రీస్తు మరణకాలంలో శిష్యులే ఆ గురువుని నమ్మలేదు: అసలు వాళ్ళల్లో ఒక్కడు మాత్రమే సిలువ దగ్గర నిల్చుండి వున్నాడు. ఆలాంటి విషమ పరిస్థితుల్లో ఈ దొంగ క్రీస్తుని రక్షకుణ్ణిగా అంగీకరించగలిగాడు అంటే, అతని విశ్వాసం చాల గొప్పదై యుండాలి. కనుకనే రక్షకుడు ఈ దినమే నీవు నాతోకూడ మోక్షాన్ని ప్రవేశిస్తావు అని పల్కాడు. ఆ దొంగ విశ్వాసానికి తగిన బహుమానం అది.

జీవితంలో చాలమంది క్రీస్తుని సమీపిస్తారు కాని అతన్ని విశ్వసించేవాళ్లు కొద్దిమందే. విశ్వసిస్తున్నామనే వాళ్లల్లోకూడ పూర్తి విశ్వాసం వుండదు. కాని పూర్ణంగా విశ్వసించేవాళ్ళకేగాని క్రీస్తు దక్కడు. అన్నిటికంటె విశ్వాసం ముఖ్యమైంది. కనుక ఆ మూగదయ్యం పట్టిన బాలకుని తండ్రిలాగే మనంకూడ "ప్రభో! నేను నిన్ను విశ్వసిస్తూనే వున్నాను. ఐనా నా విశ్వాసంలో ఏమైనా లోటు వుంటే నీవే దాన్ని సవరించు" అని ప్రార్థించాలి - మార్కు 9,24.

# మూడవ వాక్యం

## "ఇదిగో నీ కుమారుడు. ఇదిగో నీ తల్లి" - యోహా 19, 26-27.

ప్రభువు సిలువమీద వ్రేలాడుతూంటే క్రిందశిష్యుడు యోహాసూ, మరియమాతా, ఇతర పుణ్యస్త్రీలూ నిల్చివున్నారు. క్రీస్తు తన్నుతాను తండ్రికి అర్పించుకొంటూంటే మరియకూడ తన కుమారుడైన క్రీస్తుని తండ్రికి అర్పిస్తూంది. ఆమె తల్లి హక్కులన్నిటినీ వదలుకొని తన కుమారుణ్ణి మన తరపున పితకు సమర్పించింది. ఆమె పూర్వం మనుష్యావతార సందర్భంలో నీ మాట చొప్పున నా కగునుగాక అని దైవచిత్తానికి లోబడింది. ఇప్పుడు కల్వరి కొండమీద మళ్ళా రెండవసారి దైవచిత్తానికి లొంగి క్రీస్తుని తండ్రికి నివేదనం చేసింది. క్రీస్తు నెత్తురు బొట్లతో తన కన్నీటి బొట్లనుగూడ మేళవించింది. అతనిలా శారీరక వేదనలనుభవించక పోయినా తాను ఘోరమైన మానసిక వేదనలు అనుభవించింది. వీటన్నిటివలనా ఆమె క్రీస్తుతో పాటు తానూ సహరక్షకి ఐంది. ఈ సందర్భంలోనే ప్రభువు "అమ్మా! ఇదిగో నీ కుమారుడు" అని యోహానుని మరియకు కుమారునిగా దయచేసాడు. "ఇదిగో నీ తల్లి" అని ఆ శిష్యునికి తన తల్లిని తల్లిగా అనుగ్రహించాడు.

ఇక్కడ యోహానుని జెబెదయి కుమారుడనే ఓ ప్రత్యేక వ్యక్తిగాగాక, ఓ శిష్యునిగా మాత్రమే గ్రహించాలి. ఆ శిష్యుడు మనకందరికీ ప్రతినిధిగా వుంటాడు. మనలనందరినీ సూచిస్తూంటాడు. అతనిద్వారా మరియ మనకందరికీ తల్లి ఔతుంది, మనమందరమూ ఆమెకు బిడ్డలమౌతాం. యోహాను తల్లియైన సలోమిగూడ అప్పుడు సిలువదగ్గిరే వుంది - యోహా 19,25. ఆలా అతనిసొంత తల్లి దగ్గిరే వుంటే ప్రభువు మళ్ళా తన తల్లిని అతనికి తల్లిగా ప్రసాదించడం దేనికి? ఇక్కడ యోహానుని ఓ ప్రత్యేక వ్యక్తిగా తీసికోగూడదనీ, ఆతడు మనకందరికీ ప్రతినిధిగా వుంటాడనీ ముందే చెప్పాం. మనకు సాంకేతికంగా వున్న యోహాను ద్వారా మరియ మనకందరికీ తల్లి ఔతుందని గూడ చెప్పాం. ఇదే ఆమె ఆధ్యాత్మిక మాతృత్వం.

మరియ తన తొలిచూలి కుమారుణ్ణి కంది అని సువార్తలో చదువుతున్నాం - లూకా 2, 7. ఆమెకు మలిచూలి బిడ్డలు కూడ ఉన్నారు. కాని వీళ్ళు శారీరకంగా పుట్టినవాళ్లు కాదు. ఆమెకు శారీరకంగా పుట్టిన బిడ్డడు ఒక్కడే ఒక్కడు, క్రీస్తు. మనమందరమూ ఆమెకు ఆధ్యాత్మికంగా పుట్టిన మలిచూలి బిడ్డలం.

మరియ తొలిచూలి బిడ్డను కన్నపుడు ఏ బాధ అనుభవించలేదు. ఆమె పసుల కొట్టంలో సంతోషంతో క్రీస్తునికంది. కాని కల్వరికొండమీద మలిచూలి బిడ్డలమైన మనలను

కన్నపుడు మాత్రం ఘోరశ్రమలు అనుభవించింది. ఆమెను వ్యాకులమాత, వేదసాక్షుల రాజ్ఞి అని పిలుస్తాం. ఆమె శ్రమలు క్రీస్తు శ్రమలవలన కలిగినవి మాత్రమేకాదు. తాను మనకు ఆధ్యాత్మికంగా తల్లికావడం వలన కలిగినవికూడ.

స్త్రీ ప్రసవవేదనతో బిడ్డలను కనాలనే పూర్వశాపం వుంది - ఆది 3, 16. మరియ పాపరహిత కనుక క్రీస్తుని కన్నపుడు ఈ శాపం ఆమెకు సోకలేదు. కాని మనలను కన్నపుడు మాత్రం ఆమె వేదన అనుభవించింది. ఈ వేదన శారీరకమైంది కాదు, హృదయగతమైంది అని ముందే చెప్పాం. ఓ ఖడ్గం ఆమె హృదయంలోకి గుచ్చుకొని పోతుందనే సిమియోను ప్రవచనంగూడ వుంది - లూకా 2, 35.

బేత్లెహేమునుండి కానాపూరిదాకా మరియ కేవలం క్రీస్తు జననిగానే కన్పిస్తుంది. కానాపూరినుండి కల్వరి వరకు ఆమె క్రీస్తు శిష్యులకు జననిగాకూడ కన్పిస్తుంది. కల్వరిఘట్టంనుండి ఆమె పూర్ణంగా శిష్యులకు తల్లి ఔతుంది. ఓ మారు మరియా ఆమె బంధువుల బిడ్డలూ క్రీస్తుని చూడ్డానికిరాగా మీయమ్మా మీ సోదరులు నిన్ను చూడ్డానికి వచ్చారని ఎవరో క్రీస్తుతో చెప్పారు. అప్పుడు ప్రభువు నా తల్లి ఎవరు? నా సోదరులెవరు? నా తండ్రి చిత్తాన్ని నెరవేర్చేవాళ్ళే నాకు తల్లిలాంటివాళ్ళూ నా సోదరుల్లాంటివాళ్లూ ఔతారని అన్నాడు - మత్త 12, 46-50. ఈ వాక్యాలనుబట్టి బహిరంగ జీవిత ప్రారంభంనుండి క్రీస్తుకూడ తన తల్లి తనకొక్కడికే ప్రత్యేకంగా తల్లి కాదనీ, ఆమె మనకుకూడ తల్లి ఔతుందని భావించాడనీ ఊహించుకోవాలి. సరే, అతడు కల్వరిమీద చనిపోతూ మనలను మరియకు సంపూర్ణంగా బిడ్డలను చేసిపోయాడు. అంతకుముందు ఒక్కడే కొడుకైనా ఆ తల్లికి ఈ సమయంనుండి లోకమంతా సంతానమైంది. విశేషంగా పెంతెకోస్తు సమయంనుండి ఆమె లోకమాత ఐంది.

మరియ క్రీస్తుకి తల్లిగావడం చాల గొప్ప భాగ్యం. కాని ఆమె క్రీస్తు శిష్యులకు తల్లిగావడంగూడ సామాన్యమైన భాగ్యంకాదు. క్రైస్తవులంటే యెవరు? క్రీస్తుచే రక్షింపబడిన వాళ్లు. క్రీస్తుని ధరించేవాళ్లు. ఇప్పుడు నేను గాదు నాయందు క్రీస్తే జీవిస్తున్నాడు అని చెప్పుకోవడానికి అర్హులైన వాళ్లు - గల 2,20. ఈలాంటి క్రైస్తవులకు మరియ తల్లి ఔతుంది.

ఇక, మన తరపున మనకు మాత్రం మరియను తల్లిగా పొందడం సామాన్య భాగ్యమా? క్రీస్తు తల్లి మనకు గూడ తల్లి కావడం అనే భాగ్యానికి మనంతటి మనం నోచుకోగలమా? క్రీస్తు చనిపోతూ ప్రేమతో తన తల్లిని మనకు తల్లినిచేసిపోయాడు. ఆమెను మనం ప్రభువు తర్వాత ప్రభువంతటిదాన్నిగా స్వీకరించి గౌరవించాలి. అన్సెల్మ్

భక్తుడు చెప్పినట్లు, క్రీస్తు తన తల్లిని ఎంతగా ప్రేమించాడో, మనమూ ఆమెను ఎంతగా ప్రేమించి గౌరవించాలని కోరుకొంటాడో, అంతగా ఆమెను ప్రేమించాలి.

మరియ వ్యాకులంద్వారా మనకు తల్లి ఐంది. మనం కూడ వేదనలద్వారా ఆమెకు బిడ్డలమైతే ఉచితంగా ఉంటుంది. మనం లేనిపోని బాధలను కొనితెచ్చుకోనక్కరలేదు. మామూలుగా మనకు సంక్రమించే బాధలను సదుద్దేశంతో స్వీకరిస్తే చాలు. వాటిని ఆ వ్యాకులమాత శ్రమలతోను క్రీస్తు శ్రమలతోను జోడించి పరలోకంలోని తండ్రికి అర్పిస్తే చాలు, ఎనలేని ఫలితాన్ని పొందుతాం.

# నాల్గవ వాక్యం

***"నా దేవా నా దేవా! నన్నెందుకు చేయివిడిచావు!" - మత్త 27, 46***

మధ్యాహ్నం పండ్రెండునుండి మూడుదాకా దేశమంతటా చిమ్మచీకటి క్రమ్మింది. పాపాత్ములు భగవంతుణ్ణి మట్టుపెడుతున్నందుకు ప్రకృతే సంతాపం తెలుపుతుందా అన్నట్లుగా వుంది ఆ దృశ్యం. నరులు జగజ్యోతిని ఆర్పివేయడానికి పూనుకొన్నారు గనుక సూర్యుడు అనుతాపంతో తన కాంతిని ఉపసంహరించుకొన్నాడా అన్నట్లుగా వుంది. పూర్వం ప్రభువు బేత్లెహేములో అర్ధరాత్రిలో జన్మించినపుడు అద్భుతంగా వెలుగు ప్రకాశించింది. కాని ఇప్పుడు అతడు కల్వరిమీద మట్టమధ్యాహ్నం అవమానకరంగా సిలువపై మరణించబోతూండగా ఆకాశం చీకట్లను విరజిమ్మింది. చాలయేండ్లకు పూర్వమే ప్రవక్త "ఆ దినం నేను మధ్యాహ్నమే సూర్యుడు అస్తమించేలా చేస్తాను. పగటివేళనే భూమిమీద చీకట్లు కమ్మేలా చేస్తాను" అని నుడివాడు – ఆమోసు 8,9.

ఇంతవరకూ ప్రభువుని చీలలతో గ్రుచ్చి సిలువమీద పరుండబెట్టారు. కాని ఇప్పుడతన్ని సిలువమీదికెత్తి నిలబెట్టారు. కనుక అతని దేహంలో రక్తప్రసారం సరిగా జరగలేదు. ఫలితంగా ఘోరమైన జ్వరం పుట్టుకవచ్చింది. నొప్పితో దేహంలోని అవయవాలన్నీ కుదించుకొని పోయాయి. ఒక్క దేహం మాత్రమేకాదు అతని హృదయం కూడ బాధతో వ్యధతో కంపించిపోయింది. అసలు తండ్రి కూడ తన్ను చేయి విడిచాడా అన్నంతబాధ కలిగింది. ఆ సందర్భంలో ప్రభువు "నా దేవా నా దేవా! నన్నెందుకు చేయి విడిచా" వని దీనంగా విలపించాడు.

క్రీస్తు తండ్రిమీద సుమ్మర్లు పడ్డాడనిగానీ, నిరాశచెందాదనిగానీ ఈ వాక్యం భావంకాదు. ఇది అతని ప్రార్థన. ఈ వాక్యం 22వ కీర్తనలోనిది. ప్రభువు సిలువ మీద యాతన ననుభవిస్తూ ఈ కీర్తనను జపించాడు. దీనిలో ఇంకా ఈ క్రింది వాక్యాలుకూడా వున్నాయి.

"నేను ఓ పురుగునుగాని నరుణ్ణికాదు
అందరూ నన్ను నిందించేవాళ్ళే
అందరూ నన్ను ఎగతాళి చేసేవాళ్ళే
నన్ను చూచినవాళ్ళంతా పకపక నవ్వుతూన్నారు
పెదవులు విరచి తల ఆడించి అపహసిస్తున్నారు
ఇతడు దేవుణ్ణి నమ్మాడుకదా
మరి ఆ దేవుడే వచ్చి ఇతన్ని రక్షిస్తాడేమో చూద్దాం,
ఇతడే గనుక దేవుని కిష్టుడైతే
ఆ ప్రభువే వచ్చి ఇతన్ని ఈ శ్రమలనుండి
విడిపించాలిగదా – అంటున్నారు
శత్రువులు పోట్లగొడ్లలాగ నన్ను చుట్టుముట్టారు
క్రూరమైన బాషానుమండలం వృషభాల్లాగ నన్నావరించారు
నా విరోధులు సింహాల్లాగ భయంకరంగా గర్జిస్తూ
కోరలు తెరచి నా మీదికి దూకబోతున్నారు
నేను నేలమీద తొణికిపడిన నీళ్ళలాగ ఇంకిపోయాను
నా యెముకలన్నీ కీళ్ళు దప్పాయి
నా హృదయం లోలోపలే మైనంలా కరిగిపోయింది
నా గొంతు ఆవంలోని పెంకులా యెండిపోయింది
నా నాలుక అంగిటికి అంటుకొని పోయింది, నేను నేలగరిచాను
దుష్టులు చాలమంది నన్ను చుట్టుముట్టారు
రేచుకుక్కల్లాగ నా వెంట బడ్డారు
వాళ్ళు నా కాలుసేతుల్లో రంధ్రాలు తొలిచారు
నా యెముకలన్నీ బయటపడ్డాయి
నా శత్రువులు నావైపుజూచి వికటంగా నవ్వుతూన్నారు
వాళ్ళు చీట్లువేసి నా దుస్తులను పంచుకొన్నారు" – కీర్త 22, 7-18.

ఇది క్రీస్తుకి వెయ్యేండ్లకు పూర్వమే వ్రాయబడిన కీర్తన. ఐనా ప్రభువు శ్రమలను అద్భుతంగా చిత్రిస్తుంది. అతని బాధలను కన్నులకు కట్టినట్లుగా వర్ణిస్తుంది. కనుకనే ప్రభువు సిలువమీద వ్రేలాడుతూ ఈ కీర్తనను జపించాడు.

ఈ కీర్తనలో క్రీస్తు దేవుణ్ణి "నాదేవా" అని సంబోధించి విలపించాడు. ఈ సందర్భంలో క్రీస్తు మానుష స్వభావమూదైవస్వభావమూ వేరువేరుగా విడిపోయాయనీ,

ఇక్కడ అతడు కేవలం నరుడుగా దేవుడికి మొరపెట్టు కొంటున్నాడనీ కొందరు భావించారు. కాని అది పొరపాటు. క్రీస్తులో దైవస్వభావమూ మానుష స్వభావమూ ఎప్పుడూ కలసే వున్నాయి.

ఒకోసారి ఎత్తయిన పర్వతశిఖరాల మధ్యభాగాన్ని మబ్బులు ఆవరిస్తాయి. ఆ కొండల శిఖరాలు సూర్యప్రకాశంలో మెరుస్తూన్నా వాటి పాదాలు ఆ మబ్బుల నీడల వలన చీకట్లతో నిండివుంటాయి. సిలువమీద క్రీస్తుకికూడ అలాగే జరిగింది. అతనికి తండ్రి దర్శనం పూర్తిగా మరుగైపోలేదు. కాని నరుల పాపభారాన్నంతటినీ తన భుజస్కంధాలపై మోస్తూ వుండడంవల్ల కొన్ని క్షణాలపాటు ఆ తండ్రి దర్శనం స్పష్టతను కోల్పోయింది. ఆ తండ్రితో ఐక్యమై యుండడంవలన కలిగే ఆనందం మరుగైపోయిందా అన్పించింది. కనుక అతడు ఇక్కడ తండ్రినుద్దేశించి "నా దేవా నా దేవా" అని విలపించాడు. తండ్రిచే చేయి విడువబడినట్లు, తండ్రినుండి తాను వేరైపోయినట్లు, ఏకాకిఐపోయినట్లూ భావించాడు. తాను భరించే పాపాల ఫలితం అది.

పాపఫలితం దేవుడికి దూరమైపోవడం. ఇక్కడ క్రీస్తు అనుభవించిన బాధ యిదే. నరులు పాపంద్వారా దేవుని నుండి వై దొలగిపోయారు. క్రీస్తు ఆ పాపాన్నంతటినీతన భుజాలమీద భరించాడు. ఫలితంగా అతడు తాను స్వయంగా దేవుని నుండి వైదొలగిపోయిన ట్లనిపించింది. ఆ బాధను భరించలేక అతడు "నా దేవా నా దేవా" అని అరచాడు. ఆ యరపులో దేవుణ్ణి నిరాకరించే నాస్తికుల ఆక్రోశనాలన్నీ ఇమిడి వున్నాయి. దేవుని ప్రేమను నిరాకరించే పాపాత్ముల అంగలార్పులన్నీ ఇమిడి వున్నాయి. దేవుణ్ణి కాదనడమూ అతని ప్రేమను నిరాకరించడమూ అంటే నరకాన్ని కోరుకోవడమే కదా? కనుకనే క్రీస్తు పాపభారంతో సిలువమీద వ్రేలాడుతూ కొన్ని క్షణాలపాటు పాపఫలితమైన నరకయాతనను చవిచూచాడు. పాపాత్ములందరి పాపాలకు ప్రాయశ్చిత్తం చేస్తూ దేవునికి దూరం కావడం అనే ఘోరవ్యథను కొంతకాలంపాటు అనుభవించాడు. అంధకారం అతన్ని ఆవరించింది. అతడు ఒంటరిగాడయినట్లుగా భావించి దుఃఖించాడు.

నరునికి ఆదిలో దేవుడిచ్చినవరం వెలుతురు. ఈ వెలుతురు ఎంతో విలువైంది. భగవంతుడు మంచివాళ్ళకీ చెడ్డవాళ్ళకీగూడ నిత్యం ఈ వెలుతురును ప్రసాదిస్తూనే వుంటాడు – మత్త 5,45. ఐతే పాపం చీకటిలాంటిది. క్రీస్తు సిలువమీద నరజాతి పాపానికి పరిహారంచేస్తూ ఆ చీకటిని పూర్ణంగా అనుభవించాడు. లోకానికి వెలుతురునిచ్చే ప్రభువు తాను చీకటికి లొంగిపోయాడు.

సిలువ మరణాన్ని అనుభవించేవాడు శాపగ్రస్తుడు అంటుంది పూర్వవేదం – ద్వితీ 21, 23. క్రీస్తుకికూడ ఒక రీతిగా ఈ శాపం అన్వయిస్తుంది. కాని అతడు

శాపగ్రస్తుడైంది తన పాపాలకొరకుగాదు, మన పాపాలకొరకు - గల 3,13. అతడు స్వయంగా మన పాపాల ఫలితమైన శాపాన్ని అనుభవించాడు. మనలనుమాత్రం ఆ శాపంనుండి విముక్తులను చేసాడు. కాని అతడు ఆ శాపాన్ని అనుభవిస్తూ దాని బాధను భరించలేక నా దేవా నా దేవా అని విలపించాడు.

పూర్వవేద ప్రజలు కిప్పూర్ అనే ప్రాయశ్చిత్త దినాన తమ పాపాలన్నీ ఒక మేకమీద మోపి దాన్ని అడవిలోకి తోలేవాళ్ళు. అది వాళ్ళ పాపాలను మోసికొనిపోయేది - లేవీ 16, 20-22. ఈ మేక మన పాపాలను భరించే క్రీస్తుని సూచిస్తుంది. మన పాపభారం ఆ ప్రభువుని పూర్తిగా కృంగదీసింది. కనుకనే అతడు సిలువమీద ఇలా రోదనం చేయవలసి వచ్చింది.

యెషయా బాధామయ సేవకుణ్ణి పేర్కొన్నాడు. ప్రభువు మన పాపభారాన్నంతటినీ ఈ సేవకుని భుజాలమీద మోపాడు :

"మనమంతా గొర్రెల్లాగ త్రోవదప్పి నాశమైపోయాం. ప్రభువు మన పాపాల శిక్షను అతనిమీద మోపాడు" అని పల్కాడు - యెషయా 53,6. ఈ బాధామయ సేవకుడు క్రీస్తే. మన కిల్బిషభారాన్ని భరించలేక దేవా కరుణించు అని దీనంగా విలపించాడు ఆ సేవకుడు.

ఇక్కడ క్రీస్తు మానసిక వ్యధనుగూడ అర్థంచేసికోవాలి. భగవంతుడు సృష్టినిచేసి మానవులను కలిగించినపుడు జ్యోతినిగూడ కలిగించాడు. అప్పటినుండి ఆ జ్యోతి నిత్యమూ నరులతో వుంటూ వచ్చింది. అసలు జ్యోతి భగవంతునికే సంకేతం. కనుకనే కీర్తనకారుడు "నీ వెలుగులో మేమూ వెలుగును చూస్తాం" అన్నాడు - కీర్త 36,9. క్రీస్తు ఈ వెలుగుగానే లోకంలోకి వచ్చాడు. జగతికి జ్యోతిని నేనేనని చెప్పాడు - యోహా 8,12. ఐనా క్రీస్తు ఓ వెలుగులా లోకంలోనికి వచ్చి దేదీప్యమానంగా ప్రకాశించినా చీకటి ప్రపంచం మాత్రం అతన్ని అంగీకరించలేదు - యోహా 1,5. అతడు తనవాళ్ళ చెంతకువస్తే వాళ్ళే అతన్ని సిలువమీద కొట్టి చంపిస్తున్నారు. తన ప్రజలే తన్ను అంగీకరించకపోవడమనేది అతనికెంతో మానసిక వ్యధను కలిగించింది - యోహా 1,11.

ఐనా క్రీస్తుసిలువమీద నిరాశచెందలేదు. భగవంతుడు తన్ను పూర్తిగా విడనాడాడనీ, తనకిక సద్గతి లేదనీ భావించలేదు. తండ్రి నరుల పాపాలకు తన్నలా శిక్షిస్తున్నాడనీ, ఆ చీకటి గడియలు అంతరించాక మళ్ళా వెలుగు ప్రకాశిస్తుందనీ అతనికి తెలుసు. మరణమే తుదిమెట్టు కాదనీ తర్వాత ఉత్థానముంటుందనీకూడ అతడు గ్రహించాడు. మరణంద్వారాలాగే ఉత్థానంద్వారాగూడ తాను ప్రజలను రక్షిస్తానని అతడు నమ్మాడు. కనుక ప్రభువు సిలువమీద నిరాశకు గురయ్యాడనికానీ, తండ్రి అతన్ని పూర్తిగా విడనాడాడనికానీ చెప్పకూడదు.

పాపం చాల ఘోరమైంది. ఓ వేదశాస్త్రి చెప్పినట్లు అది సాధ్యమైతే భగవంతుణ్ణికూడ నాశం చేయాలని చూస్తుంది. కాని అలా చేయలేదు కనుకనే ఊరకుంటుంది. క్రీస్తుకి అంతటి శారీరక శ్రమనూ అంతటి మానసిక శ్రమనూ తెచ్చి పెట్టింది మన పాపాలే. ఆ ప్రభువు శ్రమలను ధ్యానించుకొని మనం ఇకమీదటనైనా పాపంనుండి వైదొలగాలి. పాపాన్ని అసహ్యించుకోవాలి. పౌలులాగే మనంకూడ "ప్రభువు నన్ను ప్రేమించి నా కొరకు ప్రాణత్యాగం చేసాడు. కనుక ఇకమీదట నేనుగూడ అతనికొరకే జీవిస్తాను" అని నిశ్చయించుకోవాలి – గల 2, 20.

# ఐదవ వాక్యం

## "నాకు దాహం వేస్తుంది" – యోహా 19,28.

ప్రభువు దాహానికి శారీరకంగా అలసట పొందడం ఒక కారణం. ప్రవచనాలు నెరవేరవలసి వుండడం మరో కారణం. ఈ రెండు విషయాలను పరిశీలించి చూద్దాం.

గాయాల వలన క్రీస్తు శరీరంలోని నెత్తురు చాలవరకు కారిపోయింది. ఆ గాయాలకు ఈదురుగాలి సోకి దేహంలో మిగిలివున్న నెత్తురుకూడ కరుడుకట్టుకొనిపోయేలా చేసింది. ఇంకా సిలువమీద వ్రేలాడే ప్రభువు శరీరం కేవలం కాలుసేతులమీద ఆధారపడి వుండడంవల్ల ఘోరమైన బాధననుభవిస్తూంది. దీని ఫలితంగా కలిగిన జ్వరమూ తలనొప్పి నరములవాపూగూడ ప్రభువుకి తీవ్రమైన దాహం కలిగేలా చేసాయి.

క్రీస్తుకి దాహం కలగడం వింతకాదు. అతడు తనకు దప్పిక కలిగిందని చెప్పడం వింత. ఆకాశంలోని గోళాలను వాటి పరిధిలో నిల్పినవాడు, సముద్రాలను వాటి యెల్లలు దాటి పొంగిపారకూడదని శాసించినవాడు, మోషే బెత్తంతో చరచినప్పుడు రాతిచట్టునుండి నీటిపాయను వెలువరించినవాడు, నేనిచ్చే నీటిని త్రాగేవారికి మరల దప్పిక కలుగదని సమరయ మహిళతో చెప్పినవాడు ఇప్పుడు నాకు దాహం వేస్తూందని పల్కడం వింతకాదా?

ప్రభువుని సిలువ వేసేప్పుడు మొదటిసారి చేదు కలిపిన ద్రాక్షరసాన్ని ఇచ్చారు. కాని క్రీస్తు దాన్ని పుచ్చుకోలేదు – మార్కు 15, 22–23. ఈ పానీయాన్ని సేవిస్తే మైకం కమ్ముతుంది. ఇక బాధలు గుర్తుండవు. తన శ్రమలను విస్మరింపజేసేది కనుక ప్రభువు ఈ పానీయాన్ని సేవింపలేదు. ఈ రెండవసారి అతనికి అర్పించింది పులిసిన ద్రాక్షాసవం. ఇది చౌకరకం పానీయం. ఆ రోజుల్లో దీన్ని రోమను సైనికులకు విరివిగా సరఫరా చేసేవాళ్లు. ప్రభువుని సిలువవేసే సైనికులు తమకోసం ఓ కుండలో దీన్ని

నింపిపెట్టుకొన్నారు. అతడు నాకు దాహం వేస్తుందని చెప్పగానే ఓ సైనికుడు స్పోంజిని ఈ రసంలో ముంచాడు. దానిని హిస్సోపు అనే చెట్టుకొమ్మకు తగిలించి క్రీస్తుకి అందించాడు. ప్రభువు ఆ స్పోంజినుండి కొంచెం రసం పీల్చుకొన్నాడు - యోహా 19,29.

పూర్వం పుణ్యస్త్రీలు ప్రభువుకి పరిచర్యలు చేసారు. వాళ్ళుకూడ ఇప్పుడు సిలువదగ్గిరే నిల్చుండి వున్నారు. ఐనా ఇప్పుడు వాళ్లు అతనికి ఏలాంటి సాయమూ చేయలేరు. ఓ సైనికుడే ప్రభువుకి ఆ సాయం చేసిపెట్టాడు. ఈ సైనికులు రోమనులు. వీళ్ళకు యూదులపట్ల సద్భావం లేదు. వీళ్లు సిలువమీద వ్రేలాడే క్రీస్తుని ఎగతాళి చేసారు కూడ. ఇక్కడ ఈ రసాన్ని అందించినవాడుకూడ ఎగతాళికే ఈ పనిచేసాడు - మార్కు 15, 36. ఐనా ఈలా పరియాచకంగా అందించిన రసంతోనే ప్రభువు తన దాహం తీర్చుకొన్నాడు.

పులిసిన రసపు స్పోంజిని హిస్సోపు పుల్లమీద తగిలించి క్రీస్తుకి ఇచ్చారు. ఈ హిస్సోపు కొమ్మను యూదులు కర్మకాండలో వాడేవాళ్ళు. దాని కొమ్మను పాస్కగొర్రెపిల్ల నెత్తుటిలో ముంచి ఆ నెత్తుటిని ప్రజలమీద చిలకరిస్తారు. పూర్వం ఐగుప్తులోని యూదుల యిండ్ల ద్వారబంధాల మీద గొర్రెపిల్ల నెత్తురు చిలకరించిందికూడ దీని మండతోనే. ఇంకా కుష్ఠరోగులను శుద్ధిచేసేపుడుకూడ ఈ మండను పక్షి నెత్తుటిలో ముంచి ఆ నెత్తుటిని రోగులమీద చల్లుతారు. సుప్రసిద్ధమైన 51వ కీర్తనలో కీర్తనకారుడు తన్ను ఓ కుష్ఠరోగితో పోల్చుకొన్నాడు. ప్రభువు హిస్సోపు మండతో తనమీద నెత్తురుచిలకరించి తన్ను శుద్ధిచేయాలని కోరుకొన్నాడు - 51,7.

ప్రభువు సిలువమీద ఈ పానీయాన్ని సేవించింది కేవలం దప్పికను తీర్చుకోవడానికి మాత్రమేకాదు. ప్రవచనాలను నెరవేర్చడానికిగూడ. కీర్తనకారుడు ఈలా వ్రాసాడు.

"ఎవరైనా నన్ను కరుణించి ఓదారుస్తారేమో ననుకొన్నాను
కాని ఆలాంటివాళ్ళెవరూ నాకంటబడలేదు
వాళ్ళు నాకు చేదుని తిన్పించారు
దప్పికైనప్పుడు నాచే పులిసినరసాన్ని త్రాగించారు" - 69, 21-22

ఈ ప్రవచనాన్ని నెరవేర్చడానికే ఇక్కడ ప్రభువు ఈ పులిసిన రసాన్ని సేవించాడు.

మనజీవితంలో చావు అనేది చివరి సంఘటనంగా వస్తుంది. అది యెప్పుడొస్తుందో గూడ మనకు తెలియదు. కాని క్రీస్తు జీవితంలో అలాకాదు. అతనికి తన మరణాన్ని గూర్చిన వివరాలన్నీ ముందుగానే తెలుసు. ఇంకా, మనం చేతకాక మరణానికి

లొంగిపోతాం. కాని క్రీస్తుకి తన మరణం మీద సర్వాధికారమూ వుంది. దానికి అతడు లొంగిపోలేదు. తన కిష్టమొచ్చినపుడు, తనక్టిమొచ్చిన రీతిలో దాన్ని ఆహ్వానించాడు. కనుకనే ప్రవచనాలన్నీ నెరవేరి, తాను వచ్చినపని ముగిసినపిదపనేగాని అతడు మృత్యువుని అంగీకరింపలేదు. అనగా దానికి అతనిమీద కాదు, అతనికి దానిమీద అధికారం వుంది. ఎవరూ నా ప్రాణాలను తీయలేరు. నాయంతట నేనే ప్రాణాలను ధారపోస్తాను. నేను నా ప్రాణాలను మళ్ళా పొందుతానుకూడ" అన్నాడు ప్రభువు - యోహా 10,18.

క్రీస్తు దాహం ఒడలి బడలిక వలన కలిగింది అన్నాం. ప్రవచనాలను నెరవేర్చడానికి కలిగిందనికూడ చెప్పాం. ఇంకా ఈ దాహం నరులను రక్షించాలనే కోరికవల్ల కూడ కలిగిందని చెప్పాలి. కొందరికి సుఖభోగాలు అనుభవించాలని కోరిక. కొందరికి డబ్బు కూడబెట్టుకోవాలని కోరిక. కొందరికి పదవులూ కీర్తిప్రతిష్ఠలూ ఆర్జించాలని కోరిక. క్రీస్తుకయితే నరులను రక్షించాలని కోరిక. అతడు సమరయ మహిళను నాకు దాహమీయమని అడిగాడు. అనగా నీ హృదయాన్ని నాకు సమర్పించుకో అని అతని భావం. ఆలాగే సిలువమీదగూడ అతడు నాకు దప్పిక వేస్తుంది దాహమీయండని అడిగాడు. అనగా ఆ సిలువచెంత వున్న వాళ్ళందరూ తమ హృదయాలను తనకు అర్పించు కోవలసిందిగా కోరాడు. వాళ్ళు తన రక్షణను పొందవలసిందిగా అర్థించాడు. కాని సిలువచెంతవున్న సైనికులు మొదలైనవాళ్ళంతా అతని ప్రేమను అర్థంచేసికోలేదు. కనుకనే వాళ్ళు తమ యెదదలనుగాక చేదు, పులిసినరసం మొదలైన పదార్థాలను అందించారు.

ఇక ప్రభువు నేడు మనలనుజూచిగూడ నాకు దప్పిక వేస్తుంది మీరు నాకు దాహమీయండి అని అడుగుతాడు. మీ హృదయాలను నా కర్పించుకోండి అని కోరతాడు. ఈ హృదయార్పణకు మనం సిద్ధంగా వున్నామా?

## ఆరవ వాక్యం

**"యేసు ఆ రసాన్ని అందుకొని సమస్తమూ సమాప్తమైందని పల్కాడు '**

- యోహా 19,30.

క్రీస్తు జీవితంలో ప్రతి ఘట్టమూ తండ్రి నిర్దేశించినట్లే జరిగింది. అతడు ప్రతి అంశంలోను తండ్రి చిత్తానికి బద్ధుడై జీవించాడు కనుక అతనియందు తండ్రి ప్రణాళికా కోరికాపూర్తిగా నెరవేరింది. పూర్వవేదంలో ప్రవక్తలు పల్కిన ప్రవచనాలుకూడ అక్షరాల నెరవేరాయి. కనుకనే క్రీస్తు సమస్తమూ సమాప్తమైంది, సమస్తమూ నెరవేరింది అని పల్కి ప్రాణాలు విడిచాడు.

పూర్వం తండ్రి ఆరురోజులు సృష్టిచేసి ఏడవ దినాన విశ్రమించాడు - ఆది 2,7. అలాగే క్రీస్తుకూడ రక్షణనుగూర్చి తాను చేయవలసిన కృషి అంతా చేసాడు. అతడు ప్రవక్తగా ప్రజలకు దేవుని సందేశం విన్పించాడు. రాజుగా, నాయకుడుగా ప్రజలను నడిపించాడు. యాజకుడుగా సిలువమీద ప్రాణాలర్పించాడు. ఇక అతడు విశ్రాంతిని పొందుతాడు. మోక్షానికివెళ్ళి తండ్రి కుడి పార్శ్వాన ఆసీనుడౌతాడు. ఇక రెండవ రక్షకుడంటూ లేదు. రెండవ రక్షణ మార్గంకూడ లేదు. అతని పేరుమీదిగా తప్పితే మరో పేరుమీదిగా భూమిమీది మానవులకు రక్షణం కలుగదు - అచ 4,12.

క్రీస్తుని గూర్చిన ప్రవచనాలన్నీ నెరవేరాయి అని చెప్పాం. మెస్సీయా గాడిదనెక్కి వినయంతో యెరూషలేము ప్రవేశిస్తాడన్నాడు జెకరయా. అదే ప్రవక్త అతన్ని నలుబది వెండి కాసులకు అమ్ముతారనీ ఆ డబ్బుతోనే రక్తక్షేత్రం అనే పొలాన్ని కొంటారనీ చెప్పాడు. యెషయా ప్రవక్త మెస్సీయాను క్రూరంగా హింసించి చంపుతారనీ అలా చనిపోతూ అతడు శత్రువులకొరకు మనవి చేస్తాడనీ నుడివాడు. అతనిచే పులిసినరసం త్రాగిస్తారనీ విరోధులు అతని దుస్తులను పంచుకొంటారనీ కీర్తనకారులు ప్రవచించారు. ఆతని యింటివాడే, అనగా అతని శిష్యుడే, అతన్ని మోసగించి మరణంపాలు చేస్తాడనిగూడ చెప్పాడు. ఇంకా పూర్వవేదం ఆ మెస్సియా మోషేలాంటి ప్రవక్త అనీ, మెల్కీసెదెక్కులాంటి యాజకుడనీ, హేబెలులాంటి నిర్దోషి అనీ, ఈసాకులాగ బలి అయ్యేవాడనీ చెప్తుంది. పైపెచ్చు పూర్వవేదంలో బలియిచ్చిన పొట్టేళ్ళు, కోడెలూ, గువ్వలూ, పాపాలు మోసికొనిపోయిన మేకలూ మొదలైన బలిపశువులన్నీ అతన్నే సూచిస్తాయి. ఈ ప్రవచనాలూ, ఈ సూచక వ్యక్తులూ, ఈ బలిపశువులూ అన్నీ క్రీస్తునందు సార్థక్యం పొందాయి. కనుకనే అంతా సమాప్తమైంది, అంతా నెరవేరింది అని చెప్పి తలవంచి ప్రాణం విడిచాడు ప్రభువు.

క్రీస్తు పర్వతంమీద బోధించిన ప్రసంగం అద్భుతమైంది. ఐనా ఆ ప్రసంగం ముగిసాక అతడు "అంతా సమాప్తమైంది" అనలేదు. అతడు వచ్చింది ప్రధానంగా బోధించడానికికాదు. అనేకుల కొరకు తన ప్రాణాన్ని బలిపెట్టడానికి. యెరూషలేము వెళ్తూ అతడు మనుష్య కుమారుణ్ణి అన్యజాతివారికి అప్పగిస్తారని పల్కాడు. వాళ్ళు అతన్ని అపహసించి, చండ్రకోలలతో మోది చంపివేస్తారన్నాడు. గెత్సెమని తోపులో తన్ను పట్టుకోవడానికి వచ్చిన శత్రువులమీదికి పేత్రు కత్తి యెత్తగా, తండ్రి తనకిచ్చిన పాత్రను తాను త్రాగితీరాలి అన్నాడు. అతడు పండ్రెండవ యేట తప్పిపోయి మళ్ళా తల్లిదండ్రులకు దొరికినపుడు నేను నా తండ్రి పనుల్లో నిమగ్నుణ్ణయి వుండాలి అన్నాడు. ఇంకా, నా తండ్రి చిత్తాన్ని నెరవేర్చడమే నాకాహారం అనికూడ అన్నాడు. ఈలా క్రీస్తు తన సిలువ మరణాన్ని గూర్చి ముందుగా ఎరిగించిన సంగతులన్నీ అక్షరాల నెరవేరాయి.

ఆ ప్రభువు మనలను విమోచించాడు. రక్షణకార్యం సమస్తమూ సమాప్తమైంది. ఈ రక్షణాన్ని గూర్చి తర్వాత నూత్నవేద రచయితలు "క్షుద్రమైన వెండి బంగారాల వలన మీకు పాప విమోచనం కలుగలేదు. నిష్కళంకమైన గొర్రెపిల్ల అనబడే క్రీస్తు అమూల్యమైన రక్తం వలన మీకు విమోచనం కలిగింది" అన్నారు - 1 పేత్రు 1,18-19.

ఔను, క్రీస్తు తండ్రి చిత్తాన్నీ పూర్వవేద ప్రవచనాలనూ నెరవేర్చి సిలువమీద చనిపోయాడు. ఆలా చనిపోయి మన పాపాలకు విమోచనం చేసాడు. అతనిలాగే మనంకూడ నేడు తండ్రి చిత్తానికి బద్ధులమై జీవిస్తే అతని రక్షణాన్ని సంపూర్ణంగా పొందుతాం. నరుని శ్రేయస్సూ సౌభాగ్యమూ విజయమూ అంతాకూడ తండ్రి చిత్తానికి లొంగివుండడంలోనే వుంది. తండ్రి ఆజ్ఞకు లోపడి జీవించాలంటే ఒకోసారి చాల కష్టంగా వుంటుంది. మనకు ససేమిరా గిట్టదు. కాని ఆలాంటి సందర్భాల్లో కూడ మనం తండ్రీ! నా చిత్తప్రకారం గాదు, నీ చిత్తప్రకారమే జరగనీయి అని చెప్పగలిగివుండాలి. అప్పుడే మనం క్రీస్తుకి సన్నిహితులమయ్యేది.

## ఏడవ వాక్యం

### "యేసు తండ్రీ నా యాత్మను నీ చేతుల్లోకి అప్పగిస్తున్నాను అని పల్కి ప్రాణం విడిచాడు" - లూకా 23, 46.

ఆదాము చేసిన తొలిపాపం ఫలితం చావు. ఈ యాదాము తన పెద్దకొడుకు కయీను చిన్నకొడుకు హేబెలును చంపగా చూచాడు. అదే లోకంలో తొలి మరణం. ఇప్పుడు మళ్ళా కయీను సంతతివారిని చెప్పదగిన యూదులు హేబెలులాగ నీతిమంతుడయిన క్రీస్తుని వధిస్తున్నారు.

ఆరవ వాక్యాన్ని ప్రభువు క్రిందికిజూస్తూ ఉచ్చరించాడు. కాని ఈ యేడవ వాక్యాన్ని పైకిజూస్తూ ఉచ్చరించాడు. అనగా అతడు ఈ భూమిమీద నుండి తండ్రి చెంతకు వెళ్ళగోరాడు. కాలాన్ని దాటి అనంతంలో అడుగిడ గోరాడు.

దుడుకు చిన్నవాడు దూరదేశాన్నుండి తండ్రి యింటికి తిరిగివచ్చాడు. యూదులు ఐగుప్తు ప్రవాసంనుండీ, తర్వాత బాబిలోను ప్రవాసంనుండీ వాగ్దత్తభూమికి తిరిగి వచ్చారు. అలాగే క్రీస్తుకూడ ముప్పైమూడేండ్లు ఈ లోక ప్రవాసంలో గడిపి తండ్రి యింటికి తిరిగి వెళ్తున్నాడు. ఆలా వెళ్తూ అతడు పల్కిన మాటలు "తండ్రీ! నీ చేతుల్లోకి నా యాత్మను సమర్పిస్తున్నాను" అని. ఈ వాక్యాన్ని గూడ అతడు ఓ ప్రార్థనగా జపించాడు. ఇది 31వ కీర్తనలోని 5వ వాక్యం.

"నా యాత్మను నీ చేతుల్లోకి అప్పగిస్తున్నాను
విశ్వసనీయుడవైన ప్రభూ! నన్ను రక్షించేది నీవే"

ఈ కీర్తనలో భక్తుడు తన్ను తాను భగవంతుని చేతుల్లోకి అర్పించుకొంటున్నాడు. ఆపదల్లోనుండి తన్ను కాపాడేది ప్రభువేనని విశ్వసిస్తున్నాడు. కనుకనే క్రీస్తు చివరి గడియల్లో ఈ ప్రార్థనను జపించాడు. తన ఆత్మనూ ప్రాణాన్నీ జీవితాన్నంతటినీ తండ్రి చేతుల్లోపెట్టి నిశ్చింతగా కన్నుమూసాడు.

మనలనందరినీ మృత్యువు లాగుకొనిపోతుంది. ఇష్టం లేకపోయినా ఏడుస్తూ చావుకి లొంగిపోతాం. కాని క్రీస్తుని మృత్యువు ఆలా నిర్బంధం చేయలేదు. అతడు స్వేచ్ఛగా మనకొరకు ప్రాణాలర్పించాడు. బుద్ధిపూర్వకంగా మృత్యువుని ఆహ్వానించాడు. అతడు మనలాగ తప్పనిసరయి చనిపోలేదు. ఇష్టపూర్తిగా చనిపోయాడు. మనలాగ దుఃఖిస్తూ మరణించలేదు. సంతోషంగా కన్ను మూసాడు.

మనం మృత్యుకాలం మన పరలోక జీవితాన్ని నిర్ణయిస్తుంది అనుకొంటాం. మంచి చావు చనిపోతే మోక్షమూ చెడ్డచావు చనిపోతే నరకమూ సిద్ధిస్తాయి అని భావిస్తాం. కాని యథార్థంగా మన మృత్యుకాలంకాదు, మన జీవితకాలమే పరలోక జీవితాన్ని నిర్ణయిస్తుంది. తండ్రి చిత్తాన్ని పాటిస్తూ మంచి జీవితం జీవించేవాళ్ళకి మంచి మరణమూ మోక్షభాగ్యమూ వాటంతట అవే లభిస్తాయి. ఇక క్రీస్తు జీవితాంతమూ తండ్రి చిత్తాన్ని పాటించాడు. నరుల పాపవిమోచనం కొరకు తన ప్రాణాన్ని బలిపెట్టాడు. అలా బలిపెట్టడం ద్వారా తాను ప్రదర్శించిన సోదరప్రేమ అనన్య సామాన్యమైందని రుజువు చేసాడు - యోహా 15,13. ఈలాంటి క్రీస్తు ఇప్పుడు సంతోషంగా చనిపోక దుఃఖిస్తూ చనిపోతాడా?

కొన్ని పెద్దగ్రహాలు చాలయేండ్ల తర్వాత తమ ఆకాశ ప్రయాణాన్ని ముగించుకొని మళ్ళా తమ పూర్వస్థానాన్ని చేరుకొంటాయి. ఆలా చేరుకొని తమ గమన రీతులను నిర్ణయించిన సృష్టికర్తకు మౌనంగా చేయెత్తి నమస్కరిస్తాయి. ఆలాగే క్రీస్తుకూడ తండ్రి తనకు నిర్ణయించిన ఇహలోక సంచారాన్ని ముగించుకొన్నాడు. స్వీయార్పణం ద్వారా నరులను విమోచించాడు. దానికి ముప్పైమూడేండ్లకాలం పట్టింది. ఇప్పుడు మళ్ళా తన్ను పంపిన తండ్రి వద్దకు తిరిగిపోయాడు. అతని సన్నిధిలో ఆసీనుడయ్యాడు, అతని కీర్తిలో తానూ పాలు పొందాడు. పూర్వవేదంలో "ప్రభువు" అనే బిరుదం తండ్రికి ఒక్కడికే చెల్లుతుంది. ఆ తండ్రి కుమారుడు సాధించిన మానవ విమోచనాన్ని మెచ్చుకొని ప్రభువు అనే తన బిరుదాన్ని ఆ కుమారునికి గూడ ఇచ్చి సత్కరించాడు. ఇకమీదట ప్రభువు అనే బిరుదాన్ని ధరించిన ఈ క్రీస్తుకి త్రిలోకవాసులందరూకూడ శిరం వంచి నమస్కారం చేయాలి - ఫిలిప్పి 2,9-11.

ఈ లోక పాపాలను పరిహరించే గొర్రెపిల్ల సాయంకాలం మూడుగంటలకు కొండకొమ్మున ప్రాణాలు విడుస్తూండగా అదే సమయంలో క్రింద యెరూషలేం పట్టణలో పాస్క విందుకు గొర్రెపిల్లలను వధిస్తున్నారు. పాపపరిహారానికి యూదులు వాటి నెత్తుటిని పీఠంమీద చిలకరిస్తారు. వాటి మాంసాన్ని భుజిస్తారు. ఈ తంతు పూర్వం ఐగుప్తులో జరిగిన మొదటి పాస్కబలిని పునశ్చరణం చేస్తుంది. పాస్క గొర్రెపిల్లలను వధించేదినాన్నే, అదే సమయంలోనే, క్రీస్తునికూడ చంపారు. తొలి పాస్క విందు జరిగిందీ, కయీను హేబెలును వధించిందీ, దేవుడు అబ్రాహాముతో నిబంధనం చేసికొందీ, అబ్రాహాము ఈసాకుని బలి యీయడానికి తీసికొనిపోయందీ, యేసావు తన జ్యేష్ఠభాగాన్ని తమ్మునికి అమ్ముకొందీ ఈ దినాన్నేనని రబ్బయిలు నుడివారు. వాళ్ళ మాటల్లో ఎంత సత్యముందో మనకు తెలియదు. ఒక్కటి మాత్రం నిజం. ఈ దినాన దేవుని గొర్రెపిల్లను కొండకొమ్మున బలి యిచ్చారు. ఒక్కసారి మాత్రమే అర్పింపబడిన ఈ యేకైక బలివలన మన పాపాలు శాశ్వతంగా పరిహారమయ్యాయి - హెబ్రే 10,10.

"తండ్రీ! నా ప్రాణాలను నీ చేతుల్లోకి అర్పిస్తున్నాను" అని చెప్తూ జీవం విడిచాడు క్రీస్తు. జీవితాంతమూ దైవప్రేమతో జీవించి దైవకార్యాన్ని సంపూర్ణంగా నెరవేర్చిన నరునికి ఇంతకంటె దివ్యమైన మరణం వుండదు. క్రీస్తు మరణాన్ని ఆదర్శంగా తీసికొని భక్తులు చాలమంది ఇదే వాక్యాలను ఉచ్చరిస్తూ తనువు చాలించారు. ఐతే క్రీస్తు తండ్రి చేతుల్లోకి లాగే వీళ్ళు క్రీస్తు చేతుల్లోకి తమ ప్రాణాలను అర్పించుకొన్నారు. దేవుడికి మానవుడికి మధ్య మధ్యవర్తి ఒక్కడు, క్రీస్తు. మన పాపాలను విమోచించి మనలను తండ్రి ఇంటికి చేర్చేవాడు అతడే. మరి అతని చేతుల్లోకి గాకపోతే మరెవరి చేతుల్లోకి మన ప్రాణాల నర్పించుకొంటాం? కనుకనే స్తెఫను భక్తుడు "యేసు ప్రభూ! నీవు నా యాత్మను స్వీకరించు" అంటూ ప్రాణాలు విడిచాడు - ఆచ 7,59. క్రీస్తు శిష్యులమైన మనంకూడ ఈలాంటి ధన్యమైన మరణం మరణిస్తే ఎంత బాగుంటుంది?

స్వేచ్ఛాపరుడైన నరుని చిట్టచివరి కార్యం మరణం. క్రీస్తు తన మరణాన్ని దేవుని కర్పించినట్లే మనంకూడ మన మరణాన్ని క్రీస్తుద్వారా దేవునికి అర్పించాలి. మనం ఉదయకాల సమర్పణంలో రోజువారి పనులను దేవునికి అర్పిస్తూంటాం. కాని ఈ పనులు మన జీవితానికి చెందినవి. అవి మన జీవితమనే చెట్టుమీద కాసిన పండ్లు. ఈ పండ్లను దేవునికి అర్పించడం మంచిదే. ఐనా ఆ చెట్టునే దేవునికి అర్పిస్తే ఇంకా యోగ్యంగా వుంటుంది. అనగా మన జీవితాన్నీ మరణాన్నీ ఆ ప్రభువు చేతుల్లోకి అర్పించుకొంటే ధన్యాత్ములమౌతాం. వేయేల, మనం క్రీస్తుతో బాధలనుభవిస్తే అతనితో మహిమను పొందుతాం - రోమా 8,27. "క్రీస్తు అనుభవించిన కష్టమా! నాకు ఓదార్పు దయ చేయండి. నా మరణ సమయంలో నన్ను నీ సన్నిధికి రాజేయండి" అని ప్రార్థించాడు ఇగ్నేష్యసు లొయోలా. ఈ భాగ్యం కోసమే మనమూ వేడుకోవాలి.

# 7. తెరువబడిన హృదయం

బైబులు భాష్యం - 54

## విషయసూచిక



# 1. యేసు ప్రక్కను బల్లెంతో పొడవడం

## 1. యేసు ప్రక్కను బల్లెంతో పొడవడం

సిలువమీద చనిపోయిన యేసు ప్రక్కను సైనికులు బల్లెంతో పొడిచారు. యోహాను సువార్త 19, 33-37 ఈ సంఘటనను ఈలా వర్ణిస్తుంది. 33, "సైనికులు యేసు దగ్గరికి వచ్చినపుడు అతడు అప్పటికే మరణించి వుండడం చూచి అతని కాళ్లు విరుగగొట్ట లేదు. 34 కాని సైనికుడొకడు అతని ప్రక్కను బల్లెంతో పొడిచాడు. వెంటనే నెత్తురూ నీరూ స్రవించాయి. 35. దీనిని చూచినవాడు సాక్ష్యం చెప్తున్నాడు. అతని సాక్ష్యం నమ్మదగినదే. మీరును విశ్వసించడానికి అతడు సత్యం చెప్తున్నాడని అతనికి తెలుసు. 36. "అతని యెముకల్లో ఒకటిగూడ విరుగగొట్టబడదు" అనే లేఖనం నెరవేరేటట్లుగా ఈ సంఘటనలు జరిగాయి. 37, "వాళ్లు తాము పొడిచినవాని వంక చూస్తారు" అని మరో లేఖనం కూడ చెప్తుంది".

పై వాక్యాల్లో రెండంశాలు ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి. మొదటిది, సువిశేషకారుడు అప్రధానంలా కన్పించే ఓ అంశాన్ని పేర్కొన్నాడు. అదేమిటంటే క్రీస్తు ప్రక్కను బల్లెంతో పొడవడం. సైనికులు వచ్చేటప్పటికే క్రీస్తు చనిపోయాడు. అతన్ని బల్లెంతో పొడిచినందువల్ల ఎక్కువ బాధేమీ కల్గదు. క్రీస్తు కాళ్ళను విరగగొట్టలేదు కాని, ఒకవేళ విరగగొట్టినా అతనికి బాధేమీ కలిగేది కాదు. కనుక ఈ సంఘటనలు వట్టినే యాదృచ్ఛికంగా జరిగిన అప్రధానాంశాలేమో ననిపిస్తాయి. రెండవది, ఈలా అప్రధానంలా కన్పించే అంశాన్నే

సువిశేషకారుడు చాల నొక్కి చెప్పాడు. యోహాను "దీనిని చూచినవాడు సాక్ష్యం చెప్తున్నాడు. అతని సాక్ష్యం నమ్మదగినదే" అంటున్నాడు. అనగా ఈ సంఘటనం యథార్థంగానే జరిగిందని నొక్కి చెప్తున్నాడు. ఇది చాలదో అన్నట్లు "అతడు సత్యం చెప్తున్నాడని అతనికి తెలుసు" అని ఒట్టుగూడ పెట్టుకొంటున్నాడు.

ఈ వొట్టుకూడ సువిశేషకారునికి తృప్తి కలిగించలేదు. కనుక అతడు రెండు ప్రవచనాలను ఉదాహరించి క్రీస్తు ప్రక్కను పొడవడమనే సంఘటనం యథార్థంగానే జరిగిందని నిరూపించాడు. అతని యెముకల్లో ఒకదాన్ని గూడ విరుగగొట్టరు, వాళ్లు తాము పొడిచిన వానివంక చూస్తారు అనేవి యీరెండు ప్రవచనాలు. యోహాను సువిశేషంలో ఇంతగా నొక్కి చెప్పిన సంఘటనం మరొకటి లేదు. అతడు క్రీస్తుశ్రమలను గూర్చి ఇంతగా నొక్కి చెప్పలేదు. కడకు అతని మరణాన్ని గూర్చిగూడ ఇంత గట్టిగా చెప్పలేదు. క్రీస్తు చనిపోగా నేను చూచాను, ఇది వాస్తవంగా జరిగిన సంఘటనం అని వ్రాయలేదు. కాని అతడు క్రీస్తు ప్రక్కను పొడవడాన్ని మాత్రం నొక్కి చెప్పాడు. అనగా ఈ సంఘటనను అతడు అతిముఖ్యంగా భావించి వుండాలి.

పైరెండు ప్రవచనాలు ఏమి నిరూపిస్తాయి? క్రీస్తు ప్రక్కను పొడవడమనేది యాదృచ్ఛికంగా జరగలేదనీ, దేవుడు ఆ సంఘటనను ముందుగానే నిర్ణయించాడనీ అర్థం చేసికోవాలి. ఇంకో విషయంగూడ. సిలువవేయబడినవాళ్లు త్వరలో చనిపోవడానికి వాళ్ళ కాళ్ళు విరుగగొట్టేవాళ్లు. అంతేగాని వాళ్ళ ప్రక్కను బల్లెంతో పొడిచేవాళ్లు కాదు. అలాచేయడం యూదుల చట్టానికీ రోమను చట్టానికీ గూడ విరుద్ధం. ఈలా చూచినాగూడ ఇది అసాధారణ విషయమేనని తెలుస్తుంది. కనుక దేవుడు ఈ సంఘటనాన్ని ప్రత్యేకంగా నిర్ణయించాడనే అర్థం చేసికోవాలి. కనుకనే శ్రీహృదయ పూజలో వచ్చే ఓ ప్రార్థనం "ఓ ప్రభూ! సిలువమీద వ్రేలాడే నీ యేకైక కుమారుణ్ణి సైనికుడు బల్లెంతో పొడవాలని నీవు నిర్ణయించావు" అని చెప్తుంది.

## 2. రెండు ప్రవచనాలు

సిలువమీద వ్రేలాడే క్రీస్తుకి రెండు కార్యాలు జరిగాయి. అతని కాళ్ళను విరుగగొట్టలేదు, అతన్ని బల్లెంతో పొడిచారు. ఈరెండు క్రియలూ జరుగుతాయని పూర్వవేద ప్రవచనాలు చెప్తున్నాయి కూడ. ఈ ప్రవచనాలను కొద్దిగా పరిశీలిద్దాం.

### 1. మొదటి ప్రవచనం :

అతని యెముకల్లో ఒకటిగూడ విరుగగొట్టబడదు అనే ప్రవచనం నిర్గమకాండం 12, 46 నుండి ఉదాహరింపబడింది. యిస్రాయేలీయులు ఐగుప్తునుండి బయలుదేరక

ముందు గొర్రెపిల్లను బలిగా అర్పించి దాని మాంసాన్ని భుజించాలి. దాని యెముకల్లో ఒకదాన్ని కూడ విరుగగొట్ట కూడదు. తరువాత యూదులు వాగ్దత్త భూమిలో స్థిరపడి అక్కడ యేటేట ఈ సంఘటనను పునశ్చరణం చేసికొనేపుడు గూడ ఇదే నియమం వర్తిస్తుంది - సంఖ్యా 9, 12. అక్కడ కూడ వాళ్ళు గొర్రెపిల్ల ఎముకల్లో ఒక్కదాన్ని కూడ విరుగగొట్టకూడదు. ఈ రెండు సందర్భాల్లో కూడ ఈ నియమాన్ని చేసినవాడు ప్రభువే.

యోహాను ఈ నియమాన్ని, ఈ ప్రవచనాన్నీ ప్రభువుకి వర్తింపజేసాడు. యిస్రాయేలీయులు వధించిన పాస్క గొర్రెపిల్ల కేవలం సాంకేతికమైంది మాత్రమే. యథార్థమైన పాస్క గొర్రెపిల్ల క్రీస్తే. ఈ గొర్రెపిల్ల యెముకల్లో ఒక్కదాన్ని గూడ విరుగగొట్టకూడదు. కావుననే సైనికులు చనిపోయి సిల్వమీద వ్రేలాడే క్రీస్తు దగ్గరికి వచ్చికూడ అతని కాళ్ళు విరుగగొట్టకుండా వెళ్లారు. ఐగుప్తులో వధించిన గొర్రెపిల్ల యిస్రాయేలు ప్రజల దాస్యవిముక్తికి చిహ్నం. కాని సిలువమీద బలియైన ఈ గొర్రెపిల్ల నూత్న ప్రజలమైన మన దాస్య విముక్తికీ, మన పాపపరిహారానికీ చిహ్నం.

## 2. రెండవ ప్రవచనం

వాళ్లు తాము పొడిచినవాని వంక చూస్తారు అనే ప్రవచనం జెకర్యా గ్రంథం 12, 10-11 నుండి ఉదాహరింపబడింది.

"నేను దావీదు వంశజులకును యెరూషలేము పౌరులకును
కరుణనూ ప్రార్థనశక్తినీ దయచేస్తాను
వాళ్లు తాము పొడిచినవాని వంక చూస్తారు
నరుడు తన యేకైక కుమారునికొరకు శోకించినట్లే
వాళ్లు అతనికొరకు శోకిస్తారు
జనుడు తన తొలిచూలి కుమారునికోసం దుఃఖించినట్లే
వాళ్ళు అతని కొరకు గాఢంగా దుఃఖిస్తారు".

యెషయా ప్రవచనంలోని బాధామయ సేవకునిలాంటి వ్యక్తి యొకడు జెకర్యా ప్రవచనంలో కూడ కన్పిస్తాడు. జెకర్యా చిత్రించిన ఈ వ్యక్తిని యోహాను సిలువమీద బాధలనుభవించే క్రీస్తునిగా గుర్తించాడు. ఈ ప్రవక్త ప్రవచనం ప్రకారం ప్రజలు మూర్ఖులై సేవకుణ్ణి పొడిచి చంపారు. అతడు చనిపోయాక వాళ్ళకు కనువిప్పు కలిగింది. దేవుడు వాళ్ళకు పశ్చాత్తాపం పుట్టించాడు. పుణ్యాత్ముడైన సేవకుణ్ణి చంపిన క్రూర ప్రజలే కడకు మనసు కరిగి అతని మరణానికిగాను శోకించారు. దేవుని అనుగ్రహం వలన వాళ్ళ మనసులు మారాయి. ఆ పుణ్యపురుషుని కొరకు వాళ్ళు దేవుణ్ణి మనవి చేసారు. ఆ

పొడువబడిన సేవకునివైపు దీనంగా చూచారు. యోహాను ఈ భావాలన్నిటినీ సిలువమీద వ్రేలాడే క్రీస్తుకి వర్తింపజేసాడు. పూర్వవేద ప్రజలు తాము పొడిచి చంపిన సేవకునివైపు కరుణతో జూచినట్లే నూత్నవేద ప్రజలు సిలువమీద పొడవబడిన క్రీస్తువైపు భక్తిభావంతో చూడాలి అన్నాడు.

క్రీస్తుకూడ తన బోధల్లో ఈ జెకర్యా భావాలను సూచించాడు. "మోషే యెడారిలో సర్పాన్ని ఎత్తినట్లే మనుష్యకుమారుడు కూడ ఎత్తబడతాడు" అన్నాడు - యోహా 3,14. ఇంకా "నేను భూమిమీదినుండి పైకెత్తబడినపుడు అందరినీ నా చెంతకు ఆకర్షిస్తాను" అన్నాడు - 12, 32. కనుక సిలువమీద పొడువబడిన సేవకుడు, క్రీస్తు, అందరినీ తన వైపుకి ఆకర్షించుకొంటాడు. భక్తిభావంతో, విశ్వాసంతో అతని వైపు చూచేవాళ్ళకు అతడు నిత్యజీవం దయచేస్తాడు.

యోహాను సిలువమీద వ్రేలాడే క్రీస్తుని సైనికుడు ఈటెతో పొడవడం కన్నులార చూచాడు. ఆ దృశ్యానికి అతని మనస్సు కరిగిపోయింది. కనుకనే ఆసంఘటనను నల్గురు సువిశేషకారుల్లోను అతడొక్కడే పేర్కొన్నాడు. దాన్ని గూర్చి నొక్కి చెప్పాడు. వేరే విషయాలను వర్ణించేపుడుగూడ యోహాను ఈ యంశాన్ని మర్చిపోలేదు. నాల్గవ సువిశేషంలో క్రీస్తు తోమాను ఆహ్వానించిన సందర్భంలో "నీచేయి చాచి నా ప్రక్కలో వుంచు" అంటాడు - 20, 27. అనగా ఈ యంశం యోహాను హృదయం మీద చెరగని ముద్ర వేసిందని చెప్పాలి. ఈ యద్భుత సంఘటనం మనకు కూడ భక్తిని పుట్టించాలి.

## 2. క్రీస్తు ప్రక్కలోనుండి నెత్తురు స్రవించడం

సైనికుడు క్రీస్తు ప్రక్కను ఈటెతో పొడవగా నెత్తురు స్రవించింది. - యో 19,34. యోహాను తన సువిశేషం కాక తాను వ్రాసిన మొదటి జాబులోకూడ ఈ యంశాన్ని పేర్కొన్నాడు. "క్రీస్తు జలంతోను రక్తంతోను వచ్చాడు. అతడు కేవలం జలంతోనే రాలేదు, జలంతోను రక్తంతోను వచ్చాడు" 1యోహా 5,6.

మొదట క్రీస్తు ప్రక్కలోనుండి కారిన రక్తాన్ని గూర్చి విచారిద్దాం. ఈ నెత్తురు ప్రధానంగా బలిని సూచిస్తుంది. క్రీస్తు మనకు పాస్క గొర్రెపిల్ల వంటివాడని చెప్పాంగదా? సిలువమీద అతడు నెత్తురుచిందించి ప్రాణత్యాగం చేసికొన్నాడు. ఇదే అతని బలి, అతని ఆత్మార్పణం. దీని ద్వారా మనకు పాపవిమోచనం కలిగింది. నూత్నవేదం చాలాతావుల్లో ప్రభువు నెత్తురు మనకు పాపపరిహారం చేసిపెడుతుందని చెప్తుంది. ప్రస్తుతానికి అలాంటి సందర్భాలను మూడింటిని మాత్రం పరిశీలిద్దాం.

1. క్షయవస్తువులైన వెండి బంగారాల వలన మీకు విమోచనం లభించలేదు. నిర్దోషమును నిష్కళంకమునైన గొర్రెపిల్లవంటివాడగు క్రీస్తు అమూల్యరక్తం ద్వారా మీకు విమోచనం లభించింది" - 1 పేత్రు 1, 18-19. పూర్వం బానిసల యజమానులకు వెండి బంగారాలు చెల్లించి ఆ బానిసలను దాస్యంనుండి విడిపించేవాళ్ళు. మనం పాపంద్వారా పిశాచానికి బానిసలమై యున్నపుడు క్రీస్తు నశ్వర వస్తువులైన వెండి బంగారాలద్వారా మనలను విడిపించలేదు. మరి తన నెత్తుటిద్వారా అతడు మనలను పాపదాస్యంనుండి విడిపించాడు. ఆ నెత్తురు అమ్యూలమైనది. అనగా విలువకట్టరానిది. అతడు నిర్దోషి, నిష్కల్మషుడు. అనగా మహా పవిత్రుడు. దేవుని కుమారుడు. అట్టివాని నెత్తురు ఎంత పవిత్రమైయుండాలి? ఆలాంటి నెత్తురు మనకు విమోచనం కలిగించింది. - హెబ్రే 9, 13-14.

2. "నీవు బలి కావింపబడితివి
నీ రక్తం ద్వారా
ప్రతి జాతినుండి, భాషనుండి, ప్రజనుండి, తెగనుండి
దేవునికి నరులను కొనితెచ్చితివి" - దర్శ 5, 19

క్రీస్తు సిలువమీద బలియయ్యాడు. సొంత నెత్తురులు చిందించాడు. ఈలా అతడు మనలను పాపంనుండి విమోచించాడు. ఈ విమోచనం ద్వారా అతడు దేవునికి క్రొత్తప్రజలను సంపాదించి పెట్టాడు. ఈ ప్రజలను అన్నిదేశాల్లోనుండి, అన్ని జాతుల్లో నుండి వచ్చినవాళ్ళు. అనగా ప్రభువు తన సిలువ మరణం ద్వారా అందరినీ దేవుని ప్రజలను చేసాడని భావం.

3. పూర్వవేదంలో సీనాయి కొండ దగ్గర దేవుడు యిస్రాయేలు ప్రజలతో నిబంధనం చేసికొన్నాడు. ఆ నిబంధనం నెత్తురుద్వారా జరిగింది. మోషే కోడె నెత్తుటిని ప్రజలమీద చల్లుతూ "ఇది ప్రభువు మీతో చేసికొన్న నిబంధన రక్తం" అన్నాడు - నిర్గ 24,8. ఇది ప్రాత నిబంధనం. క్రీస్తు తన నెత్తుటితో మళ్ళీ మనతో నిబంధనం చేసికొన్నాడు. అతడు ద్రాక్ష సారాయపు పాత్రను అందుకొని కృతజ్ఞతాస్తుతులు చెల్లించి మీరందరూ ఈ పాత్రలోని రక్తాన్ని త్రాగండి. ఇది అనేకుల పాపపరిహారానికి చిందబడనున్న నిబంధనపు నా రక్తం" అన్నాడు - మత్త 26,28. ఇక్కడ "నిబంధనపు నా రక్తం" అనడం ద్వారా క్రీస్తు సీనాయి నిబంధనాన్ని జ్ఞప్తికి తెచ్చుకొన్నాడు. ఆ నిబంధన ద్వారా యిస్రాయేలీయులు యావే ప్రజలయ్యారు. ఈ నిబంధన ద్వారా మనం క్రీస్తు ప్రజలమౌతాం. ఆ నిబంధనం ఎద్లనెత్తుటితో జరిగింది. కాని ఈ నిబంధనం క్రీస్తు సొంత నెత్తుటితోనే జరిగింది. దానికంటే యిది ఎంతో శ్రేష్ఠమైంది.

క్రీస్తు శ్రమననుభవించడం మొదలు పెట్టినప్పటినుండి, విశేషంగా సిలువ నెక్కినప్పటినుండి, నెత్తురు చిందిస్తూనే వున్నాడు. అతడు తన మరణం దాకా, ఆ మరణం ముగిసి అతని ప్రక్కను ఈటెతో తెరచాక గూడ, నెత్తురు కార్చాడు. ఈ పవిత్ర రక్తమే మనకు పాపవిమోచనం కలిగించింది. సిలువ మీద అతని ప్రక్కనుండి కారినది అతని నెత్తుటిలో చివరిబొట్లు అనుకోవాలి. ఈ నెత్తుటిద్వారానే అతడు మనతో ప్రేమపూర్వకమైన నూత్ననిబంధనం చేసికొన్నాడు. ఆ ప్రభువు ప్రేమను అర్థంచేసికోవడానికి పై వేదవాక్యాలు ఉపయోగపడతాయి.

# 3. క్రీస్తు ప్రక్కలో నుండి నీళ్లు కారడం

## 1. జలాలు స్రవించడం

క్రీస్తు ప్రక్కను బల్లెంతో పొడువగా నీళ్ళు స్రవించాయి - యోహా 19, 34. ఈ నీళ్ళు పరిశుద్ధాత్మనూ, మెస్సీయా కొనివచ్చే వరప్రసాదాలనూ సూచిస్తాయి. పూర్వవేదంలోను నూత్నవేదంలోను చాల వేదవాక్యాలు జలాలు ప్రవహించడాన్ని గూర్చి చెప్తాయి. ఈ యాలోకనాలు క్రీస్తు ప్రక్కలో నుండి కారిన నీటిని కొంతవరకు సూచనంగా వుంటాయి. ప్రస్తుతం ఈలాంటి వాక్యాలను ఆరింటిని పరిశీలిద్దాం.

1. యిస్రాయేలీయులు సీను ఎడారిలో ప్రయాణం చేసేప్పుడు నీళ్ళు దొరక్క బాధపడ్డారు. మోషేమీద గొణిగారు. మోషే యావే యాజ్ఞపై పూర్వం తాను నైలునదిని కొట్టిన బెత్తంతో రాతిబండను మోదాడు. వెంటనే ఆ బండనుండి అద్భుతంగా నీళ్లు వెలువడ్డాయి. ప్రజలు వాళ్ళ పశువులు ఆ నీళ్లు త్రాగారు - నిర్గ 17,1-7. మోషే రాతిబండను కొట్టినట్లే సైనికుడు క్రీస్తుప్రక్కను బల్లెంతో పొడిచాడు. ఆ రాతిబండ నుండి జలం స్రవించినట్లే, క్రీస్తు ప్రక్కలో నుండి కూడ నీళ్ళు కారాయి. పౌలు, మోషే కొట్టిన రాయి క్రీస్తుకి చిహ్నంగా వుంటుందని చెప్తూ ఈలా వ్రాసాడు. "యిస్రాయేలీయులందరూ ఆధ్యాత్మికమైన ఒకే పానీయాన్ని త్రాగారు. వాళ్ళు తమతో పాటు ప్రయాణం చేసిన ఆధ్యాత్మిక శిలనుండి దాహం తీర్చుకొన్నారు. ఆ శిల క్రీస్తే" - 1కొరి 10,4.

2. "మీరు ఆనందంతో రక్షణపు చెలమనుండి నీరు చేదుకొంటారు" అంటుంది యెషయా ప్రవచనం 12, 3. ఈ రక్షణపు చెలమ ఈటెతో తెరువబడిన క్రీస్తు హృదయమే. దానినుండి స్రవించేది రక్షణనొసగే జలం.

3. "దేవాలయం క్రిందినుండి ఒకయేరు పారుతుంది. అది దేవళం కుడివైపునుండి పారుతుంది. ఆ యేరు పారేకాడల్లా రకరకాల మృగాలూ చేపలూ జీవిస్తాయి. ఆ యేటి

వొడ్డుమీద రకరకాల ఫలవృక్షాలు పెరుగుతున్నాయి. ఆ చెట్ల ఆకులు ఏనాడూ వాడవు. ఆ చెట్లు ప్రతినెలా పండ్లు కాస్తాయి. ఆ ఫలాలు ఆహారానికీ, ఆ యాకులు మందుకీ పనికివస్తాయి" అని చెప్తుంది యెహెజ్కేలు ప్రవచనం 47, 1-12. దేవళంనుండి వెలువడే యేరు పంటలు పండించి కాయలు కాయించి ప్రాణదానం చేస్తుందని ఈ వాక్యాల భావం. ఈ యేరు కూడ క్రీస్తు ప్రక్కలో నుండి కారిన నీటిని సూచిస్తుంది. ఈ నీరు మనకు జీవాన్ని ప్రసాదిస్తుంది. తన హృదయంలో నుండి జీవజల నదులు ప్రవహిస్తాయని ప్రభువే పేర్కొన్నాడుకదా? - యోహా 7, 38.

4. "ఆ దినాన ఒక క్రొత్త ఊట వెలువడుతుంది. దాని నీరు దావీదు వంశజులనూ యెరూషలేము ప్రజలనూ పాప మాలిన్యం నుండి కడిగి శుద్ధి చేస్తుంది" అని చెప్తుంది జెకర్యా ప్రవచనం 13, 1. ఈ వూట కూడ బల్లెంతో తెరవబడిన క్రీస్తు ప్రక్కనే సూచిస్తుంది. ఆ ప్రభువు హృదయం నుండి కారిన జలాలు మన హృదయాన్ని కడిగి శుద్ధి చేస్తాయి.

5. "అటుతరువాత దేవదూత జీవనదీ ప్రవాహాన్ని నాకు చూపించాడు. అది దేవుని సింహాసనంనుండీ, గొర్రెపిల్ల సింహాసనం నుండీ వెలువడుతూంది. స్ఫటికంలా మెరుస్తూంది. నగరమధ్య మార్గంగుండా ప్రవహిస్తూంది. ఆ నదికి రెండుప్రక్కలా జీవవృక్షాలు వున్నాయి. అవి నెలకు ఒకమారు చొప్పున ఏడాదికి పండ్రెండుసార్లు కాపు కాస్తాయి. ఆ చెట్ల ఆకులు ప్రజల గాయాలను మాన్పుతాయి" అని చెప్తుంది దర్శన గ్రంథం 22, 1-2. పూర్వం పేర్కొనిన యెహెజ్కేలు ప్రవచనాన్ని మనసులో పెట్టుకొని ఈ వాక్యాలు వ్రాసాడు యోహాను. ఈ ప్రవాహం కూడ క్రీస్తు ప్రక్కలో నుండి కారిన జలాన్నే సూచిస్తుంది.

6. ప్రభువు సమరయ స్త్రీతో ఈ బావిలోని నీళ్ళు త్రాగేవాళ్ళకు మళ్ళా దప్పిక కలుగుతుంది. కాని నేనిచ్చే నీళ్ళు త్రాగేవాడికి ఇక యెన్నటికీ దప్పిక కలుగదు. నేనిచ్చే నీళ్ళు నిత్యజీవానికై అతనిలో వూరే నీటి బుగ్గగా తయారౌతాయి" అన్నాడు - యోహా 4, 13-14. ఈ వాక్యం కూడ ప్రభువు ప్రక్కలోనుండి కారిన నీటిని సూచిస్తుంది. ఆ నీళ్లు క్రీస్తు హృదయంలో నుండి మన హృదయంలోనికి ప్రవహిస్తాయి. మన యెదలో బుగ్గగా ఊరతాయి. మన దప్పికని శశ్వతంగా తీరుస్తాయి.

ఈ విధంగా జలాలు స్రవించడాన్ని గూర్చి చెప్పే పై వేదవాక్యాలు క్రీస్తు ప్రక్కలోనుండి కారిన నీటిని సూచిస్తాయి. కాని యీ వుదాహరణాలన్నీ ఒక యెత్తు, యోహాను 7,37-38 ఒక్కటే ఒక యెత్తు. ఈ యాలోకనం క్రీస్తు ప్రక్కలోనుండి కారిన నీటిని సూటిగా పేర్కొంటుంది. కనుక దీన్నిగూర్చి కొంచెం విపులంగా పరిశీలిద్దాం.

## 2. జీవజల నదులు

"పండుగ చివరిరోజు ముఖ్యమైనది. ఆదినం యేసు నిలచి బిగ్గరగా, దప్పికగొన్నవాడు నాయొద్దకు వచ్చి తన దప్పిక తీర్చుకోవచ్చు. లేఖనం చెప్పినట్లు, నన్ను విశ్వసించేవాని అంతరంగం నుండి జీవజలనదులు ప్రవహిస్తాయి అని చెప్పాడు" - అంటుంది యోహాను సువార్త 7, 37-38.

ప్రాచీన గ్రీకు లిఖితప్రతుల్లో ఈ వాక్యాలకు పాఠాంతరం కూడ వుంది. అది యిది. "దప్పికగొన్నవాడు నా యొద్దకు రావచ్చును. నన్ను విశ్వసించేవాడు దప్పిక తీర్చుకోవచ్చును. లేఖనం చెప్పినట్లు అతని (క్రీస్తు) అంతరంగం నుండి జీవజల నదులు ప్రవహిస్తాయి".

ఇక్కడ జీవజల నదులు ఎవరి అంతరంగం నుండి ప్రవహిస్తాయి? మొదటి పాఠం ప్రకారం క్రీస్తుని నమ్మిన భక్తుని అంతరంగంనుండి ప్రవహిస్తాయి. కాని రెండవ పాఠంప్రకారం అవి క్రీస్తు అంతరంగం నుండే ప్రవహిస్తాయి. బహుశ ఈ రెండవదే మెరుగైన పాఠం కావచ్చు. ఐనా ఈ రెండిటికీ అంత పెద్ద వ్యత్యాసం ఏమీ లేదు. జీవజల నదులు మొదట పుట్టేదేమో క్రీస్తు అంతరంగంలోనే. అవి ప్రవహించేదేమో ఆ క్రీస్తుని నమ్మిన భక్తుని అంతరంగంలోకే.

కాని యిక్కడ "జీవజలనది" అంటే యేమిటి? "ఆయన తన్ను విశ్వసించేవాళ్ళు పొందబోయే ఆత్మనుగూర్చి ఈ జీవజలనది అనే మాటను వాడాడు" అని చెప్తుంది యోహాను సువిశేషం 7, 39. కనుక ఈ జీవజలనది పరిశుద్ధాత్మే. ఈ యాత్మ మెస్సీయా కొనివచ్చే సకల వరప్రసాదాలకూ చిహ్నంగా వుంటుంది. ఈ జీవజలనది ప్రవచనం. తరువాత సిలువమీద క్రీస్తు పార్శ్వం నుండి యథార్థంగా కారిన నీళ్ళు ఈ ప్రవచనానికి నెరవేరుదల. ఈ యంశాన్ని మీదట విపులంగా పరిశీలిస్తాం.

ఇక్కడ క్రీస్తు "జీవజలనదులు ప్రవహిస్తాయి" అనే మాటలను పల్కిన సందర్భాన్ని కొంచెం పరిశీలించి చూద్దాం. పాలస్తీనాదేశం మన దేశంలాగే ఉష్ణదేశం. ఆదేశంలో నీళ్లు చాల ముఖ్యమైనవి. నీళ్ళు లేకపోతే పైరుపంటలూ ప్రాణులూ అన్నీ నశిస్తాయి. కనుక బైబులు సంప్రదాయంలో నీళ్ళు జీవానికే చిహ్నమయ్యాయి. మనం ఆధ్యాత్మిక జీవనం అని పేర్కొనే దాన్ని బైబులు జలంతో ఉపమిస్తుంది. అందుచేత బైబులు భాషలో జలం అంటే దివ్యజీవనం.

యెరూషలేములో గుడారాల పండుగ జరుగుతూంది. యూదులు ఉత్సవాలన్నిటి లోను ఇది మిక్కిలి ఆనందకరమైనది. ఈ పండుగ ఏడురోజులపాటు జరిగేది. కడచినయేడు

పండిన పంటలకు దేవునికి వందనాలు అర్పించడానికీ, రానున్న యేడుకూడ మంచిపంటలు దయచేయమని అడుగుకోవడానికీ యూదులు ఈ పండుగ చేసుకొనేవాళ్ళు.

ఏడవనాడు ఒక పెద్ద ప్రదక్షిణం జరిగేది. చేతుల్లో పచ్చని కొమ్మలు పట్టుకొని ప్రజలు గుంపులు గుంపులుగా వచ్చేవాళ్ళు. ప్రదక్షిణం గీహోను ఊటదగ్గరికి వెళ్ళేది. ప్రధాన యాజకుడు బంగారు కూజాను తీసికొనివెళ్ళి ఆ చెలమలో నీళ్ళు ముంచుకొని ఆ నీటిని ప్రదక్షిణంతో దేవళంలోనికి తీసికొనివచ్చి అచట బలినర్పించే పీఠంపైన కుమ్మరించేవాడు. ఆ సందర్భములో అతడు పూర్వం ఎడారిలో మోషేకు రాతిబండనుండి నీళ్ళు లభించిన ఉదంతాన్ని ప్రజలకు జ్ఞప్తికి తెచ్చేవాడు. ఆలాగే ప్రభువు సకాల వర్షాలు కురిపించి యిస్రాయేలు ప్రజలకు నీళ్ళు దయచేయాలని ప్రార్థించేవాడు.

ఈలాంటి ఉత్సవసందర్భంలో క్రీస్తు దేవళం ముందటి వసారాలలో నిల్చుండి దప్పిక గొన్నవాళ్ళు తన దగ్గరికివచ్చి దాహం తీర్చుకోవచ్చునని ప్రకటించాడు. పూర్వవేదం నుడివే జలశిలా, జీవజలమూ, జీవజలాల ఊట అన్నీ తానేనని నుడివాడు.

ప్రభువు అంతరంగంలోనుండి జీవజలం వెలువడుతుందని చెప్పాం. ఈ జీవజలం అతని ప్రక్కలోనుండి కారబోయే నీటిని సూచిస్తుందన్నాం. ఈ నీరు ఆత్మకు చిహ్నంగా వుంటుందని కూడా చెప్పాం. ఇక యిదేలాగో పరిశీలిద్దాం.

## 3. క్రీస్తు ప్రక్కలోనుండి ఆత్మ వెలువడ్డం

మనం ఆత్మను ఎప్పుడు పొందుతాం? ఆత్మ చాలా గొప్పవ్యక్తి, చాల గొప్పవరం. ఆ యాత్మను మనం ఒక్కసారే పూర్తిగా పొందలేం. మన హృదయం సిద్ధమైన కొద్దీ, మనభక్తి కొద్దీ, జీవితంలో చాలా పర్యాయాలు ఆత్మను పొందుతూనే వుంటాం. క్రీస్తు ఉత్థానమైన దినాన శిష్యులు ఆత్మను పొందారు. ఉత్థానక్రీస్తు వాళ్ళకు కన్పించి వాళ్ళమీద గాలివూది మీరు ఆత్మను పొందండి అన్నాడు. - యోహా 20, 22. ఆలాగే వాళ్లు పెంతెకోస్తు దినానగూడ ఆత్మను పొందారు. ఆ దినం వాళ్ళంతా పరిశుద్ధాత్మతో నిండిపోయారు. - అచ 2,4. ఈలా శిష్యులు ఆత్మను పొందిన సందర్భాలు చాలావున్నాయి. ఈలాగే క్రీస్తు ప్రక్కలోనుండి నీళ్ళు కారడంగూడ ఆ యాత్మ వేంచేసిన సందర్భాల్లో ఒకటి అనుకోవాలి.

యోహాను సువిశేషంలో క్రీస్తు జీవజల నదులు ప్రవహిస్తాయి అన్నపుడు ఆత్మ వస్తుందని ప్రవచించాడు - 7, 38. సిలువమీద అతని ప్రక్కలో నుండి నీళ్ళు కారినపుడు ఈ ప్రవచనం నెరవేరింది - 19,34. ఇక్కడ క్రీస్తు ప్రక్క అంటే క్రీస్తు హృదయం అని అర్థంచేసికోవాలి. కనుక అతని హృదయంలో నుండి జలం, లేక ఆత్మ వెలువడింది. ప్రభువు మనకు ఆత్మను దయచేసిన సందర్భం ఇదొక్కటే కాకపోవచ్చు. కాని ఆ సందర్భాల్లో ఇది కూడా ఒకటి అనాలి.

మనలాగా ప్రాచీన క్రైస్తవులు శ్రీ హృదయభక్తిని ఎరుగరు. కాని వాళ్ళకు క్రీస్తు గాయాలపట్ల, విశేషంగా అతని ప్రక్కలోని గాయంపట్ల, అపారమైన భక్తి వుండేది. రానురాను క్రైస్తవ ప్రజలు క్రీస్తు ప్రక్కలోని గాయంలో అతని హృదయాన్ని గుర్తించడం మొదలెట్టారు. ఇది ఆత్మ ప్రేరణంవల్ల జరిగింది. అనగా తొలిరోజుల్లో అంత స్పష్టంగా లేని శ్రీ హృదయ భక్తి రానురాను స్పష్టమైందన్నమాట.

శ్రీహృదయ ఉత్సవపూజలోని "ప్రెఫేస్" ప్రార్థన ఈలా చెప్తుంది. "క్రీస్తు సిలువమీది కెత్తబడినపుడు మన కొరకు ప్రాణాలర్పించాడు. మనపట్ల అతనికిగల ప్రేమ అంత గొప్పది. గాయపడిన అతని ప్రక్కలో నుండి నీళ్ళూ నెత్తురూ స్రవించాయి. ఈ ప్రక్కయే శ్రీసభలోని సంస్కారాలన్నిటికీ ఆధారం. రక్షకుడు తెరువబడిన తన హృదయంలోనికి నరులందరినీ ఆహ్వానిస్తాడు. ఆ రక్షణపు ఊటనుండి మనం ఆనందంతో జలాన్ని స్వీకరించవచ్చు". క్రీస్తు హృదయం ఆత్మకూ, వరప్రసాదాలకూ, రక్షణకూ నిలయమని ఈ ప్రార్థనం భావం. ఫలితాంశమేమిటంటే, క్రీస్తు ప్రక్కలోనుండి లేదా అతని హృదయంలో నుండి ఆత్మ వెలువడుతుంది. కనుక శ్రీ హృదయానికీ ఆత్మకీ చాల దగ్గరి సంబంధం వుంది. శ్రీహృదయభక్తి ఆత్మభక్తికి దారిదీస్తుంది. ఆత్మభక్తి శ్రీహృదయభక్తిని అధికం చేస్తుంది. అవి పరస్పర సహాయకారులు.

## 4. దివ్యసత్ప్రసాదమూ, జ్ఞానస్నానమూ, శ్రీసభా

క్రీస్తు ప్రక్కలోనుండి కారిన నెత్తురు అతడు పాస్క గొర్రెపిల్లలాగ బలికావడాన్ని సూచిస్తుందని చెప్పాం. అతని ప్రక్కలో నుండి కారిన నీళ్లు ఆత్మనీ వరప్రసాదాలనీ సూచిస్తాయని చెప్పాం. కాని ప్రాచీన పితృపాదులు ఈ రక్తజలాలకు పై యర్థాలనేగాక వేరే అర్థాలనుగూడ చెప్పారు. ఈ యంశాన్ని ప్రస్తుతం పరిశీలిద్దాం.

క్రీస్తు పార్శ్వం నుండి కారిన రక్తం అతని స్వీయబలితోపాటు దివ్యసత్ప్రసాదాన్ని గూడ సూచిస్తుంది. దివ్యసత్ప్రసాదమంటే ప్రభువు శరీరరక్తాలే కదా? ఆ రక్తమే అతని పార్శ్వం నుండి వెలువడింది.

క్రీస్తు పార్శ్వం నుండి కారిననీళ్ళు ఆత్మతోపాటు, వరప్రసాదాలతోపాటు, జ్ఞానస్నానాన్నిగూడ సూచిస్తాయి. నీళ్ళతోనే గదా మనం జ్ఞానస్నానం పొందేది? జ్ఞానస్నానానికీ ఆత్మకీ వరప్రసాదానికీ దగ్గరి సంబంధం వుంది. జ్ఞానస్నానంలో మనం ఆత్మను పొందుతాం. ఈ యాత్మే మనకు అన్ని వరప్రసాదాలనూ దయచేసేది. కనుకనే తండ్రి అన్ని భాగ్యాలకూ మారు పేరుగా ఆత్మను మనకు దయచేస్తాడు - లూకా 11,13. మెస్సీయా మన కొరకు కొనివచ్చే సకల భాగ్యాలుకూడ ఈ యాత్మలోనే యిమిడి వుంటాయి.

ఇక, దివ్యసత్ప్రసాదం జ్ఞానస్నానం అనే సంస్కారాలు శ్రీసభను నిర్మిస్తాయి. కనుక ఈ సంస్కారాలు పుట్టినచోటనే శ్రీసభకూడ పుట్టింది. సిలువమీద తెరువబడిన క్రీస్తు పార్శ్వం నుండి, అనగా అతని హృదయం నుండి, శ్రీసభ ఉద్భవించింది. విశ్వాసులమైన మనమే ఈ శ్రీసభ.

నిద్రపోయిన మొదటి ఆదాము ప్రక్కలోనుండి ఏవ ఉద్భవించింది కదా! అలాగే సిలువమీద మరల నిద్రించిన రెండవ ఆదాము క్రీస్తు ప్రక్కలోనుండి రెండవ యేవలాగ శ్రీసభ ఉద్భవించింది.

పూర్వం నోవా ఓడకట్టి దానికొక ద్వారాన్ని నిర్మించాడు. జలప్రళయంవల్ల నాశంగాకుండా బ్రతికివుండే జంతువులన్నీ ఈ రంధ్రంగుండా ఓడలో ప్రవేశించి చావుని తప్పించుకొన్నాయి. ఈలాంటి రంధ్రం కల్గిన నోవావోడ తెరువబడిన క్రీస్తు పార్శ్వానికి సంకేతంగా వుంటుందని చెప్పాడు అగస్టీను భక్తుడు.

# 4. శ్రీహృదయ భక్తి

క్రీస్తు పార్శ్వమంటే అతని హృదయమే. అతని హృదయంలో నుండి వెలువడిన నెత్తురునీళ్ళ భావాలు పరిశీలించి చూచాం. ఈ యధ్యాయంలో మనం ఆ హృదయంపట్ల చూపవలసిన భక్తిభావాలను పరిశీలిద్దాం.

## 1. శ్రీహృదయం మనకు ఆశ్రయస్థానం

సైనికుడు క్రీస్తు ప్రక్కను ఈటెతో పొడిచి తెరవడాన్ని గూర్చి చెప్తూ నాల్గవ శతాబ్ద భక్తుడైన క్రిసోస్తం ఈలా వ్రాసాడు. "ఆ సైనికుడు పరిశుద్ధదేవాలయం గోడకు కన్నంవేసాడు. ఆ దేవాలయంలోని నిధి నాకంటబడింది. వెంటనే నేను దాన్ని స్వాధీనం చేసికొన్నాను". క్రిసోస్తం పేర్కొన్న ఈనిధి శ్రీహృదయమే.

సిలువమీద ప్రభువు హృదయం తెరువబడినప్పటి నుండి అది భక్తులకు ఆశ్రయస్థానమైంది. భక్తులు చాలమంది తాము ఆ హృదయంలో వసించినట్లుగా చెప్పుకొన్నారు. ఈ భావాలను కొంచెం పరిశీలిద్దాం.

పదమూడవ శతాబ్దపు భక్తుడైన బోనవెంచర్ ఈలా వ్రాసాడు. "ప్రభువు హృదయంలో వసిస్తే ఎంతో ఆనందంగా వుంటుంది. ప్రభూ! నేను నీకు ప్రార్థన చేస్తున్నాను. ఈ మనవిని నీవు ఆలించే జపాల్లో చేర్చు. నన్ను పూర్తిగా నీ హృదయంలోనికి రాబట్టుకో. ప్రభూ! నీ ప్రక్కను ఈటెతో ఎందుకు పొడిచారు? మేము నీ హృదయంలోకి ప్రవేశించే మార్గం ఏర్పడ్డానికే గదా! మేము ఈ ప్రపంచ వ్యామోహాల నుండి వైదొలగి నీ హృదయంలో నివాసం ఏర్పరచుకోవడానికే గదా!

ఈటె క్రీస్తు ప్రక్కను పొడిచి గాయంచేసింది. కొండబండలో నెర్రె ఏర్పడింది. ఆనెర్రెలో పావురాళ్ళు వసిస్తాయి. క్రీస్తు భక్తుడా లే! రాతి నెర్రెలో గూడుకట్టుకొనే పావురం లాగే నీవుకూడ తెరువబడిన క్రీస్తు హృదయంలో నివాసమేర్పరచుకో!"

ఈ భక్తుడు భావించినట్లు క్రీస్తు హృదయం మనకు ఆశ్రయస్థానం. శోధనల్లో అది మనం తలదాచుకొనే దుర్గం. శ్రమల్లో బడలికల్లో అది మనకు విశ్రాంతి స్థానం. పాపులమైన మనకు అది రక్షణస్థానం.

శ్రీహృదయ దర్శనాలు పొందిన 18వ శతాబ్దపు భక్తురాలు మార్గరెట్ మేరి ఈలా నుడివింది. "మనం ప్రభువు హృదయంలోనికి ప్రవేశించి అతని ప్రేమను అనుభవానికి తెచ్చుకొంటే అతనికి ప్రీతిపాత్రులంగా జీవించవచ్చు. ప్రభువు భక్తులంతా అతని హృదయంలోనే వసిస్తారు. ఆ హృదయం ఆనందకరమైన నివాసం. దానిలో వసించేవాళ్ళు ఏ యపాయాలకీ గురికారు, ఏ శోధనలకీ లొంగరు". ఈ పునీతురాలు నుడివినట్లుగా క్రైస్తవభక్తుడు క్రీస్తు హృదయంలో వసించడం అలవాటు చేసికోవాలి. ఆ ప్రభువు ప్రేమని అర్థంచేసికొని అతనికి బదులు ప్రేమను చూపడం అభ్యాసం చేసికోవాలి.

## 2. క్రీస్తుహృదయం ప్రేమకు చిహ్నం

"మీరుకూడ విశ్వసించడానికి అతడు సత్యం చెప్తున్నాడని అతనికి తెలుసు" అన్నాడు యోహాను తన సువిశేషంలో - 19, 37. క్రీస్తు ప్రక్కను యథార్థంగా ఈటెతో పొడిచారు అన్నది ఇక్కడ యోహాను చెప్పిన సత్యం. కాని ఈ సత్యాన్ని తెలిసికొని మనం ఏమి విశ్వసిస్తాం? క్రీస్తు ప్రక్కనీ హృదయాన్నీ తెరిచారు అనే సత్యాన్ని గుర్తించి మనం తండ్రి ప్రేమనీ, క్రీస్తుప్రేమనీ విశ్వసించాలి.

తండ్రి మనలను ప్రేమించాడు అనడానికి ప్రబల తార్కాణం క్రీస్తుని పంపడమే. దేవుడు లోకాన్ని ఎంతో ప్రేమించి తనఏకైక కుమారుణ్ణి పంపాడు. ఆ కుమారుణ్ణి ప్రేమించే ప్రతినరుడూ నాశం కాకుండా నిత్యజీవం పొందడానికై తండ్రి ఆలా చేసాడు". - యోహా 8,16. కనుక నరుడుగా అవతరించిన క్రీస్తు తండ్రి ప్రేమకు తార్కాణం. ఆ తండ్రి మనలను ప్రేమించి మన పాపవిమోచనకు క్రీస్తుని పంపాడు. - 1యో 4,10. కనుక క్రీస్తు సిలువమరణమూ, అతని ప్రక్కను ఈటెతో పొడవడమూ, తండ్రి ప్రేమను చాటిచెప్తాయి.

సిలువమీద తెరువబడిన క్రీస్తు పార్శ్వం తండ్రి ప్రేమను మాత్రమేగాదు, క్రీస్తు ప్రేమనుగూడ యెలుగెత్తి చాటుతుంది. ప్రభువు మనకొరకు ఆత్మార్పణం చేసికొన్నాడు. స్నేహితుల కొరకు ప్రాణాన్ని దారబోసే వానికంటే ఎక్కువ ప్రేమగల వాడెవడూలేడు. -

యోహా 15, 13. క్రీస్తుమరణం అతని ప్రేమకి ప్రధాన చిహ్నం. "క్రీస్తు మనలను ప్రేమించాడు. దేవునికి ప్రీతినిగూర్చే సువాసనతో కూడిన అర్పణంగాను బలిగాను తన్ను తాను అర్పించుకొన్నాడు" – ఎఫె 5,2. కనుక ప్రభువు సిలువ మరణం ద్వారాను, అటు తర్వాత అతని ప్రక్కను తెరవడం ద్వారాను అతని ప్రేమ రుజువైంది.

ప్రభువు తన్ను ప్రేమించినవాళ్ళని కడపటిదాకా ప్రేమించాడు. గాఢంగా ప్రేమించాడు – యోహా 13,1. తన ప్రేమను నిరూపించుకోవడానికే అతడు హృదయాన్ని ఈటెతో పొడిపించు కోవడానికి అంగీకరించాడు. ఆ హృదయం కట్టకడపటి నీటిబొట్లూ నెత్తురుబొట్లూ ఒలికి, ఇక యింతకంటె గొప్ప ప్రేమ లోకంలో యెక్కడా లేదని నిరూపించింది.

ఏ సంస్కృతిలోనైనా, ఏ భాషలోనైనా హృదయం ప్రేమకి చిహ్నం గదా? బైబుల్లోగూడ హృదయం ప్రేమకి గుర్తే. కనుక సిలువమీద పొడవబడిన, తెరవబడిన, క్రీస్తు హృదయం అతని ప్రేమకు చిహ్నంగా వుంటుంది. కావున క్రీస్తు హృదయమంటే క్రీస్తుప్రేమ అన్నమాట. బోనవెంచరు భక్తుడు ఈలా వ్రాసాడు. "ఈటెతో పొడవడంవల్ల క్రీస్తుహృదయం గాయపడింది. ఈ గాయం మనకంటికి కనిపిస్తుంది. కాని మన కంటికి కన్పించే ఈ గాయం మన కంటికి కన్పించని శ్రీ హృదయం ప్రేమగాయానికి గుర్తుగా వుంటుంది".

ఈ హృదయం కేవలం క్రీస్తు ప్రేమకు చిహ్నం మాత్రమే కాదు. ప్రండెండవ భక్తినాథ పోపుగారు నుడివినట్లు, మన రక్షణమంతాగూడ సంగ్రహంగా దానిలో ఇమిడి వుంది. ఆ ప్రభువు మనకొరకు తన హృదయాన్నే అర్పించాడు. ఆ హృదయమే, దానిలోని ప్రేమే, మనకు రక్షణాన్ని ఆర్జించిపెట్టింది.

మన రక్షణకు కారణమైన ఈ హృదయం కరుణాపూరిత మైందికూడ. నేడు మనకు కావలసిన వరప్రసాదాలన్నీ ఈ హృదయంనుడే లభిస్తాయి. కనుక మనం ఈ హృదయాన్ని భక్తిభావంతో ధ్యానించుకోవాలి.

# 5. భక్తుల ప్రార్థనలు

శతాబ్దాల పొడుగునా భక్తులు శ్రీహృదయంపట్ల భక్తిని జూపుతూ వచ్చారు. ఆ పుణ్యాత్ములు తమ భక్తిభావాలను ప్రార్థనల్లో వెలిబుచ్చారు. అలాంటి ప్రార్థనలను కొన్నిటిని ఇక్కడ పొందుపరుస్తున్నాం.

ముందే చెప్పినట్లు, తొలి శతాబ్దాల్లో ప్రత్యేకంగా శ్రీ హృదయభక్తి అంటూ యేమీ లేదు. ప్రాచీన క్రైస్తవులు క్రీస్తు ప్రక్కలో తగిలిన గాయంపట్ల గాఢమైన భక్తిని చూపేవాళ్ళు.

ఆగాయం క్రీస్తు ప్రేమకు నిదర్శనమని భావించేవాళ్లు. ఈ భక్తే క్రమేణ శ్రీహృదయ భక్తిగా మారింది. 17వ శతాబ్దంలోని భక్తురాలు మర్గరీత మరియమ్మకు ప్రభువు దర్శనమిచ్చి తన హృదయాన్ని చూపించాడు. అప్పటినుండి శ్రీహృదయ భక్తి బాగా వ్యాప్తిలోకి వచ్చింది.

ఇక భక్తులు క్రీస్తు ప్రక్కలోని గాయాన్నీ, అతని హృదయాన్నీ, ప్రేమనీ స్మరించుకొని చేసిన ప్రార్థనలను తిలకిద్దాం.

## 1. హృదయమందిరం

ప్రభూ! నేను నీ హృదయంలో వసిస్తే ఎంత బాగుంటుంది!
నా హృదయంలోని ఆలోచనలతోను భావాలతోను
నేను నీ హృదయంలోనికి ప్రవేశించాలని నా కోరిక
నీ హృదయం దేవాలయంలాంటిది
దైవసాన్నిధ్యంగల మందసంలాంటిది
ఈ హృదదయ మందిరంలో నేను నిన్నారాధిస్తాను
నీకు నా మనవులు విన్నవించుకొంటాను
నా సోదరుడవు, స్నేహితుడవు, రాజువునైన
నీ హృదయాన్ని నేను దర్శించగలిగాను
ఈలాంటి హృదయానికి నేను మ్రొక్కలు చెల్లించవద్దా?
అసలు నీ హృదయమే నా హృదయం
కనుకనే నేను నీ హృదయానికి ప్రార్థన చేస్తున్నాను
నా వేడికోలు నీ యెదదలోనికి ప్రవేశించుగాక
నీవు నా మొర ఆలింతువుగాక
పావనమూర్తివైన నీవు నా మాలిన్యాన్ని కడిగివేయి
నా చిన్న తప్పిదాలనుగూడ తుడిచివేయి
పరిశుద్ధమూర్తివైన నీ వలన శుద్ధినిపొంది
నేను నీ హృదయమందిరంలోనికి ప్రవేశిస్తాను
జీవితాంతమూ ప్రతిరోజూ అక్కడే వసిస్తాను
ఆ పవిత్ర మందిరంలో నీ దివ్యచిత్తాన్ని తెలిసికొంటాను
దాన్ని పాటించే శక్తినికూడ పొందుతాను.

– భక్తుడు బెర్నార్డు, 12వ శతాబ్దం

## 2. ప్రభువు హృదయాన్ని కనుగొన్నాను

ప్రభూ! నీ హృదయం గొప్ప నిధి
పవిత్రమైన నీ దేహక్షేత్రంలో
దొరికే వెలలేని ముత్యం నీ హృదయం
ఈ ముత్యాన్ని ఆశింపనివాడెవడు?
నేను నా రత్నాలన్నిటినీ వెచ్చించి
నా భావాలనూ ప్రేమలనూ అమ్మివేసి
ఈ యమూల్య మణిని కొంటాను
ప్రభూ! నేను నా బాధలన్నిటినీ
నీ హృదయంముందు పెడుతున్నాను
నీవు నన్ను తప్పక కరుణిస్తావు
నా సోదరుడవు, స్నేహితుడవు, రాజువునైన
నీ హృదయాన్ని నేను కనుగొన్నాను
నీ హృదయమే నా హృదయంకూడ
కనుకనే నేను నీ హృదయానికి మనవిచేస్తున్నాను
నా యీ వేడికోలును నీ వాలించే ప్రార్థనల్లో చేర్చు
నన్ను నీయెదదలోనికి ప్రవేశింపనీయి
మాకు నీ హృదయంలోనికి మార్గం లభించడానికే
ఆనాడు నీ ప్రక్కని యీటెతో పొడిచి తెరిచారు,
నేను ఈ ప్రపంచ వ్యామోహాలనుండి వైదొలగి
నీ హృదయంలో వసించడానికే
ఆనాడు నీ గుండెను పొడిచి గాయపరిచారు,
కంటికి కన్పించే నీ యెదదలోని గాయంద్వారా
కంటికి కన్పించని నీ ప్రేమగాయాన్ని మేము దర్శించడానికే
ఆనాడు నీ హృదయాన్ని గాయపర్చారు
నీ దేహాన్ని మాత్రమేకాక హృదయాన్నికూడ
ఈలా యీటెతో గాయపర్చారు అంటే
నీ ప్రేమ యెంత గాఢమైందో తెలిసిపోతుంది
నీ హృదయంలోని ఈ గాయం
నీ మనసులోని ప్రేమకు సాక్ష్యంగా వుంటుందికదా!

– భక్తుడు బోనవెంచరు, 13వ శతాబ్దం

## 3. క్రీస్తుతో ఐక్యత

నా రాజువూ రక్షకుడవూ ఐన ప్రభూ!
కరుణలేని యీటె మొనకు
నీ హృదయం తెరుచుకోవాలని నీవు చిత్తగించావు
నేను వినయంతో నీకు మొరపెట్టుకొంటున్నాను
నాకు నీ కరుణాకవాటం తెరువు
పవిత్రమైన నీ పార్శ్వంగుండ నన్ను లోనికి రానీయి
ప్రేమపూరితమైన నీ హృదయంలోనికి నన్ను ప్రవేశింపనీయి
నా హృదయం ఏనాటికీ నీ హృదయంనుండి
విడవడకుండా వుండేలా చేయి
ప్రభూ! నీ ప్రేమతో నా హృదయాన్ని గాయపరచు
ఆ సైనికుని యీటె నా గుండెలోనికి చొచ్చుకొనిపోయేలాచేయి
ఫలితంగా నా గుండెలో నీకు మాత్రమే చోటు వుండేలానూ,
పిశాచానికీ, ప్రపంచ వ్యామోహాలకూ దానిలో
తావు దొరకకుండా వుండేలానూ అనుగ్రహించు.

– ఒక కార్తూష్యను భక్తుడు, 15వ శతాబ్దం.

## 4. ప్రభువు హృదిలోనికి అడుగిడు

ప్రభువు ప్రక్కలోని పవిత్ర క్షతమా!
గాయాలన్నిటికంటె మధురమైన గాయమా!
భక్తులెల్లరూ ప్రవేశించడానికి
లోతుగా తెరువబడిన శ్రీహృదయమా! నీ కివే నా వందనాలు
ఈ యూటలోని జలాన్ని పానం జేసినవాడు,
ఈ చెలమలోని ప్రేమను చవిజూచినవాడు
తన బాధలన్నీ విస్మరిస్తాడు
ప్రపంచ వ్యామోహాలనూ శారీరకేచ్ఛలనూ జయిస్తాడు
అతని డెందం స్వర్గసౌఖ్యాలను ఆశిస్తుంది
అతని యుల్లం ఆత్మసాన్నిధ్యంతో నిండిపోతుంది
నిత్యజీవమిచ్చే జీవజలాల బుగ్గ అతని యెదలో వెల్లివిరుస్తుంది

ఆత్మమా! జాగుచేయక సిలువపై మరణించిన
ఆ క్రీస్తు పార్శ్వంలోనికి ప్రవేశించు
ప్రేమవలన తెరువబడిన ప్రభువు పార్శ్వంలోని
గాయంగుండా అతని హృదిలోనికి అడుగిడు

–టోమస్ అకెంపిస్, 15వ శతాబ్దం

## 5. మరణకాలంలో ఆశ్రయం

ప్రభూ! మీ యమ్మ కన్నులార జూస్తుండగానే
సైనికుడు క్రూర శూలంతో నీ హృదయాన్ని భేదించాడు
నీ వనుభవించిన ఘోరయాతనలకూ
నీవు చూపిన గాఢప్రేమకూ నా నమస్సులు
మంచితనానికి పెట్టిందిపేరు నీ హృదయం
నా హృదయాన్ని సంపూర్ణంగాను, సకల కాలంవరకూను,
దాని సమస్తాభిలాషలతోపాటూను,
నీ హృదయానికి కానుక బెడుతూన్నాను
నా జీవితకాలమంతాను, విశేషంగా నా మరణకాలంలో
నీ హృదయంలోని పవిత్రమైన గాయం
నా కాశ్రయమైతే అదే మహాభాగ్యం. – నికోలాస్ ఎస్కియస్, 16వ శతాబ్దం

## 6. ఆత్మార్పణం

ప్రేమమూర్తివైన ప్రభూ!
నా దేహాత్మలనూ సకలేంద్రియాలను నీకే అర్పిస్తున్నాను
నేను నీ హృదయక్షతాన్ని నమ్ముకొంటున్నాను
నన్ను ఆ పవిత్రమైన గాయంలో దాచివుంచుకో
పాపంనుండీ దురాశలనుండీ నన్ను కాపాడు
నా హృదయాన్ని, దాని యిష్టానిష్టాలతోపాటు,
అది చేసే పనులతోపాటు, అది తీసికొనే విశ్రాంతితోపాటు
నీ హృదయంలో దాచి వుంచు
ప్రభూ! నా మనోవాక్కాయకర్మలన్నిటికీ
ఆరంభమూ అంతమూ నీవే ఔదువుగాక!

– ఓ అజ్ఞాత రచయిత, 17వ శతాబ్దం

## 7. నన్ను నేను విస్మరించుకొనేలా చేయి

ప్రభూ! నన్ను నేను కాస్త విస్మరించుకొనేలా చేయి
నరుడు నీ హృదయంలోనికి ప్రవేశించే మార్గం ఇదొక్కటే
నన్ను నేను విస్మరించుకొని
నిన్ను స్మరించుకోవాలనే కోరికను
నీవే నా యెదలో పుట్టించావు
ఈ కార్యాన్ని సాధించే భాగ్యాన్ని గూడ నీవే దయచేయి
నీ సహాయం లేందే నేనీ యాశయాన్ని నెరవేర్చుకోలేను
నన్నునేను విస్మరించుకోవాలంటే నాకే కష్టంగా వుంటుంది
కాని ఈ కార్యాన్ని సాధించాలనే కోరిక మాత్రం నాలో వుంది
కనుక నీవే నాకు ఈ పని చేసిపెట్టు
ప్రభూ! నేను మోక్షాన్ని చేరుకొంటే
అది నీ కృప ఫలితమే ఔతుంది
అది నీకేకీర్తి తెచ్చిపెడుతుంది
అందుకే నేను నీ సన్నిధిని చేరుకోవాలని
ఏ ప్రొద్దూ ఉవ్విళ్ళూరుతూంటాను. – క్లోడ్ డెలా కొలంబియేర్, 17వ శతాబ్దం

## 8. హృదయార్పణం

మర్గరీత మరియనైన నేను, నన్ను నేను
పూర్తిగా క్రీస్తు శ్రీ హృదయానికి సమర్పించుకొంటున్నాను
నా జీవితాన్నీ పనులనూ సుఖదుఃఖాలనూ
ఆ ప్రభువు చేతుల్లో పెడుతున్నాను
అతని సేవలోనే జీవించి
అతని కీర్తికొరకే రోజులు సాగించాలని నా కోరిక
నేను పూర్తిగా క్రీస్తుకే చెంది వుండాలనీ
నేను చేసే పనులన్నీ ఆ ప్రభువు ప్రేమకొరకే చేయాలనీ
నా తిరుగులేని నిర్ణయం
రక్షకునికి నచ్చని కార్యాలన్నిటినీ
పరిత్యజించాలనిగూడ నా యభిమతం

ప్రభువు శ్రీహృదయమా!
నా ప్రేమనంతటినీ నీకే సమర్పిస్తున్నాను
ఈ జీవితంలో నన్ను కాపాడేవాడివి నీవే
నాకు రక్షణాన్ని దయచేసేది నీవే
నా పాపాలను పరిహరించేది నీవే
నా బలహీనతల్లో నన్నాదుకొనేది నీవే
మరణసమయంలో నా కాశ్రయమయ్యేది నీవే
కరుణగల ప్రభువు శ్రీహృదయమా!
తండ్రి యెదుట నీవు నా తరపున మనవిచేయి
పిత కోపాన్నుండి నన్ను కాపాడు
ప్రేమగల శ్రీహృదయమా! నేను నిన్నే నమ్ముకొన్నాను
నా బలహీనత నా కెంతైనా భయాన్ని పుట్టిస్తుంది
కాని నిన్ను స్మరించుకోగానే
నా కెంతైనా నమ్మకం కల్గుతుంది
నీ చిత్తాన్నెదిరించి నీకు అప్రియం కలిగించే గుణాన్ని
నాలోనుండి పూర్తిగా తొలగించు
నేను నిన్ను విస్మరించకుండా వుండేందుకు,
నీ నుండి విడివడిపోకుండా వుండేందుకు
నీ ప్రేమను నా యెదలో కుమ్మరించు
కరుణ గల ప్రభూ!
నీ పేరును నా హృదయంలో వ్రాసివుంచుకో
నీ సేవకురాలినిగా జీవించి, నీ భక్తురాలినిగా మరణించే
భాగ్యాన్ని నీవు నాకు ప్రసాదిస్తే అదే పదివేలు.

– భక్తురాలు మర్గరీత మరియ అలకోక్, 17వ శతాబ్దం

## 9. అమృతమయమైన జలాలు

ప్రభూ! సైనికుడు నీ ప్రక్కను శూలంతో పొడువగా
నీళ్లూ నెత్తురూ స్రవించాయని పరిశుద్ధ గ్రంథం చెప్తూంది
మేము నీ హృదయాన్ని భక్తిభావంతో ధ్యానించుకోగా

నీవు సిలువమీది నుండి మాకు ఈలా ఉపదేశం చేస్తావు
"దప్పికగొన్నవాళ్ళు నా చెంతకు రావచ్చు
నన్ను విశ్వసించేవాళ్ళు నా హృదయం నుండి స్రవించే
జీవజలాలను పానం చేయవచ్చు
జీవిత భారాలను మోయలేక యలసియున్నవాళ్ళంతా
నా చెంతకు రండి, నేను మీ యలసటలను తొలగిస్తాను"
ప్రభూ! మేము నీ దివ్య హృదయాన్నుండి,
రక్షణాన్ని దయచేసే నూతిలో నుండి లాగ,
అమృతమయమైన జలాలను ఆనందంతో సేవిస్తాం
పరిపూర్ణ జీవనాన్ని దయచేసేవాడివి నీవే
మా మాటల ద్వారా, అంతకంటే అదనంగా
మా చేతల ద్వారా, మా జీవితం ద్వారా కూడ
నీ ప్రేమకు సాక్షులంగావుండే భాగ్యాన్ని
మాకు తప్పక దయచేయి.

## 10. క్రీస్తు జీవిత ధ్యేయం

ప్రభూ! నీవు జీవితమంతా
నీ తండ్రి సేవలోనే గడిపావు
నీ జీవితంలోని ప్రతిక్షణాన్నీ
నరుల శ్రేయస్సు కొరకే వినియోగించావు
అన్ని విలువలకంటె పైవిలువ దేవుడేననీ
తోడి నరులకు సేవలు చేయడం ద్వారా గాని
ఆ దేవుణ్ణి పొందలేమనీ
మాటలతోను చేతలతోను నీవు మాకు బోధించావు
ఆనాడు సైనికుడు నీ గుండెను ఈటెతో పొడువగా
దానిలోని చివరి నెత్తురుబొట్టు కూడ కారిపోయింది
దీని ద్వారా నీ జీవితధ్యేయాన్ని నీవు మాకు
సంగ్రహంగాను స్పష్టంగాను బోధించినట్లయింది.

# 8. బైబులు భక్తుల ప్రార్థనలు

బైబులు భాష్యం - 148

## 1. అబ్రాహాము మనవి - ఆది 18,27-33

అబ్రాహాము సొదొమ గొమర్రా పట్టణాల కొరకు దేవునికి మనవిచేసాడు. ఆ నగరాల్లో 50 మంది భక్తిపరులుంటే వారిని కాపాడమని అడిగాడు. ఆ సంఖ్యను 45, 40, 30, 20,10 దాకా తగ్గిస్తూ వచ్చాడు. చివరకు ఆ నగరాల్లో పదిమంది భక్తిమంతులుకూడ లేరు. కనుక దేవుడు ఆ పురాలను నాశంచేయవలసి వచ్చింది. జనులు మంచివాళ్ళయినా చెడ్డవాళ్ళయినా మన తరపున మనం వారికొరకు ప్రార్థించవలసిందే. మన విజ్ఞాపనం వలన ఎందరికో మేలు కలుగుతుంది.

## 2. మోషే విజ్ఞాపనం - నిర్గ 32, 30-32

యిస్రాయేలు ప్రజలు ఈజిప్టునుండి బయలుదేరి రాగానే సీనాయి దగ్గర బంగారు దూడను కొల్చి యావేకు కోపం రప్పించారు. అతడు వారిని నాశంచేసి మోషేనుండి క్రొత్త ప్రజను పుట్టించాలనుకొన్నాడు. కాని మోషే అందుకు అంగీకరించలేదు. అతనికి ఆ ప్రజలంటే ప్రీతి. కనుక అతడు నీవు ఈ ప్రజల పాపాన్ని మన్నించనైనా మన్నించు, లేదా నీ జీవగ్రంథం నుండి నాపేరు కొట్టివేయనైనా కొట్టివేయి అని మనవిచేసాడు. యూదులు దేవుడు తన భక్తుల పేర్లను ఓ గ్రంథంలో వ్రాసివుంచుకొంటాడనీ, వారిని తప్పక రక్షిస్తాడనీ నమ్మారు. ఇక్కడ మోషే చిత్తశుద్ధి మనకు ఆశ్చర్యం కలిగిస్తుంది. అతడు తన ప్రజ నాశమైతే తన పేరునుగూడ జీవ గ్రంథంనుండి తుడిచివేయాలని కోరుకొన్నాడు. తాను జాతిపిత కావడం, తన సంతానం కనాను దేశాన్ని ఆక్రమించుకోవడం ముఖ్యంకాదు. యావే ఎన్నుకొన్న ప్రజ బ్రతికిపోవడం ముఖ్యం. స్వార్థం లేనివాళ్ళేగాని గొప్ప ప్రార్థనలు చేయలేరు.

## 3. నన్ను చంపివేయి - సంఖ్యా 11, 10-15

యిస్రాయేలు ప్రజలకు ఏడారిలో మాంసం తినాలనే కోరిక పుట్టింది. వాళ్ళు మోషేమీద నిష్ఠురాలు పలికారు. అతనికి వారిమీద జాలి కలిగింది. అతడు ప్రభూ! నేను ఈ ప్రజల బాధను చూడలేను. నేను వీరిని ఓ తల్లిలా కనలేదు. ఓ దాదిలా ఎత్తుకొని

తిప్పలేదు. నీవే వీరికి తల్లివి, దాదివి. ఇప్పుడు వీరికి మాంసాన్ని దయచేయవేని నన్ను చంపివేయి. అప్పుడు నేను వీరి బాధను కన్నులార చూడను అని ప్రార్థన చేసాడు. మహాభక్తులు ప్రజల కొరకు ఎంతటి త్యాగాన్ని చేయటానికైనా సిద్ధంగా వుంటారు.

## 4. ఐగుప్తీయులు ఆడిపోసికోరా? - ద్వితీ 9,26-29

యిస్రాయేలీయులు తలబిరుసు జనం. వాళ్లెప్పుడూ దేవునిమీద తిరగబడేవాళ్ళు. కనుక దేవుడు వారిని హతమార్చాలనుకొన్నాడు. మోషే వారికొరకు విజ్ఞాపనం చేసాడు. దేవా! నీవు ఈ ప్రజను నాశంజేస్తే ఐగుప్తీయిలు నిన్ను ఆడిపోసికోరా! యావే ఈ ప్రజను కనాను దేశానికి చేర్చలేక మోసంతో ఎడారిలో చంపివేసాడని నిన్ను నిందించరా అని మొరపెట్టాడు. అతని వేడుకోలును ఆలించి దేవుడు ఆ ప్రజల తప్పిదాలు క్షమించాడు పునీతులు దేవునికి పసిబిడ్డల్లాగ నిష్కపటంగా ప్రార్థన చేస్తారు.

## 5. దేవుని ముఖకాంతి మీపై ప్రకాశించుగాక - సంఖ్యా 6, 24-26

యాజకులు యిస్రాయేలును ఈలా దీవించేవాళ్లు. "యావే మిమ్ము దీవించి కాపాడునుగాక. తన ముఖకాంతిని మీపై ప్రకాశింపజేయునుగాక. మిమ్ము కృపతో జూచి మీకు సమాధానము దయచేయునుగాక". ప్రభువు దీవెన మనకు అండ. అతని ముఖకాంతి మనపై బడినపుడు మనం బ్రతికిపోతాం. అతని కరుణవల్ల మనకు శాంతి లభిస్తుంది. ఇది మంచి ప్రార్థనం. మనమందరం చెప్పుకోదగింది. దేవుని దీవెనే మనకు అండ.

## 6. శాపానికి మారుగా దీవెన - 2 సమూ 16,5-13

దావీదు సౌలు కుటుంబాన్ని యుద్ధంలో నాశం జేసాడు. తర్వాత దావీదు కుమారుడు అబ్షాలోమే తండ్రిని నగరంనుండి తరిమివేసాడు. దావీదు పారిపోతూండగా సౌలు అనుయాయి షిమీ అతన్ని తిట్టాడు. అతనిమీద రాళ్ళు రువ్వాడు. సౌలుని నాశంచేసినందుకు దేవుడు నీకు శాస్తి చేసాడులే అని పల్కాడు. దావీదు అనుచరులు అతన్ని శిక్షింపబోయారు. కాని ఆ రాజు "దేవుడే ఇతన్ని నామీదికి పురికొల్పి వుండవచ్చు. ప్రభువు నా దైన్యాన్ని గుర్తించి ఇతని శాపానికి మారుగా నాకు దీవెనలు ఇస్తాడు" అని పల్కాడు. అవమానంలో గూడ అంతటి వినయాన్ని చూపిన ఆరాజు మహా భక్తుడై యుండాలి. వినయంతో గూడిన ప్రార్థన దేవునికి ఎంతో ప్రీతి కలిగిస్తుంది. అల్పులమైన మనం దేవుని ముందు చాగిలపడాలి.

## 7. దేవాలయ ప్రార్థన - 1 రాజు 8,30-40

సొలోమోను ఏడేండ్లు శ్రమించి దేవాలయాన్ని కట్టి దాన్ని దేవునికి అంకితం చేసాడు. ఆ సందర్భంలో అతడు సుదీర్ఘమైన ప్రార్థన చేసాడు. ఇది బైబుల్లోని గొప్ప ప్రార్థనల్లో వొకటి. ప్రజలు పశ్చాత్తాపపడినపుడు దేవుడు వారి మొర వినాలి. కరువు కాటకాల్లో మొరపెట్టినపుడు దేవుడు వానలు కురిపించాలి. యిస్రాయేలీయులు యుద్ధాల్లో ప్రార్థన చేసినపుడు వారికి విజయాన్ని ప్రసాదించాలి. వ్యాధిబాధలు అంటు రోగాల్లో వేడుకొంటే దేవుడు ఆ బాధలు తొలగించాలి. సొలోమోను ప్రార్థనం మనకుకూడ జపం నేర్పుతుంది.

## 8. రాజు బాధ్యతలు - 1 రాజు 3,6-10

సొలోమోను యువకుడుగా వున్నపుడే రాజయ్యాడు. తండ్రి దావీదుకున్న అనుభవం అతనికి లేదు. కనుక అతడు గిబ్యోను పుణ్యక్షేత్రంలో దేవునికి ప్రార్థన చేసాడు. ప్రజలను మంచిచెడ్డలెంచి పరిపాలించే వరాన్నీ, వారికి న్యాయబుద్ధితో తీర్పుచెప్పే వివేకాన్నీ దయచేయమని వేడుకొన్నాడు. దేవుడు సంతోషించి అతనికి విజ్ఞానమూ సిరిసంపదలూ అన్నీ ప్రసాదించాడు. ప్రజలను చక్కగా పరిపాలించడం, న్యాయబుద్ధితో తీర్పులు చెప్పడం రాజధర్మాలు. ఇక్కడ సొలోమోను రాజుగా తన బాధ్యతను తాను నెరవేర్చాలని వేడుకొన్నాడు. నేడు మనంకూడ మన బాధ్యతలను సంతృప్తికరంగా నెరవేర్చే భాగ్యాన్ని దయచేయమని దేవుణ్ణి అడుగుకోవాలి.

## 9. మా పాపాలు సముద్ర గర్భంలో పడవేయి - మీకా 7,18-19

బైబులు భగవంతుడు కరుణామయుడు. నరుల పాపాలను పూర్తిగా క్షమించేవాడు. కనుక మీకా ఈలా ప్రార్థించాడు. "స్వామీ! నీవు మా పాపాలను నీ కాళ్లతో త్రొక్కి నాశంజేయి. వాటిని విసరి సముద్ర గర్భంలో పడవేయి". సముద్రంలో పడిన వస్తువు తిరిగిరాదు. పూర్తిగా నాశమౌతుంది. దేవుడు మన పాపాలనుకూడ ఈలాగే ధ్వంసం చేయాలనిభావం. మనం పాపసంకీర్తనం చేసికొనేపుడు ఈ వేదవాక్యాలు ధ్యానింపదగినవి. పాపాలకు పశ్చాత్తాప పడేపుడూ వీటిని వాడుకోవచ్చు.

## 10. నేను నీ పలుకులు భుజించాను - యిర్మీ 15, 16-18

యిర్మీయా మహా ప్రవక్త. అతడు చాల శ్రమలు అనుభవించాడు. ప్రజలు అధికారులు అతనికి శత్రువులయ్యారు, ఆ శ్రమల్లో అతడు దేవుణ్ణి శరణు వేడాడు. నేను నీవాణ్ణి. నీ దాసుణ్ణి అని చెప్పుకొన్నాడు. ప్రవక్తగా దేవుడు అతనితో మాట్లాడేవాడు.

అతడు దేవుని వాక్కులను జాగ్రత్తగా ఆలించేవాడు. వాటిని అన్నంలాగా ప్రీతితో భుజించేవాడు. ఆ పలుకులు అతనికి ఆనందాన్ని కలిగించాయి. అతడు ప్రజల ఆనందాల్లో పాల్గొనలేదు. దేవుడే నా ఆనందం అనుకొని వంటరిగా వుండిపోయాడు. నేడు మనం ప్రభువు వాక్యాన్ని శ్రద్ధతో పఠించి, భక్తితో మననం చేసికోవాలి. దాన్ని అన్నంలాగ భుజించి ఆధ్యాత్మిక బలాన్ని పొందాలి.

## 11. నీ వాక్కు నా హృదయంలో అగ్నిలా - యిర్మీ 20,9

ప్రభువు తన వాక్కునెత్తి యిర్మీయా నోటిలో పెట్టాడు. కాని ప్రజలు అతని బోధలు వినలేదు. అతని నోరు నొక్కేయాలని చూచారు. ప్రభువు పలుకు మాత్రం యిర్మీయా హృదయంలో వుండి అగ్నిలా మండజొచ్చింది. నీవు నన్ను ప్రజలకు బోధించు, బోధించు అని ప్రవక్తను నిర్బంధం చేసింది. ప్రవక్త ఆ యగ్నిని ఆపుకోలేక బోధ చేసాడు. ప్రజలు మాత్రం అతని బోధను పెడచెవిని బెట్టారు. వేదబోధకులకు ఆంతరంగికమైన తపన వుండాలని ఈ సంఘటనం మనకు నేర్పుతుంది. బోధకుడు దైవశక్తితో, ఆంతరంగిక ప్రేరణతో బోధించాలి.

## 12. ఓనియా యిర్మీయాల ప్రార్థన -2 మక్క 15, 12-16

యూదా గ్రీకు సైనికాధికారియైన నికానోరుతో యుద్ధం చేస్తున్నాడు. అతడు దర్శనంలో ప్రధాన యాజకుడైన ఓనియాను చూచాడు. ఆ యుద్ధకాలంలో ఓనియా యూదుల విజయం కొరకు ప్రార్థన చేస్తున్నాడు. అటుపిమ్మట యూదా దర్శనంలో యిర్మీయా ప్రవక్తను గూడ చూచాడు. ఈ ప్రవక్త యూదులను గాఢంగా ప్రేమించి వారికొరకూ పవిత్ర నగరం కొరకూ ప్రార్థన చేస్తున్నాడు. అతడు యూదాకు బంగారు కత్తినిచ్చి దీనిని దేవుడు నీకు కానుకగా పంపాడు. నీవు దీనితో శత్రువులను హతమార్చు అని చెప్పాడు. ఈ యిద్దరు ప్రార్థనామూర్తుల జపాల ఫలితంగా తర్వాత యూదా శత్రువులను జయించాడు. కష్టాల్లో ఆపదల్లో ప్రార్థన మనకు విజయాన్ని చేకూర్చి పెడుతుందని ఈ కథ భావం. కనుక మన శ్రమల్లో మనం తప్పక దేవుని శరణు వేడాలి.

## 13. హిజ్కియా ప్రార్థనం - యెష 37, 9-19

అస్సిరియా రాజైన సన్హెరీబు యూదా మీదికి దండెత్తి వచ్చాడు. అతడు యూదా రాజైన హిజ్కియాకు జాబు పంపాడు. దానిలో ఇట్లుంది. "నీ దేవుడైన యావే ఈ యేరూషలేము నగరాన్ని కాపాడలేడు. మేము ఎన్నో రాజ్యాలు, పట్టణాలు నాశంచేసాం. వాటి దేవుళ్ళు ఆ నగరాలను కాపడలేకపోయారు. నీ దేవుడు మాత్రం ఈ నగరాన్ని ఏలా

కాపాడతాడు? కనుక నీవు మాకు లొంగిపో". హిజ్కియా ఆ జాబును దేవళంలో ప్రభువు పీఠంపై పెట్టి కన్నీటితో ప్రార్థన చేసాడు. ప్రభూ! నీవొక్కడివే దేవుడవు, సృష్టికర్తవు. అస్సిరియా రాజులు నాశంచేసిన నగరాల దేవుళ్ళు దేవుళ్ళేకాదు. సజీవుడవైన నీవు మమ్ము కాపాడు అని వేడుకొన్నాడు. దేవుడు ఆరాజు మొర విన్నాడు. ఆరాత్రే ప్రభువు దూత అస్సిరియా సైన్యంలో 185 వేల మందిని చంపివేసాడు. సన్హెరీబు భయపడి పారిపోయాడు. ఆపదల్లో, హింసల్లో ప్రార్థన మనకు కొండంత బలాన్నిస్తుంది. మానుష బలంకంటె దైవబలం కోటిరెట్లు శక్తి కలది.

## 14. జ్ఞాని కోరిన రెండు వరాలు - సామె 30, 7-9

జ్ఞాని దేవుణ్ణి రెండు వరాలు అడిగాడు. మొదటిది అబద్ధాలు ఆడకుండేలా చేయి అన్నాడు. దేవుడు సత్యవంతుడు. అబద్ధాలు అతనికి నచ్చవు. రెండవది, నన్ను ధనికుణ్ణీ చేయవద్దు దరిద్రుణ్ణీ చేయవద్దు అన్నాడు. నాకు కావలసినంత తిండి మాత్రం దొరికేలా చేయి అన్నాడు. ఎందుకు? తాను ధనికుడైతే పొగరెక్కి దేవుణ్ణి ధిక్కరించవచ్చు. దరిద్రుడైతే దొంగతనానికి పాల్పడి దేవునికి అపఖ్యాతి తేవచ్చు. కనుక తాను ధనికుడు దరిద్రుడూ కాకుండా మధ్యస్థంగా వుండడం మేలనుకొన్నాడు. నేడు మనం కూడ ఈ ప్రార్థనం చేస్తే బాగుంటుంది. ఎల్లప్పుడు భగవంతుని మీద మనసు నిలిపి వుంచేవాడు ధన్యుడు.

## 15. జ్ఞాన వరం - సొలోమోను జ్ఞాన 9,9-18

సొలోమోను మహాజ్ఞాని. అతడు దేవునికి ప్రార్థనచేసి జ్ఞాన వరాన్ని పొందాడు. ఆరాజు ప్రభువుకి ఇలా మనవి చేసాడు. "నీ సింహాసనం నుండి జ్ఞానాన్ని నా యొద్దకు పంపు. అది నాతో కలిసి పనిచేస్తుంటే నేను నీకు ప్రీతికరమైనదేదో తెలిసికొంటాను. నా యంతట నేను నీకు ఇష్టమైన కార్యాలు చేయలేను. అసలు నీ చిత్తమేమిటో నాకు తెలియదు. నా దేహం నా ఆత్మను క్రుంగదీస్తుంది. నా మట్టి శరీరం నా బుద్ధిశక్తిని అణచి వేస్తుంది. నీవు స్వర్గం నుండి నీ జ్ఞానాన్ని నీ యాత్మనీ పంపితేనే తప్ప నేను నీ చిత్తాన్ని తెలిసికోలేను". ప్రభువు ఆ రాజు మనవి ఆలించి అతనికి జ్ఞానవరాన్ని దయచేసాడు. ఈ జ్ఞానాన్నే మనం నూత్నవేదంలో వరప్రసాదం అంటాం. దీనికి కర్త పవిత్రాత్మ. కనుక మనం ఆత్మ నుండి జ్ఞానవరాన్ని అడుగుకోవాలి. ఈ వరం వలన మనం దేవుని చిత్తాన్ని తెలిసికొని అతనికి ప్రీతి కలిగించే పనులు చేస్తాం. పవిత్రంగా జీవిస్తాం.

## 16. తోబియా ప్రార్థన - తోబీతు 8,5-9

తోబీతు కుమారుడు తోబియా. తండ్రిలాగే అతడు కూడ నిర్మలంగా జీవించినవాడు. తోబియా మొదటిరాత్రి భార్యను కూడ బోతున్నాడు. అతడు జంతు వాంఛలకు లొంగలేదు. కామోద్రేకానికి గురికాలేదు. దేవునికి ఈలా ప్రార్థన చేసాడు. "ప్రభూ! నీవు ఆదామును సృజించి అతనికి తోడుగా వుండటానికి ఏవను కూడ కలిగించావు. ఆ యాదిదంపతులనుండి మానవజాతి పుట్టింది. నరుడు ఒంటరిగా వుండడం మంచిదికాదు, అతనికి సాటియైన తోడును కలిగిస్తాను అనుకొన్నావు. ఇప్పుడు నేను ఈ సారాను భార్యగా స్వీకరిస్తున్నాను. కామతృప్తి కొరకు కాక ఆదినుండి నీవు చేసిన ఏర్పాటుకులొంగి, అనగా స్త్రీ పురుషులు కలసికొని సంతానాన్ని కనాలి, భూమిమీద మానవ జాతిని కొనసాగించాలి అనే ఆజ్ఞకు లొంగి, ఈమెను స్వీకరిస్తున్నాను. ముసలి ప్రాయం వరకు మేమిద్దరం కలిసి జీవించే భాగ్యాన్ని దయచేయి". ఈ ప్రార్థనను బట్టి యిస్రాయేలు ప్రజలకు లైంగిక క్రియపట్ల ఎంత పవిత్ర భావాలు వుండేవో అర్థం జేసికోవచ్చు. ప్రపంచం స్త్రీ శరీరాన్ని ఆరాధించే ఈ రోజుల్లో ఈలాంటి ప్రార్థనలు మన కన్నులు తెరిపిస్తాయి.

## 17. యోబు వినయవిశ్వాసాలు - యోబు 42, 5-6

యోబు విశుద్ధవర్తనుడు. ఐనా అతనికి కష్టాలు వచ్చాయి. అతని ఆస్తిపాస్తులు పోయాయి. కొడుకులు కూతుళ్లు చనిపోయారు. కుష్ఠవ్యాధి సోకింది. అతడు ఊరివెలుపల దిబ్బమీద కూర్చుండి చిల్లపెంకుతో పుండ్లరసి గోకుకుంటున్నాడు. ఈ పరిస్థితిలో అతడు దేవునిమీద తిరగబడ్డాడు. నన్ను నిష్కారణంగా ఎందుకు బాధిస్తున్నావు అని అడిగాడు. యావే యోబుకి ఎదురుప్రశ్న వేసాడు. నా సృష్టి రహస్యాలను నీవు గ్రహింపగలవా అని అడిగాడు. యోబుకి కనువిప్పు కలిగింది. నేను పలికిన దుడుకుమాటలకు సిగ్గుపడు తున్నాను. దుమ్ము బూడిద మీద చల్లుకొని పశ్చాత్తాపపడుతున్నాను అన్నాడు. ఈ పలుకులు యోబు వినయాన్ని విశ్వాసాన్ని తెలియజేస్తాయి. దేవుని మార్గాలు మనకు అర్థంకావు. అతడు మనకు కష్టాలు ఎందుకు పంపుతాడో మనం గ్రహించలేం. అతడు మాత్రం మన మేలు కోరుతాడు. కనుక మన తరపున మనం అతనికి లొంగివుండాలి.

## 18. దానియేలు నిజాయితీ - దాని 9,4-10

యిస్రాయేలు ప్రజలు దేవుని ఆజ్ఞలు మీరి శిక్షతెచ్చుకొన్నారు. బాబిలోనియా ప్రవాసంలో వున్నారు. వారి భక్తుడు దానియేలు. అతడు ప్రజల తరపున చిత్తశుద్ధితో పశ్చాత్తాపపడ్డాడు. "దేవా! నీవు నిబంధనను పాటిస్తుంటే మేము దాన్నిమీరాం. మోషే

ధర్మశాస్త్రంలోని ఆజ్ఞలను నిర్లక్ష్యం చేసాం. ప్రవక్తల ప్రబోధాలను పెడచెవిని పెట్టాం. మా పాపాల వలన మేము ఈ ప్రవాసానికి వచ్చి అవమానం తెచ్చుకొన్నాం. మా పుణ్యకార్యాలను జూచిగాక నీ మంచితనాన్ని జూచి ఇప్పుడు మమ్ము క్షమించు" అని మనవి చేసాడు. ఈలా మనం నిజాయితీతో దేవుని ముందు మన తప్పిదాలను ఒప్పుకొంటే అతడు మనలను తప్పక క్షమిస్తాడు.

## 19. అన్నా గీతం - 1 సమూ 2, 4-6

ఎల్కానాకు ఇద్దరు భార్యలు. పెనిన్నాకు సంతానం కలిగిందిగాని అన్నా గొడ్రాలుగా ఉండిపోయింది. ఆమె షిలోదేవళానికి వెళ్ళి ప్రభువుకు ప్రార్థన చేసింది. హృదయవేదనతో కన్నీరు మున్నీరుగా ఏడ్చింది. నాకు ఒక మగబిడ్డను ప్రసాదించావంటే వాణ్ణి నీ సేవకే అర్పిస్తాను" అని మ్రొక్కుకొంది. దేవుడు ఆమె మొరవిని సమూవేలు అనే బిడ్డను ప్రసాదించాడు. అప్పుడు అన్నా పరమానందం చెంది దేవుణ్ణి స్తుతించింది. "బలశాలుల విల్లులు విరిగిపోయాయి. బలహీనులు బలాఢ్యులయ్యారు. కలవారు కూటికి కూలికిపోతే ఆకలిగొన్న దరిద్రులకు అన్నం దొరికింది. గొడ్రాలు ఏడ్గురు బిడ్డలను కంది. చంపేవాడు బ్రతికించేవాడు ప్రభువే" అని పలికింది. అనగా దేవుడు దీనులను కరుణిస్తాడని భావం. భగవంతుని ముందు వినయంతో మనదారిద్ర్యాన్ని తెలియజేసికొంటే అతడు మనలను సంపన్నులను జేస్తాడు.

## 20. యూదితు వేడికోలు - 13, 5-7

హోలోఫెర్నెసు యూదియా నగరమైన బెతూలియాను ముట్టడించాడు. యూదితు ధైర్యంతో అతని శిబిరానికి వెళ్ళింది. సైన్యాధిపతి తప్పత్రాగి మత్తెక్కి పడకమీద తూలిపడి వున్నాడు. ఆ ధీరురాలు అతని శిరస్సును నరికే సమయం ఆసన్నమైంది. ఆమె ఇలా ప్రార్థించింది "ప్రభూ! నేను యెరూషలేము కీర్తికొరకే ఈ కార్యానికి పూనుకొన్నాను. నీవు నాకు సహాయంచేసి మా శత్రువును హతమార్చు. నీ వెన్నుకొనిన ప్రజలను రక్షించు. నాకు బలాన్ని దయచేసి నా కత్తితో నేనితని గొంతు నరికేలా చేయి". ఒక ఆడగూతురు శత్రుసైన్యాధిపతి తల నరకడం సులువుకాదు. ఐనా దైవబలంతో ఆమె ఆ కార్యం సాధించింది. శత్రువులు ఓడిపోయి పారిపోయారు. ప్రార్థనాబలంతో సాహసకార్యాలు సాధిస్తాం. గండాలనుండి బయట పడతాం.

## 21. నా దేవా! నన్నేల చేయి విడిచావు? - కీర్త 22, 1.9-11

22వ కీర్తన వ్రాసిన భక్తుడు ఏదో ఆపదలో వుండి దేవునికి మొరపెట్టాడు. నాదేవా! నాదేవా! నన్నేల చేయి విడిచావు అని దీనంగా వేడుకొన్నాడు. తల్లి కడుపునుండి

నన్ను సురక్షితంగా వెలుపలికి తీసికొని వచ్చింది నీవే. మాతృగర్భంనుండి బయటికి వచ్చినప్పటినుండి నేను నీ మీదనే ఆధారపడ్డాను. నీవుదప్ప నాకు ఇంకో దేవుడు లేడు. నీవు తప్ప నన్ను ఆదుకొనేవాడు ఎవడూలేడు. కనుక నన్ను కాపాడు అని వేడుకొన్నాడు. ప్రభువు సిలువమీద వ్రేలాడుతూ ఈ కీర్తనను జపించాడు. ఇది చాల భక్తిగల గీతం. ప్రభువును నమ్మకంతోను దైన్యంతోను వేడుకొంటే అతడు మన మొర ఆలిస్తాడు.

## 22. కావలివాళ్ళు వేకువజాము కొరకులాగే - కీర్త 130, 5-6

రాత్రంతా కాపలా కాసినవాళ్ళు వేకువజాము కొరకు కాచుకొని వుంటారు. కాసేపు స్తిమితంగా నిద్రపోవాలని కోరుకొంటారు. ఎప్పుడెప్పుడు తెల్లవారుతుందా పోయి పండుకొందామని చూస్తుంటారు. అలాగే భక్తుడు ప్రభువు సహాయం కొరకు ఎదురు చూస్తున్నాడు. అది ఏ క్షణంలోనైనా లభించవచ్చు. దేవుడు దిడీలున తన దాసుని ఆదుకోవచ్చు. ఈ భక్తునిలాగే మనమూ ప్రభుని నమ్మాలి. అతని ఆదుకోలు కొరకు ఎదురుచూడాలి. అతడు ఏ క్షణంలోనైనా మనకు సాయం అందించవచ్చు.

## 23. పశ్చాత్తాపమూ వినయమూ - కీర్త 51, 16-17

యెరుషలేము దేవాలయంలో ప్రజలు జంతుబలులు అర్పిస్తున్నారు. కాని జంతుబలుల వలన దేవుడు ప్రీతిజెందడు. నిజమైన బలిపశువు భక్తుడే. కనుక దాసుడు తన హృదయాన్నే దేవునికి అర్పించుకోవాలి. కీర్తనకారుడు పశ్చాత్తాపమూ వినయమూగల హృదయాన్ని దేవునికి అర్పించుకొంటున్నాడు. పశ్చాత్తాపమెందుకంటె, మనం పాపులం కనుక. దేవుడు మన పాపాలను క్షమించేవాడు కనుక. వినయమెందుకంటె, దేవుడు సృష్టికర్త కనుక. సృష్టికర్త ముందు సృష్టిప్రాణికి వినయం తగుతుంది. కనుక భక్తుడు వినయంతో పశ్చాత్తాపంతో దేవుణ్ణి సమీపించాలి.

## 24. ప్రభువు కరుణ - కీర్త 103, 11-14

103వ కీర్తన భగవంతుని కరుణను వర్ణిస్తుంది. భూమికి ఆకాశం అనంతమైన యెత్తు. దేవునిపట్ల భయభక్తులు చూపే వారియెడల అతని ప్రేమ అంత ఎత్తుగా వుంటుంది. పడమరకు తూర్పు అనంతమైన దూరం. దేవుడు మన పాపాలను అంతదూరంగా విసరి పారవేస్తాడు. తల్లిదండ్రులు తమ కుమారులమీద జాలిజూపినట్లే భగవంతుడు నరులమీద నెనరు జూపుతాడు. ఎందుకు? మనం ఆదాము కోవకు చెందిన వాళ్లం. "ఆద్మా" అంటే మట్టి. మనం మట్టినుండి పుట్టినవాళ్లం. దుర్బల ప్రాణులం. దేవదూతలం కాదు. కనుక ప్రభువు మనలను కరుణతో జూస్తాడు. భగవంతుని కారుణ్యాన్ని అనుభవానికి తెచ్చుకొని అతనిపట్ల నమ్మకాన్ని పెంపొందించుకోవడానికి ఈ చరణాలు బాగా ఉపయోగపడతాయి.

## 25. విజ్ఞులకుగాక పసిబిడ్డలకు - మత్త 11, 25-27

ప్రభువు పరలోకం రహస్యాలను గర్వితులైన పరిసయలకూ, యూదమత పెద్దలకు తెలియజేయలేదు. పసిబిడ్డలకు తెలియజేసాడు. ఈ "పసిబిడ్డలు" దీనులు. క్రీస్తు శిష్యులంతా ఈ వర్గంవాళ్లే. దైవశ్రుతి వీరికి తెలిసినట్లుగా యూదమత నాయకులకు తెలియదు. తండ్రి తన్ను గూర్చిన సమస్త జ్ఞానాన్ని కుమారునికి అప్పగించాడు. కనుక మనకు తండ్రిని తెలియజేసేవాడు క్రీస్తే. వాళ్లిద్దరికి పరస్పర జ్ఞానం, ప్రేమ వుంటాయి. నేడు మనం క్రీస్తుద్వారా తండ్రినీ, తండ్రి ద్వారా క్రీస్తునీ తెలిసికొంటాం. కాని వినయమూ సరళస్వభావమూ కలవాళ్లే దేవుణ్ణి తెలిసికొనేది.

## 26. నేను నీ కొరకు ప్రార్థించాను - లూకా 22, 31-32

ధాన్యాన్ని జల్లెడలో పోసి అటూఇటూ వూపుతారు. అప్పుడు మట్టిపెళ్లలనూ, రాళ్లనూ వేరు చేయవచ్చు. పిశాచం శిష్యులను గోదుమలనులాగ జల్లెడ పట్టగోరింది అనగా వారిని బలంగా శోధించగోరింది. శోధించిందికూడ. కనుక శిష్యులు క్రీస్తుపట్ల విశ్వాసాన్ని కోల్పోయి అతన్ని విడచి పారిపోయారు. కాని ప్రభువు పేత్రు కొరకు ముందుగానే ప్రార్థించాడు. క్రీస్తుని నిరాకరించిన పేత్రు ఆ ప్రార్థనా బలంవల్ల అతన్ని మళ్లా విశ్వసించాడు. పడిపోయి మళ్లా లేచాడు. అలా లేచాక అతడు తోడి శిష్యులను కూడ స్థిరపరచాడు. అనగా క్రీస్తునుండి పారిపోయిన శిష్యులను మళ్లా క్రీస్తు దగ్గరికి తీసికొని వచ్చాడు. ఈలా క్రీస్తు ప్రార్థన శిష్యులందరికీ మేలు చేసింది. నేడు ఉత్థాన క్రీస్తు మన కొరకుగూడ ప్రార్థన చేస్తుంటాడు - హెబ్రే 7,25. కనుకనే మనం ఎన్నో శోధనలనూ అపాయాలనూ తప్పించుకొంటూంటాం. మనకు దైవానుగ్రహం మీద నమ్మకముండాలి.

## 27. ఈ పాత్రను తొలగించు - మార్కు 14,36

క్రీస్తు గెత్సెమని ప్రార్థనం ఎందరికో ప్రేరణం పుట్టించింది. ఈ జపంలో "పాత్ర" అంటే సిలువ మరణమే. క్రీస్తు సిలువ మరణాన్ని తొలగించమని తండ్రిని వేడుకొన్నాడు. చనిపోవడానికి ఏ ప్రాణి ఒప్పుకోదు. కనుక క్రీస్తుకి కూడ తన మరణం అనిష్టమైంది. అందరు నరుల్లాగే అతడుకూడ దీర్ఘకాలం జీవించాలని కోరాడు. ఐతే అతడు ఎల్లవేళల తండ్రి చిత్తానికి బద్ధుడు. కనుక తండ్రి కోరినట్లే తాను మరణానికి సంసిద్ధుడయ్యాడు. తండ్రి కుమారుడు అడిగినా సిలువ మరణాన్ని తొలగించలేదు. దాన్ని భరించే శక్తిని మాత్రం ప్రసాదించాడు. నేడు మనం దేవుని చిత్తానికి లొంగం. మన చిత్త ప్రకారం పనులు జరగాలని కోరుకొంటాం. కాని ఇది పద్ధతి కాదు. దేవుడు నరునికి లొంగడు.

నరుడే దేవునికి లొంగాలి. బైబులు భక్తులు నిరంతరమూ దేవునికి లొంగివుంటారు. మనం కూడ ఈ యభ్యాసాన్ని కలిగించుకోవాలి. దేవుని చిత్తప్రకారం జీవించినపుడు గొప్ప మనశ్శాంతి కలుగుతుంది. మన చిత్త ప్రకారం మనం జీవిస్తే మనం చేసేది పాపకార్యలే.

## 28. దేవా! ఈ పాపిని కనికరించు - లూకా 18, 13

పరిసయుడు సుంకరీ ఇద్దరు దేవాలయానికి ప్రార్థనకు వెళ్లారు. పరిసయుడు గర్వితుడు. అతడు దేవుని ముందు తన్నుతాను పొగడుకున్నాడు. తన పుణ్యకార్యాలు ఏకరువు పెట్టాడు. పొగరుతో నేనీ సుంకరిలాగ దుర్మార్గుణ్ణికాదు అని చెప్పుకొన్నాడు. కాని సుంకరి గుడిలోని పీఠంవైపు, దైవసాన్నిధ్యంవైపు కన్నులెత్తి చూడటానికిగూడ సాహసించలేదు. తన వినయాన్ని ప్రదర్శిస్తూ రొమ్ము బాదుకున్నాడు. తాను నిక్కంగాపాపినని నమ్మాడు. కనుక దేవా! ఈ పాపిని కనికరించు అని వేడుకున్నాడు. వినయంతో, పశ్చాత్తాపంతో గూడిన అతని వేడుదలను దేవుడు ఆలించాడు. పరిసయుని పాపాలను మన్నించని దేవుడు సుంకరి పాపాలను మన్నించాడు. మన ప్రార్థనలో వినయం, చిత్తశుద్ధి వుండాలి.

## 29. పరలోకంలోని మీ తండ్రి - 7, 9-11

ప్రార్థనలో దేవుణ్ణి తండ్రిగాను మనలను బిడ్డలనుగాను భావించుకోవాలి. తల్లిదండ్రులు తమ బిడ్డలు ఆకలివేసి రొట్టె, చేప మొదలైన ఆహార వస్తువులు అడిగినపుడు వాటినే యిస్తారు కాని కీడుచేసే రాయి, పాము మొదలైన వస్తువులను ఈయరు. ఇక దేవుడు మన తండ్రుల్లాగ చెడ్డవాడుకాడు. స్వార్థపరుడుకాడు. అతడెప్పుడూ మనకు మేలుచేసే వస్తువులే యిస్తాడు. ఆ తండ్రిని మనం నమ్మాలి. ప్రార్థనలో మనకూ దేవునికీ తండ్రీబిడ్డల సంబంధం వుంటుంది. ఈ సంబంధం మనకు నమ్మకం పుట్టించాలి. దేవుణ్ణి మించిన అమ్మానాన్నలు లేరు అనుకోవాలి.

## 30. ఇద్దరు ముగ్గురు నా పేరిట - మత్త 18, 19-20

ఇక్కడ ఇద్దరు ముగ్గురంటే మంది. వ్యక్తి ప్రార్థన కంటే బృంద ప్రార్థన బలమైంది. బైబులు భగవంతుడు యిస్రాయేలును ఒక బృందంగా యెన్నుకొన్నాడు. అలాగే క్రైస్తవులను కూడ ఒక బృందంగా ఎన్నుకొన్నాడు. మనం అతన్ని ఒక బృందంగానే ఆరాధిస్తాం. బృందంగానే రక్షణం పొందుతాం. కనుక సాధ్యమైనపుడెల్లా బృందంగా ప్రార్థనం చేసుకోవాలి. వ్యక్తి ప్రార్థన మంచిదే కాని పదిమంది కూడి చేసిన ప్రార్థన బలంగా వుంటుంది. ఉత్థాన క్రీస్తుపేరిట మనం భక్తసమాజాలుగా రూపొందాలి. ఈ సమాజాలను ఉత్తేజ పరచేది క్రీస్తే.

## 31. కోతగాండ్రను పంపమని తండ్రికి మనవి - మత్త 9, 37-39

రైతు పంటను సేకరించినట్లుగా దేవుడు ప్రజలను దైవరాజ్యంలోనికి సేకరిస్తాడు. పంట యజమానుడు తండ్రి. పంటను కోసే కోతగాడు క్రీస్తే. కాని అతడొక్కడే పంటనంతటిని కోయలేడు. కనుకనే అతడు శిష్యులను ప్రోగుచేసుకొన్నాడు. ఇప్పుడు కూడ అతనికి క్రొత్త శిష్యులు కావాలి. యువతీయువకులు పిలుపును అందుకోవాలి. వీళ్లే పనివాళ్లు లేక కోతగాండ్రు. ఎక్కువ మంది కోతగాండ్రను పంపి, ఎక్కువ పంటను సేకరించమని మనం తండ్రిని వేడుకోవాలి. అనగా ఎక్కువ మంది దైవ పిలుపుని స్వీకరించాలని మనం ప్రార్థన చేయాలి. మన ప్రార్థన వల్ల కొందరు యువతీయువకులు పిలుపుని అందుకుంటే మన జీవితం ధన్యమౌతుంది.

## 32. పరలోక జపం - మత్త 6,9 -13

పరలోక జపం క్రీస్తు స్వయంగా చేసింది. తానే మనకు నేర్పింది. కనుక ఇది జపరాజం. దీనికి మించిన జపం మరొకటి లేదు. దీనిలో మొత్తం 7 విన్నపాలు వున్నాయి. తొలి మూడు దేవుణ్ణి స్తుతిస్తాయి. మలినాల్గు మన అక్కరులను దేవునికి తెలియజేస్తాయి. ఈ జపంలో ముఖ్యాంశాలు రెండు. మొదటిది, దేవుణ్ణి తండ్రీ అని సంబోధిస్తాం. ఇక్కడ అరమాయిక్ భాషలో వాడినమాట "అబ్బ". ఈ పదానికి నాన్న అని అర్థం. క్రీస్తు నాడు యూదుల చిన్నపిల్లలు తమతండ్రిని ఈ నామంతో పిల్చేవాళ్లు. అనగా మనం దేవుణ్ణి నాన్న అనిపిలుస్తున్నాం. అతనిపట్ల మనకు చనువు, పరిచయం ఉండాలని ఈ పదం సూచిస్తుంది. కొంతమంది దేవునిపట్ల చనువు పెంపొందించు కోవడానికి భయపడతారు. ఈ భయమేమి అక్కరలేదు. ఇక రెండవ అంశం, దేవుని చిత్తానికి లొంగడం. క్రీస్తు దేవుని చిత్తానికి లొంగినట్లే మనమూ ఆ ప్రభువు చిత్తానికి లొంగాలి. భక్తుడు అన్ని కార్యాల్లోను దేవుని చిత్తాన్ని తెలిసికొని ఆ చిత్త ప్రకారం జీవిస్తాడు.

## 33. బర్తిమయి మొర - మార్కు 10, 47-48

బర్తిమయి కండ్లులేని కబోది. ఆ ప్రభువు దగ్గరకు వెళ్ళి చూపు పొందాలని ఆశించాడు. కాని పోయే అవకాశం లేక త్రోవ ప్రక్కన కూర్చుండి వున్నాడు. ఓ దినం క్రీస్తు దిడీలువ ఆదారిన వచ్చాడు. ఆ గ్రుడ్డివానికి మంచి అవకాశం లభించింది. అతడు అయ్యా! నన్ను కరుణించు అని అరచాడు. కాని చుట్టుపట్ల వున్న జనం అతన్ని కసురుకొని నోరు మూయింప జూచారు. ఆ గ్రుడ్డివాడు మాత్రం పట్టుదలతో అయ్యా! నన్ను కరుణించు అని ఇంకా బిగ్గరగా అరచాడు. అతని ప్రార్థనలో విశ్వాసముంది. పట్టుదల వుంది.

కనుకనే ప్రభువు అతనికి చూపు దయచేసాడు. నేడు మన ప్రార్థనలో కూడ ఈ గుణాలుండాలి. బర్తిమయికి కావలసింది మామూలు చూపు. మనకు కావలసింది ఆధ్యాత్మికమైన చూపు. మనం మన భక్తి విశ్వాసాలను పెంచమని దేవుణ్ణి అడుగుకోవాలి.

## 34. మిగిలిన తొమ్మిదిమంది యేరీ - లూకా 17,17

యేసు పదిమంది కుష్ఠరోగులను శుద్ధి చేసాడు. వారిలో తొమ్మిదిమంది యూదులు. వీళ్లంతా ఆరోగ్యాన్ని పొంది హాయిగా వెళ్లిపోయారు. దేవునికి వందనాలు చెప్పలేదు. పదవవాడు సమరయుడు. ఇతడు మాత్రం క్రీస్తు దగ్గరకు తిరిగి వచ్చి వందనాలు చెప్పాడు. ప్రభువు ఇతని కృతజ్ఞతాభావాన్ని మెచ్చుకొన్నాడు. మొదటి తొమ్మిది మందికి శారీరకారోగ్యం మాత్రమే లభించింది. కాని పదవవానికి ఆధ్యాత్మకారోగ్యం కూడ లభించింది. అనగా అతని విశ్వాసం పెరిగింది. అతడు క్రీస్తులోని దివ్యశక్తినీ, దివ్యత్వాన్ని గుర్తించాడు. దేవుడు మనకు ఎన్నో వుపకారాలు చేస్తుంటాడు. ఆ వుపకారాల్లో మనం దేవుని హస్తాన్ని గుర్తించాలి. దేవుని దయవల్లనే మనకు ఆ మేలు కలిగిందని గ్రహించి అతన్ని స్తుతించాలి. చాలమంది మేళ్లు పొంది కూడ దేవుణ్ణి మరచిపోతారు. వీళ్ళు ఈ కథలోని తొమ్మిదిమంది లాంటివాళ్ళు.

## 35. తుఫానులో చిక్కిన పడవ - మత్త 8, 23, 27

క్రీస్తు శిష్యులు గలిలీ సరస్సులో పడవలో పోతుండగా దిడీలున తుఫాను పట్టుకొంది. పడవ మునిగిపోయేలా వుంది. క్రీస్తు నిద్రపోతున్నాడు. శిష్యులు మునిగిపోతామని భయపడి క్రీస్తుని తట్టి లేపారు. మమ్ము కాపాడమని మొరపెట్టుకొన్నారు. మీరు అల్పవిశ్వాసులు అని ప్రభువు వారిని మందలించాడు. వారికి క్రీస్తుపట్ల కొంత విశ్వాసముంది. కాని పూర్తి నమ్మకం లేదు. వాళ్ళు ఇదివరకే క్రీస్తు అద్భుతాలు చూచారు. ఐనా ఇతడుంటే మనకు పర్వాలేదు అనుకోలేదు. కడన ప్రభువు అద్భుతంగా తుఫానును అణచివేసి శిష్యులను కాపాడాడు. ఈ శిష్యులకులాగే మనదికూడ అపరిపూర్ణమైన విశ్వాసం. కనుక మన విశ్వాసాన్ని పరిపూర్ణం చేయమని ఆ ప్రభువుని అడుగుకోవాలి. తుఫానులో చిక్కిన ఆ పడవ మనలనే సూచిస్తుంది. కనుక మన ఆపదల్లో, మనలను గట్టెక్కించమని ప్రభువుని వేడుకోవాలి.

## 36. నీటిపై పేత్రు నడక - మత్త 14, 28-31

శిష్యులు పడవలో పోతున్నారు. వేకువజామున క్రీస్తు నీటిపై నడుస్తూ పడవ దగ్గరికి వచ్చాడు. శిష్యులు క్రీస్తుని చూచి దయ్యమేమోనని భయపడ్డారు. ప్రభువు వారికి అభయమిచ్చి ధైర్యం చెప్పాడు. పేత్రుకూడ పడవదిగి క్రీస్తులాగే నీటిమీద నడవబోయాడు.

మొదటలో అతనికి విశ్వాసముంది. కనుక కొంతదూరం బాగానే నడచాడు. అంతలో పెనుగాలికి అతని విశ్వాసం చలించింది. మునిగిపోబోయాడు. మళ్లా విశ్వాసం తెచ్చుకొని ప్రభూ నన్ను రక్షించు అని కేకలు వేసాడు. క్రీస్తు అతన్ని మునగనీయకుండా పట్టుకొని పడవలోకి చేర్చాడు. ఇక్కడ పేత్రులో నమ్మకమూ, సందేహమూ, మళ్లా నమ్మకమూ అనే మూడంశాలు గుర్తించాలి. కనుకనే ప్రభువు అతన్ని అల్పవిశ్వాసి అన్నాడు. ఈ పేత్రులాగే మనంకూడ కొంతకాలం భక్తిగా జీవిస్తాం. కాని తర్వాత ఆ భక్తిని కోల్పోయి పాపంలో పడిపోతాం. మళ్లా పశ్చాత్తాపపడి దారికి వస్తాం. మళ్లా అపమార్గం పడతాం. ఈలా జీవితకాలమంతా పడుతూ లేస్తూ వుంటాం. కనుక మన విశ్వాసాన్నీ భక్తినీ పెంచమని ప్రభువుని నిరంతరం అడుగుకోవాలి.

## 37. నా అవిశ్వాసాన్ని నీవే తొలగించు - మార్కు 9,24

ఒక తండ్రి మూగదయ్యం పట్టిన కుమారుణ్ణి శిష్యుల వద్దకు తీసికొని వచ్చాడు. కాని వాళ్లు ఆ దయ్యాన్ని వెళ్ళగొట్టలేక పోయారు. తర్వాత ఆ తండ్రి కుమారుణ్ణి క్రీస్తు దగ్గరికి కొనివచ్చి నీకు సాధ్యమైతే నాకు సహాయం చేయమని అడిగాడు. క్రీస్తు నీవు విశ్వసిస్తే చాలు ఈ దయ్యాన్ని వెళ్ళగొట్టవచ్చు అన్నాడు. ఆ తండ్రి వినయంతో అయ్యా! నేను నీ శక్తిని నమ్ముతూనే వున్నాను. నాలో ఏమైనా అవిశ్వాసం వుంటే దాన్ని నీవే తొలగించు అని వేడుకొన్నాడు. తర్వాత క్రీస్తు ఆ బాలునినుండి మూగ దయ్యాన్ని పారదోలాడు. ఇక్కడ "నా అవిశ్వాసాన్ని తొలగించు" అని ఈ తండ్రి చేసిన మనవి చాల మంచి ప్రార్థన. మనకు చాల పర్యాయాలు విశ్వాసం లోపిస్తుంది. దేవుణ్ణి కొంత వరకు నమ్ముతాం. కొంతవరకు నమ్మం. ఏదో భయం, ఆందోళన మనలను ఆవరిస్తుంది. చీకట్లు కమ్మినట్లుగా వుంటుంది. కొన్నిసార్లు అసలు ప్రార్థనే చేయబుద్ధికాదు. ఒకవేళ చేసినా నమ్మకంతో చేయం. ఇదే మన అల్పవిశ్వాసం. మనందరికీ ఈ బలహీనత వుంటుంది. ఈలాంటి పరిస్థితుల్లో మన విశ్వాసాన్ని పెంచమని ప్రభువుని అడుగుకోవాలి. క్రైస్తవ జీవితమంతా ఈ విశ్వాసం మీదనే ఆధారపడి వుంటుంది. అది వున్నవాళ్ళు భక్తిగా జీవిస్తారు. దేవుని దగ్గరికి వస్తారు. అది లేనివాళ్ళు దేవునికి దూరంగా వుంటారు.

## 38. నీ రాజ్యంలో నన్ను జ్ఞాపకముంచుకో - లూకా 23, 40-43

క్రీస్తుతోపాటు ఇద్దరు దొంగలను సిలువవేసారు. వారిలో ఒకడు క్రీస్తుని నమ్మలేదు. అతడు నీవు మెస్సీయావైతే సిలువమీద నుండి దిగిరా. మమ్ముకూడ సిలువనుండి

దింపు అన్నాడు. కాని రెండవవాడు ప్రభువుని నమ్మాడు. అయ్యా! నీవు నీ రాజ్యంలో ప్రవేశించినపుడు నన్ను జ్ఞాపకముంచుకో అన్నాడు. అతడు కోరినట్లే ప్రభువు అతన్ని జ్ఞాపకం పెట్టుకొన్నాడు. తాను మోక్షప్రవేశం చేసినప్పుడే మంచి దొంగకుకూడ మోక్ష భాగ్యాన్ని దయచేసాడు. ఆ దొంగ బ్రతికి వున్నపుడు చాల వస్తువులు దొంగిలించి వుంటాడు. కట్టకడన అతడు మోక్షాన్ని గూడ దొంగిలించాడు. మన మరణ సమయంలో మనంకూడ ఈ మంచి దొంగ జపాన్ని చెప్పుకోగలిగితే మన జీవితం ధన్యమౌతుంది. మోక్షాన్ని పొందడంకంటె గొప్ప భాగ్యం ఏముంటుంది?

## 39. నీవు ప్రార్థించేపుడు నీ సోదరుని క్షమించు - మార్కు 11, 25-26

మన ప్రార్థన ఫలించాలంటే కొన్ని షరతులు పాటించాలి. దేవుడు ప్రేమమయుడు, శాంతిప్రియుడు. పగ, వైరం, ప్రతీకారబుద్ధి అతనికి గిట్టవు. కనుక తోడి నరుల మీద పగతీర్చుకోవాలనే కోరిక ప్రార్థనకు ఆటంకం కలిగిస్తుంది. కొన్నిసార్లు మన ప్రార్థన ఫలించకపోవటానికి ఇది కారణం కావచ్చు. మన తరపున మనం శత్రువులను క్షమిస్తుండాలి. కొన్నిసార్లు క్షమించబుద్ధి పుట్టదు. అప్పుడు మన్నించే గుణాన్ని దయచేయమని దేవుణ్ణి అడుగుకోవాలి.

## 40. యేసు నామం మీదిగా - యోహా 14, 13-14

మనం ఎప్పుడు కూడ యేసు నామం మీదిగా ప్రార్థన చేయాలి. యేసు నామమంటే యేసు అనే వ్యక్తి. మన మనవి క్రీస్తుద్వారా తండ్రికి అర్పించాలి. ఎందుకు? మనలను రక్షించింది క్రీస్తు. మన కొరకు సిలువమీద చనిపోయి మనకు పాపపరిహారం చేసింది క్రీస్తు. కనుక అతని ద్వారానే రక్షణం. అతని ద్వారానే మన మనవిని తండ్రికి అర్పిస్తాం. నేరుగా క్రీస్తుకి కూడ మనవి చేయవచ్చు. ఎప్పుడు కూడ యేసు అనే వ్యక్తి వలననే మన ప్రార్థన ఫలించేది. కనుక మన ప్రార్థనలో క్రీస్తుపట్ల నమ్మకం గౌరవం వుండాలి. అతడే మనకు దిక్కు అనుకోవాలి.

## 41. ఆత్మ సాయపడుతుంది - రోమా 8, 27-28

మనం క్రీస్తుద్వారా తండ్రికి ప్రార్థన చేస్తాం. కాని ఆత్మ సహాయంతో ప్రార్థన చేస్తాం. మనచేత జపం చేయించే మహాశక్తి ఆత్మ. మనంతట మనం ఈ లోకానికి అంటిపెట్టుకొని వుంటాం. మనసు దేవునివైపు త్రిప్పుకోలేం. అప్పుడు ఆత్మ మనచే ప్రార్థన చేయిస్తుంది. అసలు తానే మనలో వుండి మనచే జపం చేయిస్తుంది. ఆ జపాన్ని దేవునికి

అర్పిస్తుంది. ఆ జపం మన రక్షణకు ఉపయోగపడుతుంది. తల్లి చిన్న బిడ్డకు సహాయం చేసి నడక నేర్పుతుంది. ఈలాగే ఆత్మ మనలను ప్రార్థనలో నడిపిస్తుంది. శతాబ్దాల పొడుగున పునీతులకు, భక్తిమంతులకు ప్రార్థన నేర్పింది ఆత్మ. నేడు మనకు కూడ జపం చేసే విధానాన్ని నేర్పేది ఆత్మ. కనుక మనం ఆ యాత్మ సహాయాన్ని అడుగుకోవాలి. ఆ యాత్మ మన హృదయంలోనే వుండి మనలను ప్రార్థనకు పురికొల్పుతుంది.

## 42. ప్రతిపని యేసు పేరిట – కొలో 3,17

మనం ప్రార్థన చేసేది కొద్దికాలమే. అధిక కాలం పనులు చేస్తుంటాం. కనుక ఈ పనులను కూడ ప్రార్థనగా మార్చుకోవాలి. ఏలా? వాటిని క్రీస్తుకి అర్పించడం ద్వారా వాటిని క్రీస్తుపేరిట చేయడంద్వారా. మొదట, మన పనిని చిత్తశుద్ధితో చేయాలి. మోసం పనికిరాదు. అరకొరలుగా పని చేయకూడదు. రెండవది, ఆ పనిని మన మహిమకొరకు గాక దేవుని మహిమకొరకు చేయాలి. దాన్ని పరిపూర్ణంగా దేవునికి అర్పించాలి. ఈలా పవిత్రమైన ఉద్దేశంతో చేసిన పని ప్రార్థనగా మారిపోతుంది. తనపనే ప్రార్థనగా జీవించే నరుడు పునీతుడు ఔతాడు. మన పనులను ప్రార్థనగా మార్చుకోవడానికి ఉదయకాల సమర్పణం బాగా ఉపయోగపడుతుంది.

## 43. నీతిమంతుని ప్రార్థన మహాశక్తి కలది – యాకో 5,16

ప్రార్థన విద్యుచ్ఛక్తి, అణుశక్తి లాంటిది. దానితో ఏ కార్యాన్నయినా సాధించవచ్చు. అది నిచ్చెనలాంటిది. దానితో దేవుని దగ్గరకు ఎక్కిపోతాం. అది మోక్షంలోని ఏ గదినైనా తెరవగల బంగారు తాళపుచెవి. దేహానికి అన్నం ఏలాగో ఆత్మకు ప్రార్థనం అలాగు. జపంవల్ల మన హృదయంలో శాంతిసమాధానాలు నెలకొంటాయి. నరుడు దేవునితో ఐక్యమౌతాడు. లోకంలో ఎంతోమంది ఎన్నోకార్యాలు సాధించి పేరు తెచ్చుకొన్నారు. కాని క్రైస్తవుడు సాధించవలసిన ప్రధానకార్యం, అతడు పొందవలసిన ప్రధాన విజయం, ప్రార్థనే. జపం చేసుకొనే నరుడు దివ్యుడు.

# 9. ఆత్మశోధనలు

బైబులు భాష్యం - 55

## మనవిమాట

ఇక్కడ నరుడు చిత్తశుద్ధితో తన్నుతాను పరిశీలించి చూచుకోవడానికి అనువైన ఆత్మశోధనలను కొన్నిటిని పొందుపరచాం. ప్రతి ఆత్మశోధనను బైబులు వాక్యాలను ఆధారంగా జేసుకొని తయారుచేసాం.

క్రైస్తవ భక్తుడు వాక్యపు వెలుగులో తన్నుతాను పరిశీలించి చూచుకోవాలి. వాక్యమే ఓ న్యాయాధిపతియై మనకు తీర్పు చెప్తుంది. - హెబ్రే 4,12. అది మనం దేవుని యెదుట చిత్తశుద్ధితో పశ్చాత్తాపపడేలా చేస్తుంది.

## విషయసూచిక

# 1. ధన్యవచనాలు

మత్త 5, 1-10

ప్రభువు మనకు ఒక ఆదర్శాన్ని చూపించి పోయాడు. మనం కూడ ఆ యాదర్శం ప్రకారం జీవించాలని కోరాడు. ఆ యాదర్శం మనకు సువిశేషంలో, విశేషంగా ధన్యవచనాల్లో కన్పిస్తుంది. కనుక ఈ ధన్యవచనాల ప్రకారం జీవించే భాగ్యాన్ని మనకు ప్రసాదించమని వినయవిశ్వాసాలతో ప్రభువుని మనవి చేద్దాం.

1. ప్రభూ! నీవు "దీనాత్ములు ధన్యులు, దైవరాజ్యం వాళ్ళది" అని బోధించావు. కాని మేము డబ్బుచేసికోవాలనీ, ఈ లోకవస్తువులను కూడబెట్టుకోవాలనీ ఉవ్విళ్ళూరి పోతుంటాం. వీటిని ఒకోసారి అన్యాయంగా గూడ ఆర్జిస్తుంటాం. వీటికి అంటిపెట్టుకొంటాం. ఇది మా తప్పిదం. నీవు లోకం యొక్క పాపాలను పరిహరించే సర్వేశ్వరుని గొర్రెపిల్లవి.

జవాబు : ప్రభూ! మా మీద దయ చూపండి.

(బృంద ప్రార్థనం చేసికొనేపుడు ఈ జవాబును ప్రతిచరణం తర్వాత చెప్పాలి).

2. ప్రభూ! నీవు "శోకార్తులు ధన్యులు, వాళ్ళు ఓదార్పుని పొందుతారు" అన్నావు. కాని మేము మా కష్టాలనూ బాధలనూ భరించలేక చిర్రుముర్రులాడుతుంటాం. నీ మీద మొరపెడతాం. ఇతరుల కష్టాలనైతే అసలే పట్టించుకోం. నీవు లోకం యొక్క పాపాలను పరిహరించే సర్వేశ్వరుని గొర్రెపిల్లవి.

3. ప్రభూ! నీవు "వినమ్రులు ధన్యులు, వాళ్ళు భూమికి వారసులౌతారు" అని పల్కావు. కాని మేము అహంకారంతో విర్రవీగుతాం. దేవునిమీద కాక మా శక్తిమీద ఆధారపడతాం. నీవు లోకం యొక్క పాపాలను పరిహరించే సర్వేశ్వరుని గొర్రెపిల్లవి.

4. ప్రభూ! నీవు "నీతి నిమిత్తం ఆకలిదప్పులు అనుభవించే వాళ్ళు ధన్యులు, వాళ్ళు సంతృప్తి పొందుతారు" అన్నావు. కాని మేము సర్వనీతికినీ, సర్వధర్మానికినీ ఆధారానివైన నీ కొరకు ఆకలిదప్పులు అనుభవించం. మా జీవితంలో నీ బోధల ప్రభావానికి గురికాము. నిన్నూ నీ సందేశాన్ని ఇతరులకు తెలియజేసే ప్రయత్నం గూడ చేయం. నీవు లోకం యొక్క పాపాలను పరిహరించే సర్వేశ్వరుని గొర్రెపిల్లవి.

5. ప్రభూ! నీవు "దయామయులు ధన్యులు, వాళ్ళు దయను పొందుతారు" అని నుడివావు. కాని మేము ఇతరులను సులభంగా మన్నించం. తోడివారిపట్ల కటువుగా ప్రవర్తిస్తాం. వాళ్ళమీద సులువుగా తప్పుపడతాం. నీవు లోకం పాపాలను పరిహరించే సర్వేశ్వరుని గొర్రెపిల్లవి.

6. ప్రభూ! నీవు "నిర్మలహృదయులు ధన్యులు, వాళ్ళు దేవుణ్ణి దర్శిస్తారు" అని పల్కావు. కాని మేము మా యింద్రియాలు తెచ్చిపెట్టే దుష్టవాంఛలకు లొంగిపోతాం. మా హృదయం దురాశలతో నిండివుంటుంది. మాకు చిత్తశుద్ధిలేదు. నీ వైపు కన్నులెత్తి చూచే సాహసంకూడ మాకు లేదు నీవు లోకంయొక్క పాపాలను పరిహరించే సర్వేశ్వరుని గొర్రెపిల్లవి.

7. ప్రభూ! నీవు "శాంతిస్థాపకులు ధన్యులు, వాళ్ళు దేవుని కుమారులు అనబడతారు" అని బోధించావు. కాని మేము మా కుటుంబాల్లోను సమాజాల్లోను దేశంలోను అశాంతిని నెలకొల్పుతాం. కలహాలు పెంచుతాం. నీవు లోకంయొక్క పాపాలను పరిహరించే సర్వేశ్వరుని గొర్రెపిల్లవి.

8. ప్రభూ! నీవు "ధర్మంకొరకు హింసలనుభవించేవాళ్లు ధన్యులు, దైవరాజ్యం వాళ్ళది" అని చెప్పావు. కాని మేము ఏనాడు ధర్మం కొరకు బాధలు అనుభవించం. ఇంకా అధర్మానికి పాల్పడతాం. ఇతరులను పీడిస్తాం. దోచుకొంటాం, హింసిస్తాం. మా ప్రపంచం క్రూరకార్యాలతోను హింసలతోను నిండివుంది. నీవు లోకం పాపాలను పరిహరించే సర్వేశ్వరుని గొర్రెపిల్లవి.

### ప్రార్థనం

ప్రభూ! నీవు సాధుమూర్తివి. వినమ్ర హృదయుడివి. కరుణామయుడివి. శాంతిస్థాపకుడివి. దీనాత్ముడివి. ధర్మం కొరకు హింసలు అనుభవించినవాడివి. నీవు సిలువమరణంద్వారా మహిమను పొందావు. మేము కూడ అదేమార్గంలో నడచిపోవాలని తెలియజేసావు. మేము సువిశేషంలోని నీ ధన్యవచనాల సందేశాన్ని భక్తిభావంతో పాటించేలా చేయి. నీవు చూపిన ఆదర్శం ప్రకారం జీవించి మోక్ష బహుమానాన్ని సంపాదించుకొనే భాగ్యాన్ని ప్రసాదించు – ఆమెన్.

## 2. పర్వత ప్రసంగం

మత్త 5-7

1. ప్రభూ! నీవు "దీనాత్ములు ధన్యులు" అని పల్కావు– 5,3. మేము ఈ లోకవస్తువులకు అంటిపెట్టుకొంటాం. వాటినే నమ్ముతాం. గర్వంతో పొంగిపోతాం.
జవాబు – (ఒక్కొక్క చరణం తార్వత) మేము ఇతరులను క్షమించినట్లే నీవూ మమ్ము క్షమించు.

2. నీవు "మీరు భూమికి ఉప్పులా వున్నారు. ఉప్పు తన ఒప్పందాన్ని కోల్పోతే మళ్లా దానికాగుణం ఏలా అలవడుతుంది?" అని నుడివావు - 5,13. మేము మా క్రైస్తవ, జీవితసారాన్ని కోల్పోయాం. ఇతరులకు మంచి ఆదర్శాన్ని ఈయలేకపోతున్నాం.

3. నీవు "మీ వెలుగుని ప్రజలయెదుట ప్రకాశింపనీయండి అప్పుడు ప్రజలు మీ సత్కార్యాలను చూచి పరలోకంలోని తండ్రిని సన్నుతిస్తారు" అని నుడివావు - 6,16. మేము మా వెలుగుని దాచిపెట్టుకొంటున్నాం. నీకు సాక్షంగా వుండలేకపోతున్నాం.

4. నీవు "నేను ధర్మశాస్త్రాన్నీ ప్రవక్తల బోధల్నీ రద్దుచేయడానికి రాలేదు" అని వచించావు - 5,17. మేము నీ బోధలను జీర్ణం చేసికోనూలేదు, వాటిని పాటించనూ లేదు.

5. నీవు "పరస్త్రీని కామేచ్ఛతో చూచే ప్రతివ్యక్తీ ఆమెతో మనసున వ్యభిచరించినట్లే" నని హెచ్చరించావు - 5,28. మా హృదయాలు దుష్టవాంఛలతో నిండివుంటాయి. మేము అపవిత్రమైన కోరికలు కోరుకొంటాం.

6. నీవు "నీ కుడికన్ను నీకు పాపకారణమైతే దానిని పెరికిపారవేయి" అని మందలించావు - 5,29. మేము పాపావకాశాలను వదలించుకోము. శోధనలు వచ్చినపుడు చిత్తశుద్ధితో ప్రవర్తించం.

7. నీవు "మీరు చెప్పదలచినదానిని ఔను కాదు అనే మాటలతో సరిపెట్టుకోవాలేగాని ఒట్లు పెట్టుకోగూడదు" అన్నావు - 5, 37. మేము సరళంగా మాట్లాడం. తీయని మాటలు చెప్పి ఇతరులను వంచిస్తాం.

8. నీవు "నీ కుడిచెంపమీద కొట్టినవానికి నీ యెడమ చెంపనుగూడ చూపించు" అని ఆదేశించావు - 5,39. మేము ఇతరులమీద ద్వేషం పెంచుకొంటాం. దీర్ఘకాలవైరం పెట్టుకొంటాం. శత్రువులకు ప్రతీకారం చేస్తాం.

9. నీవు "మీ శత్రువులను క్షమించండం. మిమ్ము హింసించే వాళ్ళ కొరకు ప్రార్థించండి పరలోకంలోని మీ తండ్రిలాగే మీరూ పరిపూర్ణులుగా వుండండి" అని నుడివావు - 5, 44-48. మేము మా కిష్టమైనవాళ్ళను మాత్రం ఎన్నుకొని మాకు గిట్టనివాళ్ళను కేటాయిస్తాం. నిన్ను ఆదర్శంగా బెట్టుకొని మాకు అపకారం చేసిన వాళ్ళకు ఉపకారం చేయం.

10. నీవు "మీరు ఇతరుల మెప్పు బడయగోరి మీ భక్తిక్రియలను పదిమందిముందు ప్రదర్శించవద్దు" అని ఆజ్ఞాపించావు - 6,1. మేము మా క్రైస్తవ జీవితంలో డంబం ప్రదర్శిస్తాం. హృదయంలో ఏమీ లేకపోయినా బయటికి మాత్రం భక్తిమంతుల్లాగ నటన చేస్తాం.

11. నీవు "మీరు ఈ లోకంలోగాక పరలోకంలో సంపదలు కూడబెట్టుకోవాలి" అని మందలించావు - 6, 19-21. మేము కొండంత ఆర్భాటంతో ఈ లోకవస్తువులను కూడబెట్టుకొంటాం. మోక్ష సౌభాగ్యాలను ఆశించం. మా హృదయం ఎప్పుడూ కూడూగుడ్డా ఇల్లూవాకిలీ అనే ఇహలోక వస్తువులమీదనే లగ్నమై వుంటుంది.

12. నీవు "నీ కన్ను నీ దేహానికి దీపం. నీ కన్ను తేటగా వుంటే నీ దేహమంతా వెలుగుతో నిండివుంటుంది" అని చెప్పావు - 6,22. తరచుగా మా వుద్దేశాలు నిర్మలంగా వుండవు. మేము ఒకటి తలుస్తాం, ఇంకొకటి చెప్తాం, వేరొకటి చేస్తాం. మేము చిత్తశుద్ధి లేనివాళ్ళం.

13. నీవు "ఇద్దరు యజమానులను సేవించవద్ద"ని హెచ్చరించావు - 6,24. కాని మేము మాత్రం అటునిన్నూ కొలవబోతాం, ఇటు లోకవస్తువులనూ కొలవబోతాం.

14. నీవు "ఏమి తిందామా, ఏమి త్రాగుదామా, ఏమి కట్టుకొందామా అని ఆందోళనం చెందకండి" అని హెచ్చరించావు - 6,25. మేము చాలసారులు భవిష్యత్తును గూర్చి ఆందోళనపడతాం. ఈ లోకవస్తువులమీద ఆధారపడతాం గాని నమ్మకంతో మమ్ము మేము నీ చేతుల్లోకి అర్పించుకోము.

15. నీవు "మీరు మొదట దైవరాజ్యం కొరకూ ధర్మం కొరకూ కృషిచేయండి, అప్పుడు ఇతర వస్తువులన్నీ మీకు లభిస్తాయి" అని వచించావు - 6,33. కాని మేము నీ రాజ్యాన్ని వ్యాప్తి చేయనూ లేదు, ధర్మం కొరకు కృషి చేయనూలేదు. మా స్వార్థాన్ని మాత్రం బాగా పెంచుకొన్నాం. మా లాభాలనూ, మా సుఖభోగాలనూ మేము చూచుకొన్నాం.

16. నీవు "మీరు పరులను గూర్చి తీర్పు చేయకండి. అప్పుడు దేవుడు కూడ మీకు తీర్పు తీర్చడు" అన్నావు - 7,1. మేము ఇతరులను అపార్థం చేసికొంటాం. విమర్శిస్తాం. ఆడిపోసికొంటాం.

17. నీవు "బిడ్డడు తండ్రిని అడిగినట్లే మీరూ నమ్మకంతో పరలోకంలోని తండ్రిని అడగండి" అని చెప్పావు - 7,9-11. కాని మేము మా యక్కరల్లో నిన్ను ఆశ్రయించం. నమ్మకంతో నీకు ప్రార్థన చేయం. నీవు ఓ అమ్మానాన్న లాంటివాడివని అర్థం చేసికోం.

18. నీవు "ఇతరులు మీకేమి చేయాలని కోరుకొంటారో దాన్ని మీరు ఇతరులకూ చేయాలి" అని బంగారు సూత్రాన్ని బోధించావు - 7, 12. మేము ఇతరుల మమ్ము ఆప్యాయంగా చూడాలని కోరుకొంటాం. కాని మేము మాత్రం ఇతరులను అలా చూడం. మా యక్కరల్లో ఇతరులు మాకు తోడ్పడాలని ఆశిస్తాం. కాని మేము మాత్రం ఇతరులకు తోడ్పడం.

19. నీవు "ఇరుకైన ద్వారాన ప్రవేశించి, కష్టమైన మార్గాన ప్రయాణించి జీవాన్ని పొందండి" అని చెప్పావు - 7, 13-14, మేము మాత్రం విశాలమైన ద్వారాన ప్రవేశించి వినాశం తెచ్చుకొంటాం.

20. నీవు "నీబోధలను ఆలించి పాటించేవాడు రాతిపునాది మీద ఇల్లు కట్టినవాడి లాంటివాడనీ, వాటిని ఆలించి పాటించనివాడు ఇసుకపునాదిమీద ఇల్లు కట్టినవాడిలాంటివాడనీ" నుడివావు - 7,24-27. మే మసలు నీ గ్రంథమే చదవం. నీ బోధలు మా కట్టే తెలియవు. ఆ తెలిసినవాటిని గూడ మా జీవితంలో అంతగా ఆచరించం.

## ప్రార్థనం

ప్రభూ!నీ బోధలు మాకు శాశ్వతజీవాన్ని దయచేస్తాయి. వాటిని పాటించినవాడికి అమృతసిద్ధి కలుగుతుంది. కనుక మేము ఈ లోకంలో నీ యాజ్ఞల ప్రకారం జీవించి పరలోకంలో నీ దర్శనభాగ్యానికి నోచుకొనే అనుగ్రహం మా కందరికీ దయచేయి - ఆమెన్.

# 3. పదియాజ్ఞలు

నిర్గ 20, 1-17

## 1. సర్వేశ్వరుని మాత్రం ఆరాధించుదువు గాక

1. నేను నిజంగా దేవుణ్ణి ప్రేమిస్తున్నానా? అతనిపట్ల నాకు వ్యక్తిగతమైన అనుభవం వుందా?

2. అతన్ని రోజుపొడుగునా చాలసార్లు జ్ఞప్తికి తెచ్చుకొంటుంటానా? దానివలన నా హృదయంలో భక్తివిశ్వాసాలు పెరుగుతూంటాయా?

3. నాకు దేవుణ్ణి తలంచుకొన్నప్పటికంటె ఈ లోక వస్తువులను తలంచుకొన్నపుడు ఎక్కువ ఆనందం కలుగుతుందా?

4. నాకు ప్రార్థనంమీద అభిరుచి వుందా?

5. దేవుని సన్నిధిలో ఏకాంతంగా కాలం గడపటమంటే నాకు సంతోషంగా వుంటుందా? నరులతో మాట్లాడినపుడు ఉల్లాసంగా వున్నట్లే దేవునితో మాట్లాడినపుడు ఆనందంగా వుంటుందా?

6. దేవుణ్ణి గురించీ ఆధ్యాత్మిక విషయాలను గురించీ మాట్లాడాలంటే నాకు ఇష్టంగా వుంటుందా?

7. నేను ఆయా ప్రాంపంచిక విషయాల్లో విజ్ఞానాన్ని ఆర్జించగోరినట్లే, భగవంతుణ్ణి గూర్చిగూడ విజ్ఞానాన్ని ఆర్జించ గోరుతుంటానా?

8. భగవంతుణ్ణి పట్టించుకోవడం అన్నిటికంటె ముఖ్యమైనదని భావిస్తుంటానా, లేక నేను పట్టించుకొనే నానావిషయాల్లో ఆ భగవంతుడుకూడ ఒకడా?

9. నేను ఆ ప్రభువు చిత్తాన్ని తెలిసికొని ఆ చిత్తం ప్రకారం జీవిస్తుంటానా?

10. దేవునికి సేవలు చేయాలనీ, ఆ సేవల్లో ఎన్ని బాధలైనా అనుభవించడానికి సిద్ధంగా వుండాలనీ కోరుకొంటానా?

## 2. సర్వేశ్వరుని నామాన్ని వ్యర్థంగా పలుకకుందువుగాక

1. దేవునిపట్లా అర్చ్యశిష్టులపట్లా నాకు భక్తిగౌరవాలు వున్నయా?

2. నేను నిజంగా పాపిననీ అయోగ్యుడననీ భావిస్తుంటానా?

3. నేను అనుక్షణం దైవనామాన్ని నా హృదయంలోను పెదవుల మీదను నిల్పుకొంటుంటానా?

4. నాకు సత్యంపట్ల గౌరవం వుందా? ఆ గౌరవం వలన దొంగప్రమాణాలు చేయకుండా వుంటుంటానా? అనవసరంగా ఒట్లు వేసికోకుండా, శాపవచనాలు పల్కకుండా వుంటుంటానా.

5. దేవునికి చేసిన ప్రమాణాలూ మొక్కుబడులూ సకాలంలో తీరుస్తుంటానా?

## 3. సర్వేశ్వరుని పండుగ దినాలను పరిశుద్ధపరచుదువుగాక

1. నేనుపూజ, పాపోచ్చారణం మొదలైన సంస్కారాల్లో భక్తితో పాల్గొంటుంటానా?
2. నా దేహాన్నీ హృదయాన్నీ దేవునికి ఆలయంగా వుంచుకొంటుంటానా?
3. గుడిలోలాగే నా హృదయంలో గూడ భగవంతునికి ఆరాధనం చెల్లిస్తుంటానా?
4. నా ఆరోగ్యాన్నీ శక్తినీ కాపాడుకోవడానికి అవసరమైనంతగా విశ్రాంతిని పొందుతుంటానా?
5. నేను తరచుగా దేవుని సాన్నిధ్యాన్ని గుర్తుకి తెచ్చుకొని ఆ ప్రభువుని భక్తిభావంతో ఆరాధించుకొంటుంటానా?

## 4. తల్లిదండ్రులను గౌరవించుదువు గాక

1. క్రీస్తు, మరియా యోసేపులపట్లలాగ నేను నా తల్లిదండ్రులపట్ల గౌరవాదరాలు చూపుతుంటానా?
2. పెద్దలయెడల గౌరవమూ విధేయతా ప్రేమా చూపెడుతుంటానా?
3. నా క్రిందివాళ్లను అనురాగంతో చూస్తుంటానా?
4. క్రీస్తు శిష్యుల కాళ్లు కడిగినట్లుగా నేను తోడి ప్రజలకు సేవలు చేయడానికి సిద్ధంగా వుంటానా?

## 5. నరహత్య చేయకుందువుగాక

1. నేను తోడి నరులను గౌరవమర్యాదలతో చూస్తుంటానా?
2. ఇతరులమీద దౌర్జన్యం చేస్తుంటానా? వాళ్ళనుకోపించి కసురుకొంటుంటానా? దూషిస్తుంటానా?
3. ఇతరులను గూర్చి చెడ్డగా భావిస్తుంటానా? వాళ్ళమీద చాడీలు చెప్తుంటానా?
4. నా శత్రువులను క్షమిస్తుంటానా? వాళ్ళతో రాజీపడ్డానికి సిద్ధంగా వుంటానా? వాళ్ళకొరకు ప్రార్థిస్తుంటానా?
5. మంచివాళ్ళ పొలం మీదా చెడ్డవాళ్ళ పొలం మీదాకూడ వాన కురిపించే దేవుణ్ణి ఆదర్శంగా పెట్టుకొని (మత్త 5, 45) నేను అందరినీ అంగీకరిస్తుంటానా?
6. చెడ్డను చెడ్డతో వారించక (రోమా 12, 21) మంచితో వారిస్తుంటానా?

7. నన్నువలె నా పొరుగువాళ్ళను ప్రేమిస్తుంటానా?

8. ఆ మంచి సమరయునిలాగే అక్కరలో వున్నవాళ్ళని నా శక్తికొలది ఆదుకొంటుంటానా?

9. వికలాంగులూ పేదసాదలూ వ్యాధిగ్రస్తులూ బాధార్తులూ మొదలైవాళ్లపట్ల విశేష కరుణ చూపుతుంటానా?

10. ఇతరులకు దురాదర్శాన్ని చూపి, వాళ్ళ దైవభక్తినీ, నైతిక నిష్ఠనూ చెడగొడు తుంటానా?

11. ఇతరుల విజయంపట్ల సంతోషమూ, పరాజయంపట్ల విచారమూ తెలియ జేస్తుంటానా?

12. తోడి నరుల్లో క్రీస్తుని గుర్తిస్తుంటానా? వాళ్ళ ద్వారా అతన్ని అనుభవానికి తెచ్చుకొంటుంటానా?

13. నాలోవున్న క్రీస్తుని ఇతరులకు చూపించడానికీ, ఇతరులతో పంచుకోవడానికీ సిద్ధంగా వుంటానా?

## 6. మోహపాపాలను చేయకుందువుగాక

## 9. మోహ తలంపులను తలంపకుందువుగాక

1. నా దేహంలోను, నా దేహంతోను పాపం చేయకుండా వుంటుంటానా? (1కొరి. 6, 18-19)

2. ఇతరులమీద నా హృదయంలో లైంగికమైన వాంఛలేమైనా వున్నాయా?

3. భగవంతుడు ఆసీనుడు కావలసిన నా హృదయ సింహాసనంమీద ఏ మానుషవ్యక్తినైనా కూర్చోబెడుతున్నానా?

4. నేను చదివే పుస్తకాలూ పత్రికలూ నాలోని లైంగికవాంఛలను రెచ్చగొట్టేలా వుంటాయా?

5. నిష్కలంకమాత హృదయంలాగే నా హృదయం కూడ దేవుణ్ణీ తోడి నరుణ్ణీ నిర్మలమైన ప్రేమతో ప్రేమిస్తుందా?

## 7. దొంగిలింపకుందువుగాక

## 10. పరుల సొమ్మును ఆశింపకుందువు గాక

1. నేను ఇతరుల వస్తువులను కాజేస్తుంటానా?

2. పేరాసతో వస్తువులను కూడబెట్టుకొంటుంటానా.

3. ధనికులకు అనర్థం (లూకా 6,24) అన్న వాక్యందృష్ట్యా నేను ధనికుడనా? నా సంపదలు నన్ను దేవునినుండీ తోడి నరులనుండీ దూరం చేస్తున్నాయా?

4. నేను డబ్బు, అధికారం, ఉద్యోగం, డిగ్రీలు, పేరుప్రతిష్ఠలు మొదలైనవాటిని దేవునికంటె గూడ అధికంగా ప్రేమిస్తున్నానా?

5. అన్యాయమార్గంలో సొమ్ము సంపాదిస్తున్నానా! డబ్బుకి దాసుడనై పోతున్నానా?

6. నేను గత్యంతరం లేక దరిద్రుడనుగా వున్నాగానీ నా హృదయంలో వస్తువులను కూడబెట్టుకోవాలనే కోర్కెలు లేవా?

7. నేను చేసిన అప్పులు మట్టసరిగా తీరుస్తుంటానా?

8. నేను పేదల మీద దయజూపి వాళ్ళకు నాకు చేతనైన దాన ధర్మాలు చేస్తుంటానా?

## 8. కూటసాక్ష్యం పలుకకుందువు గాక

1. నా తలంపులకీ మాటలకీ చేతలకీ పొందిక వుంటుందా?

2. నాకు సత్యప్రీతి, కష్టాలు వచ్చినా అసత్యం చెప్పకూడదు అనే నిష్ఠ వున్నాయా?

3. నేను రహస్యాలను దాచి వుంచగలనా?

4. నేను ముఖస్తుతులు చేస్తుంటానా? దంబం చూపెడుతుంటానా?

5. నేను ఇతరులలోని మంచిని గుర్తిస్తుంటానా? ఇతరులను గూర్చి మంచిగా మాట్లాడుతుంటానా?

6. ఇతరుల మేలెంచి వాళ్ల తప్పులను వాళ్లకు ధైర్యంగా తెలియజేస్తుంటానా?

7. ఇతరులు ఎదుట లేనపుడు వాళ్లను విమర్శిస్తూంటానా? నా యెదుట ఇతరులను విమర్శించేవాళ్లను మందలిస్తానా?

8. ఇతరులమీద చాడీలు చెప్తుంటానా? నిందలు మోపుతుంటానా?

9. నేను ఇతరులు చెప్పేది సావధానంగా వింటూంటానా? వాళ్ళు చెప్పేది సానుభూతితో అర్థంచేసికొని, వాళ్ల గొడవలను కాస్త పట్టించుకొంటుంటానా?

## ప్రార్థనం

ఓ ప్రభూ! నీ యాజ్ఞలను పాటించిన వాళ్ళకు నీవు నీ దర్శన భాగ్యాన్ని దయచేస్తావు. కనుక మేము ఈ లోకంలో నీ శాసనాలను ప్రేమభావంతో పాటించి పరలోకంలో మోక్షబహుమానాన్ని చూరగొనే భాగ్యాన్ని దయచేయి - ఆమెన్.

# 4. కృషి

1. భగవంతుడంతటివాడు ఆరునాళ్ళు కృషిచేసి భూమ్యాకాశాలను సృజించాడు - ఆది 2,1-3. నరమాత్రుడనైన నేను పనిచేయవద్దా?
2. ఆదాము భాగ్యవంతమైన స్థితిలో వున్నపుడు కూడ ఏదెను వనంలో తోటమాలిగా పనిచేసేవాడు -ఆది -2,15. మరి నేను పనికి జంకవచ్చా?
3. చీమలను చూచి సోమరియైన నరుడు జ్ఞానం తెచ్చుకోవాలి అన్నాడు సామెతల గ్రంథకర్త - 6, 6-9. నేను సోమరిపోతునైతే చెల్లుతుందా?
4. సొలోమోను ఏడేండ్లు కృషిచేసి దేవునికి సుందరమైన దేవాలయం కట్టించాడు - 1రాజు 6,38. దేవునికి నేను కట్టే దేవాలయమూ, నా కృషీ యేమిటివి?
5. ప్రభువు స్వర్గంలోని దేవదూతల్లోనే తప్పుపడతాడు- యోబు - 15, 15-16 అలాంటప్పుడు అరకొరలుగా పనిచేసే మనలను అతడు మెచ్చుకొంటాడా?
6. క్రీస్తు అన్నిపనులూ చక్కగా చేసాడు - మార్కు 7, 37. నేను నాపనులను పట్టీపట్టనితనంతో చేస్తే ఆ ప్రభువుకి ప్రియపడతానా?
7. పండ్లనుబట్టి చెట్టును నిర్ణయించాలి - మత్త 7, 16-20. ఆలాగే నరులను వాళ్ళు చేసే పనులనుబట్టి నిర్ణయించాలి. నేను మంచిపండ్లుకాసే మామిడి చెట్టు లాంటివాడినా లేక పాడుకాయలు కాసే ఉమ్మెత్త చెట్టులాంటివాడినా?
8. నేను సేవలు చేయించుకోవడానికి రాలేదు, సేవలు చేయడానికి వచ్చాను అన్నాడు ప్రభువు - మార్కు 10,45. నా పని ద్వారా నేను ఇతరులకు నిజంగా సేవచేస్తున్నానని చెప్పగలనా?
9. తాను తీసికొన్న సొమ్ముని వృద్ధిచేయని మూడవ సేవకుణ్ణి యజమానుడు నీవు సోమరివైన చెడ్డదాసుడివి అని చీవాట్లు పెట్టాడు - మత్త 25, 26. ఈ తిట్టు నేడు నాకు కూడ వర్తించదుగదా?
10. మనం చేయవలసిన పనులన్నీ చేసాక గూడ "మేముఅయోగ్యులమైన సేవకులం. మా కర్తవ్యం ప్రకారం మేము చేయవలసిన పని చేసాం. మేము అధికంగా చేసిందేముంది?" అనుకోవాలి - లూకా 17,10. నేను కొద్దిగా చేసి ఆ చేసిన దానిని గూర్చి గొప్పగా చెప్పుకోవడం లేదా? నా డప్పు నేను వాయించుకోవడం లేదా?
11. పనిచేయనివాడు కూడు తినడానికి అర్హుడు కాదు అన్నాడు పౌలు - 2తెస్స 3,10. నేను కష్టపడి పనిచేసేవాడినా లేక వళ్ళు దాచుకొనేవాడినా?

12. మనం చేసే పనులన్నీ ప్రభువుపేరిట చేయాలన్నాడు పౌలు - కోలో 3.17. నా పనుల్లో నరుని మెప్పుకోరతానా లేక దేవుని మెప్పుకోరతానా?

13. నేడు మన దేశంలో లక్షలకొలది మోసగాళ్ళు కష్టపడి పని చేయకుండానే డబ్బు ప్రోగుచేసికొంటున్నారు. వాళ్ళల్లో నేనూ ఒక్కణ్ణి కాదు కదా?

14. కృషితో నాస్తి దుర్భిక్షం అన్నారు. నా జీవితంలో ఎదుగూ బొదుగూ లేకపోవడానికి కారణం నా సోమరితనం కాదా?

## ప్రార్థనం

ఓ ప్రభూ! నీవు నరుడు కష్టపడి పనిచేయాలని నిర్ణయించావు. ఐనా మాకు పనిచేయాలంటే అనిష్టంగా వుంటుంది. ఎప్పుడూ పనినుండి తప్పించుకోజూస్తాం. కాని చివరికి మమ్ము రక్షించేదీ శిక్షించేదీ కూడ మేము చేసే పనే. కనుక మేము వళ్ళు దగ్గరబెట్టుకొని మా బాధ్యతలను సంతృప్తికరంగా నిర్వర్తించే భాగ్యం దయచేయి - ఆమెన్.

# 5. చిత్తశుద్ధి

1. నరుడు వెలుపలి రూపాన్ని మాత్రమే చూస్తాడు. కాని దేవుడు హృదయాన్ని పరిశీలిస్తాడు - 1సమూ 16,7. నా హృదయంలోని కోరికలు ఏలా వుంటాయి?

2. పాతాళలోకంలో కూడ ప్రభువుకి తెలియంది కాదు. అంటే నరుని హృదయంలోని ఆలోచనలు అతనికి తెలియకుండా వుంటాయా - సామె 15,11. నా హృదయాలోచనలు తెలిస్తే ప్రభువు నన్ను మెచ్చుకొంటాడా?

3. ప్రభువు కంటబడకుండా దాగివుండే దేదీలేదు - హెబ్రే 4,13. నేను పాడు పనులు చేసి నరుల కన్నుకప్పుతాను. కాని దేవుని కన్ను కప్పగలనా?

4. ప్రభువు కండ్లు సూర్యునికంటె పదివేలరెట్లు కాంతిమంతంగా వుంటాయి. అవి నరులుచేసే పనులన్నీ గుర్తిస్తూనే వుంటాయి - సీరా 23, 19. అతడు అందరికీ కర్మసాక్షిగా వుంటాడు. మరి దుష్కార్యాలు చేసే నేను అతని యెదుట కన్నులెత్తుకొని తిరుగగలనా?

5. దేవుడు ఋజువర్తనులతో ఋజువుగాను, కపట వర్తనులతో కపటంగాను ప్రవర్తిస్తాడు - కీర్త 18,26. మరి ఆ ప్రభువు నా కపటానికి నాకు శాస్తి చేయడా?

6. అసలు నేను కయీనులాగ కపటవర్తనుణ్ణా లేక హేబెలులాగ సరళవర్తనుణ్ణా? - ఆది 4, 3-7.

7. హృదయానికుండే కపటం దేనికీ లేదు - యిర్మీ 17, 9-10. ఏ పుట్టలో ఏపాముందో? నాహృదయంలో ఏ విషసర్పం బుసకొడుతుందో?

8. ఈ ప్రజలు నన్ను పెదవులతో గౌరవిస్తున్నారుగాని వీళ్ళహృదయాలు మాత్రం నాకు దూరంగా వున్నాయి - యెష 29, 13. మత్త 15, 8-9. నా యారాధనంలో నిజమైన భక్తి ఉంటుందా?

9. నేను సమర్పించుకొనే బలి పశ్చాత్తాపతప్తమైన హృదయమే అన్నాడు కీర్తనకారుడు - 51, 16-17. నా పాపాలకొరకు నేను మనస్ఫూర్తిగా పశ్చాత్తాపపడుతుంటానా?

10. శోధనలు రానంతకాలం అందరూ భక్తులే. కాని శోధనలు వచ్చాక నిజమైన భక్తుడెవడో తేలిపోతుంది. ప్రభువు అబ్రాహాముని శోధింపగా అతడు పరీక్షలో నెగ్గాడు - అది 22, 12. మరి నేను?

11. యూదా ఉమ్మడి సంచిలోని డబ్బు కొద్దికొద్దిగా కొట్టేస్తుండేవాడు - యోహా 12, 3-6. నేను ధనప్రలోభానికి తట్టుకొని నిలుస్తుంటానా?

12. ఐగుప్తులో పోతీఫరు భార్య తన్ను పాపకార్యానికి పురికొల్పగా యోసేపు "దేవుడు చూస్తుండగా నేను ఈలాంటి చెడ్డపనికి ఒడిగట్టలేను" అన్నాడు - ఆది 39, 7-10 ఆలాగే బాబిలోనులో ఇద్దరు వృద్ధులు సూసన్నను బలత్కారం చేయగా ఆమె "ఈలాంటి పాడుపనికి పూనుకొని దేవుని యెదుట పాపం కట్టుకోవడంకంటె మీరుపెట్టే శిక్షననుభవించడమే మేలు" అంది - దాని 13, 19. లైంగికశోధనలు బలంగా వచ్చినపుడు నా ప్రవర్తనం ఏలా వుంటుంది?

13. యోహాను యాకోబు ఇతరశిష్యులకి తెలియకుండా తల్లిని వెంటబెట్టుకొని వచ్చి క్రీస్తురాజ్యంలో పెద్దపదవులు కొట్టేయబోయారు - మత్త 20, 20-24 పదవులూ గౌరవాలూ దక్కించుకోవడం కోసం నేను మాత్రం మోసానికి పాల్పడ్డంలేదా?

14. యూదులు బాహ్యశుద్ధి ముఖ్యమనుకొన్నారు. కాని ప్రభువు హృదయశుద్ధి ముఖ్యమని బోధించాడు - మత్త 15, 19-20. అతడు కోరినట్లుగా నా అంతరంగం శుద్ధంగా వుంటుందా?

15. సిలువమీద తెరువబడిన ప్రభువు హృదయం మన హృదయంమీద సోకి దాన్ని పునీతం చేస్తేనే తప్ప అది మారదు- యోహా 19,34. ఈ మార్పుని నేను మక్కువతో ఆశిస్తుంటానా?

16. అగస్టీను భక్తుడు "ఓ ప్రభూ! మా హృదయాన్ని నీ కొరకే చేసావు. నీయందు విశ్రమించిందాకా దానికి విశ్రాంతి లేదు" అన్నాడు. నా హృదయంలో నిజమైన శాంతీ సంతృప్తీ వున్నాయా? లేకపోతే కారణమేమై వుంటుంది?

17. "భాండ శుద్ధిలేని పాకమేల?" అన్నాడు వేమన్న. నేను అపవిత్రమైన హృదయంతో దేవుణ్ణి పూజిస్తే ఆ పూజ అతనికి ప్రియపడుతుందా?

18. ఇంకా అతడే "తలలు బోడులైన తలపులు బోడులా?" అన్నాడు. నా హృదయంలోని కోరికలు ఏలా వుంటాయి?

19. మేడిపండు చూడ్డానికి మేలిమిగా వున్నా పొట్టవిప్పి చూస్తే పురుగులుంటాయి. గురువిందగింజ ఎర్రగా నిగనిగలాడుతున్నా దాని పొట్టక్రింద నల్లని మచ్చ వుంటుంది. నా జీవితంకూడా ఈలాగే వుండడం లేదు కదా?

20. ఎవరు త్రవ్వుకొన్న గోతిలే వాళ్లే పడతారు అనే సామెత నా జీవితంలో ఎన్నోసార్లు నెరవేరడం లేదా?

21. తోడి నరులే గనక నా హృదయంలోని ఆలోచనలనూ కోరికలనూ తెలుసుకోగలిగితే ఇక నా మొగాన నెత్తురుచుక్క వుంటుందా?

22. పరోపదేశ పాండిత్యం చాలమందికి వుంటుంది. కాని స్వయంగా ఆచరించేవాడే డొక్కశుద్ధికల నరుడు. ఈ సూత్రంతో కొల్చిచూస్తే నేను నిలుస్తానా?

### ప్రార్థనం

ఓ ప్రభూ! నీవు సత్యప్రియుడవైన దేవుడివి. అసత్యం నీకు ఎంతమాత్రమూ గిట్టదు. మేమైతే నిత్యజీవితంలో వంచనతోను కపటంతో నాటకాలు ఆడబోతాం. కాని మా యెత్తులు నీ యెదుట చెల్లవు. నీవు హృదయాలను పరిశీలించే వాడివని గుర్తించి చిత్తశుద్ధితో జీవించే భాగ్యం దయచేయి - ఆమెన్.

## 6. కుటుంబ ధర్మాలు

1. ఆదాము ఏవను చూచి ఈమె నాయెముకల్లో యెముక, దేహంలో దేహం అనుకొన్నాడు - ఆది 2, 23-24. భార్యాభర్తలమైన మేము ఏక శరీరానిమి, ఏకవ్యక్తిమి అన్నంత సన్నిహితంగా జీవిస్తుంటామా?

2. భగవంతునికి తన భక్తులమీదవుండే ప్రేమకి ప్రతిరూపం భార్యాభర్తలప్రేమ. వివాహసమయంలో శ్రీసభా క్రీస్తూ అనే పోలిక భార్యాభర్తలమీద సోకుతుంది -

ఎఫె 5, 22-28 ఈ సూత్రానికి తగ్గట్టుగా భార్యాభర్తలమైన మేము పరస్పర ప్రేమతో జీవిస్తుంటామా? మేము ఒకరినొకరం వరప్రసాద సాధనంగా గణిస్తుంటామా?

3. ఆదాము పాపఫలితంగా స్త్రీ పురుషుడికి బానిస అయింది - ఆది 3,16. కాని క్రీస్తు నరులపాపానికి ప్రాయశ్చితం చేసి ఈ శాపాన్ని తొలగించాడు. ఐనా నేను ఈనాడుకూడా నా భార్యను బానిసను చూచిన చూపున చూడ్డం లేదా?

4. వివాహసంస్కారం ద్వారా దంపతుల్లోని జంతుప్రేమ దివ్యప్రేమగా మారాలి. కాని దంపతులమైన మా ప్రేమలో కామమెన్నిపాళ్ళు ? పవిత్రప్రేమ ఎన్నిపాళ్లు?

5. దంపతుల లైంగిక క్రియద్వారా దేవుడు తన్ను పోలిన నరులను సృజిస్తాడు. అది భగవంతుని సృష్టికి అనుసృష్టిలాంటిది. అలాంటి లైంగికక్రియలో భార్యాభర్తలమైన మేము పవిత్రమైన ఉద్దేశంతో పాల్గొంటుంటామా?

6. లైంగికక్రియలో నేనెంతగా సుఖించానా అని ఆలోచించడం కామం. నా భాగస్వామిని ఎంతగా సుఖపెట్టానా అని ఆలోచించడం ప్రేమ. ఈ రెండింటిల్లో నా పద్ధతి యేది?

7. భార్యాభర్తలు ఒకరు కోరినప్పుడొకరు దేహదానం చేసికోవాలి - 1కొ 7, 3.4. నా వివాహజీవితంలో ఈ దాంపత్యపుణ్యాన్ని హృదయపూర్వకంగా పాటిస్తుంటానా?

8. ప్రభువు ఇచ్చినపుడు సుఖాలు అనుభవించినట్లే అతడు తీసికొనిపోయినపుడు కష్టాలు అనుభవించాలి - యోబు 2, 9-10. సిలువ నా కుటుంబం మీద భారంగా సోకినపుడు నేను దానిని ఓపికతో భరిస్తుంటానా?

9. వ్యభిచార దోషంవల్ల నా భాగస్వామికి అపరాధం చేస్తున్నానా? మత్త 5, 27-28 1కొ 6, 15-20. క్రైస్తవ భక్తుడికి శారీరక వ్యభిచారమూ తగదు, మానసిక వ్యభిచారమూ తగదు అన్న సూత్రాన్ని గమనిస్తుంటానా?

10. భార్యాభర్తల పరస్పరప్రేమ వివాహధర్మాల్లో మొదటిదైతే, రెండవధర్మం సంతానాన్ని కనడం - ఆది, 1,28. దేవుడు నాకిచ్చిన బిడ్డలను నేను మనస్ఫూర్తిగా అంగీకరిస్తున్నానా? ఆ బిడ్డల పుట్టువును కృత్రిమంగా నిరోధించడంలేదుకదా!

11. కన్న బిడ్డలను గాలికి వదలివేయక వారిని మంచి క్రైస్తవులనుగా పెంచి పెద్దచేస్తున్నానా?

12. గురువు దైవకార్యాల్లోలాగే గృహస్థుడు ప్రపంచకార్యాల్లో నిమగ్నుడు కావాలి - ఆది 1, 28. దేవుడు నాకు నియమించిన పనిని నేను సంతృప్తికరంగా చేస్తున్నానా?

13. మన గృహమే ఒక దేవాలయం - 1కొ 16,19. మా గృహ దేవాలయంలో క్రైస్తవవాతావరణమూ, తగినంత భక్తీ, అనుదిన ప్రార్థనా కన్పిస్తుంటాయా? మా బిడ్డల్లో ఎవరికైనా దేవుని పిలుపు వుంటే తల్లిదండ్రులమైన మేము అడ్డు చెప్పడం లేదుకదా?

## ప్రార్థనం

ఓ ప్రభూ! గురువు గురుజీవితంద్వారా, మఠకన్య కన్యాజీవితంద్వారా పవిత్రులైనట్లే గృహస్థులు సంసారజీవితంద్వారా పవిత్రులు కావాలని నీవు సంకల్పించుకొన్నావు. నీ కోరికననుసరించి మేము ఈ వివాహబంధాన్ని ఎన్నుకొన్నాం. కనుక మేము కుటుంబధర్మాల ప్రకారం పవిత్ర జీవితం జీవించి కడన నీబహుమతిని పొందే భాగ్యం దయచేయి - ఆమెన్.

# 7. సోదర ప్రేమ

1. ధర్మశాస్త్రంలోని ఆజ్ఞలన్నీ ప్రేమాజ్ఞమీదనే ఆధారపడతాయి - మత్త 24, 34-40. ఈలాంటి ముఖ్యమైన ఆజ్ఞను నేను జాగ్రత్తగా పాటిస్తున్నానా?
2. పరలోకంలోని తండ్రి మంచివాళ్ళకీ చెడ్డవాళ్ళకీ కూడ వాన కురిపిస్తాడు - మత్త 5,45. ఈలాంటి తండ్రిని చూచి నేను విరోధులను క్షమించవద్దా? జనుల్లో కొందరిని ఆదరించి మరికొందరిని నిరాదరణం చేయకుండా వుండొద్దా?
3. మనం పరులను గూర్చి తీర్పు చేయకుండా వుంటే దేవుడు కూడ మనలను గూర్చి తీర్పుచేయడు - లూకా 6,37. నేను తరచుగా పరులను విమర్శించడం లేదా?
4. నాలుకను అదుపులో పెట్టుకొనేవాడు సత్పురుషుడు.- యాకో 3, 2-12. నా నోరు మంచిదేనా?
5. మన కానుకలు దేవుని పీఠం వద్దనే వదలిపెట్టి మొదటవెళ్ళి మన పొరుగువారితో రాజీపడిరావాలి - మత్త 5, 23-24, కాని నేను దైవప్రేమను ఘనంగా యెంచి సోదరప్రేమను చులకన చేయడం లేదా?
6. నా సోదరులకు చేసింది నాకు చేసినట్లే భావిస్తానన్నాడు ప్రభువు - మత్త 25,40, నేను అక్కరలో వున్న తోడి జనాన్ని ఎంతవరకు పట్టించుకొంటున్నాను?

7. శత్రువుని డెబ్బదియేడుసార్లు గూడ క్షమించాలి - మత్త 18, 21 22. నాలో క్షమాగుణం వుందా?

8. చెడ్డను చెడ్డతో వారించగూడదు. రోమా 12,21. ఒక చెంపన కొడితే మరో చెంప చూపించాలి - మత్త 5, 38-42. నేను నా కపకారం చేసినవాడికి ప్రతీకారం చేయడం లేదా?

9. క్రీస్తు శిష్యులకు గుర్తు సోదరప్రేమే - యోహా 13, 35 ఈ గుర్తు నాలో కన్పిస్తుందా?

10. ఉన్నవాడు లేనివానితో పంచుకొని తన ప్రేమను క్రియాపూర్వకంగా చూపించాలి - 1యోహా 3, 16-18. యాకో 2, 15-16. నేను లేమిలోవున్న తోడివాడికి ఏదైనా ఈయడానికి ఇష్టపడతానా?

11. కంటికి కన్పించే తోడినరుణ్ణి పట్టించుకోనివాడు కంటికి కన్పించని భగవంతుణ్ణి పట్టించుకోడు - 1యోహా 4, 20-21. ఈ సూత్రం ప్రకారం నేను తోడినరుణ్ణి ప్రేమించకుండానే భగవంతుణ్ణి ప్రేమిస్తున్నానుకదా అది చాలులే అనుకొంటే సరిపోతుందా?

12. మనం ప్రేమతో ఒకరికొకరం సేవలు చేయాలి - గల 5,13. నేను తోడివాణ్ణి పరామర్శిస్తుంటానా?

13. ఇతరులను మనకంటె యోగ్యులనుగా భావించాలి - రోమా 12, 10. ఫిలి 2,3. కాని నేను ఇతరులకంటె నేనే యోగ్యుణ్ణి అనుకోవడం లేదా?

14. క్రీస్తు దేహమైన క్రైస్తవ ప్రజల్లో తారతమ్యాలు ఉండకూడదు - గల 3, 28. కాని నాకు కులం పట్టింపులు లేవా?

15. క్రీస్తుదేహాన్ని విభజించగూడదు - 1కొ 1, 10-13. కాని నేను ముఠాలనూ పక్షాలనూ తయారు చేయడం లేదా?

16. ఒకరి భారాన్ని ఒకరు భరించాలి - గల 6,2. నేను, ఇతరుల దోషాలనూ లోపాలనూ సహిస్తూంటానా?

17. అన్ని పుణ్యాలనూ ఐక్యపరచే సాధనం సోదరప్రేమ - కొలో 3,14. కాని నాలో అదే ప్రధానంగా లోపిస్తే?

18. ప్రేమ అసూయపడదు, డప్పాలుకొట్టదు, ఉబ్బిపోదు, అమర్యాదగా ప్రవర్తించదు, తన స్వార్థాన్ని తాను చూచుకోదు, కోపపడదు, అపకారాలను మనసులో పెట్టుకోదు, కీడునుగూర్చి కాక మేలునుగూర్చి సంతోషిస్తుంది - 1కొ 13, 4-7. ఈ యెన్మిది సూత్రాలు నా కెంతవరకు వర్తిస్తాయి?

19. తీసికోవడంకంటె ఈయడం ధన్యం - అచ 20,35. నేనెప్పుడూ ఇతరులు నాకేమిస్తారా అనే చూస్తుంటానుగాని, ఇతరులకు నేనేమి ఈయగలనా అని ఆలోచిస్తానా?

20. నరుడికి నరుడు తోడేలు. సోదరప్రేమ మనంతట మనకు అలవడదు. అది దేవుడే యిచ్చే వరం - రోమా 5,5. నేను ఆవరం కోసం వినయంతో ప్రార్థిస్తుంటానా?

## ప్రార్థనం

ఓ ప్రభూ! క్రైస్తవ జీవితంలోకల్ల అతిముఖ్యమైందీ, అతికష్టమైందీగూడ సోదరప్రేమే. మేము ఏవేవేవో పుణ్యాలను సాధించబోతాం కాని ఈ ముఖ్యమైన పుణ్యాన్ని మాత్రం విస్మరిస్తాం. మా యవివేకాన్ని మన్నించు. నీయాత్మ సహాయంతో మేమీ పుణ్యాన్ని సాధించే భాగ్యం దయచేయి - ఆమెన్.

# 8. ముగ్గురు సేవకుల సామెత

మత్త 25-14-30

1. యజమానుడు ఆ ముగ్గురు సేవకులకు డబ్బిచ్చినట్లుగానే, ప్రభువు నాకు దయచేసిన శక్తిసామర్థ్యాలను నేను కృతజ్ఞతా భావంతో గుర్తిస్తుంటానా?
2. నా మేలిగుణాలేమిటివో, నా లోపాలేమిటివో నాకు బాగా తెలుసా?
3. నేను నా శక్తిసామర్థ్యాలను దేవునికీర్తికొరకూ, తోడి ప్రజల ఉపయోగం కొరకూ వినియోగిస్తుంటానా?
4. ఇతరులకు సేవచేయడానికిగాను నేను నేర్చుకోగల్గినన్ని సంగతులు నేర్చుకొని, ఆర్జించగలిగినన్ని నైపుణ్యాలు ఆర్జిస్తుంటానా?
5. నా పాలబడిన బాధ్యతలనూ పనులనూ ఓపికతోను ధైర్యంతోను అంగీక రిస్తుంటానా?
6. అవసరమైనపుడు నాయకత్వాన్ని వహించడానికి సిద్ధంగా వుంటానా?
7. నాకు ఆత్మవిశ్వాసమూ కార్యారంభశక్తీ వున్నాయా?
8. నాశక్తి సామర్థ్యాలనూ, కాలాన్నీ, జీవితాన్నీ ఇతరుల సేవకొరకు వినియోగించడానికి సిద్ధంగా వుంటానా?
9. నా అధికారం, పలుకుబడి, తెలివితేటలు మొదలైనవాటిని నా స్వార్థలాభానికిగాక ఇతరుల సేవకొరకు వినియోగించడానికి సంసిద్ధంగా వుంటానా?

10. నేను ఇతరుల శక్తిసామర్థ్యాలను గుర్తించి గౌరవిస్తుంటానా? ఇతరులను ప్రోత్సహిస్తుంటానా?

11. ఇతరుల కృషిని మెచ్చుకొంటుంటానా? ఇతరుల విజయాన్ని చూచి సంతోషిస్తుంటానా లేక అసూయ చెందుతుంటానా?

12. మంచిని సాధించడానికిగాను ఇతరవ్యక్తులతోగూడ కలసి పనిచేయడానికి సుముఖంగా వుంటానా?

## ప్రార్థనం

ప్రభూ! నీవు ఒక్కో నరునికి ఒక్కోరకం శక్తిసామర్థ్యాలు దయచేస్తుంటావు. నీవు నాకు దయచేసిన వరాలను నేను చక్కగా గుర్తించేలా చేయి. నా శక్తికొలది వాటిని వృద్ధిచేసి కొనేలా అనుగ్రహించు. ఆ వరాలతో నీకూ తోడిరపజలకూ సేవలుచేసే భాగ్యాన్ని గూడ ప్రసాదించు - ఆమెన్.

# 9. భగవంతుడూ, తోడినరులూ, నేనూ

## 1. నీ ప్రభువైన దేవుణ్ణి నీ పూర్ణహృదయంతో ప్రేమింతువుగాక

- మార్కు 12, 30

1. బిడ్డడు తండ్రివలె నేను దేవుణ్ణి ప్రేమిస్తుంటానా? అతన్ని అన్నిటికంటె అధికంగా ప్రేమించి అతని యాజ్ఞలను పాటిస్తుంటానా లేక ఈ లోకవస్తువులనే దేవుని కంటె అధికంగా ప్రేమిస్తుంటానా? ఆయా పనులను చేసేపుడు నా హృదయంలోని ఉద్దేశం పవిత్రంగా వుంటుందా?

2. నేను ప్రభుని గట్టిగా విశ్వసిస్తుంటానా? శ్రీసభ బోధలను అంగీకరిస్తుంటానా? నాడునాటికి విశ్వాసంలో పెరుగుతున్నానా? ఆ విశ్వాసానికి వ్యతిరేకంగా వచ్చే శోధనలను జయిస్తుంటానా? కష్టనష్టాలు వచ్చినా దేవునిపట్ల నాకున్న విశ్వాసాన్ని బహిరంగంగా వ్యక్తం చేస్తుంటానా? ఆంతరంగికంగా బహిరంగంగా గూడ నేను క్రైస్తవుణ్ణని నిరూపించుకోవడానికి సంసిద్ధంగా వుంటానా?

3. ఉదయ సాయంకాలాల్లో భక్తితో జపం చేసికొంటుంటానా? ప్రార్థనం? చేసికొనేపుడు హృదయాన్ని దేవునివైపు త్రిప్పుతుంటానా లేక వట్టినే ఏవో జపాలు వల్లెవేస్తుంటానా?

నా కష్టసుఖాలను ప్రభువుకి అర్పించుకొంటుంటానా? శోధనల్లో అతనినుండి సహాయం అడుగుకొంటుంటానా?

4. ప్రభువు దివ్యనామాన్ని గౌరవప్రపత్తులతో చూస్తుంటానా? దేవదూషణలద్వారా, అబద్ధసాక్ష్యాల ద్వారా, ప్రమాణాలు శాపవచనాలద్వారా ఆ నామాన్ని అమంగళం చేస్తుంటావా? దేవమాతకు, దేవదూతలకు, పునీతులకు అగౌరవం కలిగేలా మాటలాడుతుంటానా?

5. ఆదివారాల్లోను పండుగ దినాల్లోను భక్తిశ్రద్ధలతో దేవుణ్ణి ఆరాధిస్తుంటానా? ఆ దినాల్లో పూజబలిలో పాల్గొంటుంటానా? సంవత్సరానికి ఒకసారయినా మంచి పాపసంకీర్తనము చేసి దివ్యసత్ప్రసాదాన్ని స్వీకరించాలనే నియమాన్ని పాస్కకాలంలో నెరవేర్చుకొంటుంటానా?

6. డబ్బు, మూఢనమ్మకాలు, సుఖభోగాలు కీర్తిప్రతిష్ఠలు మొదలైన దబ్బరదేవతలను కొలిచి వాటిని దేవునికంటె అధికంగా సేవించడం లేదు కదా?

## 2. నేను మిమ్ము ప్రేమించినట్లే మీరూ ఒకరి నొకరు ప్రేమించండి

– యోహా 13, 34.

1. నేను తోడి నరులను యథార్థంగా ప్రేమిస్తుంటానా? వాళ్ళను నా స్వార్థానికి వాడుకోవడం లేదా? వాళ్లు నాకేమి చేయడానికి ఇష్టపడనో వాళ్ళకు నేనది చేయడం లేదా? నా మాటలద్వారా, చేతలద్వారా ఇతరులకు దురాదర్శం చూపించడంలేదా?

2. నా సంసార జీవితంలో యథార్థమైన ప్రేమద్వారా కుటుంబ సభ్యులను సంతోషపెడుతుంటానా? నేను నా తల్లిదండ్రులకు విధేయుడనై యుండి వాళ్ళకు కావలసిన సహాయం చేస్తుంటానా? నా బిడ్డలను క్రైస్తవమార్గంలో పెంచు తుంటానా? వారికి మంచి ఆదర్శాన్ని చూపించి, నిజమైన తండ్రిలాగ వాళ్ళకు శిక్షణ నిస్తుంటానా? నా హృదయంలోను నేను ప్రవర్తించేతీరులోను నా భార్యపట్ల (భర్తపట్ల) విశ్వాసపాత్రంగా మెలుగుతుంటానా?

3. నా సొత్తును లేనివాళ్ళతో పంచుకొంటానా? దరిద్రులకూ, పీడితులకూ దుఃఖార్తులకూ నా శక్తికొలది సాయం చేస్తుంటానా? పేదలనూ, రోగులనూ, వృద్ధులనూ, బాధార్తులనూ అనాదరం చేయనుగదా?

4. నా జీవితం నేను భద్రమైన అభ్యంగనంలో పొందిన ఆదేశాలకు న్యాయం చేకూర్చేలా వుంటుందా? నేను శ్రీసభ ప్రేషితోద్యమంలోను, నా విచారణయొక్క సేవా జీవితంలోను పాలుపంచుకొంటున్నానా? శ్రీసభ అక్కరల్లో నా చేతనైనంతవరకు సహాయం చేస్తుంటానా? శ్రీసభ ఐక్యత కొరకూ, అభివృద్ధికొరకూ, వేదప్రచారం కొరకూ ప్రార్థిస్తుంటానా? ఇంకా లోకంలో శాంతీ సాంఘికన్యాయమూ నెలకొనేందుకుగూడ ప్రార్థిస్తుంటానా?

5. నేను దేశ శ్రేయస్సుకొరకు పాటుపడుతుంటానా లేక నా లాభం నేను చూచుకొంటుంటానా? దేశంలో న్యాయమూ నీతీ సమైక్యతా ప్రేమా సుహృద్భావమూ నెలకొనేలా కృషిచేస్తుంటానా? మంచిపౌరుడనుగా జీవిస్తుంటానా? చెల్లించవలసిన పన్నులు చెల్లిస్తుంటానా?

6. నా వృత్తికి న్యాయం చేకూరుస్తున్నానా? నా పనిని చిత్తశుద్ధితో చేసి సమాజానికి యథార్థమైన సేవ చేస్తున్నానా? నా క్రింద పని చేసేవాళ్ళకి ఉచితమైన వేతనాలు చెల్లిస్తున్నానా? ఆయా కార్యరంగాల్లో ఇతరులతో చేసికొన్న ఒప్పందానికి కట్టుబడి వుంటున్నానా?

7. న్యాయసమ్మతంగానే అధికారంలో వున్నవాళ్ళకి విధేయతా గౌరవమూ చూపుతుంటానా?

8. నేను ఏదైనా పెద్దపదవిలో వుంటే దాన్ని నా స్వార్థలాభానికి వాడుకోకుండా వుంటానా? ఆ పదవిద్వారా తోడి జనానికి నిజమైన సేవ చేస్తానా?

9. నేను నిజాయితీపరుణ్ణేనా? సత్యవంతుణ్ణేనా? మోసం, నింద, చాడీలు, చెడ్డగా తలంచడం, రహస్యాలను వెల్లడి చేయడం మొదలైన దుష్కార్యాల ద్వారా ఇతరులకు కీడుచేయడం లేదు కదా?

10. నేను హింసకు పాల్పడి ఇతరులకు ప్రాణనష్టం, అవయవ నష్టం కలిగించలేదుకదా? ఇతరుల మంచిపేరుకు, ఆస్తిపాస్తులకు, ఆదాయానికి నష్టం కలిగించలేదుకదా? ఇతరులను గర్భస్రావానికి పురికొల్పలేదుకదా? ఇతరులపట్ల పగను పెంచుకోలేదుకదా? తగాదాలతోను కోపతాపాలతోను ఇతరులతో సంబంధం త్రెంచుకొని వాళ్ళ వుద్యమాలనుండి వైదొలగలేదుకదా? ఇతరుల నిర్దోషత్వాన్ని రుజువుచేస్తూ సాక్ష్యం చెప్పవలసివచ్చినపుడు స్వార్థబుద్ధితో వెనుకడాలేదుకదా?

11. నేను ఇతరుల సొత్తును అపహరించానా? ఆశించానా? పాడుచేసానా? ఇతరులసొమ్ము కొట్టేసినపుడు వాళ్ళకి నష్టపరిహారం చేసానా?

12. క్రీస్తుప్రేమను చూచి నాకు అపకారం చేసినవాళ్ళని క్షమిస్తున్నానా? వాళ్ళకు ప్రతీకారంచేసి వాళ్లమీద పగతీర్చుకోవాలనే కోరికతో లేనుకదా?

## 3. పరలోకంలోని మీ తండ్రిలాగే మీరూ పరిపూర్ణులైయుండండి

- మత్త 5, 48

1. నాగమ్యం దేవునివైపా లేక లోకం వైపా? నేను నిత్యజీవం కొరకు ప్రాకులాడు తుంటానా? బైబులును పఠించి ప్రార్థనం చేసికోవడంద్వారా, సంస్కారాలను భక్తితో స్వీకరించడంద్వారా, సోదరప్రేమద్వారా పరిశుద్ధాత్మను అనుభవానికి తెచ్చుకొంటుంటానా? అసూయ, భోజనప్రీతి, కామం మొదలైన దుర్గుణాలను అదుపులోకి తెచ్చుకొంటున్నానా? నేను సజ్జనుణ్ణి ఇతరులు వెధవలు అన్న భావంతో తోడినరులను చిన్నచూపు చూస్తున్నానా? ఇతరుల స్వాతంత్ర్యాన్నీ హక్కులనూ నిరోధించి వాళ్ళు నాచిత్తప్రకారం పోవాలని నిర్బంధం చేస్తుంటానా?

2. నా కాలం, ఆరోగ్యం, బలం మొదలైన వరాలను చక్కగా వినియోగించు కొంటున్నానా? ముగ్గురు సేవకుల సామెత దృష్ట్యా (మత్త 25, 14-30) దేవుడు నాకిచ్చిన శక్తిసామర్థ్యాలను సద్వినియోగం చేసికొంటున్నానా? సోమరితనంగా వుండిపోవడంలేదుకదా?

3. జీవితంలో వచ్చే కష్టనష్టాలనూ వ్యాధిబాధలనూ ఓర్పుతో సహిస్తున్నానా? "క్రీస్తుశ్రమల్లో కొదవుగా వున్న వాటిని పూరించడం కొరకు" (కొలో 1,24) ఆత్మ నిగ్రహాన్ని ఇంద్రియదమనాన్నీ పాటిస్తున్నానా? ఉపవాసం, ఒక్కప్రొద్దు అనుసరిస్తున్నానా?

4. పరిశుద్ధాత్మకు ఆలయమై (1కొ 6,19) ఉత్థానానికినోచుకొనే నా దేహాన్ని పవిత్రంగా వుంచుకొంటున్నానా? దేవునికి నరులపట్లగల ప్రేమను వ్యక్తంచేసే భార్యాభర్తల ప్రేమజ్యోతిని (ఎఫే 5, 22-33) నా దాంపత్య జీవితంలో నేను పవిత్రంగా నిలబెట్టుకొంటున్నానా? కామక్రియలు, తలపులు, మాటలు మొదలైన వాటిద్వారా నా దేహాన్ని అమంగళం చేసికోకుండా వుంటున్నానా? ఇంద్రియ భోగాలకు లొంగడం లేదుకదా? క్రైస్తవ వినీతి ఒల్లని సినిమాలు, నాటకాలు, వినోద కార్యక్రమాలు పుస్తకపఠనాలు మొదలైనవాటిల్లో పాల్గొంటున్నానా? దిగజారిపోయిన నా జీవితాన్ని చూచి ఇతరులుకూడ పాపం కట్టుకోవడానికి కారణమౌతున్నానా? వివాహ జీవితానికి సంబంధించిన నైతిక సూత్రాలను పాటిస్తున్నానా?

5. నా అంతరాత్మ ప్రబోధం ప్రకారం జీవిస్తుంటానా? లోకాన్ని మెప్పించడానికీ, డంబంవల్లా వేషధారితనానికి పూనుకొంటుంటానా?

6. దేవుని బిడ్డలు ఆత్మద్వారా స్వతంత్ర జీవితం జీవిస్తారు (గల 5,13) అనే సూత్రాన్ని బట్టి, నేను ఆంతరంగికమైన స్వేచ్ఛతో జీవిస్తున్నానా? నాలోని దుష్టవాంఛలకూ ఆశాపాశాలకూ దాసుణ్ణి కావడం లేదుకదా?

7. పాపసంకీర్తన సంస్కారాన్ని భక్తిశ్రద్ధలతో స్వీకరిస్తున్నానా? దానిద్వారా పాపాన్నుండి వైదొలగి దేవునితో రాజీపడుతున్నానా? లేక సోమరితనంతో దాన్ని అశ్రద్ధ చేస్తున్నానా? పాపోచ్చారణంలో బుద్ధిపూర్వకంగానే కొన్ని పాపాలు చెప్పకుండా దాచివుంచుతున్నానా? గురువు విధించిన ప్రాయశ్చిత్తం చెల్లిస్తున్నానా? ఇతరులకు నష్టపరిహారం చెల్లిస్తున్నానా? దేవుని యెదుట చేసిన వాగ్దానాలను నెరవేరుస్తున్నానా? నా జీవితం రోజురోజుకి మంచికి మారుతుందా?

## ప్రార్థనం

ఓ ప్రభూ! ఏ నరుడు నీపట్ల భక్తితోను, తోడిజనులపట్ల ప్రేమతోను, తనపట్ల తాను చిత్తశుద్ధితోను జీవిస్తాడో అతనికి నీవు తప్పక దర్శనమిస్తావు. విశుద్ధ హృదయులు దేవుణ్ణి దర్శిస్తారని నీవే వాకొన్నావు. కనుక మేము ఈలోకంలో నిర్మలంగా జీవించి పరలోకంలో నీదర్శన భాగ్యానికి నోచుకొనే వరాన్ని మాకు దయచేయి - ఆమెన్.

# 10. యువజనం

ఎఫే 6, 1-3

1. ప్రభూ! మా జీవితంలోవచ్చే రోజువారి సంఘటనల్లో నీ సాన్నిధ్యాన్ని గుర్తించలేకపోయాం.
జవాబు - ఇందుకుగాను నీవు మమ్ము క్షమించు.

2. మేము కొన్నిసార్లు పరధ్యానంతో ప్రార్థనం చేసాం. కొన్నిసార్లు అసలు ప్రార్థించనేలేదు.

3. మేము మా తల్లిదండ్రులనూ బంధువులనూ పెద్దలనూ ఆదరంతో చూడలేదు.

4. మేము ఇతరుల భావాలను విలువతో చూడలేదు. వాళ్ళ యిష్టానిష్టాలను పట్టించుకోలేదు.

5. నీవు మా కిచ్చిన శక్తిసామర్థ్యాలను అభివృద్ధి చేసికోకుండా సోమరితనంగా కాలం వెళ్ళబుచ్చాం.

6. మేము చేయవలసినంత సేవ చేయలేదు. మంచిని చేయడానికి నీవు మా కిచ్చిన అవకాశాలను వినియోగించుకోలేదు.

7. మేము చేయవలసిన పనులను సరిగా చేయలేదు. చాలసార్లు వంచనతో మా బాధ్యతలనుండి తప్పుకొన్నాం.

8. నీవు మాకు దయచేసిన స్వేచ్ఛను దుర్వినియోగం చేసికొని విచ్చలవడిగా ప్రవర్తించాం. అదుపుతప్పి తిరిగాం.

9. మేము ఒకటి తలంచి ఇంకొకటి చెప్పాం. ఒకటి చెప్పి మరొకటి చేసాం. మా ప్రవర్తనంలో చిత్తశుద్ధి లోపించింది.

10. మేము డబ్బును దూబరాగా ఖర్చుచేసాం. ఆయావస్తువులను అజాగ్రత్తగా వాడి పాడుచేసాం. కాలాన్ని వ్యర్థం చేసాం.

11. మేము మా దేహాలను పవిత్రమైన చూపుతో చూడలేదు. ఇతరుల దేహాలను కామదృష్టితో చూచాం.

12. లైంగిక విషయాలను గూర్చిన ప్రస్తావనం వచ్చినపుడు అపవిత్రమైన తలంపులు తలంచాం. అసభ్యమైన మాటలు మాటలాడాం.

13. అన్యలింగ వ్యక్తులతో మెలిగేప్పుడు పాడుచూపులు చూచాం. పాడుకోరికలు కోరాం.

14. మా సంభాషణల్లో ఇతరుల మంచిపేరును చెడగొట్టాం. మాకు గౌరవం వస్తుందనుకొని ఇతరులను తూలనాడాం.

15. మా నడవడికలో గర్వమూ మిడిసిపాటూ ప్రదర్శించాం. మేము స్నేహశీలంగాను మృదువుగాను ప్రవర్తించలేదు.

16. మా చదువుల్లో శ్రద్ధ చూపలేదు. చిత్తశుద్ధితో పరీక్షలకు సిద్ధం కాలేదు.

17. మా వుపాధ్యాయులపట్ల గౌరవం చూపలేదు. వాళ్లు ఇచ్చిన పనిని తృప్తికరంగా చేయలేదు.

18. పెద్దలు మా కోర్కెలు తీర్చనపుడు మొగం చిట్లించుకొన్నాం. వాళ్ళతో సహకరించక వాళ్ళ మనసు కష్టపెట్టాం.

19. స్వార్థబుద్ధితో మా సుఖాన్ని మేము చూచుకొన్నాం. పేదసాదలు కూడూగుడ్డా లేక అలమటిస్తుంటే వాళ్ళను పట్టించుకోలేదు.

20. మేము సామాజిక స్పృహ నలవర్చుకోలేదు. సమాజంలో పేదలకు జరిగే అన్యాయాలను అవగాహనం చేసికోలేదు.

21. అనవసరమైన సమ్మెల్లో పాల్గొన్నాం. అల్లరి మూకాలతో జేరి గొడవలు చేసాం. వస్తునష్టం కలిగించాం.

## ప్రార్థనం

ఓ ప్రభూ! యువజనులమైన మేము సమాజం నీతిన్యాయాలతో ధర్మబద్ధంగా జీవించాలని కోరుకొంటాం. కాని మా వ్యక్తిగత జీవితంలో మేము స్వయంగా ఆ ధర్మస్థాయిని చేరుకోలేక పోతుంటాం. నీవు మా లోపాలను క్షమించు. మా ఆశయాల ప్రకారం జీవించే వరప్రసాద భాగ్యాన్ని కూడ మాకు దయచేయి ఆమెన్!

# 11. రోగులు

మత్త 9,17

1. ఒకసారి వ్యాధివాత బడితేనేగాని ఆరోగ్యం విలువ తెలియదు. నేను ఆరోగ్యంగా వున్నపుడు ఆ భాగ్యానికి దేవునికి వందనాలు అర్పిస్తుంటానా?
2. వ్యాధిద్వారా ప్రభువు మన భక్తివిశ్వాసాలను పరీక్షిస్తాడు. ఈ పరీక్షలో నేను నెగ్గుతానా?
3. వ్యాధిబాధల్లో గూడ ప్రభువు నన్ను చేయివిడువక ఆదుకొంటూనే వుంటాడని విశ్వసిస్తుంటానా?
4. వ్యాధిగా వున్నపుడు నిరాశపడుతున్నానా? దేవునిమీద మొరపడుతున్నానా?
5. దీర్ఘకాలం జబ్బుగా పడివున్నపుడు జీవితార్థమేమిటా అని ఆలోచించుకోవడంలోను, ప్రభువుకి ప్రార్థనం చేసికోవడంలోను కాలం గడుపుతుంటానా?
6. నా వ్యాధి బాధలను సిలువమీద బాధలనుభవించిన ప్రభువు శ్రమలతో ఐక్యంజేసికొని రక్షణాన్ని పొందుతూంటానా? - 1 పేత్రు 2,21.
7. తమ బాధలను మంచి హృదయంతో భరించేవాళ్ళు శ్రీసభకు మేలు చేస్తారన్న విశ్వాసంతో నా వ్యాధిని ఓర్పుతో భరిస్తున్నానా? - కొలో 1, 24.
8. నాకు చికిత్స చేసేవాళ్ళకీ, నన్ను పరామర్శించే వాళ్ళకీ కృతజ్ఞత తెలుపు కొంటుంటానా?
9. నా బాధల్లో ఇతరులకు సదాదర్శం చూపుతుంటానా?
10. నా పూర్వపాపాలకు పశ్చాత్తాపపడి ఈ ప్రస్తుత వ్యాధిని మంచి మనసుతో భరించడం ద్వారా ఆ పూర్వపాపాలకు ప్రాయశ్చిత్తం చేసికొంటున్నానా?

## ప్రార్థనం

ఓ ప్రభూ! నీవు సిలువమీద మరణించి మమ్ము రక్షించావు. నీ మరణం ద్వారా మేముగూడ శ్రమలనుభవించాలని సూచించావు. ఈ వ్యాధిద్వారా నేను నీ సిలువ మరణంలో పాలుపొందుతున్నాను. కనుక నేను ఈమంచి యవకాశాన్ని సద్వినియోగం చేసికొని దీనినుండి సత్ఫలితాన్ని పొందే భాగ్యం దయచేయి - ఆమెన్.

# 12. మఠవాసులు

## 1. ప్రార్థనా జీవితం

1. నా జీవితంలో ప్రార్థనకు ఈయవలసినంత ప్రాముఖ్యం ఇస్తుంటానా?
2. నా కష్టసుఖాల్లో జపంద్వారా దేవునితో చనువుగా మాట్లాడ్డం నేర్చుకొన్నానా?
3. నాకు క్రీస్తుపట్ల గాఢమైనభక్తీ వ్యక్తిగతమైన అనుభవమూ వున్నాయా?
4. ఆయా కార్యాలను చిత్తశుద్ధితో చేయడంద్వారా నా పనికీ ప్రార్థనకీ పొత్తు కుదుర్చుకొంటున్నానా?
5. తీరిక సమయాల్లో లేనిపోని ఆలోచనలతో మనసు నింపుకోక, హృదయాన్ని ధ్యానాత్మకంగా వుంచుకొంటున్నానా?
6. నా భక్తిక్రియలద్వారా ప్రజలు నాయందు దైవసాన్నిధ్యాన్ని గుర్తిస్తుంటారా?

## 2. సామూహిక జీవితం

7. నా జీవితంలో సోదరప్రేమ అతిముఖ్యమైనదన్న సంగతి గుర్తిస్తుంటానా?
8. త్రీత్వంలోని ముగ్గురు దైవవ్యక్తులు సామూహిక జీవితం జీవించినట్లే ఈ లోకంలోని నరులు ప్రేమతో సామూహిక జీవితం జీవించడానికి తోడ్పడ్డం మనం చేయగల్గిన ఉత్తమ కార్యమని గుర్తిస్తుంటానా?
9. దేవుడు నాకిచ్చిన శక్తిసామర్థ్యాలనూ వరాలనూ వినియోగించి తోడి మఠసభ్యుల సామూహిక జీవితాన్ని సుఖమయం చేస్తుంటానా?
10. నా వ్యక్తిత్వాన్నిలాగే తోడి మఠసభ్యుల వ్యక్తిత్వాన్ని గూడ గౌరవాదరాలతో చూస్తుంటానా?

11. ఇతరులలో క్రీస్తునిచూచి వాళ్లను ఉన్నవాళ్ళను ఉన్నట్లుగా అంగీకరిస్తుంటానా? నా అవసరాలనూ అభిరుచులనూ ఇతరులకు అనుకూలంగా వుండేలా సరిదిద్దుకొంటుంటానా?

12. నేను ఇతరులలోని మంచిని చూస్తుంటానా? వాళ్ళను గూర్చి చెడ్డగా తలంచకుండా వుంటానా?

13. నా సుఖాన్ని గూడ త్యజించి తోడి సభ్యుల అవసరాలను తీర్చడానికి సిద్ధంగా వుంటానా?

14. నావలన సామూహిక జీవితం ఏ విధంగాను దెబ్బతినక వృద్ధిలోకి వస్తూందా?

15. ఇతర సభ్యుల ఇష్టానిష్టాలను గమనించి వాళ్లపట్ల మృదువుగాను ఆప్యాయంగాను మెలుగుతుంటానా?

16. నేను ఇతరుల విజయాన్నీ ప్రసిద్ధినీ చూచి అసూయకు గురిగాక, మనస్ఫూర్తిగా సంతోషిస్తుంటానా?

17. ఇతరుల భావాలను విలువతో చూస్తుంటానా? సత్యమెక్కడున్నా అంగీకరించడానికి సిద్ధంగా వుంటానా?

18. నా మాటల్లోను చేతల్లోను చిత్తశుద్ధి కన్పిస్తుంటుందా?

19. ఇతరులు నాకు ద్రోహం తలపెట్టినపుడు, లేదా తలపెట్టారని నేను అనుమానించినపుడు, వాళ్ళను క్షమించడానికి సిద్ధంగా వుంటానా?

20. ఇతరుల లోపాలనూ బలహీనతలనూ చూచి విస్తుపోక, వాళ్ళను సానుభూతితో సవరిస్తుంటానా?

## 3. ప్రేషిత సేవ

21. నేను సోమరితనానికి లొంగక దైవరాజ్య వ్యాప్తికి శ్రమించి కృషిచేస్తుంటానా?

22. ప్రజలను నా చెంతకు రాబట్టుకోక దేవుని చెంతకు రాబడుతుంటానా?

23. ఆ పౌలులాగే దైవసేవను సంతృప్తికరంగా చేయకపోతే దేవుని శిక్షకు గురౌతానని నమ్ముతుంటానా? (1కొ 9,16)

24. నా సేవలోని లోపాలను సవరించుకొని నాడునాటికి ఇంకా సమర్థవంతంగా కృషిచేస్తుంటానా?

25. నాలాగే దైవసేవచేసే యితర వ్యక్తులతోను బృందాలతోను నేను సహకరిస్తుంటానా?

## 4. విధేయత

26. నేను దైవ చిత్తానికి లోబడుతుంటానా? పెద్దల ఆజ్ఞల్లో దేవుని చిత్తాన్ని గుర్తిస్తుంటానా?
27. పరిశుద్ధాత్మ నాలో కలిగించే ప్రబోధాలను గుర్తించి వాటికి అనుగుణంగా నడచుకొంటుంటానా?
28. మఠనియమాలనూ పెద్దల ఆదేశాలను చిత్తశుద్ధితో పాటిస్తుంటానా?
29. తప్పనిసరై బయటికి మాత్రమే విధేయించకుండా మనసులోగూడ విధేయతా భావాలు కలిగివుంటానా?
30. పెద్దలను గౌరవంతో చూస్తుంటానా? అవసరమైనప్పుడెల్లా నా హృదయాన్ని వాళ్ళకి విప్పి చూపిస్తుంటానా?

## 5. దారిద్ర్యం

31. నేను క్రీస్తులాగే ఇహలోక వస్తువ్యామోహాన్ని జయించి దేవునిమీద ఆధారపడి జీవిస్తుంటానా? (మత్త 8,20)
32. మఠజీవితంలో నాకు లభించే వస్తువులతో సంతృప్తి చెందుతుంటానా
33. నేను ఏవైనా ప్రత్యేక వస్తువులు వాడుకోవలసి వచ్చినపుడు ముందుగా పెద్దలనుండి అనుమతి పొందుతుంటానా?
34. మఠసంపదను నా బంధుమిత్రుల హస్తగతం చేయకుండా వుంటుంటానా?
35. పేదల్లో క్రీస్తునిచూచి వారిపట్ల జాలీ సానుభూతీ ప్రదర్శిస్తుంటానా?
36. సమాజంలోని సాంఘిక అన్యాయాలను అవగాహనం చేసికొని నా చేతనైనంత వరకు పేదలకు న్యాయం జరిగిస్తుంటానా?

## 6. బ్రహ్మచర్యం

37. బ్రహ్మచర్యం ద్వారా దేవుణ్ణీ తోడినరుణ్ణీగూడ అధికంగా ప్రేమిస్తామని గుర్తిస్తుంటానా?
38. లింగమనేది దేవుడిచ్చే వరమనీ, మఠజీవితంలో దాన్ని మళ్లా దేవునికే అర్పిస్తామనీ అర్థంచేసికొంటుంటానా?
39. కేవలం శారీరకంగా మాత్రమే కాకుండ మానసికంగా గూడ బ్రహ్మచర్యాన్ని పాటిస్తుంటానా?

40. సన్యాస జీవితానికి తగినట్లుగా ఇంద్రియ నిగ్రహాన్ని పాటిస్తుంటానా?

41. ఇతరులతో నేను చేసే స్నేహాలు, పెట్టుకొనే సంబంధాలు నిర్మలంగాను పవిత్రంగాను వుంటాయా?

42. శరీర విషయంలో ఒకమారు పెద్దత్యాగం చేసాక, ఇప్పుడు మళ్ళా అల్పసుఖాలకు పాల్పడ్డం లేదు కదా?

## ప్రార్థనం

ఓ ప్రభూ ! మేము మూడు వ్రతాలతోను సామూహిక జీవితంతోను పవిత్ర జీవనం గడపి నీ కుమారునికి అతి సన్నిహితులమయ్యే భాగ్యాన్ని దయచేసావు. నీ కరుణద్వారా ఈ మఠజీవితాన్ని నిర్మలంగా జీవించే భాగ్యాన్ని గూడ మాకు దయచేయి - ఆమెన్.

# 13. ప్రభువు మీ యింటికి అతిథిగా వస్తే?

ప్రభువు తలవని తలంపుగా మీ యింటికి అతిథిగా విచ్చేసాడు. అతడు మీ యింటిలో రెండుమూడు రోజులు ఉండాలనుకొంటున్నాడు. అప్పుడు నీ ప్రవర్తనం ఏలా వుంటుంది?

1. ప్రభువు మీ యింటికి రావడాన్ని జూచి నీవు కంగారు పడవుగదా? అతన్ని హృదయపూర్వకంగా మీ యింటిలోనికి ఆహ్వానిస్తావా లేక అతన్ని చూడగానే నీ మొగం వెలవెల పోతుందా?

2. నీవు చదివే పుస్తకాలూ పత్రికలూ అతని కంటబడకుండా దాచాలనిపిస్తుందా? మీ యింటిలోని పటాలనూ బొమ్మలనూ తీసి ప్రక్కన పెట్టాలనిపిస్తుందా? ఇంకా అతని కంటపబడకుండా ఏయే వస్తువులు దాచాలనిపిస్తుంది?

3. ప్రభువు మీ యింటిలో వుండగా నీవు రోజూ అలంకరించుకొనే తీరుననే అలంకరించుకొంటావా?

4. నీవు ప్రభువు సమక్షంలో రోజూ మీ యింటిలో వాడే భాషనే వాడతావా లేక నీ వాగ్ధోరణని సవరించుకోవాలనిపిస్తుందా?

5. అతని సమక్షంలో నీవు రోజూ మీ యింటిలో చేసే పనులే చేస్తావా లేక వాటిని సవరించుకోవాలనిపిస్తుందా?

6. ప్రభువు చూస్తుండగా మీ యింటిలోని కుటుంబ సభ్యులపట్ల నీవు రోజు మెలిగే తీరుననే మెలుగుతావా లేక నీ చిర్రుబుర్రులను సరిదిద్దుకొంటావా?

7. నీవు వూళ్లోకి వెళ్లావు. ప్రభువుకూడ నీ వెంటవచ్చాడు. అప్పుడు నీవు రోజూ అలవాటుప్రకారం చేసే పనులు చేస్తావా లేక వాటిని మానుకొంటావా?

8. ప్రభువు మీ యింటవుండగా నీతో మాట్లాడ్డానికి వచ్చే స్నేహితులను జూచి నీవు సిగ్గుపడవుకదా?

9. ఆ ప్రభువు మీ ఇంటినీ, నిన్నూ, నీ జీవిత విధానాన్నీ మెచ్చుకొంటాడా?

10. ఆ ప్రభువు ఇంకా ఒకటి రెండురోజులు మీ ఇంటిలో గడుపుతానంటే నీకు సమ్మతంగా వుంటుందా? నీవు ప్రాణాలు గుప్పిట పట్టుకొని అతడెప్పుడెప్పుడు వెళ్ళిపోతాడా అని కాచుకొని వుండవా?

## ప్రార్థనం

ప్రభూ!అబ్రాహాము లాంటి పుణ్యపురుషులు నీ సన్నిధిలో నడిచారు. నీకు ప్రియపడేలా జీవించారు. నీవు నిత్యమూ నన్ను గమనిస్తూనే వుంటావని నమ్మి నేను వళ్ళు దగ్గర బెట్టుకొని జీవించేలా చేయి. నీవు నన్ను రక్షించేవాడివి కాని శిక్షించేవాడివి కాదని విశ్వసించి నీపట్ల నమ్మకంతో జీవించే భాగ్యం కూడ ప్రసాదించు - ఆమెన్.

# 10. బైబులు ప్రార్థనలు

## మనవి మాట

బైబులు భాష్యం 42, 46,49 సంచికల్లో బైబులు ప్రార్థనలను ప్రచురించాం. ఆ మూడు సంచికలను కలిపి ఇక్కడ ఏక గ్రంథంగా ప్రచురించాం.

మనకు బైబులు ప్రార్థనలంటూ లేవు. ఆ కొరతను ఈ పుస్తకం కొంతవరకైనా తీరుస్తుంది. ఈ పొత్తంలో 64 ప్రార్థనలున్నాయి. ప్రతిప్రార్థనకు ముందు బైబులు ఆలోకనాలు పొందుపరచాం. పాఠకులు ఆయా ప్రార్థనలను వాడుకొనేప్పుడు వాటి యాలోకనాలు కూడ నేరుగా బైబులు నుండి చదువుకోవాలి. బైబులు వాక్యాలనే ప్రార్థనలుగా మలిచాం గనుక, ఆ మూలవాక్యాలు తెలియకపోతే ఈ జపాలు అంతగా అర్థం కాకపోవచ్చు.

ఈ ప్రార్థనల ద్వారా మన ప్రజలకు ప్రభువు వాక్కు జీర్ణానికి వస్తుందని ఆశిస్తున్నాం. హృదయాన్ని ప్రభువు వాక్యంమీద నిల్పి భక్తిభావంతో మననం జేసికోవడం గొప్ప భాగ్యం, ఆత్మే అనుగ్రహించే వరం. ఒక్కోసారి ఒకటిరెండు ప్రార్థనలు చాలు. ఇది ఐదవ ముద్రణం.

## విషయసూచిక

### 1. భక్తి



### 2. పాపమూ పశ్చాత్తాపమూ

## 3. తండ్రి



## 4. పవిత్రాత్మ



## 5. క్రీస్తు

## 6. ప్రార్థన



## 7. సోదర ప్రేమ



## 8. ప్రేషిత సేవ

# 1. విత్తేవాని సామెత

మత్త 13,3-9. 19-23

ప్రభూ! నీవు శిష్యులకు ఉపమానాలతో బోధిస్తూ
విత్తేవాని సామెత చెప్పావు

నీవు మా హృదయాల్లో చల్లే విత్తనాలు
త్రోవ ప్రక్కన పడితే,
అనగా మేము నీ బోధనలను గ్రహించకపోతే,
పక్షిరూపమైన పిశాచం వచ్చి
మొలవకముందే వాటినెత్తుకొని పోతుంది

నీవు మా యెడదల్లో చల్లే విత్తనాలు
రాతినేల మీద బడితే
అవి మొలకెత్తుతాయిగాని వేరుబాతుకోలేవు,
అనగా మా హృదయాలు శ్రమలకు జంకితే
నీ బోధలు ఫలితాన్నీయవు

నీవు మా మనసుల్లో చల్లే విత్తనాలు
ముండ్ల పొదల్లో పడితే
మొలకెత్తి కొంచ మెదుగుతాయికాని
తర్వాత అవిసిపోతాయి,
అనగా మా ఐహిక చింతలూ ధనవ్యామోహాలూ
నీ బోధలనే మొక్కలను అణచివేస్తాయి
ఇంకా వుద్యోగాలు పదవులూ
మొదలైన ప్రలోభాలవల్ల కూడ
నీ సందేశాలనే పైరు అణగారిపోతుంది

నీవు మా అంతరంగంలో చల్లే విత్తనాలు
సారవంతమైన నేలమీదబడితే,
అనగా మా హృదయాలు నీ బోధల నంగీకరిస్తే
అవి నూరంతలు పంట పండుతాయి

నీవేమో నీ బోధలనే బీజాలను
ఎప్పుడూ వెదజల్లుతూనే వుంటావు
విత్తనాల కేమీ కొదువలేదు
బైబులు గ్రంథమంతా నీ విత్తనాలే
కాని మంచి నేలకు మాత్రం ఎప్పుడూ కొదవే
మంచి నేలలాంటి హృదయాలుకల భక్తులెందరు?
కావున మా హృదయాలు
తొలిమూడు రకాల పాడునేలల్లా కాకుండ
ఆ సారవంతమైన నాల్గవరకం నేలలా వుంటే
మాకు ఫలితం దక్కుతుంది

## 2. హృదయ దేవాలయం

దర్శ 3,20. యోహా 14,23. 1కొ 6,19

ప్రభూ! నీవు మా హృదయద్వారాన్ని
మెల్లగా తడతావు
నీ రాకడనుగూర్చి మమ్ము హెచ్చరిస్తావు
ఐనా మమ్ము నిర్బంధం చేయవు
మేమే హృదయమనే తలుపు తెరచి
నిన్ను మా అంతరంగంలోని కాహ్వానించాలి.
అలా ఆహ్వానించిన భక్తులకు నీవు అతిథివౌతావు,
స్నేహితుడవై వాళ్ళను పరామర్శిస్తావు

నీ యాజ్ఞ పాటించేవాళ్లు నీకు ప్రియపడతారు
అప్పుడు నీవూ నీ తండ్రీ విచ్చేసి
వాళ్ళ హృదయ కమలంలో
నివాస మేర్పరచుకొంటారు

నీవు నెలకొనివున్న ఆలయం దేవాలయం
నీ సాన్నిధ్యం వలన అది పవిత్రమందిర మౌతుంది
కాని జ్ఞానస్నాన సమయమునుండే నీ యాత్మ
ఓ దేవాలయంలోలాగ

మా హృదయంలో వసిస్తూంటుంది
తన సాన్నిధ్యంతో మమ్ము పవిత్రులను చేస్తూంటుంది
అందుకే హృదయానికి మించిన దేవాలయం లేదు
భక్తి హృదయంలో ప్రారంభం కావాలి
హృదయంలో భగవంతుడు లేనివాడికి
దేవళాల్లోను పుణ్యక్షేత్రాల్లోను దేవుడు దొరకడు
మేము ఎక్కడికి వెళ్ళినా
ఆ హృదయాన్నే మోసికొని పోతూంటాం గదా!
గొల్లవాడు గొర్రెను చంకన బెట్టుకొని ఊరంతా వెదకినట్లు
మా హృదయ సింహాసనంమీద ఆసీనుడవై యున్న నిన్నుగానక
నీకోసం ఎక్కడెక్కడో గాలిస్తుంటాం
ప్రభూ! మా యవివేకాన్ని మన్నించు
మేము అంతర్ముఖులమై
మా యెదదల్లోనేవున్న నిన్ను గుర్తించేలా చేయి
మా గుడిసె క్రిందనే దాగివున్న
బంగారు గనివైన నిన్ను గుర్తుపట్టేలా దయచేయి.

## 3. మరియామార్తలు

లూకా 10, 38-42

క్రీస్తూ! నీవు బెతనీ గ్రామంలో
మరియమార్తల యింటికి వెళ్ళగా
మార్త అన్నపానీయాది గృహకృత్యాలతో సతమతమౌతూంది
మరియ మాత్రం నీకు శిష్యురాలై నీ పాదల చెంత కూర్చుండి
నీవు బోధించే పరలోకపుతండ్రి గుణగణాలను శ్రద్ధతో వింటూంది
మార్త తనకు సాయంచేయడానికి చెల్లెలిని పంపమని వేడగా
నిత్యకృత్యాలనుగూర్చి ఆందోళనం చెందవద్దని
నీవామెను మందలించావు
భగవంతుణ్ణి ధ్యానించుకోవడం ముఖ్యమని వాకొన్నావు
మరియ ధ్యానశీలతను మెచ్చుకొన్నావు

ఈ మరియ ప్రార్థనాపరులందరికీ ఆదర్శంగా వుంటుంది
ఈ భక్తురాలిలాగే మేమూ రోజూ కాసేపు
నీ వాక్యాన్ని ధ్యానించుకోవాలి
నీ పాదాలచెంత కూర్చుండి నీ బోధలను మననం చేసికోవాలి
నీ పవిత్రగ్రంథాన్ని భక్తివిశ్వాసాలతో
పారాయణం జేసికొనేవాళ్ళకు
నీవే స్వయంగా ఉపాధ్యాయుడవై బోధ చేస్తావు
ప్రార్థనం చేసికొనేపుడు మేము నీతో సంభాషిస్తాం
కాని వేదగ్రంథాన్ని పఠించేపుడు నీవే మాతో మాటలాడతావు
గ్రంథ పఠనంద్వారా నీవు మాకు చెప్పే సందేశాలను
మేము జాగ్రత్తగా వినాలి
నీ చిత్తాన్ని గ్రహించి నీ మార్గాల్లో నడవాలి
చీకటిలో పోయేవాడికి దీపం దారిచూపినట్లే
ఈ జీవితయాత్రలో నీ వాక్యం మాకు త్రోవజూపుతూంటుంది
ఈ లోకంలో మేమేమి చేయాలో ఏమి చేయకూడదో
విధి నిషేధాలద్వారా నీ పలుకు మాకు తెలియజేస్తూంటుంది
వాక్యమననం వలన మేము
నాడునాటికీ పరిపూర్ణ క్రైస్తవుల మౌతాం
కనుక దివ్యగ్రంథ పారాయణంపట్ల మాకు ప్రీతి పుట్టించు
పూజపాపోచ్చారణాది దేవద్రవ్యానుమానాల భక్తే గాని
వేదవాక్య భక్తి మాకు లేశమైన లేదు
మేము నీ వాక్యమాధుర్యాన్ని చవిజూచే భాగ్యాన్ని ప్రసాదించు
ఈ లోకంలో రోజూ ఇన్ని పనులతో సతమత మౌతూంటాం
నీవు చేసిన సృష్టివస్తువుల్లోబడి నిన్ను విస్మరిస్తూంటాం
కాని నిన్ను ధ్యానించుకొనేవాళ్ళకు నీవు తోడుగా వుంటావు
మేమ ఉరికురికి కష్టపడి పనిచేసికోబోతాం
కాని నీ దీవెన వలన మా పనులు
నూరంతలు అదనంగా ఫలిస్తాయి
చాల పనులు చేసినందువలన కాక

హృదయంలోని భక్తివల్ల నరుడు నీకు ప్రీతిని కలిగిస్తాడు
కనుక మార్త క్రియాశీలత మాకు చాలదు
మరియ మననశీలతకూడ మాకవసరం.

## 4. లూదియా

అచ 16,11-15. దర్శ 3,20

ప్రభూ! నీ భక్తులైన పౌలు లూకా శనివారం మునిమాపున
ఫిలిప్పి నగరంచెంత యేటియొద్దున బోధచేస్తూంటే
చాలమంది యూదమహిళలు ఆసక్తితో వింటూన్నారు
కాని నీవు వారిలో లూదియా యనే యువిద యెడద తెరిచావు
దానితో ఆమె హృదయంలో భక్తి పొంగిపారింది
ఆమె క్రీస్తుని విశ్వసించి శిష్యురాలయింది
అపోస్తలులకు ఆతిథ్యంకూడ యిచ్చి సేవలు చేసింది
మాయంతట మేము ఎన్ని సారులు గ్రంథం చదివినా
ఎన్ని వుపన్యాసాలు విన్నా, ఎన్ని ప్రార్థనలు చేసినా
ఎంత మొత్తుకొన్నా ప్రయోజనం లేదు
నీ వెవరి హృదయాలు తెరుస్తావో వాళ్ళకు భక్తిపుడుతుంది.

రేయంతా కొలనులో ముడుచుకొనివున్న తామరమొగ్గ
ఉదయాన సూర్యకిరణాలు సోకగానే దోసెడంత పూవౌతుంది

మూగవోయినట్లు పడివున్న సంగీతవాద్యం
విద్వాంసుని చేయి సోకగానే మధురగీతం పలుకుతుంది

అలాగే నీవు మా హృదయాన్ని తట్టగానే
అది భక్తిభావంతో పులకించిపోతుంది
భక్తి అనేది నీవు కరుణతో దయచేసే వరంగాని
మేము ప్రయత్నించి సాధించేది కాదు
ఔను, నీవు ఆనాడు ఆ లూదియా యెడదనులాగే
ఈనాడు మా హృదయాలనుకూడ తడుతూంటావు
ఎవడు నీ ప్రబోధానికి లొంగి హృదయకవాటం తెరుస్తాడో
ఆ భక్తుని ఎడదలోనికి నీవు అతిథివిగా విచ్చేస్తావు

అతనితో భోజనం చేస్తావు, అతనికి స్నేహితుడవౌతావు
నిన్ను హృదయసదనంలో నిల్పుకొనేవాడుకదా పుణ్యపురుషుడు
నీ సాన్నిధ్యంవలన పులకించిపోయేవాడుకదా నిజమైన భక్తుడు
ప్రభూ! మోడుపడిన మా యెదదలను చిగురింపజేయి
మొద్దువారిన మా హృదయాలకు చైతన్యం పుట్టించు
చెరకుగడెనుండి రసం స్రవించినట్లుగా
తేనెపట్టునుండి తేనె చిప్పిలినట్లుగా
చెలమనుండి నీరు ఉబికివచ్చినట్లుగా
మా హృదయాలనుండి భక్తిరసామృతం
పొంగిపారేలా నీ చేయెత్తి మమ్ము దీవించు.

## 5. ఉదార హృదయ

మార్కు 12,41-43

ప్రభూ! చాలమంది ఉదారబుద్ధులు నీకు సేవలు చేసారు
నీ పిలుపు విన్పింపగానే పేత్రు అంద్రెయా
యోహాను యాకోబులు
తమ పడవలనూ వలలనూ అన్నిటినీ వదలి నీవెంట వచ్చారు
సుంకాల శాలలో కూర్చుండివున్న మత్తయికూడ
నీ పలుకాలించి తాను లెక్కబెట్టే సొమ్మును అక్కడే వదలి
బిరాన నిన్ననుసరించాడు
కాని వీళ్ళందరికంటెగూడ ఉదారహృదయ ఆ పేద వితంతువు
నీవు దేవళం దాపులో హుండీవద్ద కూర్చుండి
భక్తులు కానుకలు వేసే తీరును పరికిస్తున్నావు
ధనికులు బారులుగా వచ్చి పెట్టెలో పెద్దమొత్తాలే వేసారు
అంతలో ఓ దరిద్ర వితంతువుకూడ వచ్చింది
ఆమె పైటచెంగున రెండే రెండు దమ్మిడీలున్నాయి
ఆ భక్తురాలు ఏమీ సంకోచించకుండా,
ఉన్నదికూడపోతే తనబ్రతుకేమౌతుందో అని భయపడకుండా
ఆ రెండుకాసులూ విప్పి హుండీలో పడవేసింది
ఆ గుణవతి వదాన్య బుద్ధికి నీవు మురిసిపోయావు

అందరి దానంకంటెగూడ ఆమె దానం
మిన్న అన్నావు శిష్యులతో
కలవాళ్లు తమ కల్మిలో కొంత దేవుడికిస్తే గొప్పేమిటి?
లేనివాళ్ళు తనకున్నదంతా దేవునికి కానుక పెడితే,
తమ బ్రతుకుతెరువునే ఆ తండ్రి పాదాలచెంత అర్పిస్తే
అదిగదా గొప్ప?
ప్రభూ! ఈ వుదారహృదయను నీవు మనస్ఫూర్తిగా పొగడావు
ఈ పేదరాలు నేడు మాకుకూడ ఆదర్శంగా వుంటుంది
మేము మా కానుకలను నీ కర్పించుకొంటేనే సరిపోదు
వాటికంటె ముఖ్యంగా మా హృదయాలను నీ కర్పించాలి
పండు నీయడంకంటె చెట్టు నీయడం ఘనం
అలాగే నీకు మా వస్తువుల నీయడంకంటె
మా యెడదల నర్పించుకోవడం ముఖ్యం
కనుక మేము నీ సన్నిధిలో చిత్తశుద్ధితో
హృదయార్పణం గావించుకొని
రోజువారి జీవితంలో ఆ యర్పణం ప్రకారం జీవించేలా జేయి
నిన్ను నమ్మి, నీ మీద ఆధారపడి
మా మనుగడను కొనసాగించుకొనే భాగ్యాన్ని ప్రసాదించు.

## 6. హృదయశుద్ధి

యిర్మీ 17,9. మత్త 15,19. యిర్మీ 31,33. యెహె 36,26-27,
కీర్త 51,16-17. యోహా 19,34.

ప్రభో! మా హృదయంలో వుండే కపటం అంతాయింతా కాదు
మేము ఒకటి తలచి ఇంకొకటి చెప్తాం
ఒకటి చెప్పి మరొకటి చేస్తాంగూడ
ఈలాంటి హృదయం నీకు ప్రియపడుతుందా?
కొందరు బాహ్యశుద్ధిని ఘనంగా యెంచుతారు
కాని అంతశ్శుద్ధికదా ముఖ్యమైంది?
హత్యలూ వ్యభిచారాలూ దొంగతనాలూ ద్వేషాలూ
అబద్ధాలూ అసూయలూ కలహాలూ వంచనలూ

మొదలైన దుష్కార్యాలన్నీ పుట్టేది మొదట యెదలో కాదా?
మనిషిని మలినపరచేది డెందం కాదా?

కనుకనే యిర్మీయా క్రొత్త నిబంధన కాలం వస్తుందనీ
ఆ కాలంలో ప్రభువు తన ఆజ్ఞలను రాతిపలకమీద కాక
నరుల హృదయాలమీదనే లిఖిస్తాడనీ
ఫలితంగా ప్రజలు దైవభక్తులౌతారనీ పల్కాడు

ప్రభువు ప్రజలకు నూత్న హృదయాలను దయచేస్తాడనీ
వాళ్ళల్లోని రాతిగుండెలను తొలగించి వాటిస్థానే
మాంసపు గుండెలను నెలకొల్పుతాడనీ నుడివాడు యెహెజ్కేలు

ప్రభువుకి ప్రియపడేది జంతుబలులు కానేకాదనీ
పశ్చాత్తాపపూరితమైన హృదయం
అన్నిటికంటె శ్రేష్ఠమైనబలి అనీ వాకొన్నాడు కీర్తనకారుడు

ఇవి భక్తుల హృదయాంతరాళం నుండి వెలువడిన వాక్కులు
తండ్రీ! హృదయశుద్ధిలేని నరుడు నీకు నచ్చనే నచ్చడు
భాండశుద్ధిలేని పాకం ఎవరికి రుచిస్తుంది?
మరి మా కపట హృదయాన్ని చక్కదిద్దుకొనే మార్గమేమిటి
ప్రవక్తలు పల్కిన నిర్మల హృదయాన్ని పొందడమేగదా?
కనుకనే క్రీస్తు విచ్చేసి మా మానుషహృదయాన్ని చేకొన్నాడు
ఆ విశుద్ధహృదయాన్ని సిల్వమీద ఈటెతో పొడిచి తెరచారు
నేడు ఆ నిర్మలహృదయం మా పాపపు హృదయాలమీద సోకి
వాటిని పునీతం చేస్తేనేతప్ప మాకు గతిలేదు.

## 7. ప్రేమాజ్ఞ

మార్కు 12,28-34. మత్త 22,40

తండ్రీ! అన్నిటికంటె ముఖ్యమైన యాజ్ఞ యేదని
ధర్మశాస్త్ర బోధకుడు ప్రశ్నింపగా నీ కుమారుడైన క్రీస్తు
"మన దేవుడైన ప్రభువు ఏకైక ప్రభువు
అతనికి సాటి దైవం లేనేలేదు

కనుక మనం అతన్ని పూర్ణహృదయంతో ప్రేమించాలి
పైగా మనలను మనం ప్రేమించుకొన్నట్లే
ఇరుగుపొరుగువాళ్ళను గూడ నిండుమనస్సుతో ప్రేమించాలి
మోషే ధర్మశాస్త్రంలోని ఇతరాజ్ఞ లేవికూడ
ఈ రెండాజ్ఞలతో సరితూగజాలవు
ధర్మశాస్త్రమంతా, ప్రవక్తలు పల్కిన బోధలన్నీ
చాలా వస్తువులు ఒక వంకెమీద వ్రేలాడినట్లుగా,
భవనం పునాదిమీద నిల్చినట్లుగా
ఈ ప్రేమాజ్ఞమీదనే నిలుస్తాయి" అని చెప్పాడు
అతని మాటలను మెచ్చుకొనిన ధర్మశాస్త్ర బోధకుడు
"నిజమే ప్రేమాజ్ఞ అన్నిటికంటె శ్రేష్ఠమైంది
బలులకంటె దహనబలులకంటె అది గొప్పది" అన్నాడు
క్రీస్తుకూడ అతని ధర్మనిష్ఠను కొనియాడుతూ
బాబూ! నీవు దైవరాజ్యానికి చేరువలోనే ఉన్నావన్నాడు
తండ్రీ! మేముకూడ ఈ యాజ్ఞను పాటిస్తే చాలు
నీకు ప్రియపడతాం
ఒకే నది రెండుపాయలుగా చీలినట్లు,
ఒకే చెట్టు రెండు కొమ్మలుగా చీలినట్లు
ఒకే ప్రేమాజ్ఞ రెండు కట్టడలుగా కన్పిస్తుంది
దేవుణ్ణి ప్రేమించినా నరుణ్ణి ప్రేమించినా ప్రేమేమో ఒక్కటే
మేము నిరంతరం ఏవేవో నియమాలతో
ఏవేవో ఆచారాలతో సతమతమౌతూంటాం
కాని ఈ ప్రేమాజ్ఞ నొక్కదాన్ని పాటిస్తే చాలు
మా పుట్టువు చరితార్థమౌతుంది
పూర్వనూత్న వేదాలు రెండింటికీ పునాది ఈ యాజ్ఞేగన్క
దీన్ని ఒక్కదాన్ని అనుసరిస్తేచాలు మా జీవితం ధన్యమౌతుంది.

## 8. కాయలు కాయని అంజూరం

మత్త 21,18-20. యిర్మీ 19,10-11. అచ 21,10-11

క్రీస్తూ! ఓమారు నీవు యెరూషలేముకు ప్రయాణంచేస్తూ
ఆకలిగొని పండ్లకొరకు ఓ అంజూరం దగ్గరి కెళ్ళావు

ఒక్కపండుకూడా లేని ఆ చెట్టు నీకు నిరాశ పుట్టించింది
నీవు దాన్ని శపించగా అది నిలువున యెండిపోయింది
ఆ పండ్లచెట్టు కలవాడు దిగులుపడడా అని మేము ప్రశ్నిస్తాం
కాని ఆ యత్తిమ్రానుని శపించడంలో నీ వుద్దేశం వేరు
పూర్వం ప్రవక్తలు తమ బోధలను నటించి చూపించారు
యిర్మీయా నడివీధిలో క్రొత్తకుండను పగులగొట్టి
పాలస్తీనా దేశం కూడ అలాగే ముక్కలౌతుందన్నాడు
అగబు పౌలు నడికట్టుతో తన కాలుసేతులు బంధించుకొని
ఈ నడికట్టును ధరించిన పౌలుని
యూదులు ఈలాగే బంధిస్తారని పల్కాడు
ఈరీతినే నీవు కూడ కొన్ని బోధనలను నటించి చూపించావు
ఇక్కడ ఈ యంజూరం యిస్రాయేలు ప్రజలకు గుర్తు
నీవు ఎంత బోధించినా వాళ్లు పరివర్తనం చెందడం లేదు
ఆ ప్రజలు పశ్చాత్తాప ఫలాలను ఫలించడమే లేదు
కనుక ఆ జనులు తండ్రి శాపానికి గురౌతారు
ఈ యెండిపోయిన చెట్టులాగే వాళ్ళుకూడ శుష్కించిపోతారు
ఈ సత్యాన్ని బోధించడానికే నీవీ యంజూరం సామెతను
కన్నులకు కట్టినట్లుగా నటించి చూపించావు
ఇక, ఈ నటనాత్మకమైన అత్తిమ్రాని సామెత
నేటి మా జీవితానికికూడ అక్షరాల వర్తిస్తుంది
మేము కూడ పాపంనుండి వైదొలగుతూండాలి
ఎప్పటికప్పుడు పశ్చాత్తాపపడి నీ మన్నన పొందుతూండాలి
సహనవంతుడవైనా నిన్ను దీర్ఘకాలం విసిగించకూడదు
పరివర్తనం చెందక, పశ్చాత్తాపానికి లొంగక
రాతిబండలాంటి గుండెతో అలాగే వుండిపోతే
మేము కూడ నీ శాపానికి జిక్కి మ్రగ్గిపోతాం
నీవు నెనరుతో పాపిని కరుణించినా
ఆ పాపి పాపాన్ని మాత్రం ఎంతో అసహ్యించుకొంటావు
పరిశుద్ధుడవైన నీవు కిల్బిషాన్ని ఏలా సహిస్తావు
కనుక ప్రభూ! సకాలంలో పశ్చాత్తాప ఫలాలను
ఫలించే భాగ్యం పాపులమైన మాకు నిత్యం ప్రసాదిస్తూండు.

# 9. వస్తు వ్యామోహం

లూకా 12,16-21. మత్త 6,24

క్రీస్తూ! నీవు ఇద్దరు యజమానులను సేవించవద్దన్నావు
దేవునికీ లోకవస్తువులకీ సేవలు చేయవద్దన్నావు
ఈ సత్యాన్ని బోధించడానికే ధనవంతుని కథ కూడ చెప్పావు
ఓ సంపన్నునికి సమృద్ధిగా పంటలు పండాయి
అతడా ధాన్యాన్ని పెద్దకొట్లలో నిల్వజేయించి
దీర్ఘకాలం తింటూ త్రాగుతూ సుఖిస్తాననుకొన్నాడు
దేవుణ్ణీ తోడినరుణ్ణీ ఏమాత్రం పట్టించుకోననుకొన్నాడు
కాని ఆరాత్రే దేవుడు అతని ప్రాణాలు తీయగా
బంధువులువచ్చి వాని యాస్తిపాస్తులు పంచుకొనిపోయారు
ఐహికవస్తువుల కంటిపెట్టుకొని దేవుణ్ణి విస్మరిస్తే
ఎవరికైనా ఈలాంటి దుర్గతే పడుతుంది
మా పాపాలన్నిటికీ మూలకారణం ఈ వస్తువ్యామోహమే
నీవు చేసిన సృష్టివస్తువులు మమ్ము మభ్యపెడతాయి
మే మా వస్తుజాలంలో చిక్కుకొని నిన్ను విస్మరిస్తాం
నరుడు సృష్టివస్తువులను వాడుకొని నిన్ను చేరాలి
నీవద్ద కెక్కిరావడానికి అవి నిచ్చెనమెట్లలా వుపకరిస్తాయి
కాని మా దౌర్భాగ్య మేమిటంటే
మేము ఈ నిచ్చెన మెట్లమీదనే కూర్చోగోరుతాం
వాటిని దాటి నీ చెంతకు రావడానికి ఒప్పుకోం
సృష్టివస్తువులంటే మాకు అంత ప్రీతి
వాటి చెంతకు లగెత్తడమంటే అంత సరదా
కనుకనే వాటి ననుభవిస్తూ నిన్ను మరచిపోతాం
కాని భక్తుడు అగస్టీను అనుభవపూర్వకంగా చెప్పినట్టు
నీవు మా హృదయాలను సృష్టివస్తువుల కొరకు గాక
అన్ని యానందాల కావలి యానందమైన నీకొరకే చేసావు
కనుక నీయందు విశ్రమించిందాకా
మా హృదయాలకు విశ్రాంతి అంటూ లేదు

తాత్కాలికంగా సుఖపెడితే పెడతాయేమో గాని
లోకవస్తువులేవీ మాకు శాశ్వతసుఖాన్నీయలేవు
హృదయశాంతి నీనుండేగాని వస్తుసంచయంనుండి రాదు
ప్రభూ! ఈ గొప్ప సూత్రాన్ని జీర్ణం చేసికొని
ప్రపంచవస్తువుల కంటిపెట్టుకొనకుండా వుండే వరాన్ని
నీ దాసులమైన మాకు నిత్యమూ దయచేస్తూండు.

## 10. కోడికూయక మునుపే

లూకా 22,54-62. మత్త 26,31-35

ప్రభూ! నీవు ఒలీవ కొండమీద శిష్యులతో మాటలాడుతూ
"నేను గొర్రెల కాపరిని వధిస్తాను
మందంతా చెల్లాచెదరౌతుంది - అనే వేదవాక్యం నెరవేరుతుంది
మీరంతా నన్ను విడనాడి వెళ్ళిపోతారు" అని చెప్పావు
అందుకు పేత్రు వీళ్ళంతా నిన్ను పరిత్యజించినా
నేనుమాత్రం నిన్ను విడనాడను అని బింకాలు పల్కగా నీవు
"ఈ రాత్రి కోడికూయకమునుపే నీవు నన్నెరుగనని
ముమ్మారు బొంకుతావు" అని అతన్ని హెచ్చరించావు
కాని పేత్రు యింకా రోషం తెచ్చుకొని
అవసరమైతే నీకోసం ప్రాణాలైనా అర్పిస్తాను గాని
నిన్ను మాత్రం త్యజించను అన్నాడు పెద్దగా గొంతుచేసికొని
ఈలాంటి పేత్రే ఒలీవతోటలో మూడుసార్లు కునుకుతీసాడు
యూదా అపరాత్రిలో దండుతో వచ్చి నిన్ను బంధింపగా
అందరిలాగే తానూ బ్రతుకుజీవుడా అని కాలికి బుద్ధిచెప్పాడు
అటుపిమ్మట ప్రధానయాజకుడైన కయిఫా యింట
ఓ పనిపిల్లకు దడిసి ముమ్మారు నిన్నెరుగనని బొంకాడు
అతడాలా బొంకుతుండగానే నీవు నుడివినట్లే
కొక్కొరోకో అని కోడి కూయనే కూసింది
అప్పుడు శత్రువులు నిన్ను బంధించి తీసికొనిపోతూండగా
నీవు వెనుకకు మళ్ళి జాలితో పేత్రువైపు చూచావు

ఆ చూపు ఓ బాణంలా అతని యెదలో గ్రుచ్చుకొంది
అతడు తాను కొట్టిన డప్పాలనూ తన పతనాన్నీ తలంచుకొని
వెలుపలికి వెళ్ళి పుట్టెడు దిగులుతో బోరున యేడ్చాడు
పేత్రుకి కలిగిన ఈ తలవంపుల ద్వారా
నేను పాఠం నేర్చుకోవద్దా?
నేను నేననుకొన్నదానికంటె బలహీనుడనని గుర్తించేలా చేయి
నేను కాలుజారి పడినపుడెల్ల ఆ తొందరపాటు శిష్యునిలాగే
వెంటనే చిత్తశుద్ధితో పశ్చాత్తాపపడేలా చేయి
ఇంకా నేనెన్నిసార్లు నీకు ద్రోహం చేసినా
నీ వెప్పుడూ జాలితో నావైపు చూస్తూనే వుంటావనీ
డెబ్బైయేడుసార్లు నన్ను క్షమించడానికి సిద్ధంగానే వుంటావనీ
గ్రహించే భాగ్యాన్ని కూడ ఈ పాపికి అనుగ్రహించు.

## 11. కరుణామయుడు

కీర్త 51,4.7. యెహెజ్కేలు 33,11. కీర్త 103, 10-13. లూకా 5,31.

ప్రభూ! నా జీవితమార్గంలో ఓమారు
వెనక్కు తిరిగి చూస్తే నాకు కన్పించేవన్నీ ఘోరపాపాలే
పొట్టలో పురుగులుండే రేగుపండుని నేను
నేను పుట్టినప్పటినుండి పాపాత్ముడనే
మా యమ్మ నన్ను కన్నప్పటినుండి కిల్బిషాత్ముడనే
నేను చేయవలసిన పనులు చేయనేలేదు
చేయగూడని కార్యాలు మాత్రం ఎగిరెగిరి చేసాను
నా తప్పిదాలను స్మరించుకొంటే
నా మొగాన నెత్తురుచుక్క మిగలదు
నేనింత అల్పుణ్ణి, యింత తక్కువవాణ్ణి
కాని నా పాపాల కుప్పమాత్రం ఓ కొండలా పెరిగింది
ఐనా నీవు పాపి నాశంగావాలని కోరుకోవు
అతడు మనసు మార్చుకొని మళ్ళా బ్రతకాలనే నీ తలపు
కనుకనే నీవు నా పాపాలకు తగినట్లుగా నన్ను శిక్షింపవు

అలా శిక్షిస్తే నే నీపాటికి నరకంలో కూరుకొని వుండనా?
భూమికి ఆకాశం ఎంత ఎత్తుగా వుంటుందో
నీ భక్తులపట్ల నీ ప్రేమ అంత మిక్కుటంగా వుంటుంది
పడమరకు తూర్పు ఎంతదూరమో
మా పాపాలను నీవు అంత దూరంగా తొలగిస్తావు
తండ్రి తన కుమారులమీద జాలి చూపినట్లే
నీవూ నీ దాసులమీద కరుణ జూపుతావు
జాలిగుండెలు కలవాడివి కనుక
నీవు నరులమీద సులభంగా కోపపడవు
నెనరుగల తండ్రీ! నీవుతప్ప నాకు దిక్కెవరు?
నేను పాపమనే కుష్ఠ సోకి అపవిత్రుణ్ణయ్యాను
నీవు నామీద నీళ్లు చిలకరించి నన్ను శుద్ధిచేయి
కిల్బిషంవల్ల నేను సిందూరంలా ఎర్రనయ్యాను
నీవు నన్ను కడిగితే నేను మళ్లా మంచులా తెల్లనౌతాను
నీ కుమారుడైన క్రీస్తుకూడ తాను వచ్చింది
రోగులకోసంగాని ఆరోగ్యవంతులకొరకు కాదన్నాడు
దుష్టుడనైన నాకు ఇంతకంటె ఊరటవాక్య మేముంటుంది?

## 12. పాపాన్ని గూర్చిన ఉపమానాలు

ప్రభూ! మేము పాపాన్ని ఏవగించుకోవడానికి
దివ్యగ్రంథం పెక్కు ఉపమానాలను వాడుతుంది
పాపం వ్యభిచారంలాంటిది
భార్యాభర్తలు ఒకరిని కాదని ఒకరు
అన్యవ్యక్తులను సమీపిస్తారు
అలాగే మేము నిన్ను కాదని
అన్యదైవాల విగ్రహాలను కొలుస్తాం
నేరుగా విగ్రహాలనే కొలవనపుడు కూడ
సృష్టివస్తువులనే విగ్రహాలనుగా జేసికొని వాటిని సేవిస్తాం
పాపం కుష్ఠరోగంలా అసహ్యామైంది,
కాయలు కాయని అంజూరంలా వ్యర్థమైంది,
తీయని పండ్లకు మారుగా పుల్లని కాయలుకాసే

నికృష్టపు ద్రాక్షతోటలాంటిది,
నెర్రెలు విచ్చినందున తనలో నీళ్ళు నిల్చుకోజాలని
రాతి చట్టులోని తొట్టిలాంటిది,
ముండ్లపొదలతో నిండిపోయి పంటపండక
దేవుని శాపానికి గురైన పాడు పొలంలాంటిది,
అన్నిటినీ యీడ్చుకొనిపోయే భీకరప్రవాహంలాంటిది,
నరులు మోయలేని పెనుభారంలాంటిది,
భయంకరమైన విషసర్పంలాగ దుష్టమైంది,
తెరువబడిన సమాధిలాగ దుర్గంధ మొలికేది,
పాపం కట్టుకోవడమంటే పందిలాగ బురదలో పొర్లాడ్డం,
కుక్కలాగ కక్కిన కూటిని మరల మింగడం,
కయీను బిలాము యూదాలాంటి పాపులు
పోయిన త్రోవలో పోవడం
కనుక మేము కిల్బిషాన్ని ఎంతయినా అసహ్యించుకోవాలి
మా పాపాలవల్ల మాకు ఎఱ్ఱని మచ్చలు పుడతాయి
కాని పవిత్ర మూర్తివైన నీవు మమ్ము కడిగి
మంచులా శుభ్రం చేస్తావు
మా పాపాలు ఎఱ్ఱగావున్నా
మేము వున్నివలె తెల్లనయ్యేలా చేస్తావు
మా యపరాధాలను నీ కాళ్లక్రింద త్రొక్కివేస్తావు
వాటినెత్తి నడిసముద్రంలోనికి విసరివేస్తావు
మా తరపున మేము చిత్తశుద్ధితో మా తప్పిదాల నొప్పుకొంటే
నీవు వాటిని పూర్తిగా క్షమిస్తావు, మరల జ్ఞప్తికి తెచ్చుకోవు
కావున నా తమ్మునికి నేనేమైనా కావలి వున్నానా
అన్న కయీనులాగ
మా దోషాలను మేము కప్పిపెట్టేకోగూడదు
నేను ప్రభువుకి ద్రోహంగా పాపం చేసాను అన్న దావీదులాగ
మా దుష్కార్యాలను పూర్ణహృదయంతో అంగీకరించాలి
పిడికెడు మట్టిముద్దలమూ బలహీనపు ప్రాణులమూ ఐన మేము
ఈ నిజాయితీని ప్రసాదించమని
నిన్ను వినయంతో వేడుకొంటున్నాం.

# 13. పాపాన్ని తొలగించే దేవుడు

యెహెజ్కేలు, 33,11. లూకా 15,21. కీర్త 103,10.
మత్త 9,13. లూకా 15,5. లూకా 23,43. హెబ్రే 7,25.
1కొరి 6,19. రోమా 8,14. 1తెస్స 5,19.

తండ్రీ! నీవు పాపి నాశంకావాలని ఏనాడూ కోరుకోవు
అతడు పరివర్తనంచెంది మళ్ళా బ్రతకాలనే కోరుకొంటావు
కనుక నేనూ ఆ దుడుకుచిన్నవాడిలాగే
బిరాన నీ సన్నిధిలోకి తిరిగివచ్చి
తండ్రీ! నీకు ద్రోహంగా పాపం చేసాను
ఇకమీదట నీ కుమారుణ్ణి అని
పిలిపించుకోవడానికి యోగ్యుణ్ణి కాను
అని మనవిచేసికొంటున్నాను
నీవు ఈ పాపిని కరుణతో ఆదరించు
సహనమూర్తివీ దీర్ఘశాంతుడవూ ఐన నీవు
నా పాపాలకు తగినట్లుగా నన్ను దండించవద్దని
నీ యెదుట చేతులెత్తి మనవిచేసికొంటున్నాను.

క్రీస్తూ! నీవు పాపులను పిలువవచ్చానని చెప్పుకొన్నావు
ఆ తప్పిపోయిన గొర్రెనులాగే నన్నూ
నీ భుజాలమీద మోసికొనివచ్చి
తిరుగా మందలో చేర్చు
ఆ మంచి దొంగకులాగే నాకు గూడ
నేడే నీవు నా రాజ్యాన్ని చేరుకొంటావని అభయమీయి
ఇంకా, నీవు స్వర్గంలో తండ్రి సమక్షంలో వుండి
ఈ లోకంలో ఎప్పొద్దూ శోధనలకు గురయ్యే నాకోపం
విజ్ఞాపనంచేసి, నన్ను పిశాచ శోధనలనుండి కాపాడు.

ఆత్మమా! నీవు దేవునికి పోలికగా వుండే నరులను
పాపమాలిన్యంనుండి శుద్ధిచేసేవాడివి
నేను నీవు వసించే మందిరాన్ని కనుక

నీవు నా హృదయ దేవాలయాన్ని మరింత శుద్ధిచేసి
దానిలో నిరంతరమూ నెలకొనివుండు
నా అంతరంగాన్ని ప్రేరేపించి
నన్ను నీ మార్గంలో నడిపిస్తూండు
నా హృదయాంతరాళంలో వెలిగే భాగ్యదీపానివైన నిన్ను
గుప్పున ఆర్పివేసుకొనే దౌర్భాగ్యాన్ని మాత్రం
నీ దాసుడనైన నాకు ఏనాడూ పట్టనీకు.

## 14. రేపు అనే సుదినం వచ్చేనా?

మత్త 6,27.5,36 కీర్త 90,5. లూకా 12,16-20

తండ్రీ! నేను ఐహిక వస్తువులకోసం చీమలా ప్రాకులాడతాను
కాని పరలోక భాగ్యాలను పట్టించుకొనే పట్టించుకోను
ఈరోజు ఎగిరెగిరి పాపకార్యాలకు పూనుకొంటాను
రేపు వాటికి పశ్చాత్తాపపడవచ్చులే అనుకొంటాను
కాని ఆ రేపు అనేది నా స్వాధీనంలో వుంటుందా?
నేను నా యెత్తుని అంగుళం పెంచుకోలేను
నా ఆయుఃప్రమాణానికి ఒక్క క్షణం చేర్చుకోలేను
నా నరసిన వెంట్రుక నొక్కదాన్ని నలుపుగా చేసికోలేను
నా ఆయుస్సు ఓ కలలాగ, ఓ మంచుతెరలాగ
ఇవ్వాళ వుండి రేపెండిపోయే గడ్డిలాగ, క్షణికమైంది
మరి నేనా రేపటి రోజుకి కర్తను?
సువిశేషకథలోని ధనికుడేమనుకొన్నాడు?
నాకీ యేడు పంటలు పుష్కలంగా పండాయి
క్రొత్తకొట్లు కట్టించి ధాన్యం నిల్వజేయిస్తాను
చాల యేండ్లవరకు హాయిగా తిని త్రాగుతాను
ఇక దేవుణ్ణిగాని తోడి నరుణ్ణిగాని పట్టించుకోవలసిన
అవసరమేముంది అని తలంచాడు
నాస్తికత్వమంటే యిది కాదా? మరి దేవుడేమని పల్కాడు?
ఓరీ మందమతీ! ఈ రాత్రే నీ ప్రాణాలు తీస్తాను

నీవు కూడబెట్టిన యీ సొత్తు అన్యుల పాలవుతుంది అన్నాడు
ఆ ధనికుడు ఆ రాత్రే కన్నుమూసాడు కనుక
రేపు అనే సుదినాన్ని కంటితో చూడనేలేదు
కనుక ప్రభూ! నేను ఆధ్యాత్మిక విషయాలను
రేపటికి వదలివేయకుండా వుండేలా చేయి
దీపముండగానే యిల్లు చక్కబెట్టుకోవాలికదా!
కావున నేను కూడూగుడ్డ కొరకు రోజూ ప్రాకులాడినట్లే
మోక్షభాగ్యం కొరకు గూడ రోజూ కృషిచేసేలా చేయి
అపుడు నేను తలవని తలంపుగా కన్నుమూసినా,
రేపు అనే సుదినానికి నోచుకోకపోయినా,
నీ దర్శనభాగ్యాన్ని మాత్రం కోల్పోను.

## 15. సృష్టికర్త

ఆది 2,7. కీర్తన 8,4-7. యెష 64,8-9

ప్రభూ! నీవు ఆదిలో ప్రాణిసృష్టి చేసినపుడు
నేల మట్టినుండి నరాకృతిని జేసి
దానిలోనికి జీవవాయువు నూదగా
ఆ మృత్పిండం జీవించే ప్రాణి ఐంది
అతడే ఆది మానవుడైన తొలి ఆదాము
అప్పటినుండి నీవు నిరంతరం నరులను సృజిస్తూనే ఉన్నావు
స్త్రీపురుషుల శుక్రశోణితాలు మాతృగర్భంలో నెలకొనగా
నీవా మాంసపు ముద్దలోనికి జీవవాయువు నూదుతావు
ఫలితంగా నీ పోలిక కలిగిన నరుడు జన్మిస్తాడు
మానవమాత్రులమైన మేమంతా యిలా పుట్టినవాళ్ళమే
నీవు చేసిన యీ భౌతికసృష్టిలో నరుడు ఉత్కృష్టప్రాణి
అతడు నీకంటె కొంచెం తక్కువవాడు, నేలమీద నీ ప్రతినిధి
నీ వతన్ని కీర్తిమహిమలనే కిరీటంతో అలంకరించావు
సాధుమృగాలు వన్యమృగాలు ఆకాశపక్షులు జలజంతువులు
మొదలైన జీవకోటి నంతటిని అతని పాదాలక్రింద వుంచావు

నీవు చేసిన సృష్టికంతటికి అతన్ని అధిపతిని చేసావు
దేహధారుల్లో నరుడంతటివాడు లేడు
నీవు స్వర్గానికి రాజువైతే అతడు భూమికి రాజు
తండ్రీ! నీవు నాకు ఇంత శ్రేష్ఠమైన నరజన్మ నొసగావు
ఈ జన్మను నేను సార్థకం జేసికొనేలా చేయి
నేను నీకూ నీవు చేసిన తోడిజనులకు సేవలు చేసేలా చేయి
పుట్టలోని చెదల్లాగ పుట్టిగిట్టితే యేమి లాభం?
నీవు పుట్టగలిగిన వాళ్ళలోకూడ అందరినీ గాక
కొందిరిని మాత్రమే పుట్టిస్తావు – ఆ కొందరిలో నేనూ వొకణ్ణి
ఇందుకు నేను నీకు నిరంతరం వందనాలర్పించాలి
దుమ్మూధూళినైన నేను ఎగిరిపడగూడదు
మట్టిముద్దయైన ఆదాము పుత్రుని బండారమెంత?
నీవు నరుణ్ణి స్మరించుకోడానికి అతడెంతటివాడు?
కుండ కుమ్మరిమీదా, బల్ల వడ్రంగిమీదా తిరగబడకూడదు
కనుక నేను నీకు లొంగివుండేలా చేయి
నాలోని పొగరుబోతుతనాన్ని అణచివేయి
నీపట్ల వినయవిధేయతలు ప్రదర్శిస్తూ
నీ బంటునుగా జీవించే భాగ్యాన్ని దయచేయి.

## 16. ఐదు ఉపమానాలు

ప్రభూ! నీవు కాపరివైతే మేము నీవు మేపే మందం
మమ్ము అపమార్గం పట్టనీక తిన్నని త్రోవలో నడిపించు
రోజురోజు నీ పవిత్ర గ్రంథాలనే పచ్చికపట్టుల్లో మేపు
సకలాపదలనుండీ అనర్థాలనుండీ మమ్ము కాపాడు
నీవు నాయకుడవై మా ముందు నడుస్తూ
మమ్ము నీవెంట గొనిపో
మేము నీ స్వరాన్ని విని నిన్ననుసరించి వచ్చేలా చేయి

నీవు కాపువైతే మేము నీవు నాటిన ద్రాక్షతోటం
ఎరువేసి నీరుకట్టి నీ ద్రాక్షలమైన మేము

గుబురుగా ఎదిగి ఏపుగా కొమ్మలు చాచేలా చేయి
మేము తీయని పండ్లు గుత్తులుగుత్తులుగా ఫలించేలా చేయి
పుల్లని కాయలు కాసే వక్రబుద్ధినిగాని
అసలు ఫలించకుండావుండే దుష్టబుద్ధినిగాని మాకు పుట్టనీయకు

నీవు గృహనిర్మాతవైతే మేము నీవు కట్టిన గృహానిమి
పటిష్ఠమూ సుందరమూ ఐన భవనంగా మమ్ము తీర్చిదిద్దు
మేమంతా నీ మెస్సీయా అనే పునాదిరాతిమీద నిల్చేలాచేయి
నీ శిష్యులమైన మేమంతా ఒక్క సమాజంగా ఐక్యంగావాలి
ఈ భక్త సమాజమనే మందిరంలో నీవు నిరంతరం వసిస్తూండు

నీవు వరుడవైతే మేము నీవు అనురాగంతో చేపట్టిన వధువుమి
పూర్వవేద ప్రజలు నిబంధనంద్వారా వలె
నూత్నవేదంలో జ్ఞానస్నానంద్వారా మేము నీప్రజలమయ్యాం
కాని దుష్టవధువుమైన మేము అవిశ్వాసంతో నీకు ద్రోహంచేస్తాం
నిన్ను విడనాడి నీవు చేసిన సృష్టివస్తువులవద్దకు లగెత్తుతాం
కనుక మా అంతరంగంలో నీపట్ల భక్తివిశ్వాసాలు పెంచు
మా హృదయంలో ప్రేమజ్యోతిని వెలిగించు
నీ సువిశేష బోధలద్వారా మాకు ప్రబోధం కలిగించు
అవిభక్త హృదయంతోను అనన్యచిత్తంతోను
ఏప్రొద్దు మేము నిన్ను సేవించేలా చేయి

నీవు తండ్రివైతే మేము నీ సంతానానిమి
కుమ్మరి మట్టితో కుండను చేసినట్లుగా నీవు మమ్ము చేసావు
జీవనాధారానివైన నీనుండి మేము
జీవనదాయక జలాలు గ్రోలాలి
జ్యోతిర్మూర్తివైన నీనుండి దివ్యజ్యోతిని పొందాలి
తండ్రి బిడ్డలమీదవలె నీవూ మామీద నెనరుజూపు
మా పేరు నీ యరచేతులమీద వ్రాసి వుంచుకొంటావనీ,
తల్లి తన ప్రేవున బుట్టిన బిడ్డను విస్మరించినా
నీవు మమ్ము విస్మరించవనీ మేము రూఢిగా నమ్మేలా చేయి.

# 17. తండ్రి గుణగణాలు

మత్త 6,26. 30. 5,45. కీర్త 104, 29-30, యెష 64,8-9.
యోబు 25, 5.4, 18. కీర్తన 103, 8-10. లూకా 7,19.
1సమూ 16,7. యెష 57,15, కీర్త 119,105. కీర్త 121,4.

తండ్రీ! పక్షులు పైరులువేసి పంటలు పండించుకోవు
పాతరల్లో గాదెల్లో ధాన్యం దాచుకోవు
ఐనా నీవు వాటికి సకాలంలో తిండిపెడతావు
అలాగే పొలంలోని పిచ్చిమొక్కలు బట్టలు కుట్టించుకోవు
ఐనా నీవు వాటికి పూలనే రంగురంగుల దుస్తులు తొడుగుతావు
నీవు నీకు పోలికగా జేసిన నరునికి వీటికంటె అదనంగా
కూడూగుడ్డా యిల్లూవాకిలీ దయచేస్తావు
నీవు సజ్జనులకూ దుర్జనులకూగూడ సూర్యరశ్మిని దయచేస్తావు
సత్పురుషుల పొలాలమీదా దుష్టుల పొలాలమీదా గూడ
వానను ఒకేరీతిగా కురిపిస్తావు
మాలాగా కొందరిని కేటాయించి కొందరిని ఆదరించవు
నీవు భూమ్యాకాశాలను సృజించావు
కుమ్మరి మట్టితో కుండలను జేసినట్లుగా నరులను జేసావు
నీవు వూపిరిపోస్తే ప్రాణికోటి బ్రతుకుతుంది
ఊపిరితీస్తే జీవులన్నీ చస్తాయి
వెలుతురు చీకటిని సహించనట్లే
మహాపవిత్రుడవైన నీవు పాపాన్ని సహించవు
నీ కంటికి చంద్రుడూ నక్షత్రాలుకూడ నిర్మలంగా వుండవు
నీవు స్వర్గంలోని దేవదూతల్లోనే తప్పులు చూస్తావు
ఇక క్రిమీ కీటకమూవంటివాడైన మట్టిమానిసిలో
నీకెన్ని దోషాలు కన్పించవు?
నీ యెదుట మా పుణ్యకార్యాలెంత? మా పావిత్ర్యమెంత?
ఐనా నీవు కరుణామయుడవు, దయాపూరితుడవు
దీర్ఘశాంతుడవు, ప్రేమనిధివి
మేము పాపంచేసినప్పుడుకూడ మమ్ము కటువుగా మందిలింపవు

మా మీద నిరంతరం కోపింపవు
మా పాపాలకు తగినట్లుగా మమ్ము శిక్షింపవు
పిచ్చుకమీద బ్రహ్మాస్త్రమా అన్నట్లుగా
మమ్ము చూచీచూడనట్లుగా వదలివేస్తూంటావు
దయా సముద్రుడవైన నీవు
మా పాపాలను పూర్తిగా మన్నిస్తావు
మా యపరాధాలను నీ కాళ్ళక్రింద త్రొక్కివేస్తావు
వాటిని సముద్రగర్భంలోనికి విసరివేస్తావు
నరులు వెలుపలి రూపాన్ని జూచి భ్రమపడతారు
కాని నీవు హృదయాన్ని పరిశీలిస్తావు
హృదయశుద్ధిగల మహానుభావులంటే నీకెంతో యిష్టం
నీవు అత్యున్నతమైన పరిశుద్ధ స్థలంలో వసించేవాడివైనా
వినయాత్ములూ పశ్చాత్తాప మనస్కులూఐన
నరుల హృదయాల్లోకూడ ప్రీతితో వసిస్తూంటావు
నీవు నీ యాజ్ఞలతో నీ భక్తులను నడిపిస్తూంటావు
ఈ లోకంలో నీ వాక్యం మాకు దీపంలా త్రోవజూపుతుంది
తల్లిపక్షి తన పిల్లలను రెక్కలతో కప్పినట్లుగా
నీవు నీ సేవకులను కాచికాపాడుతూంటావు
నీ భక్తులకు నిరంతరం కావలికాసే దేవుడవైన నీవు
కునికిపాట్లు పడనూపడవు, నిద్ర పోనూపోవు.

## 18. శాశ్వతుడైన దేవుడు

కీర్తన 102,25-27. యెష 40,6-8

ప్రభూ! నీకూ మానవమాత్రులమైన మాకూ
ఎంత యంతరం!
అసలు నీతో మాకు సఖ్యం కుదురుతుందా అనిపిస్తుంది
నీతో పోల్చుకొంటే మానవుని ఆయుష్కాలమెంత?
మునిమాపు నీడలాగ, మంచుతెరలాగ,
వాడిపోయిన గడ్డిలాగ, నరుడు క్షణమాత్రుడు
కాని నీవు మాత్రం శాశ్వతంగా మనేవాడివి

ఈ భూమికి పునాదులెత్తింది నీవు
పైయాకాశాన్ని ఓ గోళంలాగా నిర్మించింది నీవు
ఈ భూమ్యాకాశాలు గతిస్తాయిగాని
నీవుమాత్రం గాలిలేని తావులోని దీపంలాగ
ఎల్లకాలమూ నిశ్చలంగా వెలుగుతూనే వుంటావు
నరుడు చినిగిపోయిన బట్టను తొలగించి
క్రొత్త పుట్టాన్ని ధరించినట్లే నీవుగూడ
శిథిలమైపోయే భూమ్యాకాశాలను నిర్మూలించి
మళ్ళా క్రొత్త సృష్టినిచేసి దాన్ని ఓ వలువలా ధరిస్తావు
నీవు చేసిన యీ సృష్టి గతిస్తుంది గాని నీవు గతించవు
ఏండ్లూపూండ్లూ కదచినా వృద్ధత్వానికి గురికాకుండా
ఎల్లప్పుడూ ఒకేరీతిగా వుండిపోతావు
ప్రవక్త నుడివినట్లు నరులంతా తృణంలా క్షణమాత్రులు
వాళ్ళ సౌందర్యం పూవులా వికసించి
క్షణంలో వాడిపోతుంది
వేడిగాలి సోకగానే గడ్డి కమిలిపోతుంది
పూవు వాడిపోతుంది, నరుల బండారంగూడ యింతే
నీ వాక్కు ఒక్కటిమాత్రం శాశ్వతంగా నిలుస్తుంది
ప్రభూ! నీవు మమ్ము అనంత ప్రేమతో ఆదరించావు
అశాశ్వతులమైన మా చెంతకు
శాశ్వతమైన నీ వార్తను పంపావు
ఆవార్త మానవమాత్రులమైన మమ్ము జేరి మా రూపం చేకొంది
ఇందుకుగాను నీకు మా వందనాలు.

## 19. దైవసాన్నిధ్యం

కీర్తన 139

ప్రభూ! నన్ను గూర్చి నీకు బాగా తెలుసు
నే నేమి చేసినా, ఎక్కడికి వెళ్లినా నీవు గమనిస్తూనే వుంటావు
నా హృదయంలోని ఆలోచనలను గుర్తిస్తూంటావు
నానోట మాట రాకమునుపే నేనేమి చెప్తానో నీకు తెలుసు

నీవు నా ముందూ నా వెనుకాగూడ పయనిస్తూంటావు
ప్రేమతో నిరంతరం నన్నాదుకొంటూంటావు.
నన్ను గూర్చిన నీ తెలివిడి ఆశ్చర్యకరమైంది
అల్పబుద్ధినైన నేను దాన్ని గ్రహించలేనుగూడ

నీ సమక్షంనుండి తప్పించుకొని నే నెక్కడికి పారిపోగలను?
నేను గగనాని కెక్కిపోతే నీ వక్కడుంటావు
పాతాళానికి దిగిపోతే అక్కడుంటావు
రెక్కలు కట్టుకొని తూర్పుదిక్కున కెగిరిపోతే,
పడమరన చాల దూరంవరకు పయనిస్తే, అక్కడా వుంటావు
నేను చీకటిలో దాగుకొన్నా నీ కంట బడకపోను
చీకటి నీ ముందు పగటిలా ప్రకాశిస్తుంది
రేయింబవళ్ళు నీకు సరిసమానం

నాలోని ప్రత్యణువునూ నీవే సృజించావు
మాతృగర్భంలో నన్ను రూపొందించింది నీవే
నేను తల్లికడుపులో పిండాకృతిపొంది
వివిధాంగాలతో చిత్రంగా రూపొందుతూన్నపుడే,
ఇంకా యే నరుడూ నన్ను కంటితో చూడకమునుపే,
నీవు నన్ను ప్రేమతో వీక్షించావు
నీవు నాకు నిర్ణయించిన దినాలన్నిటినీ,
వాటిని నేనింకా జీవింపకమునుపే,
ముందుగానే నీ గ్రంథంలో లిఖించి వుంచావు
నా జీవితంలోని ప్రత్యంశమూ నీకు ముందుగానే తెలుసు
నాపట్ల నీకు గల ప్రేమభావాలు అన్నీ యిన్నీ కాదు
అవి యిసుక రేణువుల్లాగ లెక్కల కందవు

తండ్రీ! ఈలా నీవు నన్ను నిరంతరం అనురాగంతో స్మరిస్తున్నా
లోకవ్యామోహాల్లో చిక్కుకొని నేను నిన్ను విస్మరిస్తుంటాను
మబ్బు చంద్రబింబాన్ని లాగే
నేనింతగా అభిమానించే యీ సృష్టివస్తువులు
నిన్ను కప్పివేస్తుంటాయి

కనుక నేను సమస్త వస్తువుల్లోను నిన్ను గుర్తించేలా చేయి
సమస్త వస్తువులనూ నీయందు గుర్తించేలా అనుగ్రహించు
నీ ముఖప్రకాశంతో నన్ను వెలిగించు
నా యెదలోని చీకట్లను తొలగించు
నిన్ను జేరి నీసన్నిధిలో వుండిపోవడం జీవం
జీవనాధారానివైన నీనుండి వైదొలగడం మరణం.

## 20. దత్తపుత్రులు

రోమా 8,15-17. యోహా 6,44. 14,4

తండ్రీ! క్రీస్తు నీకు సరిసమానుడు, సహజపుత్రుడు
ఆ పుత్రునిలోనికి జ్ఞానస్నానం పొంది
మేము నీకు దత్తపుత్రీ పుత్రుల మౌతాం
అతని ద్వారా నిన్ను చనువుతో నాన్నా అని పిలుస్తాం
పూర్వవేద ప్రజలు నిన్నుజూచి భయపడ్డారు
నీ పేరు ఉచ్చరించడానికి జంకి నిన్ను అదొనాయి అని పిల్చారు
నీవు యజమానుడవనీ తాము నీకు బానిసలమునీ యెంచారు
కాని నూత్నవేదంలో క్రీస్తు చలవవల్ల
మేము నిన్ను స్వాతంత్ర్యంతో నాన్నా అని పిలువగల్గుతున్నాం
లోకంలోని నరులంతా సృష్టిద్వారా నీ బిడ్డలయ్యారు
ఎన్నిక నిబంధనలద్వారా యూదులు నీ సుతులయ్యారు
కాని మేము క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొంది
నీ సంతాన మయ్యాం
సకలలోకాలకు కర్తవూ దేవాధిదేవుడూ ఐన నిన్ను
గారాబు తండ్రినిగా బొందడం సామాన్యభాగ్యమా?
లోకంలో ఉన్నతాధికారి కుమారుడు
తన తండ్రిని జూచి గర్విస్తాడు
తండ్రులందరికి తండ్రివి అధికారులందరికి అధికారివి నీవు
నీ తనయుల మైనందుకు మేమెంతగా గర్వించాలి?
మేము నీ బిడ్డలంగాన నీవు మమ్మెంతగానో ప్రేమిస్తావు

మా కొరకు నీ యేకైక కుమారునే త్యాగం చేసిన నీవు
మమ్ము గాఢంగా ప్రేమించకుండా వుంటావా?
నీ ప్రేమ మా అమ్మానాన్నల ప్రేమంటె బలమైంది,
ప్రాణంకంటె విలువైంది, పర్వతంకంటె స్థిరమైంది
ఆకాశంకంటె ఉన్నతమైంది, సముద్రంకంటె లోతైంది
మేము జ్ఞానస్నానంలోనే పొందిన పవిత్రాత్మ
నిన్ను నమ్మకంతో నాన్నా అని పిల్చేలా చేస్తుంది
మేము నీ బిడ్డలమని నిండుమనస్సుతో విశ్వసించేలా చేస్తుంది
మేము పరలోకపు తండ్రివైన నీకు వారసులమై
నీ యాస్తియైన మోక్షసామ్రాజ్యాన్ని స్వీకరించేలా చేస్తుంది
తండ్రీ! మమ్ము నీ ప్రియసుతుడైన క్రీస్తుచెంతకు ఆకర్షించు
ఆ క్రీస్తూ మమ్ము నీ చెంతకు ఆకర్షించేలా అనుగ్రహించు
బిడ్డలు తమ అవసరాల్లో తండ్రి చెంతకులాగే
మేమూ నీ చెంతకు పరుగెత్తుకొని వచ్చేలా చేయి
విశేషంగా మేము నీప్రేమను అనుభవానికి తెచ్చుకొనేలా చేయి
నిన్ను తలంచుకొని సంతసంతో పొంగిపోయేలాను
నీ దర్శనభాగ్యం కొరకు తపించిపోయేలాను దయచేయి.

## 21. ఆకాశపక్షులూ గడ్డిమొక్కలూ

మత్త 6, 25-33

ప్రభూ! మాకు చింతలు మెండు
ఏమి తిందామా ఏమి కట్టుకొందామా అని
చీటికిమాటికి ఆందోళనపడుతూంటాం
ఐనా మా ప్రాణం భోజనంకంటె విలువైందనీ
మా దేహం బట్టలకంటె మెరుగైందనీ నీవే బోధించావు

నీవు ఆకాశంవైపు చూపించి
"ఆ మీద యెగిరే పక్షులను చూచారుకదా!
అవి విత్తవు, కోయవు, గింజలు గాదెల్లో చేర్చుకోవు
ఐనా పరలోకపు తండ్రి వాటిని పోషిస్తున్నాడు

మీరు ఆ పక్షులకంటె విలువైనవాళ్ళు కారా?
మీరు ఎంత ఆందోళనం జెందితే మాత్రం
దేవుడు మీకు నిర్ణయించిన ఆయుష్కాలంకంటె
ఒక్కక్షణం అదనంగా జీవించగలరా" అన్నావు.

ఇంకా నీవు భూమివైపు చూపించి
"బట్టలకొరకు మీరింతగా విచారించాలా?
ఆ పొలంలో యెదిగే గడ్డిమొక్కలను చూడండి
అవి శ్రమపడి పనిజేయవు, బట్టలు నేసికోవు
ఐనా మహావైభవంతో జీవించిన సొలోమోను మాత్రం
వాటి పూవుల్లాంటి సొగసైన దుస్తులు ధరించాడా?
నేడు పొలంలో ఎదిగి రేపు పొయ్యిలో మాడిపోయే
తృణజాలాన్నే దేవుడు ఈలాంటి బట్టలతో అలంకరిస్తే
మీకింకా యెంత నాణెమైన దుస్తులు దయచేయడు" అన్నావు.
కనుక ప్రభూ! మేము కూడుగుడ్డ యిల్లువాకిలి
అనే తాపత్రయాల్లో బడి కొట్టుకొనిపోగూడదు
భగవంతుని నమ్మని అభాగ్యులకుగాని
మాకు తగవు ఈలాంటి చింతలు
మమ్ము పోషించే పరలోకపు తండ్రికి
ముందుగానే తెలుసు మా అక్కరలన్నీ
మొదట ఆ తండ్రినీ అతని రాజ్యాన్నీ ఆశిస్తే చాలు
ఈ లోకవస్తువులన్నీ వాటంతట అవే సమకూరుతాయి.

## 22. పుట్టువునిచ్చే తండ్రి

కీర్త 8. సొలోమోను జ్ఞాన 11,24-26

తండ్రీ! నీ భక్తుడైన కీర్తనకారుడు నరుణ్ణిజూచి విస్తుపోయాడు
"దేవా! నీవు సృజించిన యీ విశాలాకాశాన్నీ
మింటిమీద నీవమర్చిన చంద్రతారకలనూ తిలకింపగా
ఈ అల్పమానవుడు ఏపాటివాడు అన్పిస్తుంది
ఐనా నీవు ఈ క్షుద్రనరుణ్ణి స్మరించుకొంటావు

ఈ పేదనరుణ్ణి పట్టించుకొంటావుకూడ
ఇంకా ఆశ్చర్యమేమిటంటే
నీవు నరుణ్ణి దేవుడంతటివాణ్ణిగా చేసావు
కీర్తికిరీటంతో అతన్ని అలంకరించావు
నీ సృష్టికంతటికీ అతన్ని అధిపతిని చేసావు
నీవు కలిగించినవాటి నన్నిటిని
అతని పాదాలక్రింద వుంచావు" – అన్నాడు
తండ్రీ! ఈలాంటి నరజన్మను నీవు నాకు ప్రసాదించావు
నూరేండ్ల క్రితం నేను లేను
మరో నూరేండ్ల తర్వాత ఉండబోను
పూర్వం ఈ మంటిమీద నేను లేను
ఉండవలసిన అవసరంకూడ లేదు
మరి నేడు నేనుంటున్నానంటే వింతలలోకెల్ల వింతకాదా?
పుట్టగలిగిన వాళ్ళనందరినీ నీవు పుట్టింపవు
కొందరికి మాత్రమే పుట్టువునిస్తావు, వాళ్ళల్లో నేనూ వొకణ్ణి!
పైగా నేను ఓ రాయిగానో చెట్టుగానో మృగంగానో
ఓ గంటకాలం నీ కృపవల్ల మనివుంటే అదీ గొప్పే
కాని నీవు నాకు అంతకంటె ఉత్కృష్ట జన్మనే యిచ్చావు
నన్ను నీకు పోలికగా చేసావు, నీయాత్మను నాలో వుంచావు
నేను శాశ్వతంగా మనగలను
నీవు వసించే దివ్యధామం చేరుకోగలను
అసలు నేనంటే నీకిష్టం, నీవు నన్ను చీదరించుకోవు
నేనంటే నీ కసహ్యమైతే నీవు నన్నెందుకు పుట్టిస్తావు?
నీవు పుట్టించందే ఏప్రాణి పుడుతుంది?
నీవు సంరక్షించందే ఏప్రాణి మనుతుంది?
నాశంలేని నీ యాత్మే నాలోనూ నెలకొని వుంది
కనుక తండ్రీ! నా పుట్టువును స్మరించుకొని
విస్మయంతో వేమారు నీ ముందట ప్రణతుడనయ్యేలా చేయి
ఈలాంటి జన్మను దయచేసిన గారాబు తండ్రివైన నీకు
ఏప్రొద్దు వినతులర్పించే వివేకంకూడ ప్రసాదించు.

# 23. క్రీస్తు దయచేసే ఆత్మ

సంఖ్యా 20,11. 1కొరి 10,4. యోహా 4,10.7, 37-39
అచ 2,33. యోహా 19,30. 19,34

క్రీస్తూ! పితనుండి బయలుదేరే ఆత్మ
నీ ద్వారా మా హృదయాల్లోకి ప్రవేశిస్తుంది
పూర్వం మోషే యెడారిలో మెరిబా చెంత
బెత్తంతో రాతిబండను చరవగా నీటిపాయ వెలువడింది
ప్రభూ! ఆ రాతిబండ నిన్నే సూచిస్తుందన్నాడు శిష్యుడు పౌలు
నీవు సుఖారు బావివద్ద సమరయ మహిళతో మాటలాడుతూ
"అమ్మా! నీవేగనుక దేవుని వరాన్ని గుర్తించి వున్నట్లయితే
ప్రస్తుతం నీతో మాటలాడుతుందెవరో తెలిసికొని వున్నట్లయితే
నీవే అతన్ని త్రాగటానికి నీళ్ళీయమని అడిగేదానివి
అప్పుడతడు నీకు జీవజల మిచ్చివుండేవాడు" అని చెప్పావు.
ఈ జీవజల మేమోగాదు, పరిశుద్ధాత్మే
కనుకనే మరోసందర్భంలో యెరూషలేములో ఉపన్యసిస్తూ
"దప్పికగొన్నవాడు నా చెంతకువచ్చి దాహం తీర్చుకోవచ్చు
నన్ను విశ్వసించేవాడి హృదయాంతరంగంనుండి
జీవజలం పొంగిపారుతుంది" అని పల్కావు
ఆ జీవజలప్రవాహం మరేమోగాదు పరిశుద్ధాత్మే
ఔను, నిన్ను నమ్మేవాళ్ళు నీనుండి ఆత్మను పొందుతారు
నీవు ఉత్థానంచెంది తండ్రి సమక్షాన్ని చేరుకొని
అతనినుండి ఆత్మను స్వీకరించావు
అలా స్వీకరించిన ఆత్మను
నిన్ను నమ్మే భక్తులమీద కుమ్మరించావు
సువిశేషం నుడివినట్లుగా
నీవు సిల్వమీదికెక్కి నీ యాత్మను వదిలావు
అనగా నీవు సిల్వపై చనిపోయి తండ్రిని చేరుకొని
ఆత్మను పొందావు, అలా పొందిన ఆత్మను మామీదికి ఊదావు
కనుకనే సిలువమీద నీ ప్రక్కను బల్లెంతో పొడవగా

నీరూ నెత్తురూ ఏకధారగా ప్రవించాయి
ఆ నీరు ఆత్మనీ, ఆ యాత్మద్వారా సిద్ధించే
జ్ఞానస్నాన సంస్కారాన్నీ చూచిస్తుంది
కనుక ప్రభూ! ఏవిధంగా జూచినాగానీ
మాకు ఆత్మ నొసగేవాడివి నీవే
ఏనుగుపడితే ఏనుగే లేపాలి అంటారు
దైవవ్యక్తియైన ఆత్మను దైవవ్యక్తివైన నీవే దయచేయాలి
ప్రభూ! నీ యాత్మను మాకు సమృద్ధిగా ప్రసాదించు
మేము జ్ఞానస్నానంలోనే స్వీకరించిన ఆ యాత్మను
స్వయంకృషితో, స్వీయభక్తితో, వ్యక్తిగత ప్రార్థనతో
రోజురోజుకీ అధికాధికంగా వృద్ధి జేసికొనే భాగ్యాన్ని దయచేయి
నాడు నీవు ప్రారంభించిన రక్షణోద్యమాన్ని
నేడు ఈ మంటిమీద కొనసాగించేది నీయాత్మే గనుక
ఆ పావనాత్మ నాయకత్వం క్రిందనే నీ భక్తులమైన మేము
మా క్రైస్తవ జీవితయాత్రను నాడునాటికీ ఫలప్రదంగా
కొనసాగించుకొనే మహాభాగ్యాన్ని మాకెల్లరికి అనుగ్రహించు.

## 24. రెండవ నాయకుడు

సంఖ్యా 27,22-23. 1రాజు 19,19-21. యోహా 16,7. 2కొరి 12,3.

ప్రభూ! పూర్వం యూదులు ఎడారిలో ప్రయాణం చేసినపుడు
మోషే తర్వాత యోషువా నాయకుడై
ఆ ప్రజలను వాగ్దత్త భూమికి చేర్చాడు
అలాగే యేలీయా తర్వాత యెలీషా ప్రవక్తయై
యిస్రాయేలు దేశంలో యావేమతాన్ని నిలబెట్టాడు
ఈలా మొదటి నాయకుని తర్వాత రెండవ నాయకుడు వచ్చి
ఆ మొదటి నాయకుని ఉద్యమాన్ని కొనసాగించడం
పూర్వవేదంలో కన్పించే సంప్రదాయం
ఈ సూత్రం ప్రకారం క్రీస్తు మోక్షారోహణం చేసాక
రెండవ నాయకుడైన ఆత్ముడు విజయంచేసాడు
తండ్రిని చేరిన క్రీస్తే ఈ రెండవ ఆదరణకర్తను పంపాడు

ఇక నేడు క్రీస్తు ఉద్యమాన్ని కొనసాగించేది ఈ యాత్ముడే
ప్రభూ! నీవు ఒకే దేవుడవైనా
ముగ్గురు వ్యక్తులతో కూడినవాడివి
కనుకనే నీవు మూడు దశల్లో
నిన్ను గూర్చి ప్రజల కెరుకపరచుకొన్నావు
తొలుత ప్రజలకు తండ్రినిగూర్చి మాత్రమే తెలిసింది
తర్వాత క్రీస్తునిగూర్చి కూడ తెలిసింది
కడపట ఆత్మనుగూర్చీ తెలిసింది
ఈ మూడు దశలూ క్రమంగా పితృశకం,
క్రీస్తుశకం, ఆత్మశకం అని పిలువబడతాయి
ఇప్పుడు మేము ఆత్మశకంలో వున్నాం
ఇక లోకాంతంవరకూ ఈ యాత్మశకమే కొనసాగుతుంది
నీలో నాల్గవవ్యక్తి లేదు కనుక నాల్గవ శకం లేదు
కనుక రెండవరాకడదాకా గూడ
ఆత్ముడే యిక మాకు నాయకుడు
ఆ యాత్ముడు కూడ మమ్ము తన చెంతకుకాక
క్రీస్తు చెంతకే చేరుస్తుంటాడు
అతని అనుగ్రహం లేందే మేము
యేసే ప్రభువని యెంతమాత్రమూ విశ్వసించలేం
ఇప్పుడు మేమంతా ఆత్మశకంలో వున్నాం గనుకనూ
ఆత్మద్వారా తప్ప క్రీస్తును చేరలేం గనుకనూ
ఆ యాత్మునిపట్ల మేము భక్తిని
అత్యవసరంగా పెంపొందించుకోవాలి
అన్ని భక్తిమార్గాలకంటే ఈ యాత్మభక్తి అతిముఖ్యమైంది.

## 25. జీవజలం

కీర్త 42,1-2. 63,1. యిర్మీ 2,13. యోహా 4,13-14. 19,34. దర్శ 21,6

తండ్రీ! నీవు జీవనప్రదమైన జలానివి
ప్రతి నరుడూ నీనుండి జీవజలం త్రాగి దప్పిక తీర్చుకోవాలి
కావుననే నీ భక్తుడైన కీర్తనకారుడు

దప్పిక గొనిన దుప్పి సెలయేటి నీళ్ళకుమల్లె
నా హృదయం ప్రభువు కొరకు తపిస్తూంది
సజీవుడైన దేవుని కొరకు
నేను ఆరాటం చెందుతూన్నాను అన్నాడు
మరో కీర్తనకారుడు – నీవే నాకు దేవుడవు
నేను నీకొరకు ఉబలాటం చెందుతున్నాను
నీళ్ళులేక యెండి మాడిపోయిన నేలలాగ
నాయాత్మ నీకోసం దప్పికగొంటూంది అని పల్కాడు
నీ భక్తులు నీకొరకు తపించిపోయిన తీరు ఈలా వుంటుంది
కాని మట్టిమానుసులమైన మాకు ఈలాంటి కోరికలు పుట్టవు
పూర్వవేదపు ప్రజల్లాగే మేమూ రెండు తప్పులు చేసాం
అవివేకంతో జీవధారవైన నిన్ను విడనాడాం
నీటికోసం రాతిచట్టులో తొట్టిని తొలిపించుకొన్నాం
కాని అది నెర్రెలు విచ్చినందున దానిలో నీళ్ళు నిలువవు
కనుక మా దౌర్భాగ్యానికిగాను మేము గాఢంగా పరితపిస్తున్నాం
ఐతే మా పాలిటి భాగ్యదేవతయైన క్రీస్తు
సుఖారు బావిచెంత సమరయ మహిళతో మాటలాడుతూ
ఈ నీళ్లు త్రాగితే మరల దప్పిక వేస్తుంది
నేనిచ్చే నీళ్లు త్రాగితే యిక దప్పిక వేయదు
నేనిచ్చే జీవజలం నరుల యెదదల్లో నీటిబుగ్గలా వూరుతూ
వారికి నిత్యజీవం దయచేస్తుంది అని వాకొన్నాడు
ఈలా క్రీస్తు మాకు దయచేసే జీవజలం పవిత్రాత్మే
ప్రభువు సిలువమీద వ్రేలాడుతుండగా
అతని ప్రక్కను ఈటెతో తెరచారు
వెంటనే అతని హృదయంనుండి నీళ్లు స్రవించాయి
ప్రభువు పేర్కొన్న జీవజలమూ పవిత్రాత్మా ఈ నీళ్ళే
తండ్రీ! నీనుండీ క్రీస్తునుండీ బయలుదేరే ఆత్మ
ఓ మహా జలప్రవాహంలాగ మామీదికి దుమికివస్తుంది
మే మా జలాలు గ్రోలి దప్పిక తీర్చుకోవాలి
నీ కుమారుడైన క్రీస్తు దప్పికగొన్నవాళ్ళ నందరినీ

జీవజలపు చెలమనుండి స్వేచ్ఛగా నీళ్ళు త్రాగనిస్తాడు
మేము నీళ్ళు త్రాగి మా భౌతిక జీవితాన్ని నిలబెట్టుకొన్నట్లే
జీవజల స్వరూపుడైన ఆత్మను పానంజేసి
మా యాధ్యాత్మిక జీవితాన్ని నిలబెట్టుకోవాలి
కనుక ఆ యాత్మను సమృద్ధిగా పానంజేసే భాగ్యాన్ని
జీవజలదాతయైన క్రీస్తుద్వారానే మాకు ప్రసాదించు.

## 26. శిష్యులమీదికి దిగివచ్చిన ఆత్మ

అచ 2,1-4. నిర్గ 19,16-20

పావనాత్మమా! పెంతెకోస్తు దినాన శిష్యులంతా కలసి
మీది గదిలో భక్తిభావంతో ప్రార్థన చేసికొంటూండగా
నీవు వాయువులాగ, అగ్నిజ్వాలల్లాగ, నాలుకల్లాగ
దిఢీలున వారిమీదికి దిగివచ్చావు
హీబ్రూ భాషలో నీ పేరు "రువా" - అంటే వాయువు
కనుక నీ పేరుకు దగ్గట్టుగానే నీవు మహాశక్తితో
గాలిలాగ దిగివచ్చావు

అగ్ని దైవసాన్నిధ్యాన్ని సూచిస్తుంది
కావుననే దైవవ్యక్తివైన నీవు నిప్పులా దర్శనమిచ్చావు
పూర్వవేదంలో మోషే సీనాయి కొండమీదికెక్కి
కారుమబ్బుల్లో ఉరుముల్లో మెరుపుల్లో నిప్పుమంటల్లో
దేవుణ్ణి దర్శించి ధర్మశాస్త్రాన్ని పొందాడు
దానితో పూర్వవేద సమాజం ప్రారంభమైంది
అలాగే నీవే పెంతెకోస్తు దినాన నూత్న ధర్మశాస్త్రాన్నొసగి
నూత్నవేద సమాజంతోగూడిన శ్రీసభను ప్రారంభించావు

నాలుక వాక్శక్తికి నిదర్శనం
నీవు శిష్యులకు బోధనాసామర్థ్యాన్ని దయచేసావని సూచిస్తూ
వారిమీదికి నాలుకల్లా దిగివచ్చావు
ఇక, ఆ శిష్యులు పెంతకోస్తు దినాన నిన్ను పొందినట్లే
నేడు జ్ఞానస్నానంలో మేమూ నిన్ను స్వీకరిస్తాం

నీవు నిరంతరం మా అంతరంగంలో నెలకొని వుంటావు
నరుడు నిధిని భద్రంగా దాచుకొన్నట్లే
మేమూ నిన్ను మా హృదయపేటికలో పదిలంగా దాచుకోవాలి
నిప్పుమీద వూదగానే మంటలు లేచినట్లు
మేము నిన్ను స్మరించుకొని నీకు ప్రార్థనం జేసికొనగానే
నీవు మా హృదయంలో మహాజ్యోతివిగా ప్రజ్వరిల్లు
మహావాయువువైన నీవు మమ్ము నీయద్భుతశక్తితో నడిపించు
దైవాగ్నివైన నీవు మమ్ము దైవసాన్నిధ్యంతో నింపు
మాలోని పాపమాలిన్యాన్ని దహించి
మా హృదయాలను శుద్ధిచేయి
జిహ్వారూపుడవైన నీవు మేము క్రీస్తుని స్తుతించేలా చేయి
ఆ ప్రభువుని లోకానికి చాటిచెప్పే శక్తినిగూడ ప్రసాదించు
సదుపదేశం, దైవభక్తి, దృఢత్వం, దైవభీతి
తెలివి, వివేకం, విజ్ఞానం అనే సప్తవరాలను మాకు ప్రసాదించు
మా హృదయంమీద క్రీస్తురూపాన్ని ప్రస్ఫుటంగా చిత్రించు
మేము జీవితాంతమూ ఆ ప్రభువుకి
సేవలు చేసే భాగ్యాన్ని ప్రసాదించు.

## 27. క్రీస్తుని ముద్రించే ఆత్మ

ఎఫే 1,13. 1కొ 6,19. లేవీ 19,2. రోమా 5,5.

ఆత్మమా! మేము జ్ఞానస్నానం పొందినప్పుడే
నీవు మాలోకి విచ్చేసి
మా హృదయాలమీద క్రీస్తుని ముద్రిస్తావు
పూర్వం యజమానులు బానిసల భుజాలమీద తమ ముద్రవేసి
వాళ్ళను తమ యధీనంలో వుంచుకొనేవాళ్ళు
జ్ఞానస్నానానికి పూర్వం మేము
పిశాచమనే యజమానునికి చెందినవాళ్ళం
ఈ సంస్కారానంతరం క్రీస్తనే యజమానునికి చెందుతాం
మేము నిరంతరం క్రీస్తు భక్తులంగా జీవిస్తూ

ఆ దివ్యయజమానునికి ఊడిగం చేసేలా చేయి
మేము ఒకసారి విడనాడిన పిశాచ నాయకునికి
పాపకార్యాలద్వారా మరల దాస్యంచేయకుండావుండేలా చేయి

ఇంకా మేము జ్ఞానస్నానం పొందినప్పటినుండి
నీవు మా హృదయంలో ఓ దేవాలయంలోలాగ వసిస్తూంటావు
దేవుడెక్కడ వసిస్తే అదే దేవాలయం
కావున నీ సాన్నిధ్యంవలన మేము పవిత్ర మందిరానిమౌతాం
పూర్వం యెరూషలేము దేవాలయంలో భక్తులు
నిష్కళంకమైన గొర్రెపిల్లలను బలిగా అర్పించేవాళ్లు
అలాగే నీవు మమ్ముకూడ
పవిత్ర నైవేద్యంగా దేవుని కర్పిస్తావు
మాకు నిర్మలజీవితంమీద ప్రీతి పుట్టించు
పవిత్రుడైన దేవుణ్ణి కొలిచే మేముకూడ ఆ ప్రభువులాగే
పవిత్రులంగా జీవించే భాగ్యాన్ని ప్రసాదించు
కుమ్మరిపురుగు బురదలో తిరుగుతున్నా బురద దానికి సోకదు
తామరాకు నీటిలో మునిగి తేలుతున్నా నీరు దాని కంటదు
అలాగే మేము ఈ పాపపులోకంలో సంచరిస్తున్నా
లోకవాసన లంటకుండా జీవించేలా అనుగ్రహించు

ఇంకా జ్ఞానస్నానం పొందినప్పుడే
నీవు దేవుని ప్రేమను మా హృదయాలమీద కుమ్మరిస్తావు
బొక్కెనతో మొక్కలకు పాదునిండ నీళ్లు పోసినట్లుగా
నీవు మా యెదదలకు సమృద్ధిగా ప్రేమజలాన్ని పోస్తావు
దీనివల్లనే మేము దేవుణ్ణీ తోడినరుణ్ణీ
కొలదిగానైనా ప్రేమిస్తున్నాం
స్వార్థపరులమైన మేము ఇతరులను ప్రేమించడాని కొప్పుకోం
అన్యులది తీసుకోగోరుతాంగాని వాళ్ళకీయదానికి ఇష్టపడం
కాని నీవు దయచేసే ప్రేమశక్తివల్ల మా బుద్ధులు మారతాయి
మేము తోడివారిని అన్నదమ్ముల్లాగ, అక్కచెల్లెళ్లలాగ ఆదరిస్తాం
దేహంలోని అవయవాల నన్నిటినీ

ఆత్మ ఒక్కటిగా బంధించినట్లుగా
నానా వర్గాలతో కూడిన క్రైస్తవ ప్రజానీకాన్ని
దివ్యాత్ముడవైన నీవు ఒక్క ప్రేమసమాజంగా బంధిస్తావు
ఇది మానవమాత్రుల కృషివల్ల సిద్ధించే కార్యంగాదు
పాపపు మానవులు ఒకరినుండి వొకరు విడిపోతుంటే
పావనాత్ముడవైన నీవు ఒకరితో ఒకరిని ఐక్యపరుస్తావు
నీదివ్యప్రభావానికి మేము నీకు సదా కైమోడ్పులర్పిస్తాం.

## 28. ప్రార్థన నేర్పే ఆత్మ

రోమా 8,26-27, హెబ్రే 7,25. లూకా 11,1

పావనాత్మమా! మేము లోకవ్యామోహాల్లో
చిక్కుకొని ప్రార్థన చేయలేం
మా హృదయాలను ఈ మంటిమీదినుండి
మింటిమీదికి త్రిప్పుకోలేం
మా యీ బలహీనతను జూచి నీవు తల్లిలా జాలి జెందుతావు
నీ బిడ్డలమైన మాకు సహాయం చేయడానికి పూనుకొంటావు
ఎప్పుడు, ఎక్కడ, ఏలా ప్రార్థనచేయాలో మాకు తెలియకపోతే
నీవు మా తరపున ప్రార్థన చేస్తావు,
మాచే గూడ జపం చేయిస్తావు
తల్లి తాను నడుస్తూ పసిబిడ్డచే అడుగులు వేయిస్తూ
ఆ శిశువుకు నడవడం నేర్పించునట్లుగా వుంటుంది నీ పరిశ్రమ
నీవు మా హృదయాల్లో వుండి ప్రార్థన చేస్తూండగా
నరుల హృదయాలోచనలు తెలిసిన తండ్రి
ఆ ప్రార్థనను గ్రహిస్తాడు
మేము దేవుని చిత్తప్రకారం నడచుకోవాలని నీవుచేసే ప్రార్థన
తండ్రికెంతో ప్రీతి కలిగిస్తుంది,
అతడా వేడికోలు నంగీకరిస్తాడు
క్రీస్తు మోక్షంలో తండ్రి సమక్షంలో
మా తరపున ప్రార్థన చేస్తుంటే

నీవు మా హృదయాల్లోనే వుండి మాకొరకు మనవిచేస్తుంటావు
నాడు క్రీస్తు శిష్యులకు ప్రార్థనం నేర్పినట్లుగా
నేడు నీవూ మాకు జపం చేసికొనే విధానం నేర్పించు
మేము మాటలతో స్పష్టంగా చెప్పలేకపోయినా
మా భక్తిభావాలూ హృదయాలోచనలూ తండ్రికి తెలిసేలా చేయి
మేము ప్రార్థన అనే నిచ్చెనద్వారా
తండ్రివద్ద కెక్కిపోయేలానూ
ఆ నిచ్చెన ద్వారానే తండ్రి
మా వద్దకు దిగివచ్చేలానూ అనుగ్రహించు
మాకు ప్రార్థనమీద గాఢమైన కోర్కె పుట్టించు
మా జపానికొక రూపం దయచేసి దాన్ని వో తోటలా పెంచు
శతాబ్దాల పొడుగునా పునీతులకు ప్రార్థనం నేర్పింది నీవు
భక్తులచే దైవార్చన చేయించింది నీవు
సాధకులకు తాత్వికచింతనంమీద ప్రీతి పుట్టించింది నీవు
నేడు మమ్ముకూడ ప్రార్థనాతత్పరులనుగా తీర్చిదిద్దు
ప్రొద్దుతిరుగుడు పూవు సూర్యునివైపు తిరిగినట్లుగా
మా హృదయాలుకూడ భగవంతునివైపు తిరిగేలా చేయి
మేము ఇరుగుపొరుగువారిని గూర్చిన సుద్దులతో కాలక్షేపం చేయక
దేవుని సన్నిధిలో పవిత్రంగా కాలం గడిపేలా చేయి
విశేషంగా అనుదినం దివ్యగ్రంథాన్ని పారాయణం జేసికొంటూ
ప్రభువు సందేశాలను భక్తితో మననం జేసికొనేలా చేయి
నిరంతర వేదవాక్యచింతనం వలన
అమృతసిద్ధిని పొందేలా దయచేయి.

## 29. భక్తులను నడిపించే ఆత్మ

అచ 13,1-4. రోమా 8,14

ఆత్మమా! శ్రీసభ ప్రారంభకాలంలో
రెండు క్రైస్తవకేంద్రా లుండేవి
యెరూషలేము కేంద్రానికి పేత్రు యాకోబులు అధిపతులు

వీళ్లు యూదులేగాని అన్యజాతివాళ్లు
క్రైస్తవమతంలో చేరాలనుకోలేదు
అంతియోకయ కేంద్రానికి బర్నబా పౌలులు పెద్దలు
వీళ్ళు అన్యజాతి ప్రజలు కూడ
క్రైస్తవ ధర్మం చేపట్టాలనుకొన్నారు
ఓదినం అంతియోకయ సమాజంలో
క్రైస్తవులు ప్రార్థన చేస్తూండగా
బర్నబాను పౌలును నేను సంకల్పించిన పనికొరకు పంపండని
నీవొక భక్తునిచే ఆ ప్రార్థనాసమాజంలో ప్రవచనం చెప్పించావు
అచటి విశ్వాసులు నీ ప్రబోధాన్ని అర్థంచేసికొని
బర్నబా పౌలులను ప్రేషిత సేవకు పంపారు
వాళ్ళు వెళ్ళి యూదులుకాని అన్యజాతి ప్రజలకు
క్రీస్తుని బోధించారు
గ్రీకు రోమను ప్రజలకు జ్ఞానస్నానమిచ్చి శ్రీసభను వ్యాప్తిజేసారు
ఈలా నీవు నిరంతరం ప్రేషితులను వేదబోధకు పంపిస్తుంటావు
నీ ప్రేరణంవల్ల పూర్వం విదేశాలనుండి వచ్చిన గురువులు
మా ప్రాంతాల్లోగూడ వేదబోధ చేసి శ్రీసభను స్థాపించారు
వాళ్ళ చలవవల్ల నేడు మేము క్రైస్తవులంగా జీవిస్తున్నాం
ఈ పరమోపకారానికి కృతజ్ఞతగా మా తరపున మేము కూడ
సువిశేషబోధ చేసే వివేకాన్ని మాకు ప్రసాదించు
మాకు చేతనైన పద్ధతిలో మేము కూడ యిరుగుపొరుగువారికి
క్రీస్తును చాటిచెప్పాలనే కోర్కెను మా హృదయాల్లో పుట్టించు
మేము నోటిమాటలతో క్రీస్తును బోధించలేనప్పుడుగూడ
మామంచి జీవితంద్వారానే ఆ ప్రభువుకి సాక్ష్యం పలికేలా చేయి

ఇంకా నీవు మా అంతరాత్మలో వుండి మమ్ము నడిపిస్తుంటావు
పాడుపనులు చేయాలనుకొన్నపుడు
మా మనస్సాక్షి మమ్ము మందలిస్తుంది
మంచిపనులు చేసినపుడు మా అంతర్వాణి మమ్ము మెచ్చుకొంటుంది
నీవు నరుల హృదయాల్లో దీపంలా వెలుగుతూ

వారికి త్రోవ జూపుతూంటావు
ఓవైపు పిశాచం బిడ్డలను పిశాచం నడిపిస్తూంటే
మరోవైపు దేవుని బిడ్డలను దేవుని ఆత్మవైన నీవు నడిపిస్తుంటావు
నీ ప్రబోధాలను గుర్తించి మేము పాపమార్గంనుండి వైదొలగి
క్రీస్తు ఆదేశించిన పుణ్యపుత్రోవల్లో నడవాలి
మేము ఆరాధన ప్రార్థన సేవాది పుణ్యకార్యాల్లో మునిగి వున్నపుడు
నీవు మా అంతరంగంలో మెల్లని స్వరంతో మాటలాడుతూ
మాకు రకరకాల ప్రబోధాలు కలిగిస్తుంటావు
మేము అంతర్ముఖులమై నీవు చేసే యీ హెచ్చరికలను గమనించేలా చేయి
నీవు మా హృదయాల్లో పుట్టించే
మంచి కోర్కెలద్వారానే మమ్ము నడిపిస్తావు
మేమా కోర్కెలను క్రియలుగా మార్చుకొనే భాగ్యాన్ని ప్రసాదించు
విశేషంగా మేము బైబులు గ్రంథాన్ని చదివి ప్రార్థనచేసికొనేపుడు
ఆ వేదవాక్యాలద్వారా మా కర్తవ్యాన్ని మాకు తెలియజేయి
మా దైనందిన బాధ్యతలను మేము సంతృప్తికరంగా నిర్వర్తించేలా చేయి
ప్రియాప్రియ సంఘటనల్లోను దేవుని హస్తాన్ని గుర్తించేలాచేయి
మా ముఖ్యకార్యాలన్నిటిలోను నిన్ను సంప్రతించేలా చేయి
ఒకోసారి నీవు ఇతరుల పలుకులద్వారా మాతోమాటలాడినపుడు
వినయంతో మేమా మాటల భావాన్ని గ్రహించేలా చేయి
మేము మా నాయకుడివైన నీవెంట పయనించి తండ్రియింటిని జేరి
క్రీస్తు దివ్యముఖాన్ని దర్శించే మహాభాగ్యాన్ని దయచేయి.

## 30. పవిత్రాత్ముడు ఉన్నాడనికూడ తెలియకపోతే

యెష 11,1-2. గల 5,22. 1కొ 12,4-11. అచ 19.1-7,
ఎఫె 4,30. 1తెస్స 5,19.

పావనాత్మమా! క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొందిన మమ్ము
పవిత్రపరచడానికి నీవు మాకు సప్తవరాలు దయచేస్తావు
ప్రేమ సంతోషాది తొమ్మిది ఫలాలనుగూడ ప్రసాదిస్తావు
ఇంకా మేము క్రైస్తవ సమాజానికి సేవలు చేసి

శ్రీసభను ఓ భవనంలా నిర్మించి
వృద్ధిలోకి తీసుకరావడానికి
మాకు ప్రవచనం ఆరోగ్యదానం మొదలైన
సేవావరాలు అనుగ్రహిస్తావు
ఈలా నీవు నిరంతరం మాకు వెలలేని వుపకారాలు చేస్తూ
ఆధ్యాత్మిక జీవితంలో మమ్ము ముందుకు నడిపిస్తూంటావు
ఐనా మేము నిన్నట్టే పట్టించుకోం, నీ దివ్యనామాన్ని స్మరించం
నిన్ను గూర్చి మాకు సరిగా తెలియను గూడ తెలియదు
పూర్వం పౌలు ఎఫెసు పట్టణంలోని శిష్యులను
మీరు పవిత్రాత్మను పొందారా అని ప్రశ్నింపగా వాళ్ళు
పరిశుద్ధాత్ము డున్నాడన్న సంగతే మాకు తెలియదే అన్నారు
నేడు మాపరిస్థితికూడ యిలాగేవుందనడానికి సిగ్గుపడుతున్నాం
మేము కనీసం పునీతులపట్ల చూపే భక్తినైనా
దైవవ్యక్తివైన నీపట్ల చూపం
మాకు బైబులు గ్రంథంతో పరిచయం లేదు కనుక
రక్షణ చరిత్రో నీ స్థానమేమిటో అర్థం చేసికోలేం
క్రీస్తు తర్వాత నీవు మాకు రెండవ ఆదరణకర్తవనీ,
నీవు లేందే అసలు ఆధ్యాత్మిక జీవితమే లేదనీ గ్రహించలేం
మా యజ్ఞానాన్ని మన్నించి మాకు నీపట్ల భక్తిని పుట్టించు
పసిబిడ్డ తల్లి చెంతకులాగా మా యాధ్యాత్మికావసరాల్లో
మేము నమ్మకంతో నీ చెంతకు పరుగెత్తుకొని వచ్చేలా చేయి
మేము పాపకార్యాలకు పాల్పడి
మా అంతరంగాల్లో నెలకొనివుండే
పవిత్రమూర్తివైన నిన్ను దుఃఖపెట్టకుండా వుండేలా చేయి
నీ ప్రబోధాలను పెడిచెవిని బెట్టి
మా హృదయసదనంలో వెలిగే దివ్యజ్యోతివైన నిన్ను
అవివేకంతో ఆర్పివేసికోకుండా వుండేలా చేయి
నీవు వ్రాయించిన పరిశుద్ధ గ్రంథాన్ని అనుదినం
పారాయణం జేసికొని
మమ్ముగూర్చిన దైవచిత్తాన్ని గుర్తించి
పవిత్ర జీవితం గడపేలా చేయి.

# 31. దివ్య వైద్యుడు

మత్తయి 8,17. మార్కు 3,1-6

ప్రభూ! నీవు మా వ్యాధిబాధలను జూచి జాలిచెందావు
ప్రజలు నీయొద్దకు రోగులను తీసికొనిరాగా
నీవు కరుణతో వారిమీద చేతులుచాచి
వారి వ్యాధులను నయంజేసావు
కనుకనే "అతడు మన వ్యాధులను భరించాడు
మన బాధలను తన భుజాలమీద వహించాడు"
అని యెషయా నిన్ను గూర్చి ప్రవచించాడు
నరులు పనిచేయగూడని విశ్రాంతిదినాన గూడ
నీవు రోగులను పరామర్శించావు
బాధతో అలమటించే నరుణ్ణి ఆదుకోవడానికి
విశ్రాంతిదినం అడ్డుగా పరిణమించగూడదని నుడివావు
విశ్రాంతిదినం నరుల కొరకుగాని
నరులు విశ్రాంతిదినం కొరకుగాదు అని విశదీకరించి
నిన్నెదిరించిన యూదనాయకుల నోళ్లు మూయించావు
జబ్బులతో అల్లాడిపోయే ప్రజాసమూహానికి
అమృతహస్తాలతో ఆరోగ్యదానం జేసిన వైద్యుడివి నీవు
కనుక రోగపీడితులూ బాధామయులూ,
అపార్థాలకూ అన్యాయాలకూ గురైనవాళ్లూ,
ఒంటరితనంవల్లా నిరుత్సాహంవల్లా క్రుంగిపోయేవాళ్లూ,
బంధునష్టంవల్లా వియోగంవల్లా పరితపించేవాళ్ళూ,
పేదరికం తెచ్చిపెట్టే ఆకలిదప్పులవల్ల కృశించేవాళ్ళూ
మొదలైన నానావిధ దుఃఖార్తుల నందరినీ కరుణించు
ఆనాడు సిలువమీద నీవనుభవించిన బాధలద్వారా
నేటి మా వేదనలన్నిటికీ ఉపశాంతిని దయచేయి
పైగా తోడిప్రాణి యాతనలను జూచి
జాలిచెందే మెత్తని గుండెనుగూడ మాకు ప్రసాదించు.

# 32. విత్తనం మొలకెత్తినట్లే

మత్త 28,1-6. ఆది 2,7. రోమా 8,11. యోహా 6,54

ప్రభూ! నీ మృతదేహాన్ని సమాధిలో పదిలంచేసాక
ఆదివారం వేకువనే పుణ్యాంగనలు సమాధిని దర్శింపవచ్చారు
కాని అప్పటికే నీవు ఆత్మశక్తితో ఉత్థాన మయ్యావు
తొలుత తండ్రి పిడికెడు మట్టిముద్దలోనికి శ్వాస నూదగా
ఆ మృత్పిండం జీవించే ప్రాణి ఐంది, అతడే తొలి ఆదాము
మళ్లా తండ్రి నీ మృతదేహంలోనికి తన శ్వాస నూదాడు
ఆ శ్వాసే జీవశక్తిని ప్రసాదించే పరిశుద్ధాత్మ
ఆ యాత్మశక్తితోనే రెండవ ఆదామువైన నీవుకూడ
అద్భుతంగా ఉత్థానుడ వయ్యావు
తండ్రి ఏ ఆత్మతో మృతుడవైన నిన్ను సజీవుణ్ణి చేసాడో
ఆ యాత్మతోనే మాకుకూడ ఉత్థాన భాగ్యం దయచేస్తాడు
మాకు సరిగా అర్థం కాకపోయినా
ఈ సత్యాన్నేమో భక్తిభావంతో విశ్వసిస్తున్నాం
అసలు ఈ జగత్తంతా ఉత్థాన తేజస్సుతో భాసిల్లుతూంది
రోజూ సూర్యుడు అస్తమించి మళ్ళా ఉదయించడం లేదా?
రేయిరేయి నింగిని చుక్కలు పొడవడం లేదా?
భూమిలో నాటిన విత్తనం మొలకెత్తడం లేదా?
నరికి నేలలో పాతిన కొమ్మ మళ్ళా బ్రతికి పెరగడం లేదా?
ఆకురాల్చిన చెట్లు మళ్ళా చిగిర్చి పూలుపూయడం లేదా?
అలాగే మంటిలో పాతిపెట్టిన దేహం మాత్రం
మళ్ళా యెందుకు లేవకూడదు?
విత్తనంలో జీవశక్తి వుండబట్టే అది మళ్ళా మొలకెత్తుతూంది
దేహంలో మాత్రం అలాంటి జీవశక్తి లేదా?
నీ వేమని బోధించావు?
నా శరీరాన్ని భుజించేవాణ్ణి నే నంతిమదినాన లేపుతానన్నావు
కనుక ఆ దివ్యసత్ప్రసాదమే
మా దేహమనే బీజంలోని జీవశక్తి ఔతుంది
అదే అద్భుతమైన ఆత్మశక్తి కూడ
శిథిలమై భూగర్భం చేరిన మా తనువు ఆ దివ్యశక్తితోనే
అంతిమ దినాన మళ్ళా ఓ విత్తనంలా మొలకెత్తుతుంది
మృత్యుంజయుడవైన నీవల్ల మాకు ఉత్థానప్రాప్తి సిద్ధిస్తుంది.

# 33. మోక్షారోహణమూర్తి

యోహా 13,1.17, 1-5, హెబ్రే 8,1-2. కొలో 3,1-2.

ప్రభూ! నీవు ఈ లోకాన్నివీడి తండ్రిచెంతకు వెళ్ళే గడియ
సమీపించిందని గుర్తించి మింటివైపు కన్నులెత్తి
"తండ్రీ! ఇక నీ తనయుని మహిమపరచు
నీవు నా కప్పగించిన పని పూర్తిచేసాను
నేను నిన్ను మహిమపరచినట్లే నీవూ నన్ను మహిమపరచు"
అని విన్నవించావు - ఆ ప్రార్థనా ఫలితమో అన్నట్లు
తండ్రి నిన్ను సిలువమీద మహిమపరచాడు
నీకు ఉత్థాన మహిమను దయచేసాడు
తదనంతరం నీవు శిష్యులతో ఓలివు కొండకు వెళ్ళి
అక్కడి నుండి మోక్షారోహణం చేసావు
దివ్యతేజస్సుతో మేఘమండలాన్ని చీల్చుకొని
స్వర్గసీమ కెగసిపోయి దివ్యధామాన్ని చేరుకొన్నావు
ఠీవితో తండ్రి కుడిపార్శ్వాన సింహాసనాసీనుడవయ్యావు
ఈలా నీవు దివ్యలోకాన్ని ప్రవేశింపగా నీ భక్తులమైన మేము
ఇంకా ఈ మంటిమీదనే జీవితయాత్ర సాగిస్తున్నాం
కాని నీలోనికి జ్ఞానస్నానం పొందిన మేము కూడ
ఓనాడు నిన్ను చేరుకొంటాం, నీ వైభవంలో పాలుపొందుతాం
కనుక మేమీ లోకంలో వసిస్తూన్నపుడు కూడ
స్వర్గంలో సింహాసనాసీనుడవై యున్న నీవైపు దృష్టి మరల్చాలి
ఈ యిహలోక వస్తువ్యామోహం నుండి వైదొలగి
ఆ దివ్యలోక సౌభాగ్యాలమీద మనసు లగ్నం చేసికోవాలి
నీ భక్తుడైన ఇరినేయుసు నుడివినట్లుగా
మృగాలు తల నేలవైపు వంచి నడుస్తాయి
ఆ నడక ద్వారానే అవి
తామీ మంటిలో కలిసిపోతామని సూచిస్తాయి
కాని నరుడొక్కడు మాత్రం శిరస్సు పైకెత్తి నడుస్తాడు
ఆ నడక ద్వారానే అతడు
తాను ఊర్ధ్వలోకానికి చెందినవాడనని సూచిస్తాడు
కావున మోక్షారోహణమూర్తివైన ప్రభూ! నీ భక్తులమైన మాకు
ఈ మంటి కట్టిపెట్టుకొని బ్రతికే దౌర్భాగ్యం పట్టనీకు
నిరంతరం స్వర్గసంపదల నాశించే భాగ్యం దయచేయి.

# 34. క్రీస్తుతో ఐక్యత

యోహా 15,1-6. 1కొ 12,27. 1పేత్రు 2,4-5.

ప్రభూ! జ్ఞానస్నానం ద్వారా మేమంతా నీతో
ఐక్యమౌతామని చెప్పడానికి
నీ భక్తులైన దివ్యగ్రంథ రచయితలు
మూడుపమానాలు వాడారు
యోహాను చెట్టూకొమ్మలు అనే సాదృశ్యం చెప్పాడు
కొమ్మలు చెట్టుకు అతుక్కొని వుంటాయి
చెట్టు సారం కొమ్మలలోనికి ప్రసరింపగా
అవి పూలుపూచి కాయలు కాస్తాయి
అలాగే మేముకూడ నీతో ఐక్యమౌతాం
అప్పుడు నీసారమనే వరప్రసాదం మాలోనికి ప్రసరిస్తుంది
ఫలితంగా మేము యోగ్యమైన దివ్యజీవితం గడుపుతాం
చెట్టునుండి నరికివేసిన కొమ్మలు
నిలువున యెండిపోతాయి
అలాగే నీనుండి వేరయినప్పుడు
మేముకూడ నిష్ప్రయోజకులమై పోతాం.

పౌలు దేహం అవయవాలు అనే దృష్టాంతం చెప్పాడు
చాలా అవయవాలు దేహానికి అతుక్కుని వుంటాయి
ఆ యంగాలన్నిటికీ నాయకత్వం వహించేదీ
వాటిని చైతన్యవంతం చేసేదీ శిరస్సే
అవయవాలూ శిరస్సూ అన్నీ కలసి ఒక్క శరీరమౌతాయి
అలాగే మేముకూడ అవయవాల్లాగ
నీలోనికి అతుక్కొని పోతాం
నీవూ మేమూ కలసి ఒక్క ఆధ్యాత్మిక శరీరమౌతాం
ఈ దేహానికి మేము అంగాలమైతే నీవు శిరస్సువి
మమ్ము నడిపించే నాయకుడివి నీవే
మాకు జీవశక్తి నొసగేదీ నీవే.

పేత్రు పునాదిరాయీ దానిమీదిరాళ్ళు అనే పోలిక చెప్పాడు
పునాదిరాతితో మందిరం ప్రారంభమౌతుంది
దానిమీద ఇతర శిలలను పేర్చుకొంటూ పోతారు
మూలరాయీ దానిమీద పేర్చిన యితరశిలలూ కలసి

ఓ సుందరమైన దేవళంగా తయారౌతాయి
నీవు పునాది రాయివైతే మేము దానిమీద చేరిన రాళ్ళం
దేవళంలోని రాళ్ళన్నీ మూలరాతిమీద ఆధారపడినట్లే
మేమందరమూ నీ మీద ఆధారపడి జీవిస్తాం
నీవూ మేమూ అందరమూ కలసి ఓ మందిర మౌతాం
ఆ మందిరంలో తండ్రికి ఆరాధన చెల్లిస్తాం
నీవూ మేమూ కలసి యేర్పడిన క్రైస్తవసమాజమే
ఈ సుందర మందిరం.

## 35. చూడకుండానే విశ్వసించేవాళ్ళు

యోహా 20,24-29. హబుక్కూకు 2,4

భగవంతుణ్ణి శంకించేవాళ్ళు ఎప్పుడూ వుండనే వుంటారు
అలాంటివాళ్ళల్లో శిష్యుడు తోమాకూడ వొకడు
"నేను క్రీస్తు హస్తాల్లోని చీలగంట్లల్లో వ్రేళ్ళు జొన్పితేనేగాని
అతని ప్రక్కగాయంలో చేయిపెట్టి చూస్తేనేగాని
ఆ ప్రభువు ఉత్థానాన్ని నమ్మను"
అని అతడు శిష్యులతో వాదించాడు
ఎన్మిదిరోజులు గడిచాక, తోడి శిష్యులూ తోమా అందరూ
తలుపు మూసికొని గదిలో ప్రార్థన చేసికొంటూండగా
ప్రభూ! మూసిన ద్వారంగుండానే నీవా గదిలో ప్రవేశించావు
తోమాతో "బాబూ! నాచేతి గంట్లల్లో నీ వ్రేళ్ళు జొన్పించు
నా ప్రక్క గాయంలో నీ చేయి పెట్టిచూడు
ఇకనైనా ఈ యవిశ్వాసాన్ని వదలుకో" అన్నావు
ఆ శిష్యుడు భక్తిభావంతో "స్వామీ! నీవే నా ప్రభువువి
నీవే నా దేవుడవు" అంటూ నీ ముందట చాగిలపడ్డాడు
నీవతనితో "ఓయి! నీవు నన్ను చూచావు కనుక నమ్మావు
కాని చూడకుండా నమ్మేవాళ్ళు మరీధన్యులు" అని నుడివావు
ప్రభూ! నేనుకూడ కొన్నిసార్లు ఈ తోమాలాగే ప్రవర్తిస్తాను
వేదసత్యాలను శంకిస్తాను, దివ్యగ్రంథాన్ని సందేహిస్తాను,
పునీతుల చరిత్రలనూ భక్తుల అద్భుతాలనూ అనుమానిస్తాను,
ఎవరైనా నీవు తమకు సాక్షాత్కరించావని చెప్తే
అవన్నీ కల్లబొల్లి కబుర్లేమో ననుకొంటాను,
మతాచరణమూ భక్తీ ఓ విధమైన భ్రమయేమో ననుకొంటాను

తరతరాలబట్టి నరులంతా ప్రమాదపడుతున్నారనుకొంటాను
కాని నిన్ను నాబుద్ధి శక్తితోనే అర్థం చేసికోగలనా?
విశ్వాసంద్వారా కాదా? ప్రవక్త నుడివినట్లు
విశ్వాసంతో జీవించేవాళ్లు కాదా పుణ్యపురుషులు?
కనుక ప్రభూ! నీ మహిమ అల్పమైన నా బుద్ధి కందదనీ
నిన్ను నమ్మడంలో మౌఢ్యం ఏమీలేదనీ
నేను గుర్తించేలా చేయి.

## 36. గడెమీది పాము

సంఖ్యా 21,4-9. యోహా 3,14-15. మత్త 1,21

ప్రభూ! యిస్రాయేలీయులు ఎడారిలో ప్రయాణంచేస్తూ
అక్కడి కూడు గిట్టక మోషేమీద తిరగబడ్డారు
దానికి శిక్షగా విషసర్పాలు వచ్చి వాళ్ళను కరచాయి
అప్పుడు మోషే నీ యాజ్ఞపై కంచుపాముని చేసి
గడెమీద వ్రేలాడగట్టి ప్రజలకు చూపించాడు
సర్పదష్టులు నీమాటను నమ్మి ఆపామువైపు చూడగా
విషం విరిగి బ్రతికిపోయారు
ఆనాడు కంచుపాము వాళ్ళను బ్రతికించలేదు
నీమాటను నమ్మినవాళ్ళను పాముద్వారా నీవు బ్రతికించావు
ఇక క్రీస్తుని కూడ ఆ పామునిలాగే సిల్వమీది కెత్తారు
పూర్వవేద ప్రజలు ఆ పామువైపు చూచి బ్రతికిపోయినట్లే
నూత్నవేద ప్రజలమైన మేముకూడ ఆ క్రీస్తువైపు చూచి -
అనగా సిల్వమీద వ్రేలాడే క్రీస్తుని విశ్వసించి - బ్రతికిపోతాం
తన్ను విశ్వసించినవాళ్ళకు క్రీస్తు నిత్యరక్షణం దయచేస్తాడు
అతనిపేరు యేసు, ఆ పేరుకి రక్షకుడనే అర్థం
పాపవిషాన్నుండి నరులను రక్షించే ప్రభువతడు
అతని సిలువకూడ ఓ జెండాలాగ అందరినీ ఆకర్షిస్తుంది
కాని అతడు తనంతట తాను రక్షకుడైనా
మామట్టుకు మాకు రక్షకుడు కావచ్చు, కాకపోవచ్చు గూడ
చెట్టుమీదిపండు కోసికొంటేనేగాని మాదికాదు,
అంగటిలోని మిఠాయి కొనుక్కొంటేనేగాని మాదికాదు
అలాగే మా తరపున మేము క్రీస్తును విశ్వసిస్తేనే గాని
ఆ ప్రభువు మాకు రక్షకుడు కాడు

ఆ పరిశుద్ధమూర్తికి హృదయాన్నర్పించుకొంటేనేగాని
అతడు పాపమాలిన్యాన్నుండి మమ్ము శుద్ధి చేయడు
కనుక తండ్రీ! నిన్నూ నీవు పంపగావచ్చి సిల్వనెక్కిన క్రీస్తునీ
మేము గాఢంగా విశ్వసించే భాగ్యాన్ని దయచేయి
ఈ విశ్వాసంద్వారానే బ్రతికిపోయే వరాన్ని గూడ ప్రసాదించు.

## 37. సానుభూతికల యాజకుడు

హెబ్రే 2,14-18. 4,14-16. 7,25

ప్రభూ! మా ప్రధానయాజకుడవైన నీ వేలాంటివాడివి?
నీవు దేవదూతల కుటుంబంలోకాక
ఆదాము సంతతిలో అవతరించావు
ఎందుకు? మా బలహీనతలనూ బాధలనూ
అనుభవపూర్వకంగా తెలిసికోవాలనే నీ కోరిక
మానవుడవైనందున మా శ్రమలకూ మరణానికీ నీవూ గురయ్యావు
కాని ఆ మరణాన్ని జయించి మాకు అమరత్వం దయచేసావు
అలాగే మా శోధనలకుగూడ నీవు తలొగ్గావు
కాని శోధలన్నిటిని జయించి
పిశాచంమీద మాకు విజయం ప్రసాదించావు
ఈలా సమస్త విషయాల్లోను నీవు
నీ సోదరులమైన మాలాంటివాడి వయ్యావు
ఒక్క పాపంలో దప్పితే నీకూ మాకూ వ్యత్యాసం లేదు
మా ప్రధానయాజకుడవైన నీవు
బలహీనులమైన నీ యీ తోబుట్టువులపట్ల
సానుభూతి చూపలేనివాడివి కాదు
మా యవకతవకలను జూచి మమ్మసహ్యించుకొనేవాడివీ కాదు
పైపెచ్చు మేమెంత దుర్బలులమో
అంతగా మమ్ము కరుణించేవాడివి,
అంతగా మమ్మాదుకొని పైకి లేవనెత్తేవాడివి
ఎందుకంటే నీవు మా జన్మనెత్తి మా దౌర్భాగ్యాలకు గురై
మాపట్ల జాలి చూపడం నేర్చుకొన్నావు
ఇంకా నీవు మమ్మెప్పుడూ చీదరించుకోవు
కనుక నీవు తండ్రి సమక్షంలో వుండి
మాకోసం నిరంతరమూ విజ్ఞాపనం చేస్తూంటావు

ఆ ప్రార్థనా ఫలితంగా మేము పడిపోయికూడ మళ్ళా లేస్తాం
ఈలాంటి యాజకుడవైన నిన్ను ముందుబెట్టుకొనే
మా బాధల్లో మే మా తండ్రిని సమీపిస్తాం
కృపాసింహాసనంమీద ఆసీనుడైయున్న ఆ దయానిధి
నిన్నుజూచి మమ్ము నెనరుతో ఆదరిస్తాడు
సమయోచితమైన వరప్రసాదంతో మమ్మాదు కొంటాడు
యాజకుడవూ యజ్ఞపశువివీ ఐన ప్రభూ!
నీతో ఐక్యమై తండ్రిని అర్చించే భాగ్యం మాకు దయచేయి.

## 38. అహాన్ని జయిస్తేనేగాని

యోహా 12,24-25.15, 2.16,21, మత్త 16,24-25

ప్రభూ! నరుడు తన్నుతాను పరిత్యజించుకోందే ఫలితం లేదు
మాలోని స్వార్థం చావందే మేమేమీ సాధించలేం
ఈ సత్యాన్ని బోధించడానికి నీ వెన్నో ఉపమానాలు చెప్పావు

గోదుమగింజ భూమిలో పడనంతవరకు ఒంటిగానే వుంటుంది
కాని ఓమారు నేలలోపడి చివికిపోతే
మొలకెత్తి దుబ్బువేసి సమృద్ధిగా ఫలిస్తుంది

ద్రాక్షతీగకు కత్తిరింపువేస్తే అది యేపుగా యెదిగి
తీయని కాయలు గుత్తులుగుత్తులుగా కాస్తుంది

స్త్రీ మొదట ప్రసవవేదన ననుభవిస్తేనేగాని
బంగారు బిడ్డను కని మురిసిపోదు

కనుక శ్రమపడందే ఫలితం లేదు, చావందే జీవంలేదు
అందుకే గాబోలు నీవు శిష్యులతో
తన ప్రాణాలు కాపాడుకొనేవాడు నశిస్తాడనీ
తన ప్రాణాలు వదలుకొనేవాడు బ్రతుకుతాడనీ చెప్పావు
ప్రభూ! మా మట్టుకు మాకు ఈ సత్యం సులువుగా బోధపడదు
స్వార్థంకొద్దీ మాలోని అహాన్ని
భద్రంగా సంరక్షించుకోగోరుతాం
అయహాన్ని మురిపించుకొనే ప్రయత్నంలో సర్వనాశమౌతాం
మరి నీవేమి చేసావు?
నీవు విత్తేవాడివీ విత్తనానివీ కూడ

నిన్ను నీవే సిలువమీద ఆత్మార్పణం చేసికొని
సమాధి అనే సారవంతమైన క్షేత్రంలో
ఓ విత్తనంలా నాటుకొన్నావు
ఆ క్షేత్రంనుండే మళ్లా ఓ అంకురంలా మొలకెత్తావు
ఉత్థానమనే పంట పండావు నూరంతలుగా
ఈలా చావులోనే జీవం వుందని నిరూపించావు,
స్వార్థత్యాగంలోనే విజయసిద్ధి వుందని ధ్రువపరచావు.
అహాన్ని జయిస్తేనేగాని అమృతసిద్ధి లేదని రుజువుచేసావు
నీ కృపవల్ల ఈ వొక్క సత్యాన్ని
మేము జీర్ణంచేసికొంటేచాలు
పండిన పండపొలంలా మా జీవితంకూడ ధన్యమౌతుంది.

## 39. సిలువను చేకొనడం

లూకా 9,23-24

ప్రభూ! నీవు "నా శిష్యుడు కాగోరేవాడు
తన్ను తాను నిరాకరించుకొని
అనుదినం తన సిలువను మోసికొంటూ
నా వెంట రావాలి" అని బోధించావు

నీ బోధల్లో దీనికి మంచింది లేనేలేదు
గురువు కొకత్రోవా శిష్యుడి కింకోత్రోవా వుంటుందా?
నీవు బాధామయ మార్గంలో నడచిపోయావు
కనుక నీ యనుచరులకు కూడ అదే మార్గం

తన్ను తాను నిరాకరించుకోందే
తనకుతాను చనిపోందే
జీవమెక్కడిది?

తన సిలువను తాను చేకొనందే
తాను కష్టపు త్రోవను త్రొక్కందే
ఉత్థానపు మహిమ యెక్కడిది?

నీ మరణోత్థానాలను
మా జీవితంలో ప్రతిబింబించుకోందే
నిత్య జీవనమెక్కడిది?

"క్రీస్తు మొదట శ్రమలనుభవించిగాని
ఆ పిమ్మట మహిమను పొందడు" -
ఎన్నేండ్లు జీవించినా ఏమేమి సాధించినా
నీ శిష్యులమైన మాకు కూడ
ఇదే శాశ్వత సూత్రం.

## 40. మన తల్లి

యోహా 19,26-27

క్రీస్తూ! నీ వానాడు కొండకొమ్మున వ్రేలాడుతూ
సిల్వచెంత నిల్చియున్న నీ తల్లి మరియను
శిష్యుడు యోహానుకి తల్లిగా ఒప్పగించావు
ఆ శిష్యుడు మా కందరికీ ప్రతినిధిగా వుంటాడు కనుక
ఆ పునీతమాత మా కందరికీ తల్లి అయింది
ప్రభూ! నీవు మాకు చాల వరాలను దయచేసావు
కాని మీ యమ్మనే మాయమ్మగా బడయడం
నీవు ప్రసాదించిన వరాలన్నిటిలోను ఉత్తమమైంది
నీకు అత్యంత ప్రీతిపాత్రురాలైన మాతృమూర్తి
మాకూగూడ గారాబుతల్లి కావడం సామాన్యభాగ్యమా?
నేడు నీ శిష్యుల్లో కొందరు ఆ తల్లిని అంగీకరించరు
నీ తల్లిని గౌరవిస్తే నిన్నగౌరవించినట్లే నంటారు
నీ వొక్కడివే మధ్యవర్తివని వాదిస్తారు
వాళ్ళ చాదస్తంగాని
తల్లిని మెచ్చుకొంటే మెచ్చుకోని తనయుడుంటాడా?
మేము తన్ను కొనియాడినప్పుడు
మరియమాత్రం ఏం చేస్తుంది?
ఆ తల్లి మమ్ము ఆదరంతో నీ చెంతకే చేరుస్తుందికాని
తన చెంతకు రాబట్టుకొని సంతోషించదు కదా?
మమ్ము నీకడకు చేర్చే తల్లి మాన్యురాలెందుకు కాదు?
ఇంటిలో తల్లిలేని పిల్లలకు దిక్కూమొక్కూ వుండదు
మరియ అనే తల్లి లేని పిల్లలకు అలాంటి దుర్గతే పడుతుంది
ప్రభూ! లోకంలోని అందరు కుమారుల్లాగే
నీవూ నీ తల్లిని గౌరవించావు, ప్రేమించావు,
ఇతరులూ ఆమెను గౌరవించాలని కోరుకొన్నావు

కనుక నీవు మీయమ్మను ఎంతగా గౌరవించి ప్రేమించావో,
మేమూ ఆ తల్లిని
ఎంతగా గౌరవించి ప్రేమించాలని కోరుకొన్నావో
అంతగానే ఆమెను గౌరవించి ప్రేమించే భాగ్యం
నీ శిష్యులమైన మాకు ఏ ప్రొద్దూ దయచేయి.

## 41. క్రీస్తు ప్రార్థనం

మార్కు 1,35. మత్త 14,23. లూకా 6,12.
మత్త 6,5-6. లూకా 11,1-2.

ప్రభూ! నీ ప్రార్థనాపద్ధతిని పరిశీలిస్తే
మాకు కూడ భక్తి భావం పుట్టుకవస్తుంది
నీవు వేకువజాముననే లేచి
నిర్జనప్రదేశానికి వెళ్ళి ప్రార్థించేవాడివి
కొండపైకెక్కి యేకాంతంగా
తండ్రిని ధ్యానించుకొనేవాడివి
రాత్రియంతా జపంలో గడిపేవాడివి
పదిమంది కంటబడేలా కాకుండ
రహస్యంగా ప్రార్థనచేయడం నీకిష్టం
నీ ప్రార్థనకు మురిసిపోయి శిష్యులు
"స్నాపక యోహాను తన శిష్యులకు మల్లె
నీవూ మాకు ప్రార్థన నేర్పు" అని అడిగారు
అప్పుడు నీవు దేవుని చనువుతో "నాన్నా" అని పిలిస్తే.
నరుడు దేవునికి చిత్తానికి లొంగి జీవిస్తే
అది ఉత్తమ ప్రార్థన మౌతుందని చెప్పావు

ప్రభూ! ఎప్పుడు, ఎక్కడ, ఏలా జపించాలో
మా కట్టే తెలియదు
కాని జపించాలనే కోరికమాత్రం
మా హృదయంలో గాఢంగా వుంది
నాడు శిష్యులకు మల్లె నేడు మాకుగూడ
నీవే ప్రార్థనం నేర్పు
నీ యాత్మ మా హృదయాలను మేలుకొల్పి
వానిలో నుండి ప్రార్థన పెల్లుబికివచ్చేలా దయచేయుగాక.

# 42. అడగండి

లూకా 11,9-13. మార్కు 14,36

ప్రభూ! నీవేమన్నావు? "నా పేరిట మీరేమి యడిగినా
తండ్రి మీకు తప్పక దయచేస్తాడు
కుమారుడు ఆకలిగొని రొట్టెనడిగితే
తండ్రి రాతినీయడు గదా?
అలాగే చేపనడిగితే పాము నీయడు గదా?
ఈలా భూలోకంలోని తండ్రులు తమపిల్ల లడగగానే
హితకరమైన వస్తువుల నిస్తూంటే
పరలోకంలోని తండ్రి మాత్రం తన్నడిగే భక్తుల
కోర్కెలు తీర్చకుండా వుంటాడా?
కనుక అడగండి ఆ తండ్రి మీకు దయచేస్తాడు,
తట్టండి అతడు మీకు తలుపు తెరుస్తాడు,
వెదకండి మీకు కావలసింది దొరుకుతుంది"
అని బోధించావు - సరే బాగానే వుంది
ఐనా మాకో సందేహం సుమా!
ఒకోమారు మేము ఎంత ప్రాధేయపడి అడిగినా
ఆ తండ్రి మామొర విన్పించుకొన్నట్లయినా కన్పించడు
ఇంకా ఆనాడు నీవు ఓలివు తోపులో చాగిలపడి
"నాన్నా! ఈలాంటి శ్రమకు నన్ను గురిజేయకు
ఐనా నీ చిత్తంగాని నా చిత్తంగాదు" అని మనవిచేస్తే
మరి ఆ తండ్రి నీ శ్రమను వీసమైన తొలగించలేదేం?
అతడు నిర్ణయించినట్లుగా నీవు సిలువనెక్కవలసి వచ్చిందేం?
ఇక్కడేదో రహస్యం ఉండివుండాలి కదూ?
అడగడానికేం జనం ఏదైనా అడుగుతారు
కాని తామడిగేది మంచిదో కాదో యెందరికి తెలుసు?
మేము వేడేది మాకూ మాతోడివారికీ మేలు చేయనపుడు,
దైవచిత్తానికి సమ్మతం కానపుడు,
మేము వేయిసార్లు వేడినా ఆ తండ్రి విన్పించుకోడని
దీన్నిబట్టే విశదం గావడంలేదూ?

# 43. జీవితంలో తుఫానులు

మత్త 8,23-27

ప్రభూ! నీవు శిష్యులతో గలసి
గలిలయ సరస్సులో ప్రయాణం చేస్తూండగా
పెనుతుఫాను పట్టుకొని అలలు ఉవ్వెత్తుగా లేచాయి
ఓడ అతలాకుతలమై మునిగిపోవడానికి సిద్ధమైంది
అప్పుడు నీవు నావలో ఓ మూల పండుకొని నిద్రపోతూండగా
శిష్యులు భయకంపితులై నీ చెంతకు వచ్చి నిన్ను నిద్రలేపారు
ప్రాణాపాయంలో వున్నాం మమ్ము రక్షింపమని మనవిచేసారు
నీవు వాళ్ళకు ధైర్యంచెప్పి తుఫానునూ సాగరాన్ని శాసింపగా
గాలివాన సమసిపోయి వాతావరణం ప్రశాంతమైంది
ఈలా ప్రకృతి శక్తులుకూడ నీకు లొంగడంజూచి
శిష్యులు నిన్ను వేనోళ్ళ కొనియాడారు
ఈ సంఘటనాన్ని మననం జేసికొంటూంటే
నేడు మా జీవితంలో సంభవించే తుఫానులు జ్ఞప్తికివస్తున్నాయి
ఏవేవో వ్యాధిబాధలు మమ్ము నిరంతరం క్రుంగదీస్తుంటాయి
పేదరికంవల్లా చాలీచాలని జీతాలవల్లా తీరని యప్పులవల్లా
మేము నానాయాతన లనుభవిస్తూంటాం
ఓవైపు మా శత్రువులు నిర్దయతో మమ్ము పీడిస్తూంటే
మరోవైపు మా మిత్రులు మాకు ద్రోహంచేసి
దుఃఖం కలిగిస్తూంటారు
తలవని తలంపుగా కలిగిన అపార్థాలవల్ల
మనసు వికలమౌతూంటుంది
ఎదిగిన పిల్లలు మాట విననందునా
ఒకోసారి తల్లిదండ్రులమైన మాకే మనసులు కలవనందునా
కుటుంబంలో శాంతి అంతరించి యిల్లు నరకప్రాయమౌతుంది
ఇంకా మాకు నీమీద ఉండవలసిన భక్తి లేనందునా
మేము నీ వరప్రసాదానికి నోచుకోనందునా
మా హృదయాల్లో సంతోషమూ సంతృప్తీ కరవైపోతూంటాయి
మా జీవితాలు ఎండిన నేలలాగ
మోడువారిన చెట్టులాగ తయారౌతాయి
మేము నీ చెంతకు రాగోరిగూడ నీకు దూరమౌతూంటాం,
ఈలాంటి పెనుతుఫానులు మా జీవితంలో చాలా వస్తూంటాయి

ఈలాంటి భీకరతరంగాలు
మా సంసారసాగరంలో చాలా చెలరేగుతూంటాయి
కాని ఈలాంటి విపత్తులకు గురైనపుడు
ఆ శిష్యుల్లాగే మేమూ నీకు మొరపెట్టాలి
మా శక్తికి మించిన శ్రమలు మమ్ము నలగద్రొక్కుతున్నాయి
నీ వాదుకోకపోతే మాకు దిక్కులేదని
నీకు మనవి చేసికోవాలి
ఈలా నిన్నర్థిస్తే నీవు మా యిక్కట్టులను తీర్చనైనా తీరుస్తావు,
లేదా ఆవేదనలను భరించే శక్తినైనా మాకు ప్రసాదిస్తావు
మేము నీ దివ్యచిత్తానికి లొంగి నీవు పంపే సిలువలను
మంచి మనసుతో స్వీకరించే సద్బుద్ధిని దయచేస్తావు
అసలు మమ్ము నీ చెంతకు రాబట్టుకోడానికే
నీవు మాకు ఆయా ఆపదలను పంపిస్తూంటావు
తుఫానులు సోకందే మాలో చాలమంది నీచెంతకురారు
కనుక నీవు మాకు పంపే కష్టాలను నీ పిలుపులనుగా భావించి
మా బాధలన్నిటిలోను భక్తజనశరణ్యుడవైన నిన్నాశ్రయించి
నీ ముందట వినయంతో మోకరిల్లే
మహాభాగ్యాన్ని ప్రసాదించు.

## 44. విజ్ఞాపనం

అచ 12,1-10. యాకోబు 5,16.

ప్రభూ! హేరోదు క్రూరబుద్ధితో పేత్రుని చెరలో త్రోయించి
కత్తితో పొడిచి చంపడానికి సంసిద్ధుడయ్యాడు
అప్పుడు యెరూషలేములోని భక్తసమాజం నీకు మొరపెట్టింది
ఆ విజ్ఞాపనం ఫలితంగా నీవొక దేవదూతను పంపగా
అతడు పేత్రుని చెరనుండి విడిపించాడు
కావలకాసేవాళ్లు కాస్తూండగానే
చెరసాల తలుపులు వాటంతట అవే విచ్చుకొన్నాయి
పేత్రు సురక్షితంగా కారాగారంనుండి వెలుపలికి వచ్చాడు
అలా భక్తుల విజ్ఞాపనంవల్ల అతడు బ్రతికిబయటపడ్డాడు
మేము సాంఘిక వైద్య విద్యాది నానాసేవలు చేస్తూంటాం
అన్నదానమూ శ్రమదానమూ విత్తదానమూ చేస్తూంటాం
కాని ఈ దానాలు ఈ సేవలకంటె

ప్రార్థనాసేవ తక్కువదేమీ కాదు అనడానికి
పై పేత్రు దృష్టాంతమే తార్కాణం
సత్పురుషుల ప్రార్థనం మహాశక్తితో పనిచేసి
ఇక్కట్టులో వున్నవాళ్ళ ఆపదలను తొలగించితీరుతుంది
కనుక మేము నిరంతరం తోడివారికొరకు నీకు మనవి చేయాలి
మేము చదువుచెప్పే పిల్లలకు పాఠాలు చెప్తేనే చాలదు
వాళ్ళ శ్రేయస్సుకొరకు ప్రార్థనలు కూడ చేయాలి,
మేము పరామర్శించే రోగులకు మందులిస్తేనే చాలదు
వాళ్ళ ఆరోగ్యంకొరకు విన్నపాలుకూడ చేయాలి,
మేము సాంఘిక సేవచేసే పేదలకు వస్తువులనిస్తేనే చాలదు
వాళ్ళ అభివృద్ధికొరకు వేడికోళ్లనుగూడ అర్పించాలి,
ఇంకా మా మిత్రులూ శత్రువులూ ఇరుగుపొరుగువాళ్ళూ
బ్రతికివున్నవారూ చనిపోయినవారూ అందరికొరకూ
రోజురోజు భక్తితో నీ ముందట మోకరిల్లుతూండాలి
అలా ప్రణమిల్లితే నీవు మా మొరలాలించి
బాధార్తుల శ్రమలు తీరుస్తావు
రేపు మేము ఇక్కట్టుల్లో వున్నపుడు
కొందరు భక్తులను ప్రేరేపించి
వాళ్ళు మాకొరకు ప్రార్థనలర్పించేలా అనుగ్రహిస్తావు కూడ.

## 45. పదిమందిలో ఒక్కడు

లూకా 17,11-19. అచ 12,21-23

ప్రభూ! నీవు పదిమంది కుష్ఠరోగులకు వ్యాధి నయంచేస్తే
వాళ్ళల్లో ఒక్కడు వచ్చి నీకు ధన్యవాదాలర్పించాడు
ఆ వచ్చినవాడుకూడ యూదుడు కాదు
సంకరజాతి సమరయుడు
ఈ సంఘటనకు నీవు మనసునొచ్చుకొని నిట్టూర్పు విడిచావు
"తతిమ్మా తొమ్మిదిమంది యేమయ్యారు
దేవుణ్ణి స్తుతిద్దామనే బుద్ధి వాళ్ళకు పుట్టనేలేదా?" అన్నావు
కాని అవి మంచిరోజులు కనుక
పదిమందిలో ఒకడైనా కృతజ్ఞతాపరుడు తగిలాడు
ఈ కాలంలో ఐతే నూర్గురిలో ఒకడైనా అలాంటి వాడుండడేమో!
ఈ సంఘటనం గుర్తుకువస్తే నామట్టుకు నాకే

ఆశ్చర్యం కలుగుతుంది
కృతజ్ఞత అనేది నాలో కలికానికైనా వుందా?
నీ చలవవల్ల నాకు చక్కని ఆరోగ్యం లభించింది
తెలివితేటలబ్బాయి పైచదువులు ముగించుకొన్నాను
చిన్నదో పెద్దదో ఉద్యోగంగూడ దొరికింది
చాలా విజయాలు సాధించాను
నా జీవితయాత్ర సాఫీగానే సాగిపోతూంది
తోడివారిలో నాకొక గుర్తింపంటూ వుంది
పేరుప్రతిష్ఠలుకూడ అబ్బాయి
మరి యీ వరాలన్నిటికీ నేను ధన్యవాదాలు తెల్పుకోక
మూగెద్దులా మౌనంగా వుండిపోయినందుకు
నాకే సిగ్గువేస్తూంది
పైపెచ్చు నా తెలివితేటలవల్లనే
నేను రాణించాననుకొన్నాను
నా జాగ్రత్తవల్లనే విజయాలు సాధించాననుకొన్నాను
నాకు నేనే మురిసిపోయాను, నన్ను నేనే పొగడుకొన్నాను
ఇతరులుకూడ నన్ను పొగడాలని లోలోపల కోరుకొన్నాను
కాని ఈ పద్ధతి నీకు నచ్చుతుందా?
పూర్వం మూడవ హేరోదు దేవుణ్ణి గౌరవింపక
తన్ను తాను ఘనంగా యెంచుకోగా
ఓ దేవదూత అక్కడికక్కడే అతన్ని ఘోరంగా శిక్షించాడు
ఈలాంటి శిక్షే నాకూ ప్రాప్తించి వుండవలసింది
కాని నీ కరుణవల్ల ఆ దండనం తప్పిపోయింది
ఇకనైనా నేను బుద్ధితెచ్చుకొని
నీకు వందనాలర్పిస్తే బాగుంటుంది
కనుక ప్రభూ! నాలోని కృతఘ్నుతాభావాన్ని
నేను ఏవగించుకొనేలా చేయి
రోజు కొక్కసారైనా నీ వుపకారాలకు
నీకు కైమోడ్పులర్పించే భాగ్యం దయచేయి.

## 46. ప్రాకృతిక వరాలు

ప్రభూ! నీవు ఎన్ని ప్రాకృతికవరాలు దయచేసావు?
బిడ్డ పుట్టకమునుపే తల్లి ఉయ్యేలను సిద్ధంచేసినట్లుగా
మేము పుట్టకముందే నీవు ఈ నేలను తయారుచేసావు

ఈ భూమే లేకపోతే మేము పుట్టాక ఎక్కడ వసిస్తాం?
నీవు మాకు నీళ్ళు సమృద్ధిగా దయచేసావు
ఆ జలాన్ని మేము ఆప్యాయంగా త్రాగుతాం
శరీరశుద్ధికి వాడుకొంటాంగూడ
అలాగే నీవు సృజించిన గాలిని హాయిగా పీల్చుకొంటాం
నీవు కలిగించిన ఋతువులు - విశేషంగా వానకాలమూ
చలికాలమూ ఎండ్లకాలమూ ఎన్నెన్నో మార్పులు తెస్తాయి
నీవు మొలిపించే చెట్టుచేమలు ఎన్నో పూలు పూస్తాయి
నోరూరించే పండ్లు ఎన్నో ఫలిస్తాయి
సస్యజాతులు బంగారు పంటలు పండుతాయి
మాకోసం నీవు ఎన్నో పశువర్గాలను సృజించావు
ఎన్ని పక్షులు ఆహ్లాదంగా ఎగురుతూంటాయి
నీవు గగనాన నిల్పిన సూర్యుడు లోకానికంతటికీ
వేడినీ వెలుగునీ ప్రసాదిస్తుంటాడు
తళతళలాడే చందమామ వెన్నెల ఎంత హాయిగా వుంటుంది!
ఇంకా నీవు విరామాలూ సెలవులూ ఆటపాటలూ
మొదలైనవి కల్పించి మా బడలికలు తీరుస్తుంటావు
సుఖనిద్ర కల్పించి మాకు విశ్రాంతిని దయచేస్తావు
సినిమాలు, రేడియోలు, పత్రికలు, గ్రంథాలు, టీవీలు
మొదలైనవాటిద్వారా విజ్ఞానవినోదాలు చేకూర్చిపెడతావు
ఎవరివద్దనుండయినా ఒక్కజాబు వస్తే ఎంతగా సంతోషిస్తాం
ఇక బస్సులూ రైళ్ళూ మొదలైన ప్రయాణ సాధనాలు
అనతికాలంలోనే మమ్ము దూరనగరాలకు కొనిపోతాయి
మాకు వలసిన వస్తువులన్నిటినీ సరఫరా చేస్తుంది స్థానిక పట్టణం
ప్రభూ! నీవు దయచేసిన ఈ వస్తువులన్నిటిలోను
నీ నిజరూపాన్ని దర్శించి నీకు కృతజ్ఞులమైయుండే భాగ్యాన్ని
నీ బిడ్డలమైన మాకు ఏప్రొద్దూ దయచేయి.

## 47. సొలోమోను మనవి

1రాజు 3,4-15

ప్రభూ! పూర్వం సొలోమోను చక్రవర్తి
నిన్ను సేవించడానికి గిబ్యోను పుణ్యక్షేత్రానికి వెళ్ళాడు
నీ వచట ఆ రాజుకి కలలో కన్పించి
ఏమి వరం కావాలో కోరుకొమ్మని అడిగావు

సొలోమోను అప్పుడే సింహాసన మధిష్ఠించాడు
ప్రజలను చక్కగా పరిపాలించడం అతని బాధ్యత
కనుక జనులను మంచిచెడ్డలెంచి పరిపాలించే వివేకం
ప్రసాదించమని అతడు నీకు మనవి చేసాడు
ఆ రాజు స్వార్థబుద్ధితో దీర్ఘాయువూ, శత్రునాశమూ
సిరిసంపదలూ మొదలైన వరాలేమీ కోరుకోక
ప్రజాపాలనానికి వలసిన వివేకం అడిగాడు కనుక
అతని వేడికోలు నీకెంతో ప్రీతి కలిగించింది
నీవతన్ని దీవించి మహాజ్ఞానిని చేసావు
త్రికాలాలలోను అతనిలాంటి మహాప్రభువు లేదనిపించావు
అడగకపోయినా ఇతర వరాలుకూడ అతనికి దయచేసావు
మేమైతే వెర్రిమొర్రి కోరికలన్నీ కోరుకొంటాం
పిచ్చిపిచ్చి ప్రార్థనలన్నీ చేస్తుంటాం
కాని అవసరమైన దొక్కటే - కర్తవ్యపాలనం
మా బాధ్యతలను సక్రమంగా నిర్వహిస్తే చాలు
మేము నీ కెంతైనా ప్రియపడతాం
నీ చిత్తాన్ని పాటించి నీ యాజ్ఞకు బద్ధులమై
ఈ జీవితంలో నీవు మా కొప్పజెప్పిన పనిని సంతృప్తికరంగా
చేసిముగిస్తే నీవు మమ్ము తప్పక మెచ్చుకొంటావు
మే మడగకపోయినా ఇతర వరాలుకూడ దయచేస్తావు
కనుక మేము చేయవలసిన కార్యాలను
చిత్తశుద్ధితో చేసే సామర్థ్యాన్ని ప్రసాదించమని
ఏ ప్రొద్దు నిన్ను వేడుకొనే వివేకం మాత్రం మాకు దయచేయి.

## 48. శిష్యలక్షణం

యోహా 13,35

ప్రభూ! మేము ఒకరినొకరం ప్రేమిస్తే
అప్పుడు లోకం మమ్ము నీ శిష్యులనుగా
గణిస్తుంది అని నుడివావు
లోకంలో సోదరప్రేమ లేదు, నరునికి నరుడు తోడేలు
కనుక సోదరప్రేమను పాటించేవాళ్ళను జూచి లోకం విస్తుపోతుంది
వీళ్లు క్రీస్తు శిష్యులని చెప్పుకొంటుంది
కాని సోదరప్రేమను పాటించడం సులభమైన కార్యం కానేకాదు

తోడి నరుణ్ణి ఆదరించాలంటే మాలోని స్వార్థం అడ్డుదగులుతుంది
మేము ఇతరులనుండి తీసికోగోరుతాంగాని
ఇతరుల కీయడానికి ఇష్టపడం
మరి తోడివాణ్ణి ఎందుకు పట్టించుకొంటాం?
కనుక మాలోని స్వార్థాన్ని చంపుకొని
మమ్ము మేము త్యజించుకొంటేనేగాని
సోదరప్రేమను కొలదిగానైనా పాటించలేం
క్రైస్తవ జీవితంలోకెల్లా సోదరప్రేమే
కష్టమైన కార్యం అన్పిస్తుంది
కనుకనే నీవు దీనిని నీ శిష్యులకు గుర్తుగా నిర్ణయించావు
అద్భుతాలు చేసేవాళ్ళూ కాదు
పిశాచాలను పారద్రోలేవాళ్ళూ కాదు
వ్యాధులను కుదిర్చేవాళ్లూ కాదు
ప్రార్థనా సభలు నడిపించేవాళ్ళూ కాదు
గ్రంథాలు వ్రాసి ఉపన్యాసాలిచ్చేవాళ్ళూ కాదు
సాంఘికసేవ చేసేవాళ్ళూ కాదు
మరి సోదరప్రేమను పాటించేవాళ్లెవరో
వాళ్లుమాత్రమే నీ నిజశిష్యులు
క్రైస్తవ జీవితంలోకల్ల యిది కష్టమైన కార్యం
కావున యిదొక్కటే నీ శిష్యులకు ముఖ్యలక్షణం.

## 49. వెలుగుబాట

1యోహాను 2,10-11. 4,19-21

తండ్రీ! నీవు చీకటి యేమాత్రము లేని నిండువెలుగువి
ద్వేషము అణుమాత్రము లేని పరిపూర్ణ ప్రేమవి
నీ గారాబు సుతుని మాకు ప్రసాదించడంలోనే
మాపట్ల నీకుగల ప్రేమ వ్యక్తమైంది
ఆ ప్రభువు ముఖప్రకాశం మామీద సోకగానే
మా హృదిలోని తమస్సూ ద్వేషమూ పటాపంచలైపోయి
నీ వెలుగూ అనురాగమూ మాలో చోటుచేసికొంటాయి
తోడినరుణ్ణి ప్రేమించలేనివాడు
దట్టమైన కారుచీకటిలో పయనించేవాడు
ఇరుగుపొరుగువారి నాదరించే పుణ్యపురుషులే
జ్యోతిర్మార్గంలో నడచే ధన్యాత్ములు

చీకట్లు విచ్చిన వెలుగుబాటలో పయనిస్తున్నారుగాన
ఆ సుకృతాత్ములు ఏనాడూ కాలుజారి పడిపోరు
తండ్రీ! నీవు మొదట మమ్ము ప్రేమించావు కనుకనే
ఇప్పుడు మేము నిన్ను ప్రేమించగల్గుతూన్నాం
మేము నిత్యం నీ ప్రేమలో నెలకొనివుండి నీ వెలుగుబాటలో
నిబ్బరంగా పయనించే భాగ్యం దయచేయి
విశేషంగా తోడినరుణ్ణి అనాదరంజేస్తూగూడ
దేవుణ్ణి పూజిస్తున్నాంగదా అది చాలులే
అనుకొనే ఆత్మవంచనం నుండి మమ్ము విమోచించు
కంటికి కనుపించే తోడినరుణ్ణి ప్రేమించలేనివాడు
కంటికి కనుపించని భగవంతుణ్ణి ప్రేమిస్తాడా?
అందుబాటులో వున్న నరుణ్ణా
లేక యెక్కడో దూరంగా వున్న దేవుణ్ణా
ఎవరిని ప్రేమించడం సులభం?
ఓవైపు తోడిమానవుణ్ణి చిన్నచూపు చూస్తూనే
నిన్ను పూజింపబూనడం అబద్ధాలకోరుల లక్షణం
కనుక తండ్రీ! నిన్ను ప్రేమించినపుడు తోడినరులనూ
వారిని ప్రేమించినపుడు నిన్నూ ప్రేమిస్తామనే సత్యం
మేము ఏనాడూ విస్మరించకుండా వుండేలా చేయి.

## 50. పరవిమర్శ

లూకా 6,37-38

ప్రభూ! నీవు తోడివారిని గూర్చి చెడ్డగా భావించవద్దన్నావు
“మీరు ఇతరులను చెడ్డవారని యెంచకండి
అప్పుడు దేవుడు కూడ మీరు చెడ్డవారని యెంచడు
ఇతరులమీద నేరం మోపకండి
భగవంతుడుగూడ మామీద నేరం మోపడు
ఇతరులను క్షమించండి దేవుడూ మిమ్ము క్షమిస్తాడు
మీరు తోడిజనుల కేలాంటి కొలత కొలుస్తారో
దేవుడు మీకూ అలాంటి కొలతే కొలుస్తాడు”
అని నీవు పర్వత ప్రసంగంలో విశదం చేసావు
కాని మా దౌర్భాగ్య మేమిటంటే
ఇరుగు పొరుగువాళ్ళను సులభంగా అడిపోసుకొంటాం
వాళ్లు చేసిన మంచిపనులు మాకట్టే నచ్చవు

ఇక వాళ్ళ చెడ్డపనులనో అంటే
గోరంతలు కొండంతలు చేస్తాం
మా హృదయంలో ఇతరులమీద
అసలు సదభిప్రాయమే వుండదు
కనుకనే వాళ్ళంటే కొరకొరలాడతాం,
కటువుగా మాటలాడతాం, క్రూరంగా విమర్శిస్తాం
ఎవరూ అడగకపోయినా యితరులను గూర్చిన
మా అభిప్రాయాలను బాహాటంగా వెలిబుచ్చుతాం
అసలు తోడినరుల మీద మమ్మెవ్వరు
న్యాయాధిపతులనుగా నియమించారో మాకే తెలీదు
ఇతరులు మమ్ము విమర్శిస్తే మాత్రం అగ్గిలా మండిపోతాం
మా హృదయంలోని ఉద్దేశాలు వాళ్ళకేలా తెలుసు అంటాం
విషయాన్ని అర్థంజేసికొని మంచిచెడ్డలు విచారించి
సానుభూతిలో మాట్లాడాలికదా అని వాపోతాం
మా విమర్శల్లో మాత్రం ఈ సూత్రాలను ఏమాత్రం పాటించం
మేమసలు ఇతరులకు తీర్పు తీర్చగూడదు
ఒకవేళ తీర్పు తీర్చవలసివస్తే సానుభూతీ మానవతా
ఉట్టిపడేలా మాట్లాడే భాగ్యాన్ని
ప్రభూ! నీవుగాకపోతే మరెవరు మాకు ప్రసాదిస్తారు?

## 51. నాలుక

యాకో 3,2-12. సామె 8,21. కీర్త 14,3.

ప్రభో! నాలుక ఎంత దుష్టావయవం
దానివలన రోజూ ఎన్నిపాపాలు మూటగట్టుకొంటాం
చిన్నకళ్లెం గుర్రాన్ని అదుపులో పెట్టుకొంటుంది
చిన్న చుక్కాని పెద్ద నావను అటూఇటూ త్రిప్పుతుంది
అలాగే ఈ చిన్న నాలుక
మా దేహాన్నంతటిని వశంచేసుకొంటుంది
అది మాచేత పలుకగూడని పాడుపలుకులు పలికిస్తుంది
అది అంత చిన్న అవయవమైనా యెంతగా డప్పాలు కొడుతుంది!
చిన్న నిప్పురవ్వ మహారణ్యాన్నే దహిస్తుంది
అల్పావయమైన నాలుక మా జీవితాన్నే తగులబెడుతుంది
అసలు దయ్యమేవచ్చి మొదట దానికి చిచ్చుపెట్టగా

అది తన తరపున తాను మా జీవితానికి అగ్గిపెడుతుంది
నరులు పాములనూ పులులనూ అదుపులో వుంచుకొంటారు
కాని యే నరుడూ నాల్కను అదుపులో పెట్టుకోలేదు కదా!
జిహ్వనుండి అమృతమయమైన వాక్కులు వెలువడాలి
కాని దానినుండి వూరే విషం అంతాయింతా కాదు
ఈ నాలుకతో దేవుణ్ణి స్తుతిస్తాం
దీనితోనే దేవుని రూపం ధరించిన నరుణ్ణి శపిస్తాం
ఒకే చెలమనుండి తీయని నీళ్లూ ఉప్పునీళ్లూ ఊరతాయా?
ఒకే చెట్టునుండి తీయని పండ్లూ చేదు కాయలూ కాస్తాయా?
కాని ఒకే నాలుకనుండి దీవెనలూ శాపాలూ వెలువడ్డం విడ్డూరం
ప్రకృతిలో ఈలాంటి వైరుధ్యం మరెచటా కన్పించదు
ప్రభూ! ఈ నాలుకతో ఎందరిని ఆడిపోసుకొంటాం
ఎందరి మనసు నొప్పిస్తాం,
ఎన్ని పచ్చని సంసారాలు పాడుచేస్తాం
ఎన్ని తగాదాలు తెచ్చిపెట్టుకొంటాం
దీనివల్లనే మాకు చావుగాని బ్రతుకుకాని సిద్ధిస్తాయి
నోరు మంచిదైతే ఊరు మంచిదౌతుంది కదా!
కనుక కీర్తనకారునిలాగే మేముకూడ
"ప్రభూ! మేము దుర్భాషలాడకుండా వుండేలా
మా పెదవులకు తాళం వేయి" అని ప్రార్థిస్తున్నాం
నీ యనుగ్రహం లేనిదే ఈ చండాలపుటవయవం మాకు లొంగదు.

## 52. ఇచ్చేవాడు ధన్యుడు

అచ 20,35. మత్త 10,42. మత్త 6,2-4.

ప్రభూ! నేనెప్పుడూ ఎవరివద్ద యేమి దొరుకుతుందా
ఎవరి చెంతనుండి యేమి గుంజుకొందామా అని చూస్తుంటాను
ఒకడికీయడానికి మాత్రం చచ్చినా ఒప్పుకోను
నాది యేదైనా అన్యుడి కీయాలంటే
నా శరీరాన్ని కోసియిచ్చినంత కష్టంగా వుంటుంది
అవును తీసికోవడం తీపి, ఈయడం మహాకష్టం
ఐనా నీవిచ్చేవాడివికాని తీసికొనేవాడివి కావు
నీ కత్యంత ప్రీతిపాత్రుడైన క్రీస్తునే మా కిచ్చావు
నీ యాత్మను మా హృదయాల్లోకి పంపావు

ఈ దైవవ్యక్తులతోపాటు అన్ని వరాలనూ మాకు దయచేస్తావు
నిన్ను ఆదర్శంగా పెట్టుకొని మేముకూడ
ఈయడం నేర్చుకోవాలి
ఎప్పుడుకూడ తీసికొనేవాడికంటె ఇచ్చేవాడు ధన్యుడు
కావుననే తోడి నరునికి గ్రుక్కెడు మంచినీళ్ళిచ్చినా
ప్రతిఫలం తప్పక లభిస్తుందన్నాడు క్రీస్తు
ఇంకా అతడు స్వయంగా ప్రాణత్యాగంచేసి
తోడివారి కెంత ప్రియమైన వస్తువు నీయవలసి వచ్చినాసరే
వెనుకాడగూడదని మాకు పాఠం నేర్పాడు
మా తరపున మేము మా ప్రాణాల నీయలేకపోయినా
మాకున్నది తులమోఫలమో అన్యులతో పంచుకోవాలి
లేకపోతే మేమేమి శిష్యులం?
ఒకోమారు కొద్దోగొప్పో యిస్తాంగాని
మా దానాన్ని గూర్చి బాగా ప్రకటనం చేయించుకొంటాం
ఆడంబర ప్రియులమైన మాకు ఇదొక సంతృప్తి
"కుడిచేతి దానం ఎడమచేతికి తెలియకూడదు
దేవుడు ఒక్కడు మన దానం గుర్తిస్తేచాలు" అన్న క్రీస్తువాక్యం
స్వార్థపరులమైన మాకు సిగ్గునే పుట్టిస్తుంది
ఏమైతేనేమి, నిన్నూ క్రీస్తునీ ఆదర్శంగా పెట్టుకొని
మేము కూడ ఈయడమనే కష్టమైన విద్యను నేర్చుకోవాలి
నీళ్లు తీస్తూంటే యింకా వూరుతుంది చెలమ
తీయకపోతే ఉన్న నీళ్ళుకూడ తెప్పకట్టి చెడిపోతాయి
మా జీవితానికీ ఇదే సూత్రం వర్తిస్తుందని గుర్తించే భాగ్యం
నీ దాసులమైన మా కందరికీ దయచేయి.

## 53. అసూయ

ఆది 30,1-2. 37,3-4. 1సమూ 18,6-9. లూకా 9,49-50.

ప్రభూ! నేను ఇతరులు కొంచెం పచ్చగావుంటే ఓర్వలేను
సులభంగా అసూయకుగురై నా యల్పత్వాన్ని చాటుకొంటాను
ఇతరుల నెవరైనా కొంచెం పొగడితే సహించలేను
అన్యులు నాకంటె కొంచెం మంచి బట్టలు ధరిస్తే ఓర్వలేను
పరులు లాభాన్ని నా నష్టంగా భావించి బాధపడతాను
ఇతరుల నష్టాన్ని నా లాభంగా యెంచి పొంగిపోతానుగూడ
ఇంతకంటె నీచప్రవృత్తి మరొకటుంటుందా?

పూర్వం రాహేలు గొడ్రాలుగా వుండిపోగా
ఆమెయక్క లేయాకు ముత్యాల్లాంటి పిల్లలు పుట్టారు
ఇకనేం ఆ చెల్లెలు అక్కనుజూచి కండ్లల్లో నిప్పులు పోసికొంది

యాకోబు తన ముద్దులకొడుకు యోసేపుకి
పొడుగుచేతుల నిలువుటంగీని కుట్టించడం జూచి
అతనియన్నలు తండ్రిమీద కవిసిపడ్డారు

సౌలు రణరంగంలో ఫిలిస్టీయులను వేయిమందిని చంపాడుకాని
దావీదైతే పదివేలమందిని చంపాడని స్త్రీలు పాడాగా విని
సౌలురాజు దావీదుమీద కుతకుత వుడికిపోయాడు

ఎవడో అనామక శిష్యుడొకడు క్రీస్తు పేరుమీదిగా
దయ్యాలను వెళ్ళగొడుతుంటే పండ్రెండుమంది శిష్యులూ
చుప్పనాతితనంతో అతనికి అడ్డంబోయారు -
ఈలా వుంటాయి పతనమానవుల దుర్గుణాలు
మేమెంత అల్పబుద్ధులమో అంత సులభంగా అసూయచెందుతాం
లోపల పురుగుపడి గుమ్మడిపండును కుళ్ళబెడుతుంది
అలాగే అసూయకూడ మా హృదయాలను తొలిచి
మేము లోలోపల కుళ్ళిపోయేలా చేస్తుంది
ఇతరుల వృద్ధినిచూచి ఓర్వలేనితనంతో క్రుగ్గిపోయేవాడికి
ఇక వేరే శత్రువులంటూ అక్కరలేదుకదా?
ప్రభూ! ఈ దుర్గుణాన్ని మాయంతటి మేము అణచుకోలేం
మా పాపాలన్నిటికీ ప్రాయశ్చిత్తం చేసిన క్రీస్తు సిల్వమరణమే
ఈ రాక్షసగుణాన్ని మా హృదయాల్లోనుండి తుడిచివేయాలి.

## 54. జగడాలు

అచ 6,1-6.

ప్రభూ! యెరూషలేములోని ఆదిమ క్రైస్తవ సమాజంలో
పాలస్తీనా యూదులనీ అన్యదేశాల యూదులనీ
రెండు తెగలవాళ్ళు ఉండేవాళ్లు
ఆ యుభయ వర్గాలవాళ్లు పొత్తుకుదరక కీచులాడుకొన్నారు
అన్యదేశాల యూదులు తమ వితంతువులకు కూడు అందలేదని
పాలస్తీనా యూదులతో జగడమాడారు
అప్పుడు అన్నం అందరికీ సకాలంలో ముట్టేలా చూడ్డానికీ

ఈలాంటి తగవులన్నీ పరిష్కరించడానికీ
పేత్రు ఏడ్గురు పరిచారకులను నియమించవలసి వచ్చింది
మా జీవితంలోను ఈలాంటి గొడవలే వస్తూంటాయి
మేము చిన్నదానికీ పెద్దదానికీ ఇరుగుపొరుగువారితో కలహిస్తాం
కొంచెం సర్దుకుపోతే జగడాలు వాటంతటవే సమసిపోతాయి
కాని తగాదాలు కొనితెచ్చుకొనే బుద్ధిమాది
అసలు ఏవో కొన్ని కయ్యాలు లేకపోతే మాకు నిద్రపట్టదు
నోటిమాటల్లో, వస్తువుల వాడకంలో,
ఇచ్చిపుచ్చుకోవడంలో, ఆసనాలు ఆక్రమించుకోవడంలో,
వస్తువులు పంచుకోవడంలో, పనులు చేయడంలో -
ఎక్కడికి వెళ్ళినా ఏమిచేసినా అన్నీ తగాదాలే
మేము ఎంత అల్పబుద్ధులమో
అంత సులభంగా కయ్యానికి కాలు దువ్వుతాం
నీచులు కలహాన్నీ సాధువులు సంధినీ
అభిలషిస్తారనే సూక్తి వుండనేవుంది
ప్రభూ! మేము తోడివారిపట్ల ప్రేమతో మెలిగేలా చేయి
తీసికోవడం కంటె ఈయడం ధన్యమని గుర్తించేలా చేయి
ఎప్పుడూ మాదే పైచేయిగా వుండాలనే
దురభిమానానికి లోనుగాకుండా వుండేలా చేయి
తోడివారితో భేదాభిప్రాయాలు వచ్చినపుడు
మాది కొంత వదలుకొనైనాసరే
కయ్యాలకు దూరంగా వుండే సద్బుద్ధిని దయచేయి.

## 55. క్షమాధర్మం

ఆది 50,15-21. లూకా 23,34

ప్రభూ! సోదరులు యోసేపుని బానిసగా అమ్మారు
అతడు దైవబలం వలన ఐగుప్తుకి మంత్రియయ్యాడు
తర్వాత సోదరులు రెండుసార్లు ధాన్యంకోసం ఐగుప్తు వెళ్లారు
రెండవతూరి యోసేపు వాళ్ళకు తన్నెరుకపరచుకొన్నాడు
దానితో వాళ్లు తాము చేసిన యపకారాన్ని జ్ఞప్తికితెచ్చుకొని
యోసేపు తమమీదపగదీర్చుకొంటాడేమోనని హడలిపోయారు
కాని ఆ యుదారహృదయుడు వాళ్ళకు అభయమిచ్చి
"ఆనాడు మీరు నాకు నిక్కంగా కీడు తలపెట్టారు

కాని దేవుడు ఆ కీడును మేలుగా మార్చాడు
నన్ను మీకంటె ముందుగా ఈ కానిదేశానికి పంపి
ఈ కరువు కాలంలో మీకు తిండి దొరికేలా చేసాడు
కనుక నేను మీ యపరాధాన్ని పూర్తిగా క్షమిస్తాను
మిమ్ము ఆదరిస్తాను మీరేమీ భయపడకండి" అని పల్కాడు
ఈ యోసేపు ఎంత క్షమాబుద్ధికలవాడు!
మేమైతే మా కపకారం చేసినవాళ్ళమీద మండిపడతాం
కారాలు మీరాలు నూరుతూ నిష్ఠురాలు పలుకుతాం
మా శత్రువులకు కసిదీర కీడు చేయాలనిపిస్తుంది
ఇక మేము వాళ్ళను క్షమించేదెక్కడ?
వాళ్ళకు మేలు చేసేదెక్కడ?
కాని ప్రభూ! ఇది పద్ధతి కాదు
అపకారికి వుపకారం నెపమెన్నక చేస్తేగదా గొప్ప!
చంపదగిన శత్రువు చేతికి జిక్కితే
కీడుజేయక మేలుజేసి పంపితేగదా మాన్యత?
మాది రాక్షస ప్రవృత్తి కనుక శత్రువుని క్షమించలేం
తోడి నరుణ్ణి మన్నించాలంటే మాకెంతో కష్టంగా వుంటుంది
కనుకనే నీవు సిలువమీద వ్రేలాడుతూ
నిన్ను హింసించే శత్రువుల కొరకు ప్రార్థించావు
మేము మా పగవారిని మన్నించాలని బోధించావు
నీవు బోధించిన గొప్ప శిష్యధర్మాల్లో క్షమాధర్మ మొకటి
తోడివాణ్ణి మన్నించినవాడు దివ్యుడుకాని నరుడు కాదు
కనుక నిన్నాదర్శంగా బెట్టుకొని యెంత కష్టమైనాసరే
ఈ క్షమాగుణాన్ని సాధించే ప్రయత్నం చేస్తాం.

## 56. ప్రేషిత ధర్మాలు

మత్త 5,13-16

ప్రభూ! నీవు పర్వతప్రసంగంలో ప్రేషితధర్మాలను వివరించావు
నీ శిష్యులు భోజనంలో వుప్పులా వుండాలన్నావు
దీపస్తంభంమీద పెట్టిన దీపంలా వెలగాలన్నావు
కొండమీద కట్టిన పట్టణంలా విరాజిల్లాలన్నావు
వుప్పు భోజనానికి రుచినిస్తుంది, దాన్ని పదిలపరుస్తుందికూడ
అలాగే మేమూ నీ వుపదేశాలనే రుచిని లోకాని కందీయాలి

నీ సందేశాలనే వుప్పుద్వారా
లోకాన్ని భ్రష్టత్వం నుండి కాపాడాలి
దీప స్తంభంమీది దీపం ఇంటిని వెలుతురుతో నింపుతుంది
అలాగే మేమూ ప్రపంచాన్ని నీ బోధలనే కాంతితో నింపాలి
పూర్వవేదంలో ధర్మశాస్త్రంలాగే
నూత్నవేదంలో నీ బోధలుకూడ వెలుగు
ఆ వెలుగుతోనే మేము లోకంలోని చీకట్లను పారద్రోలాలి
కొండమీద కట్టిన నగరం పదిమంది కంటా పడుతుంది
అలాగే నీ శిష్యులమైన మమ్ము
ఇరుగుపొరుగువాళ్ళు గమనిస్తుంటారు
కనుక మా జీవితం శుద్ధంగాను భక్తిమంతంగాను వుండాలి
చెప్పేదొకటి చేసేదొకటి అన్నట్లుగా వుండకూడదు
మేము మంచి కార్యాలు చేస్తే తోడిజనులు సంతోషిస్తారు
ఈలాంటి పుణ్యపురుషులను పుట్టించావని దేవుణ్ణి స్తుతిస్తారు
కాని మేము దుష్కార్యాలుచేస్తే జనులు మనసునొచ్చుకుంటారు
ఈ కుక్కమూతి పిందెల నెందుకు పుట్టించావని
దేవునికి మొరపెడతారు
కనుక మేము వళ్ళు దగ్గర బెట్టుకొని యోగ్యంగా మెలగాలి
ఎంతచెట్టు కంతగాలి అంటారు
నీ శిష్యులమైనందుకు మాకు గొప్పబాధ్యతలు సంక్రమించాయి
అసలు మా జీవితం పవిత్రంగా లేందే
లోకం మా బోధలను నమ్మదు
గులాబీ తన సుగంధాన్ని గూర్చి
అందాన్ని గూర్చి వుపన్యాసాలీయదు
ఐనా స్త్రీలు ముచ్చటపడి
దాన్ని జడల్లో ముడుచుకొంటారు
అలాగే నీ శిష్యులమైన మేము నీ బోధలను పాటిస్తూ
ఆదర్శవంతమైన క్రైస్తవ జీవితం జీవిస్తే
లోకం మమ్ము నమ్ముతుంది, మెచ్చుకొంటుంది
ఆచరణశుద్ధి కలవాడు ఆర్భాటంతో ఉపన్యాసాలీయనక్కరలేదు
గులాబీలా మౌనంగా వున్నా
లోకం తనంతట తాను దాని చెంతకు వస్తుంది
కనుక మేము నోటిద్వారా బోధించే వేదసత్యాలను
మా నడవడికద్వారా ఆచరించి చూపించే భాగ్యాన్ని ప్రసాదించు

నీ శిష్యులకు కొలతబద్ధ క్రియాశుద్ధికాని
నటనా, వేషధారణా, ఆడంబరమూ కాదని గుర్తించేవరాన్ని
నీ సేవకులమైన మా కెల్లరికీ దయచేయి.

# 57. సువిశేష సేవ

యోహా 20,21. 15,5. మత్త 4,20. ఎఫే 4,16.
యిర్మీ 20,9. 1కొరి 9,16. 2కొ 12,15.

క్రీస్తూ! ఉత్థానానంతరం నీవు శిష్యులకు దర్శనమిచ్చినపుడు
తండ్రి నన్ను పంపినట్లే నేనూ మిమ్ము పంపుతున్నానని పల్కావు
తండ్రి పంపగా దైవరాజ్యాన్ని గూర్చి
బోధించడానికి వచ్చిన మహా ప్రేషితుడవు నీవు
మేము నీలోనికి జ్ఞానస్నానం పొందినపుడే
నీ ప్రేషిత ధర్మాన్ని స్వీకరిస్తాం
కనుక నీలాగే మేముకూడ దైవరాజ్యాన్ని గూర్చి ప్రకటించాలి
ఈ కార్యంలో నీవు తండ్రి నుండి బలాన్ని పొందినట్లే
మేమూ నీ నుండి సత్తువను పొందాలి
కనుకనే నీవు ద్రాక్షతీగ ఉపమానాన్ని వివరించి
ద్రాక్ష కొమ్మలు తల్లితీగ నుండి సారాన్ని పొందినట్లే
మేమూ నీనుండి వరప్రసాద బలాన్ని పొందాలని వాకొన్నావు
నీ నుండి వేరైనప్పుడు
మేమెందుకు పనికిరామనిగూడ నుడివావు
ఇంకా నీవు పండ్రెండుమంది శిష్యులను ఎన్నుకొన్నపుడు
ఇంతవరకు మీరు చేపలను పడుతూ వచ్చారు
కాని యికమీదట మిమ్ము మనుష్యులను పట్టే
బెస్తలను చేస్తానన్నావు
కనుక నేడు మేము దైవరాజ్యానికి నరులను సేకరించాలి
పెక్కుమంది విశ్వాసులను ప్రోగుజేసి శ్రీసభను వ్యాప్తిజేయాలి
శరీరంలోని అవయవాలన్ని కష్టపడి పనిచేసి
ఆ శరీరం దృఢంగా పెంపొందేలా చేస్తాయి
అలాగే జ్ఞానదేహానికి అవయవాలైన మేముకూడ కృషిచేసి
ఆ యాధ్యాత్మిక దేహాన్ని పెంపులోకి తీసుకురావాలి
ప్రభూ! మాకు ప్రేషిత సేవమీద గాఢమైన కోర్కె పుట్టించు
వేదబోధపట్ల నీ భక్తులకు దయచేసిన తపనను

మాకూ దయచేయి
పూర్వం యిర్మీయా పాలకులు పెట్టే హింసలకు దడిసి
తన ప్రవచన సేవను విరమించుకోవాలనుకొన్నాడు
కాని నీ సందేశాన్ని వెల్లడిచేయాలనే తీవ్రమైన కోరిక
ఆ ప్రవక్త హృదయంలో అగ్ని జ్వాలలాగ మండజొచ్చింది
అతడా మంటను భరించలేక
మళ్లా ప్రవచనం చెప్పడానికి పూనుకొన్నాడు
పౌలుకూడ సువార్త ప్రకటనంపట్ల
తనకున్న అభిరక్తినిగూర్చి చెప్తూ
క్రీస్తునిగూర్చి బోధించినందులకు
నేను గొప్పలు చెప్పుకోనక్కరలేదు
ఆ ప్రభువు రక్షణసందేశాన్ని బోధించే భారాన్ని నా నెత్తిన పెట్టాడు
సువిశేషసేవ చేయకపోతే నేను ముదనష్టమైపోతా నన్నాడు
ఈ మహానుభావులకు కలిగిన ప్రేరణలో నూరవవంతయినా
మాకుకూడ కలిగితే మా జీవితం ధన్యమవుతుంది
దీపం తాను కాలిపోతూ,
తన చమురును తాను వ్యయంజేసికొంటూ
ఇంటిలోని వారికి వెలుతురు నిస్తుంది
అలాగే మేముకూడ మా ఆయుస్సునీ మా జీవితాన్నంత్తటినీ
నీ సువిశేష సేవలో వ్యయంజేసికొంటే యెంత బాగుంటుంది!

## 58. శక్తిసామర్థ్యాలు

మత్తయి 25, 14-30

క్రీస్తూ! నీవు ముగ్గురు సేవకుల కథ చెప్పావు
ఒక యజమానుడు తన సేవకులను ముగ్గురునీ పిల్చి
ఒకనికి ఐదు సంచులూ, ఒకనికి రెండు సంచులూ,
ఒకనికి ఒకసంచీ రూకలు అప్పగించాడు
అతడు పనిమీద దూరదేశానికి వెళ్ళి తిరిగివచ్చేలోపల
ఐదు సంచులు పుచ్చుకొన్నవాడు మరి ఐదు సంచులూ
రెండు సంచులు తీసికొన్నవాడు మరి రెండు సంచులూ
సొమ్ము గణించగా యజమానుడు ప్రీతి చెందాడు
కాని మూడవ సేవకుడు తాను పుచ్చుకొన్న రూకలమీద
ఏ మాత్రమూ ఆదాయం గణించనందున

యజమానుడు మండిపడి "ఓరి సోమరిపోతూ!
నీవు నా సొమ్ముమీద కనీసం వడ్డీయైనా రాబట్టావు కావు
కావున నీ సంచిని గూడ ఆ మొదటివానికే యిస్తాను" అన్నాడు
ప్రభూ! నీవు చెప్పిన ఈ కథ మా జీవితానికీ వర్తిస్తుంది
నీవు మాకు పలువిధాలైన శక్తిసామర్థ్యాలు ప్రసాదిస్తావు
మేము కృషిచేసి ఈ వరాలను వృద్ధిచేసికొంటే
నీవు సంతోషిస్తావు, లేకపోతే కోపిస్తావు
కనుక తెలివితేటలున్నవాడు చక్కగా చదవాలి
సేవాగుణమున్నవాడు పదిమందికీ పరిచర్య చేయాలి
నాయకత్వమున్నవాడు బృందాలను నడిపించాలి
హాస్యచతురుడు వినోదకార్యక్రమాలు చేపట్టాలి
ఆటపాటల్లో శక్తిగలవాడు ఆడాలి పాడాలి
భక్తిగలవాడు నీ గ్రంథాన్ని చదివి ప్రార్థనలు చేయాలి
ఈ విధంగా నీవు మాకు దయచేసిన మేలిగుణాలు
మేము స్వీయకృషితో పెంపులోకి తెచ్చుకోవాలి
కాని మేము సోమరితనంతో వట్టినే కాలక్షేపం చేస్తాం
నీ వరాలను గుర్తించం, లెక్కచేయం, వృద్ధిచేసికోం
స్వయంకృషి లేదు కనుకనే నీ దీవెనలకు నోచుకోక
జీవితాంతమూ ఎక్కడున్న వాళ్ళ మక్కడే వుండిపోతాం
ప్రభూ! మా యీ యవివేకాన్ని మన్నించి
మాకు జ్ఞానోదయం కలిగించు.

## 59. శిష్యుల గొప్ప యేమిటి?

1కొరి 1, 18-31.

ప్రభూ! నీవు పండ్రెండు మంది శిష్యుల నెన్నుకొన్నావు
కాని వాళ్ళ స్తోమతను పరికిస్తే ఆశ్చర్యం కలుగుతుంది
వాళ్లు యూదసమాజంలోని అట్టడుగు వర్గమైన సుంకరులు
చదువు సంధ్యలులేని పామరులు, చేపలుపట్టే బెస్తలు
అలాంటి జనంతో ఏ నాయకులైనా
ఏమిసాధిస్తారా అని ఆశ్చర్యం కలుగుతుంది
ఐనా నీవు అలాంటి ముడిసరుకునే చేరదీసి తర్ఫీదు నిచ్చావు
నీ యాత్మ వాళ్ళను శక్తితో నింపి మహాప్రేషితులను చేసింది
పండితులైన ఆనాటి యూదులూ గ్రీకు రోమను విద్వాంసులుకూడ

వాళ్ళముందు నిలువలేక దాసోహమన్నారు
నీవు ఈనాడు అల్పులమైన మమ్ముకూడ నీ పరిచర్యకు పిల్చావు
కాని అసమర్థులమైన మేము నీకు ఏమి సేవలు చేయగలం?
మావల్ల నీ పనులు నెరవేరి నీ రాజ్యం వ్యాప్తి జెందుతుందా?
నేటి నవనాగరికతా ప్రపంచానికి
నిన్ను చాటిచెప్పే స్తోమత మాకుందా?
అసలు మేమెంత మా బండారమెంత?
ఈలా మేము ఓవైపు అధైర్యం చెందినా
మరోవైపు ఆ శిష్యుల యెన్నికను చూచి
ఎక్కడలేని ధైర్యం తెచ్చుకొంటాం
ఎప్పుడుగూడ నీవు అజ్ఞానుల నెన్నుకొని
విజ్ఞులనబడేవాళ్ళకు జ్ఞానం లేదని నిరూపిస్తావు
దుర్బలుల నెన్నుకొని బలవంతులకు బలం చాలదని నిరూపిస్తావు
అల్పుల నెన్నుకొని అధికుల మహత్తును చిత్తు చేస్తావు
ప్రభూ! నీవీలా తాడూబొంగరమూ లేనివాళ్ళను
నీ సేవకులుగా గ్రహించడం దేనికి?
ఏ నరుడూ నీముందు గొప్పలు చెప్పుకోకుండా వుండేందుకా?
నే నంతటివాణ్ణి యింతటివాణ్ణి అని
ప్రగ్గెలు పల్కకుండా వుండేందుకా?
మాలో పనిచేసే శక్తి దైవబలం కాని మానుషబలం కాదని
మాచే ఒప్పించేందుకా?
మా బలమూ విజ్ఞానమూ పాపపరిహారమూ పావిత్ర్యమూ అంతా
సిలువమీద మృతిపొంది మళ్ళా ఉత్థానుడవైన నీనుండేనని
మే మెల్లరమూ వినయంతో అంగీకరించేలా చేసేందుకా?
అలాగైతే మేము నీ శిష్యుల మైనందుకు
అధైర్యం చెందంగదా యింకా వుబ్బిపోతాం
కాని మా వుబ్బూ మా లావూ మానుండిమాత్రం కాదు
మేము నీ శక్తిని పొందిన దాసులమనుకొని పొంగిపోతాం - అంతే.

## 60. దుర్బలులకు బలం

2కొరి 12,7-10.

ప్రభూ! నీవు భక్తుడైన పౌలుకి ఎన్నోసార్లు సాక్షాత్కరించావు
కాని ఆ దర్శనాలవల్ల పౌలు కెక్కడ తల తిరుగుతుందోనని
అతన్ని యేదో దుర్బలమైన బాధతో పీడించావు

ఈ బాధనే పౌలు "ముల్లు" అని పేర్కొన్నాడు
ఈ కంటకాన్ని తొలగించమని
అతడు ముమ్మారు నిన్ను వేడాడు
నీవు ఆ శల్యాన్ని తీసివేయలేదు గాని
"నీవు దుర్బలుడవై యున్నపుడు నా శక్తి నీమీద పనిచేస్తుంది
నా యనుగ్రహం నీకు చాలుపో" అని మాత్రం సెలవిచ్చావు
పౌలు ఆ పీడను తొలగించమని మళ్ళా అడగనే లేదు
తాను దౌర్బల్యంతో క్రుంగిపోయినపుడే గాని
నీ బలాన్ని పొందలేనని విశ్వసించాడతడు
కావుననే "నేను బలహీనుడనై యున్నపుడే
బలవంతుణ్ణవుతాను" అని వాకొన్నాడు
ఈ వాక్యంలో ఎంతో సత్యం వుంది
నీవు వినయవంతులను దుమ్ములోనుండి పైకి లేవనెత్తేవాడివి
గర్వాత్ములను ఆసనాలమీది నుండి క్రిందికి పడద్రోసేవాడివి
మా బలాన్ని చూచి కాదుగాని మా దుర్బలత్వాన్ని చూచి
నీవు మమ్మాదరిస్తావు
లోకంలో నరులైతే గొప్పలు చెప్పుకొంటారు
తమ ప్రజ్ఞాప్రాభవాలను ఏకరువు పెడతారు
కాని మేమైతే నీముందు మా యశక్తతను ప్రదర్శించుకొంటాం
మా చేతగానితనాన్ని వెల్లడిచేసికొంటాం
అప్పుడు నీ శక్తి మామీదికి బలంగా దిగివస్తుంది
మహావృక్షానికి అల్లుకొన్న బలహీనపు తీగ
ఆ తరువు బలంలో తానూ పాలుపొందినట్లే
బలాఢ్యుడవైన నిన్నాశ్రయించిన మేంకూడ
నీ బలాన్ని పంచుకొని బలశాలుల మౌతాం.

## 61. మనలను నమ్మే ప్రభువు

యోహా 21,13-17

ప్రభూ! నీవు నరస్తేరాన శిష్యులకు దర్శనమిచ్చినపుడు
"ఓయి! వీళ్ళకంటె అదనంగా నీవు నన్ను ప్రేమిస్తున్నావా?"
అని పేత్రుని ముమ్మారు ప్రశ్నించావు, అతడు ముమ్మారు
ఔను ప్రభూ! వీళ్ళకంటె అధికంగానే ప్రేమిస్తున్నానన్నాడు
నీవు "ఐతే నా గొర్రెలను మేపు" అని శిష్యులందరిమీదా,

కాబోయే నీ యనుచరులందరిమీదా
అతనికి ఆధిపత్యం దయచేసావు
మూడుసార్లు నిన్నెరుగనన్నందుకు ప్రాయశ్చిత్తంగానేమో
మూడుసార్లు ప్రేమిస్తున్నానని ప్రమాణంచేసాడు పేత్రు
ఈ సంఘటనం నుండి మేము నేర్చుకొనవలసిన పాఠాలు
చాలా వున్నాయి కదా!
యూదా పేత్రు యిద్దరూ పాపం కట్టుకొన్నారు
ఐనా యూదా అపనమ్మకంతో ఉరివేసికొన్నాడు
అతడు తన్ను క్షమింపమని నిన్నడుగనూ లేదు
నీ నుండి మన్నింపు పొందనూ లేదు
పేత్రు మాత్రం నమ్మకంతో నిన్ను శరణువేడాడు
నీనుండి మన్నింపు పొంది నీ యభిమానాన్ని చూరగొన్నాడు
నీవు క్షమింపలేనంత ఘోరమైన పాపాలు
మేమేమీ చేయలేంగనుక
ఎంత పెద్ద తప్పు చేసినా మేము నిరాశపడకూడదు
ఇంకా, నీవు పేత్రులాంటి దుర్బలుణ్ణి నమ్మి
అతన్ని నీ సమాజానికి అధిపతిని చేసావు
ఈ సత్యాన్ని అర్థంచేసికోలేక
మేము శ్రీసభలోని అధికారులను విమర్శిస్తూంటాం
వాళ్ళ బలహీనతలకూ అవకతవకలకూ విస్తూపోతాం
ఐనా వాళ్ళద్వారా శ్రీసభను నడిపించేది నీవు కాదా?
పైపెచ్చు నీకు ద్రోహం చేసిన పేత్రుని
నీవు నమ్మకమైన వాణ్ణిగా యెంచావు
ఇతరులను కాదని అతనికి నాయకత్వం అప్పజెప్పావు
అలాగే ఎన్నోసారులు నీ మనసు నొప్పించిన
మాకు కూడ నీ సమాజంలో
ఓ బాధ్యతా ఓ పదవీ అప్పజెప్పావు
నీ ప్రజలకు సేవలు చేసే భాగ్యం దయచేసావు

ఈలా పాపకర్ములమైన మమ్ము విశ్వసనీయులనుగా భావించి
మామీద మాకే నమ్మకమూ గౌరవమూ
కలిగేలా చేసావు గనుక
మేము నీకు ఏప్రొద్దూ వందనశతా లర్పిస్తూంటాం.

# 62. డాంబిక వర్తనం

మత్త 23

ప్రభూ! నీది స్ఫటికంలాంటి మనస్సు
కనుకనే డాంబికవర్తనమంటే నీకు గిట్టదు
ఒకటి బోధిస్తూ మరొకటి ఆచరించే
ఆనాటి పరిసయులనూ వాళ్ళ కపటవర్తనాన్నీ
నీవు పిడుగుల్లాంటి శాపవచనాలతో ఖండించావు
ఆ డాంబికులకు సద్గతులు లేవని ఖండితంగా జెప్పావు
వాళ్లు దైవరాజ్యమనే గృహంలో తాము ప్రవేశింపనూలేదు
ఇతరులను ప్రవేశింపనీయనూ లేదు
నరులు చేసిన నియమాలనూ గొప్పగా గణిస్తూ
దేవుని నియమాలైన కారుణ్యాన్ని సాంఘిక న్యాయాన్ని
పూర్తిగా విస్మరించి పాషాణహృదయులయ్యారు
దోమల్లాంటి చిన్న ప్రాణులను వడకట్టి
ఒంటెల్లాంటి పెద్దప్రాణులను గుటుక్కున మ్రింగారు
గ్రుడ్డినాయకులై మార్గం దెలియలేక
తమ్మనుసరించే జనంతోపాటు తామూ గోతిలో గూలారు
యితరులమీద యెంతటి భారాలనైనా మోపడానికి ఏమాత్రం
వెనుదీయలేదుగాని ఆ బరువులనెత్తడానికి మాత్రం
తమ చిటికెనవ్రేలినైనా చాపలేదు
సున్నంగొట్టిన సమాధుల్లా బయటికి తళతళలాడుతూ
లోలోపల క్రుళ్ళిన దుర్గంధంతో కంపుగొట్టారు
ఇది నీవు చిత్రించిన పరిసయుల డాంబికవర్తనం
కాని ప్రభూ! నాజీవితంమాత్రం సరళంగావుందా?
నా తలపులకీ మాటలకీ చేతలకీ పొందికేలేదు
కనుకనే నేను ఒకటి తలుస్తాను, మరొకటి చెప్తాను,
ఇంకొకటి చేస్తాను – వంచకబుద్ధితో
బయటికి మాత్రం వేషాలువేసి కొండంత నటన చేస్తాను
ఈలాంటి డాంబికుణ్ణి నీవు మెచ్చుకొంటావా?
ఛిత్తశుద్ధిలేని నా జీవితాన్ని నీవు చీదరించుకోవా?
కనుక ప్రభూ! నీతులు చెప్పేవారికి

బూతులు మెండు అన్నట్లుగా కాకుండ
నేను ఆర్భాటంతో బోధించే ఆ నీతిసూత్రాలను
నా జీవితంలోకూడ పాటించే మహాప్రసాదాన్ని
డంబాచారినైన నీ యీ దాసునికి తప్పక దయచేయి.

## 63. ప్రభువు తేజస్సు

నిర్గ 34, 29-30. 2కొ 3,18

ప్రభూ! మహాభక్తుడైన మోషే
సీనాయి కొండమీద కెక్కగా
యావే తేజస్సు సోకి అతని ముఖం ప్రకాశించింది
కాని నూత్నవేద ప్రజలమైన మేము
ఉత్థానమూర్తివైన నీ తేజస్సు సోకి ప్రకాశిస్తాం
నీలోనికి మారి నీ రూపం గైకొంటాం
మా చేతల్లో మాటల్లో నిన్ను ప్రతిబింబించుకొంటాం
మేము నీకు సాక్షులంగా వుండకపోతే
మా యీ క్రైస్తవ జీవితానికి అర్థమేలేదు
లోకంలో జనం మాయందు నిన్ను గుర్తించకపోతే
ఇక మేమేపాటి శిష్యులం?
కనుక ప్రభూ! నీవు మా ద్వారా ప్రకాశించు
మా ద్వారా లోకానికి నీ వెలుగును ప్రసరించు
ఆ వెలుగు నీదే కాని మాదికాదు
ఐనా అది మా గుండా ప్రసరిస్తుంది
మమ్ము నీకు సాక్షులను చేస్తుంది
ఆ మోషేలాగ నీ తేజస్సును
మా నడవడికలో ప్రతిబింబించు కోవడంకన్న
మేము చేయగలిగిన మహత్తర కార్యం మరేముంటుంది?

## 64. ఉత్సాహం కలిగించే ప్రభువు

యెహెజ్కేలు 37, 1-14.

బాబిలోను ప్రవాసంలో రోజులు సాగించే ప్రవక్త యెహెజ్కేలు
ఓమారు దర్శనంలో ఓ లోయను చూచాడు
దానినిండా యెండిన యెముకలు ప్రోగుపడి వున్నాయి
పూర్వమక్కడ యుద్ధం చేసి నిహతులైన సైనికుల బొమికలవి

అతడు ప్రభువు ఆదేశంపై గళమెత్తి
ఆ శల్యాలు పూర్వనరరూపం దాల్చాలని ప్రవచించాడు
తత్ క్షణమే ఆ యస్థులు ఒకదానికొకటి సంధించుకొని
మాంసం పొదుగుకొని చర్మం కప్పుకొని
నిండు దేహాలయ్యాయి పూర్వమానవాకృతితో
ఐనా వాటిల్లో యింకా జీవమంటూ లేదు
ప్రవక్త ప్రభువు ఆజ్ఞపై మళ్లా గొంతెత్తి
జీవాత్మ ఆ శరీరాల్లోనికి ప్రవేశించాలని ప్రవచించాడు
వెంటనే ఆ కళేబరాలు చైతన్యంపొంది జీవం తెచ్చుకొని
లేచి నిల్చున్నాయి పూర్వపు మహాసైన్యంగా
అప్పుడు దేవుడు ప్రవక్తతో "ఈ యెముకలగూళ్ళు
బాబిలోను ప్రవాసంలో చిక్కిన యిస్రాయేలీయులకు గుర్తు
వాళ్లు నిరుత్సాహంతో తమ బ్రతుకులు ఎండిపోయాయనీ
తమ యాశలు మోడువారిపోయాయనీ విలపిస్తున్నారు
కనుక నీవు నా పేరుమీదిగా వాళ్ళను
హెచ్చరించి ప్రోత్సహించు
వాళ్ళు సమాధుల్లో శిథిలమైపోయిన శల్యాల్లా వున్నారు
ఐనా నేనా సమాధులు తెరచి వాళ్ళను బయటికి రప్పిస్తాను
నా యాత్మను వాళ్ళమీద కుమ్మరించి
వాళ్ళకు జీవం ప్రసాదిస్తాను
మళ్లా వాళ్ళు స్వీయదేశం చేరుకొనేలా చేస్తాను" అన్నాడు
క్రీస్తుప్రభూ! నీ కృపవల్ల ఈ ప్రవచనం
నేడు మాపట్లగూడ నెరవేరుతుంది
ఉత్థాన పురుషుడవైన నీవు
నీ యాత్మను నేడు మా మీద కుమ్మరిస్తావు
ఆ దివ్యాత్మ మా నిరుత్సాహాన్ని తొలగిస్తుంది
మమ్ము ఓదార్చి చైతన్యవంతులను చేస్తుంది
అనారోగ్యమూ ఆటంకాలూ అపజయాలూ శోధనలూ
మొదలైన నానాయాతనలవల్ల మేము బెండువడిపోతే
నీ యాత్మ మాకు ఉల్లాసమూ ఉత్తేజమూ ప్రసాదిస్తుంది
మా జన్మభూమియైన స్వర్గసీమకు మమ్ము నడిపిస్తుంది
ఉత్థాన నాయకుడవైన ప్రభూ! నీకివే మా నమస్కారాలు.

★★★



**ఫాదర్ పూదోట జోజయ్య, S.J.** గారు, పూదోట మరయ్య, చిన్నమ్మ దంపతులకు 1931వ సం॥ ఫిబ్రవరి 15న, గుంటూరు జిల్లాలోని కనపర్రు గ్రామంలో జన్మించారు. ఈయన ప్రాథమిక విద్యను కనపర్రులో, ఉన్నతవిద్యను ఫిరంగిపురంలో అభ్యసించారు. మద్రాసు లొయోలాలో కళాశాల విద్యను పూర్తిచేసి, ఆంధ్రవిశ్వవిద్యాలయంలో M.A. (సాహిత్యం) లో పట్టా పుచ్చుకున్నారు.

1955లో తమిళనాడులోని దిండిగల్ నందు యేసుసభలో చేరిన జోజయ్యగారు, అటుపిమ్మట కొడైకెనాల్‌లో తత్వశాస్త్రాన్ని, కర్సియాంగ్‌లో వేదాంతశాస్త్రాన్ని నిశిత పరిశీలనా దృష్టితో క్షుణ్ణంగా అధ్యయనం గావించారు. 1965, మార్చి 27న బిషప్ ముమ్మడి ఇగ్నేషియస్ గారి చేతుల మీదుగా ఫిరంగిపురంలో గురుపట్టం పొందారు.

రోమునగరంలోని బిబ్లికల్ ఇన్‌స్టిట్యూట్‌లో బైబులు విద్యనభ్యసించిన జోజయ్యగారు ఆ తర్వాత తనదైన విశిష్టశైలిలో బైబులు సాహిత్యానికి ఎనలేని సేవ చేసారు. లొయోలా కళాశాలలో 2 సంవత్సరములు ఉపన్యాసకునిగా విద్యార్థులకు చక్కని శిక్షణను అందించారు. పుస్తకరచన, బైబులుబోధ, విద్యార్థులకు నాయకత్వ శిక్షణ వీరి ముఖ్య కార్యక్రమాలు.

**సాహిత్యరంగంలో వీరు నిర్వహించిన కొన్ని బృహత్తర కార్యక్రమాల వివరాలు :**

1. అనువాదకునిగా : అకుంఠిత దీక్షతో 17 సం॥లు అవిరళకృషిసల్పి క్యాథలిక్ బైబులులోని పూర్వవేదాన్ని జనరంజకంగా తెలుగులోనికి అనువదించారు.
2. ఆధ్యాత్మికవేత్తగా : ఆధ్యాత్మిక చింతనకు పెద్దపీట వేస్తూ ఆయన నడిపే బైబులు భాష్యం పత్రిక, బైబులు గ్రంథమాల ఆయన ఆధ్యాత్మికరంగంలో నిత్యకృషీవలుడని చెప్పకనే చెబుతాయి.
3. విద్యార్థి బాంధవునిగా : విద్యార్థిలోకాన్ని ఉత్తేజపరచడానికి, వారిలో నవచైతన్యం నింపడానికి ఆయన నడిపే చైతన్యవాణి పత్రిక, విద్యార్థిహిత గ్రంథమాల, విద్యార్థిలోకానికే నిర్దేశకాలు.
4. వక్తగా : ఆంధ్రరాష్ట్రమంతటా తిరిగి విద్యార్థులకు,ఉపాధ్యాయులకు, ఉపదేశకులకు సామాన్యప్రజానీకానికి వందలకొలది సదస్సులు నిర్వహించి, వారిలో నవ్యోత్సాహాలను నింపారు.